# వీరపూజ

అనువాదకులు :

కవిరాజహంస, కవికులాలంకార

శ్రీ వెంకట పార్వతీశ్వరకవులు

ప్రకాశకులు :

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్,

కపిలేశ్వరపురము.

(తూర్పుగోదావరిజిల్లా.)

శ్రీ

# వీర పూజ

## ప్రథమఖండము—హృదయము

### మొదటి ప్రకరణము.

## రాజులు—రాజ్యములు

ఆకాలమున భారతవర్షము చిన్న చిన్న రాజ్యములుగా విభజింపఁబడి యుండెను. ఒక్కొక్క రాజ్య మొక్కొక్క ప్రభువుచేఁ బరిపాలింపఁబడు చుండెను. అప్పుడు ప్రబలులగు రాజులు దుర్బల ప్రభువులఁ దెరలించి వారిరాజ్యముల నాక్రమించు కొనుచుండిరి. ఆదినములలో యుద్ధములును వైరవములును విశేషించి యుండెడివి. అకారణముచే సైన్యము లెల్లప్పుడును యుద్ధసన్నద్ధములై యుండెడివి. రాజ్యమునందలి ప్రత్యేకప్రజలుకూడ నించుకంత యుద్ధవిద్యా పరిచితులై యుండిరి. ఉద్యానవన కుసుమములవలె నప్పటి రాజులు భారతవర్షమం దంతటను విలసిల్లుచుండిరి ; కాని యీర్ష్యాళువులై పరస్పర వైషమ్యములచే నొకరినొకరలక్ష్యము చేయుచుండిరి ; దురభిమాన పరవశులై పరగౌరవములను సహింపఁ జాలకుండిరి. అప్పటికి భరతఖండమున మొగలాయీ ప్రభుత్వముగాని యాంగ్లేయ ప్రభుత్వముగాని తలసూపి యుండలేదు. అప్పు డేకచ్ఛత్రాధిపతి యగుప్రభు వెవ్వఁడును లేఁడు. ఈ మాట మేము చెప్పినది కాదు. మొగలు లెన్నఁడును భరతవర్షమున నేకచ్ఛత్రాధిపతులై యుండలేదు. అక్బరుగాని, యౌరంగజేబుగాని యీ సమగ్ర భారతవర్షమునకుఁ బ్రభుత్వమును సంపాదించుటకు సమర్థులు కాఁజాలకపోయిరి.

రాజపుత్రస్థానమునకుఁ బూర్వాంచలమున నిషధమను పేరు గల యొకచిన్న రాజ్యముండెను. అదియే యొకప్పుడు ప్రాతస్స్మరణీయుఁడును జక్రవర్తియునగు నలమహారాజుచేఁ బరిపాలింపఁబడియెను. ఆవంశమునకుఁ దిలక స్వరూపుఁడును, గుణావహాళల ధురంధరుఁడు నగు వీరేంద్రకేసరియను మహారాజా రాజ్యమును బదునొకండవ శతాబ్దప్రారంభమునందుఁ బరిపాలించుచుండెను. అతఁడు వీరేంద్ర కులభూషణుఁ డని భారతవర్షమునం దొకప్పుడు సుప్రసిద్ధుఁడై యుండెను. అతని ప్రబలప్రతాపమునకు వెఱచి పరరాజు లెల్లరును వినమితులై యుండిరి. లోకాతీతంబులగు నాతని సద్గుణములంబట్టి ప్రజ లెల్లరు నాతని దండ్రిగా భావించుకొనుచుండిరి. అతనితో సంబంధించినవారెల్లరు నాతని బ్రేమించుచునే యుండిరి.

కాని, యొకశుష్క హృదయుఁడుమాత్ర మాతని మనఃపూర్వ పూర్వకముగఁ బ్రేమింపజాలకుండెను. వీరేంద్రకేసరికిఁ గనిష్ఠసోదరుఁ డొకఁడుండెను. అతనిపే రనంతరాముఁడు. అతఁ డితరుల నెవ్వరినైనఁ బ్రేమించుట యెఱుంగునో యెఱుంగఁడో చెప్పఁజాలము గాని స్వయముగఁ దన్నుఁదానుమాత్రము ప్రేమింపఁగలిగి యుండెను. అతనికిఁ దనయన్నగారి గుణములయెడల నసూయ యుదయించుటచే నాతనిహృదయ మెల్లప్పుడును బ్రజ్వలించిపోవుచుండెను. కాని వీరేంద్రకేసరి గుణకీర్తనములు రాజ్యమం దంతటను వ్యాపించి యుండెను. ప్రతిజనుఁడును నతిప్రేమముతో నాతని గీర్తించుచుండెను. ప్రతిమందిరమునందును, బ్రతిసౌధమునందును, బ్రతికీర్తి స్తంభమునందును వీరేంద్రకేసరి పవిత్ర నామాక్షరములు ప్రతిధ్వనించుచుండెను. ఇది యనంతరాముఁడు సహింపఁగలఁడా? హాలాహలము హృదయమున నిండిపోయినది: కాని వెడలఁగ్రక్కుట కుపాయము లేదు. ఆబాధ ననుభవించుచు ననంతరాముఁ డాదారుణ విషమును దనలోపలనే యడంచుకొని యన్నగారి పాదసన్నిధానమునం దుపవసించి చాటుకారునివలె నగ్రజునిం బొగడుచుఁ గృత్రిమప్రేమమును బ్రకటించుచుఁ గాలక్షేపము చేయుచుండెను. అనంతరాముని

వంటి భ్రాతృహితాకాంక్షి యీలోకమునం దితరుఁ డెవ్వఁడు నుండఁ డని తోఁచునట్లుగా నతిచతురతతో నాతఁడు మెలంగుచుండెను. మహాత్ముఁడగు వీరేంద్రకేసరి యాతని కపటస్వభావము నించుకం తయు నెఱుంగక తమ్ముని దనప్రాణముకంటె నధికముగఁ బ్రేమించు చుండెను.

కాని యనంతరాముని దుస్స్వభావము కొంతమందికైన దెలి యకుండఁబోలేదు. అనంతరాముఁ డెంతనిపుణుఁడైనను దనహృదయ రహస్యము నెల్లవేళలందును గూఢముగ నుంచుటకు సమర్థుఁడు కాఁ జాలకుండెను. ఆదుస్స్వభావ మప్పుడప్పు డాతని కన్నులలోఁ బ్రతి ఫలించుచుండెను. ఆకన్నులలోని భావమొకప్పు డాతని మాటలలోఁ గూడ నగపడుచుండెడిది. ఆసంగతి వీరేంద్రకేసరి మంత్రులలో నొకఁ డును, గంచుకి యొకఁడును గ్రహించియుండిరి. వారాసంగతి తమ హృదయముల యందే దాఁచికొని యుండిరి; కాని రాజుతోఁగాని, మఱియొకరితోఁగాని యించుకంతయును జెప్పుటకు సాహసింపఁజాలక పోయిరి. అప్పుడు మంత్రియగు లక్ష్మీపతి కంచుకియగు జనార్దనున కించుక బోధచేసి రాజరక్షణ విషయంబున నప్రమత్తుఁడవై యుండ వలయునని యాజ్ఞాపించెను.

అనంతరాముఁడు పొట్టివాఁడైనను మిగుల బలిష్ఠుఁడు; ఖడ్గ చాలనమున నిపుణుఁడు; ఆతనికన్ను లించుక యెత్తుగ నున్నచో మిగుల రూపవంతుఁడు; అతఁడు బండతనముగ దిరుగుచున్నను దీక్ష్ణ బుద్ధిసంపన్నుఁడు. అనంతరామున కొకకుమారుఁ డుండెను. ఆతని పేరు దేవలుఁడు. అతనిస్వభావము సరళమైనది; హృదయ ముదార మైనది; మనసు గౌరవ మైనది

మహారాజగు వీరేంద్రకేసరికిఁగూడ నొక కుమారుఁ డుండెను, ఆబిడ్డను గని రాణి పరలోకగతురాలయ్యెను. యువరాజగు భవానీ ప్రసాదుఁడు తండ్రివలెనే సద్గుణసంపన్నుఁడై వర్ధిల్లుచుండెను. వీరేం ద్రకేసరి ప్రభుత్వసమయమున రాజ్యమునం దెచ్చటను నత్యాచార ములు లేవు; అశాంతి లేదు. ప్రజలందఱును నిశ్చింతులై యుండిరి,

కాని యారాజ్యమున నొకకారణముగ మహావిప్లవము తటస్థించెను. సిరోహీ దేశాధీశ్వరునకును, అజ్మీరుప్రభువునకును యుద్ధము సంభవించెను. అప్పుడు సిరోహీప్రభువు తనకు సహాయము చేయవలయునని వీరేంద్రకేసరికి సమాచార మంపించెను. కాని వీరేంద్రకేసరి యట్లు చేయుటకు సమ్మతింపక యజ్మీరుప్రభువునకే సాహాయ్యముం గావించెను. అప్పు డాయిరువురకును సేనారాక్షేత్రమునందు దారుణసమర మయ్యెను. ఆయుద్ధమున సిరోహీ దేశాధిపతియే యోడిపోయెను. కాని వీరేంద్రకేసరిమాత్రము ప్రాణములతో మరలఁ దనరాజధానికిఁ జేరుకొనలేదు. ఆతని మరణవార్త రాజ్యమునందంతటను హాహాకారముం బుట్టించెను.

—:♦:—

రెండవ ప్రకరణము.

## రాజ్య మెవ్వరిది ?

అప్పటికి యువరాజగు భవానీప్రసాదునకుఁ బదునేడవయేఁడు. బాలకుఁడగు నాతఁడు రాజ్యపాలనమున నసమర్థుడని చెప్పి పినతండ్రి యగు వసంతరాముఁడు దయచేసి రక్షక స్వరూపుఁడై రాజ్యభారమునువహించుచుండెను కాని యాతఁడు సింహాసనము నధిరోహింపలేదు ; యువరాజునుగూడ సింహాసన మెక్కింపలేదు. గౌరవమయంబగు నిషధరాజ్య సింహాసనము శూన్యమై పడియుండెను.

క్రమముగ వసంతరాముఁడు బలసంచయమును గూర్చుకొనుచుండెను; పురాతనామాత్యవర్గమునం దొకొక్కనినే పదచ్యుతునిం గావించుచుఁ దనయందు విశ్వాసము గలవారి నాస్థానములయందు నియోగించుచుండెను. క్రమముగా నా రాజ్యమునందు రెండు పక్షము లేర్పడియెను. మంత్రిసభ రెండు కక్షలుగా భిన్నమయ్యెను. యువరాజగు భవానీప్రసాదుని సింహాసన మెక్కింపవలయునని యొక పక్షమువారు త్వరపడుచుండిరి. మఱియొక పక్షమువారు వసంతరాముని దయ నభిలషించి యాతనికి రాజత్వముం గూర్ప

వలయు నని నిరోధించుచుండిరి. ఆ కారణమున రాజ్యమునందు శాంతిలేదు; ఒకరి నొకరు విశ్వసించుట లేదు. ఎవ్వరును దమ హృదయభావములను విస్పష్టముగ నెవ్వరియొద్దను బ్రకటించుట లేదు. విద్రోహులుగ ననుమానింపఁబడిన వారందఱును రాజదండనమునకుఁ బాత్రులై ప్రాణములఁ బోఁగొట్టుకొనుచుండిరి. కొందఱు గుప్తఘాతుకుల చేతులలోఁ బడిపోవుచుండిరి. రాజ్యమునందవిశ్వాసమును, నశాంతియు, హాహాకారములును వర్ధిల్లుచుండెను.

ఈ రీతిగా మూడుసంవత్సరములు గడచిపోయినవి. యువరాజిప్పటి కిరువది సంవత్సరముల యీడుగల మహావిక్రమశాలి యగు కుమారుఁడై యుండెను. అస్త్రచాలనము, లక్ష్యభేదనము, హయారోహణము, మల్లయుద్ధము మొదలగువానియందా రాజ్యమున నాతనితో సమానులగు వారెవ్వరును లేక యుండిరి ఆతఁడు తన పదునేడవయేట సింహరాక్షేత్రమున జరిగిన యుద్ధమునందుఁ బ్రదర్శించిన యద్భుత సామర్థ్యమును జూచిన వారెవ్వరు నిప్పటికిని మఱచి యుండలేదు. ఆతని శౌర్యము, వినయము, సౌజన్యము, ప్రేమ, దయ, సత్యప్రియత్వము మొదలగు సద్గుణములకు ముగ్ధులై యెల్లరు భక్తితో నాతని సేవించుచుండిరి. అందఱు నాతని బ్రేమించుచుండిరి, గాని పాషాణహృదయుఁడును, స్వార్థపరాయణుఁడు నగు ననంతరాముఁడుమాత్ర మాతని బ్రేమించుటకు మాఱుగ ద్వేషించుచుండెను.

అనంతరాముఁడు రాజ్యమును వహించియుండెను—ఆతఁడు దేనిని గోరియుండెనో దానిని బొందియే యుండెను. కాని యాతనికి శాంతి లభియించుటలేదు. ఆతని శాంతికి యువరాజగు భవానీప్రసాదు కంటకుఁడై యుండెను. యువరాజును ద్రోసివేయకున్నచో నాతని రాజత్వమున కెన్నియో యంతరాయము లున్నవి. సైనికులు, ప్రజలు వేయేల—అందఱునుగూడ యువరాజునెడల ననురక్తులై యుండిరి. అనంతరాముఁ డింకొక నూతనదళమును జేర్చియుంచుకొనియెనుగాని యందలి వారెల్లరును స్వార్థపరాయణులే

యయియుండిరి. అట్టివారి నాధారముగఁ జూచుకొని యనంత రాముఁడు రాజ్యమునందు విప్లవానల జ్వాలను దగిలించుటకు సాహ సింపఁ జాలకుండెను. రాజధానియందలి గుప్తఘాతుకుల మూలమున యువరాజును జంపించుట సర్వశ్రేష్ఠముగ నుండునని యతఁ డాలో చించుకొనియెను. కాని యువరాజు దినదినమునకు జనప్రియుఁడై పోవుచుండెను. ఈరీతిగఁ గొంతగాలము గడచినచో ననంతరాముని చేతినుండి రాజదండము జారి పడిపోఁగలదు. అనంతరాముఁ డిం తయు నాలోచించుకొని దుస్సహయాతన ననుభవించుచుండెను. క్రూరహృదయమునకు శాంతి యెక్కడిది ?

కాని యువరాజు తన పితృస్థానీయుఁ డగు పినతండ్రిపై మిగుల ననురక్తుఁడై యుండెను. అతనికి యిహసంసారమునఁ దల్లి, తండ్రి, సోదరి, సోదరుఁడు మఱియెవ్వరును లేరు. ప్రేమించినను, సేవించినను నాతని కొక్క పినతండ్రిమాత్రమే యున్నాఁడు. ఆ కారణముచే నాబాలకుని హృదయమునందలి భక్తియును, ప్రేమ యును ననంతరాముని యెడలనే సమర్పితమయి యుండెను. అతఁడు రాజ్యమునుగాని సింహాసనమునుగాని యాకాంక్షించి యుండలేదు. కేవలమును బినతండ్రిని బ్రేమించి సేవించుటయే యాతనికి సర్వ మునై యుండెను. అయ్యో! అదియును నుపయోగపడినదికాదు.

ఒక్కఁడుమాత్రము భవానీప్రసాదును బ్రాణములకంటె నధికముగఁ బ్రేమించి యుండెను—అతఁడెవ్వఁడు? దేవలుఁడు. దేవలుని హృదయ మమూల్యమైనది—ఆతని ప్రేమయు నమూల్య మైనదియే—దేవలునితల్లి యున్నను లేకున్నట్టే—వీరేంద్రకేసరి మరణించిన తరువాత ననంతరాముఁడు తన భార్యయగు నామెను బుట్టినింటికిఁ బంపివైచెను—కాని మఱి తీసికొనిరాలేదు. ఆమె యపరాధ మేమనిన:—ఆమె భవానీప్రసాదును సింహాసన మెక్కింప వలయునని భర్తతో నెల్లప్పుడును జెప్పుచుండెడి దఁట!—ఆ యప రాధమునకే యామె పరిత్యజింపబడెనని లోకులు చెప్పుకొను చుండిరి. ఏమైననేమి?—ఆ పరమ పతివ్రతాశిరోమణితో మనకథ

కొంతమాత్రమును సంబంధము లేదు. ఆ కారణముచే మనకా సంగతింగూర్చి యాలోచింపవలసిన యావశ్యకము లేదు.

తండ్రియగు ననంతరామునియందు దేవలున కొంతమాత్రమును గౌరవబుద్ధి లేదు; ప్రేమ లేదు. వికసనోన్ముఖ హృదయుడగు నాతఁ డెల్లప్పుడును దనయన్నయొద్దనే తన హృదయము నమృతమయముగఁ జేసికొనుచుండెను. యువరాజు తన పితృమాతృసోదర ప్రేమముల నన్నిటి నేకము చేసి యా ప్రేమసుధారసమునందీకోమలకుసుమము నే నిమజ్జితముగఁ జేయుచుండెను. ఇరువురు నొక్కచో విహరించుచుండిరి; ఒక్కచో నాడుకొనుచుండిరి; ఒక్కచో భుజియించుచుండిరి; ఒక్కచో నిదురించుచుండిరి. ఇరువురును గలసి వేఁటకుఁ బోవుచుండిరి. ఒక్కచోఁ గొలువు చేయుచుండిరి.

దేవలుఁ డిప్పుడు పదునేడేండ్ల యువకుఁడు. చిన్నతనము నుండియు నాతనికి భవానీప్రసాదే శిక్షాగురుఁడై యుండెను. దేవలుని హృదయమును జరిత్రమును భవానీప్రసాదు ననుసరించియే యుండెను. కాని యాతని బుద్ధిమాత్రము స్థిరమైనది కాదు. అతఁ డొక్కొక్కప్పుడు స్వల్పవిషయములకే క్రోధాంధుఁడై పోవుచుండును.

ఆ రాజ్యమునకుఁ దేజస్వతీనగరము రాజధాని యయియుండెను. దుర్గము నగరమునకవ్వలఁ గట్టబడి యుండెను. ఆ దుర్గముతో మనకంతగాఁ బ్రయోజన మేమియును లేదు. ఆ నగర మధ్యమునందే రాజప్రాసాదమున్నది. యుద్ధసమయములయందుఁ దక్క మఱి యెప్పుడును సైనికులు దుర్గమునం దుండరు; రాజప్రాసాదమునందే యుందురు. ఆ కాలమునఁ బ్రతిరాజ్యమునందును రాజకుమారులకుఁ బ్రత్యేకమందిరము లుండుట సామాన్యపద్ధతి. అట్లే యువరాజగు భవానీప్రసాదున కొక ప్రత్యేకమందిరము నిర్దేశింపఁబడి యుండెను. ఆ భవనము నగరప్రాంతమునందు మనోహరోద్యాన పరివేష్టితమై ప్రాకారద్వార పరిరక్షితమై యుండెను. ఆ భవనమునకు సుధామందిర మని పేరు. భవానీప్రసాదు సుధామందిరమున నివసించి

యుండెను. దేవలునకుఁగూడ ప్రత్యేకమందిరమున్నది. కాని, యాతఁ డందుండుట లేదు. అతఁడు యువరాజునొద్దనే యుండెను. అనేక విధములఁ దండ్రిని బ్రార్థించి తాను యువరాజునొద్దనుండుటకు దేవలుఁడు తండ్రియనుజ్ఞను దీసికొనియెను. ఆ సుధామందిర మనంతరాముని గూఢచారులచేఁ బరిపూరితమైయుండెను. భవానీ ప్రసాదు నిత్యమును గావించు పనులన్నియు లిపిబద్ధములై యనంతరామునకు నివేదింపఁ బడుచుండెను. నిర్విచారుఁడై విహరించుచున్న యువరాజున కీసంగతు లేవియును దెలియవు.

యువరాజున కాతని తండ్రియెడల సంపూర్ణ విశ్వాసముగల జనార్దనుఁడను నొకఁడు సర్వదా రక్షకుఁడై కంటికి రెప్పవలె నుండెను. రాత్రులయం దాతఁడే యువరాజు శయనమందిరమున ద్వార రక్షకభారమును వహించుచుండెను. ఆ కారణముచే దేవలభవానీ ప్రసాదు లిప్పుడు నొంటరులఁ గాఁగలిసికొని యేకశయ్యాగతులై నిర్విచారముగ నిదురించుచుండురు.

జనార్దనుఁ డసిచాలనమున దక్షుఁడు. అతఁడు ప్రతిదినమును యువరాజుతోఁగలసి ఖడ్గసాధనముం గావించుచుండును; ప్రతిదినము నాతనిచే నోడింపఁబడుచునే యుండును. అదియే యాతనికి సంతోష దాయకముగనుండెను. ఖడ్గసాధనానంతరమున నశ్వారోహణ వ్యాయామము జరుగుచుండును. అశ్వారోహియయి యరణ్యములు, లతాగుల్మావృత ప్రదేశములు మొదలగు ప్రదేశముల యందెట్లు సంచరింప వలయునో జనార్దనుఁడు యువరాజునకు నేర్పుచుండెను. జనార్దనుఁడు తన తండ్రికి విశ్వాసపాత్రుఁడగు కంచుకి యగుటచే యువరాజాతని నెల్లయెడల గౌరవించుచుండెను. ఇప్పటికి మాముఖ్య పాత్ర ప్రదర్శనము పూర్తియయినది. ఇఁకఁ గథారంభమున కెంత మాత్రము నాటంకము లేదు.

---

మూఁడవ ప్రకరణము.

# పినతండ్రియా—రంధ్రాన్వేషకుఁడా?

దురదృష్టవశంబున దారుణ శీతకాలమునందలి ప్రాతఃకాలమున మా కథ యారంభింపఁబడినది. ఇప్పుడు చలి యించుక యతిశయముగనే యున్నది. పశుపక్షి మృగాదులు పరమక్రూర స్వరూపమగు శీతమునకు భయపడి వణఁకుచుఁ బొదలు, తరుకోటరములు, గుహలు మొదలగుచోటుల నివసించి విరహవిధురలగు రమణీమణులం బోలి శుష్కీభూతములై యుండెను. హిమావకుంఠితములగు పర్వతములు శ్వేతవసనావృతలగు విధవలవలె దూరమునఁనుండి సంకుచితభావముతో విశ్వాలయము నందలి జగన్నాథునకుఁ బ్రభాత మంగళారాత్రిక స్వరూపుఁడగు నుదయభానుని గనుఁగొనుచున్నట్లుండెను.

సూర్యోదయమున కించుక పూర్వమునందే యువరాజును దేవలుఁడును గిరిప్రాంగణమునఁ బ్రవేశించి యస్త్రచాలనాభ్యాసముం గావించుచుండిరి. శిక్షాగురుండగు జనార్దనుఁడు వారికి బాణవిద్యను నేర్పుచుండెను. అనేక విధంబులగు నస్త్రవిద్యాసాధనము లైన తరువాత యువరాజు తరవారిం దీసికొని దేవలునింజూచి "సోదరా! యుద్ధములయందు శీఘ్రవిజయముం గల్పించు సాధనములలో ముఖ్యమైనది తరవారియేసుమా! నీ వెట్టిసమయమున నాపైఁ గత్తివిసరినను నేను దానిని దప్పించుకొని మరల నీపైఁ గత్తివిసరఁగలను. ఖడ్గముష్టిసాధనము నభ్యసింపకున్నచోఁ గేవల కౌశలమాత్రమున విజయము లభియింపదు" అనియెను.

దేవ—అన్నా! ఖడ్గసాధనమున నిన్నుఁబోలిన వానిని నేనిది వఱ కెన్నఁడును జూచియుండలేదు. నీకత్తివ్రేటు భయంకరముగ నుండును సోదరా! నేను నీవలె నెన్నాళ్ళకు నేర్చుకొనఁగలుగుదును?

జనార్దనుఁడు నవ్వుచు "పెద్దవాఁడ నగు నేనుగూడ ఖడ్గసాధనమున నీయన్న యంతటివానిని జూచియుండలేదు. ఈశక్తి యభ్యా

సమువలనఁ గలిగినదికాదు ; దైవదత్తమైనదని తోఁచుచున్నది" అనియెను.

అప్పుడు వెనుకనుండి యొకఁడు "ఎంతటి విద్యయయినను నొకసారి చూచినచో గ్రహింపవచ్చును" అనియెను.

అందఱును వెనుకకుఁ దిరిగి చూచిరి. ఆతఁడు క్రొత్తగ నియమింపఁబడిన యుద్యోగి యగు రణధీరుఁడు. సుధామందిరమున యువరాజరక్షణమునకై కొంతయంగరక్షక సైన్యము నిలుపఁబడియుండెను. రణధీరుఁ డాసేనకు నాయకుఁడు ; ఖడ్గసాధనమునం దాతని కించుక ఖ్యాతియున్నది. ఆగర్వముచేతనో, మఱియేకారణముచేతనో గాని యాతఁడు యువరాజును దనతోఁ గ్రీడామాత్రముగ ఖడ్గసాధనముం గావించుటకై పిలిచెను. ఆతనికోరిక యనివార్యమై యుండెను. అందుచే యువరాజు కన్నులించుక యెఱ్ఱనయ్యెను ; జనార్దనుని చేతి యందలి కరవాలము జణజణధ్వని చేసెను. దేవలుఁడు క్రుద్ధుఁడై గర్జించెను. అంతలో యువరాజు ప్రసన్నుఁడై "రణధీరా ! శిక్షాగురుండును సహానుండునుగాక తక్కిన వారితో ద్వంద్వయుద్ధము నిషిద్ధమైనది. నీవు నీపని చూచుకొనుము" అనియెను.

రణధీరుఁడు మ్లానవదనముతో "యువరాజా ! మీరు ఖడ్గసాధనమున సుప్రసిద్ధులు. కావున మీయొద్ద నించుక నేర్చుకొనవలయునని కోరికయున్నది" అనియెను.

యువరాజు నవ్వుచు "అట్లయినచోఁ గానిమ్ము ! నీవు నిరాశపడవలదు—సిద్ధపడుము" అనియెను.

జనార్దనుఁడు యువరాజును మరలింపవలయునని ప్రయత్నించెను. కాని, లాభములేకపోయెను. యువరాజు మాటయిచ్చి తిరుగువాఁడు కాఁడు. అప్పుడు జనార్దనుఁడు రణధీరునింజూచి "నీవిప్పుడు పదనులేని కత్తిం దీసికొని యువరాజుతో విలాససాధనముం గావింపవలయును" అని నిరోధించెను. రణధీరుఁడు నవ్వుచు "యువరాజును గొట్టవలయునని నా యుద్దేశము కాదు. నా కంతటి సామర్థ్యమును

లేదు. ఆయనయొద్ద నేర్చుకొనవలయుననియే నేను వేడుకపడుచుంటిని" అనియెను.

యువరాజు మాఱుమాట చెప్పక ఖడ్గయుద్ధమునకు సంసిద్ధుఁడయ్యెను. యువరాజుమహోద్భుతాసిచాలన మందఱకు నాశ్చర్యముం గల్పించెను. రణధీరుఁడు సావధానుఁడై యాత్మరక్షణముం గావించుకొనుచుండెను కాని నిమిషములో నాతనిచేతిలోనికత్తి జారి దూరముగఁ బడిపోయెను అచ్చటనే రణధీరుని సజ్జితాశ్వము నిలువఁబడియుండెను. రణధీరునికత్తి మృత్తికాస్పర్శనముంగావించి యాహయపాదములపైఁ బడియెను. అంతబలముగా దెబ్బ తగులకపోయినను తోడనే యాగుఱ్ఱము భూతలపతితమైపోయెను ; అంతలోనే మరణించెను. కొంతసేపటివఱకు నందఱును స్తంభితులై యాయద్భుతవ్యాపారమును గనుఁగొనుచుండిరి. గుఱ్ఱ మెప్పుడు నిష్పందమై పోయినదో యప్పుడు జనార్దనుఁడు తీవ్రస్వరముతో "పాపాత్మా! రణధీరా! విషలిప్తమగు కరవాలముం గైకొని యువరాజుం జంపుటకై వచ్చితివా? నీకుఁ జావు సమీపించినది!" అని పలుకుచు నొరనుండి కరవాలముం దీసి యొక్కయుదుటున రణధీరునిపైఁ బడఁబోయెను గాని యువరాజాతని నడ్డగించి నిలిపెను. జనార్దనుఁడు చేయునది లేక గర్జించుచుండెను. కాని యంతలో దేవలుఁడు ఖడ్గహస్తుఁడై పోయి రణధీరునిపైఁబడి యాతనిమస్తకము ఖండించివైచెను.

శత్రుశిక్షణమైనది కాని ఫలము దూరముగనే యుండెను. ఈ సంగతి యంతయును మోసముగనో, స్వభావముగనో యనంతరామునకుఁ గర్ణగోచర మయ్యెను. అప్పుడాతఁడు యువరాజును బిలువనంపెను. యువరాజశ్వారోహియయి పితృవ్యసందర్శనమునకు బయలుదేరెను. దేవలుఁడుగూడ నాతనితోఁ బోవఁదలఁచెను గాని యువరాజాతని వారించి వెడలిపోయెను. జనార్దనుఁ డెన్నియో చెప్పెను గాని యువరాజు వానిని బెడచెవుల బెట్టెను. ఇరువు రంగరక్షకులు మాత్రము వెంటరా యువరాజు వెడలిపోయెను. ఆయశ్వపదశబ్దము జనార్దనుని హృదయమును గలఁచివైచెను. అప్పుడు జనార్దనుఁడు

దేవలునిం జూచి "కుమారా! నీవు మీయన్నతో నేల పోలేదు?" అని ప్రశ్నించెను.

దేవ—అన్న నన్ను రానీయలేదు. ఇప్పుడే తిరిగి వచ్చెదనని చెప్పి పోయినాఁడు.

జనా—కుమారా! నీవుకూడఁ బోయిన బాగుగ నుండును—ఇప్పుడైనఁ బోఁగలవా?

దేవ—అన్న కోపపడునేమో?

జనా—నేను బంపితి నని చెప్పుము!

దేవలుఁ డశ్వారోహణముం గావించి బయలుదేరెను. జనార్దనుఁడు చింతాక్రాంతుఁడై కాళికామందిరమునకుఁ బోయెను. జనార్దనుఁడు ముసలివాఁడు కాఁడు—ముప్పదియేండ్లవాఁడు. అతని శరీరమున నేనుగంత బలమున్నది; ముఖమున వసంతచిహ్నము సంపూర్ణముగ నున్నది. జనార్దనునకు వివాహము లేదు, అందుచే నాతనికి సంసారమున సంతానాదిక మేమియును లేదు. ఆతనికి సర్వస్వమును యువరాజే—

యువరాజు రాజప్రాసాదమునఁ బ్రవేశించి పినతండ్రి సన్నిధికిఁ బోయెను. అనంతరాముఁ డొకగదిలోఁ గూరుచుండి యేమియో యాలోచించుకొనుచుండెను. ఆ గది చిన్నదియయినను సమలంకృతమై యావశ్యక వస్తుపరిపూర్ణమై యుండెను. అందు రెండు మూఁడు కుర్చీలును, సోఫాయు, నుండెను. గోడలు నిషధరాజ్యమునందలి పూర్వుల చిత్రపటములచే నలంకృతములై యుండెను. శ్రీరామచంద్రుఁడు, కుశలవులు, నలచక్రవర్తి, లక్ష్మి, సరస్వతి, దమయంతి మొదలగువారి చిత్రములు విలసిల్లుచుండెను. సోఫాపార్శ్వమున గోడపై నొక తరవారి వ్రేలాడుచుండెను. రెండు మూఁడు భల్లములు, నొకడాలును, శిరస్త్రాణమును గూడ నుండెను.

యువరాజు పినతండ్రికి నమస్కరించి యెదుట నిలువబడియెను. అనంతరాముఁ డేమియును మాటాడలేదు. ఏమి మాటాడవలయునో యూహించుకొననైనలేదు. కొంతసేపటివఱ కిరువురును

మౌనముతో నుండిరి. అప్పుడు యువరాజు మెల్లమెల్లగ "తండ్రీ! నన్నుఁ బిలువ నంపితిరా?" అనియెను?

అనం—ఔను—పిలిచితిని. నీవు కేవల మాతతాయివై పోవుచున్నావు. నిన్ను మందలింపవలసి యున్నది.

యువ—తండ్రీ! కుమారుని యవినయమును మన్నింపవలయును. సెలవైనచో మనవి చేసికొనుచున్నాను. నేనట్టి యపరాధముం గావించితిని?

అనం—నీవు రణధీరరావు నేల చంపితివి?

యువరాజు చెప్పఁదగిన సమాధానము చెప్పకుండ మృదుస్వరముతో "రణధీరుఁడు నన్నుఁ జంపఁదలఁచుకొని వచ్చియున్నాఁడు" అనియెను.

అనం—నీ శరీరమున దెబ్బలేవియు నగపడుట లేదే! ఆతఁ డట్టి దురభిప్రాయముం గలిగియుండెనని నీ వెట్లు గ్రహించితివి?

యువ—ఆతఁడు విషలిప్తమగు కత్తిం గైకొని నన్ను ద్వంద్వ యుద్ధమున కాహ్వానించినాఁడు.

అనం—ఆ కరవాలముతో నన్నాతఁడు కొట్టినాఁడా?

యువ—లేదు—కొట్టఁజాలకపోయినాఁడు—అంతకుముందే యాతనికత్తి చేతినుండి జారిపడిపోయినది.

అనం—అట్లయినచో నాతనికత్తి విషాక్తమైనదని నీ కెట్లు తెలిసినది?

యువ—ఆతని యశ్వశరీరముసందు దాని నిదర్శన మగపడినది.

అనంతరాముఁడు కొంతసేపటివఱకును మాటాడలేదు. భవానీ ప్రసాదు నిలువఁబడియే యుండెను. ఆతఁడు తనలో "నా సమాధానము నాపినతండ్రికి సంతృప్తికరముగనే యున్నది" అని భావించుకొనియెను. కాని యువరాజు పొరపాటుగ నిశ్చయించుకొన్నాఁడు. అప్పు డనంతరాముఁడు "మంచిది. ఆతఁడు దోషియే యనుకొందము—అట్లయినను నాతని శిక్షించుటకు నీ వెవ్వరు?" అనియెను.

యువ—ద్వంద్వయుద్ధమునఁ బ్రతియోధుని శిక్షించుట కంద ఱకు నధికార మున్నది.

అనంతరాముఁడు నిరుత్తరుఁ డయ్యెను. కొంతసేపైనతరువాత నాతఁడు "రణధీరుఁడు నిరాయుధుఁడై పోయినట్లు నీమాటల వలన నే తెలియుచున్నది. నిరాయుధునిఁ జంపుట యేటివీరధర్మము!" అనియెను

యువ—అందుకొఱకు నేను వీరసమాజమున నిందనీయుఁడ నగుదును. కాని, రాజాంతికమున నపరాధిని మాత్రము కాఁజాలను.

అనం—రాజెవ్వరు ?

యువ—మీరు.

అనం—అసత్యము! నేనే ప్రభువునని నీవు భావించుకొనుచున్నావు. ఆగర్వముచేత నే నీవాఁడలు తెలియకుఁడ నన్నవమానించుటకై రాజ్యమునందు నీయిచ్ఛవచ్చినట్లత్యాచారము లంగావించుచున్నావు

యువ—తండ్రీ! క్షమింపుము. ఈ ప్రపంచమున మీకంటె నాకెవ్వరును లేరు. నేను మహాపాపాత్ముఁడనగు దురాచారినే కావచ్చును. కాని తండ్రివగు నిన్ను నవమానింపఁజాలను. ఆపాప వాసన నాహృదయమునందు ప్రవేశించుటకుఁ బూర్వమే స్వయముగా నాహృదయమును జీల్చివైచుకొందును.

అనం—వెఱ్ఱివాఁడవు లేవు అప్పుడే యింతటికొండుతనము నేర్చుకొంటివా? నీగురువగు జనార్దనుని నే నెఱుంగుదును—అతనియొద్ద నిఁక నీచదువు చాలును.

యువ—తండ్రీ! మాయపరాధ మేమి?

అనం—అపరాధ మేమియా ? నీవు నిష్కపటముగ నెల్ల సంగతులను దెలిపితివా ? సత్యగోపనము గావింపలేదా ?

యువ—ఈనాజీవితమునందు నే నసత్యము చెప్పలేదు ఇప్పుడును జెప్పలేదు. నిష్కపటముగ నెల్లసంగతుల దెలుపవలయుననియే వచ్చియుంటిని. కాని ప్రేమమయుఁడగు పినతండ్రి యిప్పుడు రాజసింహాసనమున శాసకుఁడై పరిణమించుటచే నించుక

సంకోచభావముతో నెల్లవృత్తాంతమును విస్పష్టముగఁ నిలుపఁజాలక పోయితిని.

అనం—మరల నన్ను రాజని చెప్పి పరిహాసము చేయుచుంటివా? రాజెవ్వరు? నేను నీకు రక్షకమాత్రమేగాని రాజవు నీవేకావా? నేను నీకు భృత్యుఁడను. నీవు నన్ను సింహాసనమునుండి యెట్లయినఁ దొలగింపవలయునని రహస్యప్రయత్నములు చేయుచున్న సంగతి నాకు దెలియ దనుకొంటివా?

యువ .. మీపాదములుముట్టి శపథమునుచేసి చెప్పుచున్నాను. నేను రాజ్యమునుగాని యైశ్వర్యమునుగాని యెంతమాత్రము నభిలషించుట లేదు. నేను సేవలను మీ ప్రేమమాత్రమునే యపేక్షించుచున్నాను.

అనం—నీవు నా కష్టములయెడుటఁ బుట్టి శఠత్వముచే నన్నే వంచింపఁ జూచుచున్నావు నీ వసత్యవాదివి. వంచకుఁడవు. నేను నీటక్కుల నెఱుంగనివాఁడనే యయియున్నచో నీవు నన్నీపాటికి రణ భీరునివలెనే చంపియుందువు నేను నీమోసములకు లోఁబడువాఁడను గాను. ఈ పరమాత్మాపరాధమునకై దర్బారునందు నిన్ను విచారింపవలయును. ఎవరక్కడ? ద్వారపాలకా!—

ద్వారపాలకుఁడు వచ్చెను. అనంతరాముఁడు కఠినస్వరముతో "ఈ యువరాజును నీ యధీనమునందుంచుకొనుము! రేపటిదినమున సభలో నీతని నేరమును విచారించెదను— పొమ్ము!" అనియెను.

ద్వారపాలకుఁడు నిష్క్రాంతుఁడై పోయెను ఆతనినోట మాట వెలువడలేదు. యువరాజును వెంటఁబెట్టుకొనిపోవుట యట్లుండ నిమ్ము— భయముచే నాతఁడే వెనుకకు జరగిపోయెను. ఇంతలో మందిరద్వారమునఁ గరాఘాత మయ్యెను. తలుపు దెఱచుకొని దేవలుడు లోపలఁ బ్రవేశించెను. అనంతరాముఁడు విరక్తుఁడై "దేవలా! నీ వెక్కడనుండి? అనియెను?"

దేవ—అన్న యెక్కడనుండియో నేను నక్కడనుండియే.

అనం—నాయాజ్ఞకొఱకు నిరీక్షింప నక్కఱలేదా?

దేవ—తండ్రి యొద్దకు బిడ్డలు తమ యిచ్ఛవచ్చినప్పుడు రావచ్చును.

అనం—రావచ్చును—కాని యెల్లప్పుడు నట్లు రాఁగూడదు. నేనిప్పుడు రాజకార్యవ్యస్తుఁడనై యున్నాఁడను. నీవు స్థానాంతరమునకుఁ బొమ్ము!

అప్పుడు దేవలుఁడు యువరాజుచేయి పట్టుకొని "తెమ్ము సోదరా! రమ్ము!" అనియెను.

అనం—ఇప్పుడు మీ యన్న నీతో రాఁడు. నీవుపొమ్ము!

దేవ—నే నన్న నచ్చటకును నిరీక్షించి యుండెదను. ఇరువురమును గలసియే పోయెదము.

అనం—మీ యన్న బందీయయినాఁడు.

దేవ—అన్న నిర్బంధితుఁడా? నా సోదరుని బందీగాఁ జేయువా రెవ్వరు?

అనం—నేను—రేపు విచారించెదను.

దేవ—ఏ నేరముచే మా యన్న యపరాధియయ్యెను?

అనం—ఆ సంగతి వినుటవలన నీ కేమియునుఁ బ్రయోజనము లేదు.

దేవ—నాకుఁ బ్రత్యక్ష దైవస్వరూపుఁడగు మా యన్నను గారాగారమునకుఁ బంపుచుండిరి. రాజ్యాధీశ్వరుఁడు ప్రజాముఖమున విచారింపఁబడవలయును? ఇట్టిస్థితిలో నీతనియపరాధ మేమిటో తెలిసికొనఁగూడదా?

అనం—అపరాధము నరహత్య.

దేవ—నరహత్యయా? చంపబడినవా రెవ్వరు?

అనం—రాజకర్మచారి యగు రణధీరరావు—

దేవ—కాకున్న గుప్తఘాతకుఁడగు రాజద్రోహి రణధీరరావు.

అనం—కుమారా! నీవు పొరపాటు పడుచున్నావు—నీవిప్పు డెవ్వరియెదుట మాటలాడుచుంటివో నీకు దెలియుచున్నదా?

దేవ— నే నించుకంతయును దెలివితప్పి యుండ లేదు. ఆపాపాత్ముఁడు విషలిప్తమగు తరవారిందాల్చి మాయన్నను జంపవలయు నని వచ్చియుండెను. అందుచే నే నాతని స్వయముగఁ జంపవైచితిని.

అనం— నీ వసత్యము చెప్పుచున్నావు.

దేవ—అసత్యమా? అసత్య మాడుటయె నేర్చినవాఁడనైనచో నన్ను నన్ను గౌరవించునా? ఇదిగో చూడుఁడు — ఇంకను నాకర వాలమునందా నరాధముని రక్తచిహ్నము లగపడుచున్నవి. అన్న వలదని వారించుచున్నను నేనాతని జంపివైచితిని. ఈయపరాధమునకు నాయన్న కారాగృహమునకుఁ బోవలసి యున్నచో గుప్తఘాతుకుఁడగు నారణగీరుని జంపినవాఁడను నే నని దర్బారులో సందఱి యెదుటను ఘంటాపథముగఁ జెప్పెదను.

అనంతరాముఁడు నిస్తబ్ధుఁడై పోయెను. చాలసేపాలోచించి "ద్వారపాలకా! నీవావలకుఁ బొమ్ము!" అనియెను. ద్వారపాలకుఁడు వెడలిపోయెను. భవానీప్రసాదు స్థిరభావముతో నిలువఁబడి యుండెను. అనంతరాముఁడు మరల నెన్నియో విధముల నాలోచించుకొని పిమ్మట "దేవా! నీవింతటినుండి నీమందిరమందే నివసించియుండుము—సుధామందిరమున కెప్పుడును బోవలదు. దుస్సంగమువలన నీబుద్ధి చెడిపోవుచున్నది. యథేచ్ఛాప్రవర్తనముచే నీవెవ్వరికిని లొంగకుండఁ జెడిపోవుచున్నావు భవానీ! నీవు నాయాజ్ఞ లేకుండ నీ యిల్లువిడిచి బయటికి రావలదు. ఇప్పటికి నీపథమాపరాధమును క్షమియించితిని. ఇఁక నీవు పొమ్ము!" అనియెను.

---

నాలుగవ ప్రకరణము.

## నీలమేఘము — నీలాకాశము

చింతాకుల హృదయుఁడై యువరాజు మెల్లగ నేకాకియయి సుధామందిరమునకు మరలిపోయెను. అచ్చట జనార్దనుని వెదకెను. గాని యాతఁ డగపడలేదు. అప్పుడు యువరాజు తన శయనమందిర

రమునకుఁ బోయి తలుపులు మూసికొనియెను. తరువాత నా మందిరమున నెలకొనియున్న చతుర్భుజయు, మృణ్మయియు నగు కాళీమూర్తి వంకఁ జూచుచు విచారింప నారంభించెను; ఆమాత పాదకమలముల నశ్రువులతో నభిషేకించెను తరువాతఁ గన్నీటిని దుడిచికొని "ఏడ్చుటవలన నేమిసుఖము తల్లీ? ఇతగా నేడ్చితినిగదా—నీ హృదయ మించుకంతయును గరఁగలేదా తల్లీ? నాకుసర్వము నున్నవి—ఒకొక్కటిగ నన్నియును బోవుచున్నవి? ప్రేమాధారమగు నొక సుకుమారకుసుమమును దాఁచికొని యుంటిని—తుద కదియును లేకుండఁబోవలయునా? అన్నియును బోయినవి. ఈయభాగ్యప్రాణము లింకను నేల నిలిచియుండవలయును?" అనునప్పు డాతని కన్నులనుండి నిరర్గళాశ్రుధారలు వెలువడుచుండెను. అతఁడు విశీర్ణహృదయుఁడై తల్లిపాదములపైఁబడి యెన్నియో విధముల దుఃఖించెను.

దుఃఖించుటవలన నించుకస్వాంతశాంతి కలిగెను. అప్పుడు యువరాజు గవాక్షముకడకు వచ్చి నిలువఁబడియెను. ఆతనిదృష్టి దూరమునందున్నది—చాలాదూరము—నీలాకాశమున నీలమేఘసదృశంబులగు పర్వతపంక్తు లెచ్చట నైక్యమై యుండెనో యువరాజుదృష్టి యచ్చట నున్నది. ఆపర్వతపంక్తులపై నీలమేఘములు—వానిపై నీలమేఘమాలికలు—ఆహా! ఆకాశమునం దీచిత్రలేఖనముం గావించినవా రెవ్వరు? ఈనీలవర్ణసమ్మేళనము—ఈ నీలాకాశముతో నీలజలనిధి సమాశ్లేషము—ఈవిధముగఁ బ్రతిహృదయమునను ప్రేమస్వర కలకలకూజితము—ఇవి యన్నియును గల్పించినవా రెవ్వరు?

గవాక్షమునకుఁ గ్రిందిభాగమున నేదియో చప్పుడయ్యెను. యువరాజు తొంగిచూచెను. సరిగాఁ గ్రిందనుండి జనార్దనుఁడు గునపముతో మట్టిని ద్రవ్వుచుండెను. యువరాజు విస్మయముతో "జనార్దనా!" అని పిలిచెను. జనార్దనుఁడు తిరిగిచూచి "యువరాజా! ఇటురమ్ము!" అనియెను.

రెండవయంతస్తునందున్న యువరాజు దిగి జనార్దనునియొద్దకు వచ్చి నిలువఁబడియెను. అప్పుడు జనార్దనుఁడు "యువరాజా! విశేషము లేమి?" అని ప్రశ్నించెను.

భవానీ ప్రసాదు సకలవృత్తాంతమును జనార్దనునకుఁ దెలిపెను. జనార్దనుఁడు చాలసేపాలోచించి "నేననుకొన్నట్లే జరిగినది కాని యింతటి జాగరూకతతో నుండవలయును. నేను దోడు లేకుండ నీవెచ్చటికినిఁ బోవలదు" అనియెను.

యువ — నీయుద్దేశము నాకు బోధపడినది. కాని నీవు పొరపాటు పడుచున్నావు. నా పినతండ్రి నాకెంతమాత్రమును శత్రుఁడు కాఁడు. అతఁడాజ్ఞాపించినచో నా ప్రాణములనైన నిచ్చుటకు నేనెప్పుడును సిద్ధముగా నున్నాఁడను. అట్టిస్థితిలో నన్ను రహస్యముగాఁ జంపించుట కాతఁ డేల ప్రయత్నింపవలయును? ఛీ! ఛీ! ఇట్టి పాపపుఁదలంపుల కెన్నఁడును నీహృదయమునఁ జోటీయకుము!

జనా — యువరాజా! నీవు బాలుఁడవు. నీమనసు సరళమైనది — నీహృదయము పవిత్రమైనది. ఇప్పుడు నీకీసంగతు లన్నియును దెలియవలసిన యావశ్యకము లేదు. నా వెంటరమ్ము. నీకొక మనోహరకుసుమనికుంజమును జూపించెదను.

గవాక్షమునకుఁ గ్రింద — ఇంచుక దూరమున — పుష్పోద్యాన మధ్యమున — పుష్పలతాచ్ఛాదితమగు నొకచిన్నమందిరము కలదు. ఆవిశాలోద్యానమున నందం దిట్టిమందిరములు చాల నున్నవి. అవియే విశ్రామమందిరములు. అప్పుడు జనార్దనుఁడు చూపించిన యామందిరమున విచిత్రము లేవియును లేవు కాని యామందిరమును జనార్దనుఁడు క్రొత్తగ నిర్మించెను. జనార్దనుఁడు యువరాజు నామందిరములోనికిఁ దీసికొనిపోయి "యువరాజా! ఇటుచూడుము! ఈ మందిరమునందు లేయుంబప తెల్లవారునను సుసజ్జితంబులగు రెండు గుఱ్ఱములు సిద్ధముగ నుండును. ఈద్వారమును దెఱచుపద్ధతిని నేర్చియుండుము. ఎవ్వరితోడ నేమియును జెప్పవలదు.

యువ—నాకు నీమాటలయర్థము బోధపడుట లేదు. రాత్రుల యందు గుఱ్ఱములు కావలసివచ్చినచో మనయశ్వశాలనుండియే తీసి కొని రావచ్చును. నావడకటింటికి సమీపమున గుఱ్ఱములనుంచి దుర్గంధ పూరితముగఁ జేయుటకుఁ బ్రయోజన మేమున్నది?

జనా—పరమేశ్వరుఁ డట్టిప్రయోజనము లేకుండు నట్లనుగ్ర హించుఁగాక !

తరువాత నాయిరువురు నుద్యానమున సంచరించుచుండిరి. అప్పు డొకయశ్వారోహి యతివేగముగ నచ్చటికి వచ్చి యువరాజున కొకయుత్తరము నిచ్చెను. అది దేవలుని లేఖయని యువరాజు గ్రహించి యాయుత్తరమును విచ్చి చదివెను అందిట్లున్నది:—

“సోదరా ! ఎవ్వని సందర్శించుటవలన నాహృదయమునకు శాంతి లభియించునో యట్టినిన్నుఁ గోరిక యుండియు దర్శింపఁజాల కున్నాను. నేనిఁక నెట్లు జీవింపఁగలను? త్వరలో నిన్నుఁ జూడఁజాల కున్నచోఁ దండ్రియాజ్ఞకుఁ బ్రతిఘటింప వలసివచ్చును. ఏమైనను సరియే గాని నేనుమాత్రము నన్ను విడిచి యుండఁజాలను——

నీప్రియసోదరుఁడు
దేవలుఁడు.”

యువరాజు చింతాకుల హృదయుఁడై ప్రాసాదమునకుఁ బోయి జనార్దనునితో నాలోచించి యీవిధముగఁ బ్రత్యుత్తరమును వ్రాసెను. “సోదరా ? దేవల ? చాలదినములనుండి వేఁటకుఁబోవుట లేదు. రేపటి యుదయమున మనము శ్రీలక్ష్మీపతి రక్షితారణ్యము నకు వేఁటకుఁ బోవలయుననియున్నది. ఆయరణ్యము వీరపురసమీప మునందున్నది. చాలదూరము. తిరిగివచ్చుట కైదాఱు దినములు పట్టును. తండ్రిగా రంగీకరించినచో మన మిరువురమును గలసి పోవచ్చును.” అని——

తరువాత వేఁటకు సెలవీయవలయునని యనంతరామునకుఁ గూడ నొక యుత్తరమును వ్రాసి పంపించెను. ఆ రెండు తావుల నుండియును యథాసమయమునకుఁ బ్రత్యుత్తరములు వచ్చినవి.

అందు దేవలునిలేఖ యానందపరిపూర్ణమై యుండెను. అనంతరామునిలేఖ యాతని హృదయమువలెనే శుష్కప్రాయమై యుండెను. అనంతరాముఁ డిట్లు వ్రాసెను:—"నీకు వేటకుఁ బోవలయునని కోరిక యున్నచో సమీపవనములకే పోవచ్చును—అంతదూరము పోనక్కఱలేదు. విశేషించి లక్ష్మీపతి యిప్పుడు రాజకర్మచ్యుతుఁ డయి యున్నాఁడు. ఆతని గృహమున నాతిథ్యముం గైకొనుట యంత మంచిపని కాదు."

యువరాజా యుత్తరముం గాంచి నిరుత్సాహి యయ్యెను. తరువాత నాతఁడు బాగుగ నాలోచించుకొని పినతండ్రి న్యాయముగనే వ్రాసెనని భావించుకొనియెను. ఆతని హృదయము న్యాయాన్యాయములను భావింపలేదు. పరిణయప్రాయుఁడగు దేవలునికొఱ కాతఁడు మిగుల దుఃఖించెను. ఆ దుఃఖముతోనే యువరాజా రాత్రిని వేగించెను.

మఱునాఁ డుదయమున లేచునప్పటికి లోకసేనకుఁ డొకయుత్తరముం దీసికొని యువరాజునకై ప్రతీక్షించియుండెను. ఆయుత్తరమనంతరాముఁడు వ్రాసినది. భవానీప్రసా దాయుత్తరముం జదువుకొని విస్మితుఁ డయ్యెను. అప్పుడాతఁ డానందముతో "జనార్దనా! వీరపురమునకు వేటకుఁ బోవుటకుఁ దండ్రిగారనుమతించినారు." అని చెప్పెను.

కాని జనార్దనుఁ డందుకొఱకు సంతోషింపలేదు; గంభీరముఖభావముతోఁ జాలసే పాలోచించెను. తరువాత యువరాజు జనార్దనునిం జూచి "భృత్యగణమును సంసిద్ధపఱుపుము; అశ్వములు మొదలగువాని నాయత్తము చేయుము. నీవశ్వారోహివై ముందుగ దేవలునియొద్దకుఁ బోయి యాతని బ్రయాణము చేయుము. నేనును శీఘ్రముగనే బయలుదేరి యాతనియొద్దకు వచ్చెదను. సైనికులను వెంటఁబెట్టుకొని పోవనక్కఱలేదని యాతనితోనే చెప్పితినని చెప్పుము. నూఱుమంది యంగరక్షకులు నా వెంట వచ్చునట్లు తండ్రిగా రాజ్ఞాపించియున్నారు. ఇంకను సైనికు లేల కావలయును

పొమ్ము! శీఘ్రముగఁ బొమ్ము! ఆలస్యము చేయకుము!" అని చెప్పెను.

భృత్యగణమునకుఁ దగినయాజ్ఞల నొసంగి జనార్దనుఁడు చింతాకులుఁడై దేవలుని ప్రాసాదమునొద్దకుఁ బోయి చూచెను. దేవలుఁడు మందిరమున లేఁడు. కొలది సేపటిక్రిందనే దేవలుఁడు పితృదర్శనార్థమై యాస్థానమునకుఁ బోయిన ట్లాతనికిఁ దెలియవచ్చెను. జనార్దనుఁ డాతని రాకకై నిరీక్షించి యుండెను. కొంతసేపటికి దేవలుఁడు వచ్చెను. జనార్దనుఁ డాతనిం జూచి రహస్యముగ "కుమారా! నీముఖలక్షణములంబట్టి చూడఁగా మీ తండ్రిగారు నీకు వేఁటకు సెలవీయ లేనట్లు తోఁచుచున్నది. నిన్న మీయన్నకును సెలవు దొరకినది కాదు. నేఁటి యుదయముననే యాజ్ఞ యయినది. ఏమి జరుగనున్నదో బోధపడుట లేదు కాని కుమారా! నీవు మాతోఁగూడ రావలయును. రానిచో మీ యన్నకు విపత్తు కలుగఁగలదు. మఱియొకమాట—నీ వెవ్వరికిని దెలియనీయకుండ నైదువందల మంది సైనికులను వెంటఁబెట్టుకొని రావలయును. పొమ్ము! మరల మీ తండ్రియొద్దకుఁ బొమ్ము! ఎట్లయిన నాతని యనుమతిం గైకొని రమ్ము! నీయొద్దనుండి జాబు వచ్చినతోడనే మేము ప్రయాణమయ్యెదము" అని చెప్పెను.

తరువాత జనార్దనుఁడు తిరిగి వచ్చెను. దేవలుఁడు మరలఁ దండ్రియొద్దకుఁ బోయెను. అప్పు డనంతరాముఁడు రాజస్థానమునఁ గొలువు చేయుచుండెను. అచ్చటనే కుమారుఁడగు దేవలుఁడు తన ప్రయాణముంగూర్చి మరల మనవి చేసికొనియెను. అనంతరాముఁడు విరక్తుఁడై "ఇప్పుడు కాదు—మఱియొకప్పుడు నీమాట వినియెదను" అనియెను.

కాని దేవలుఁడు కదలలేదు. ఇంతమందియెదుటను దండ్రితోఁ దనకోరికను దెలిపి యనుమతింపఁ జేయవలయునని యెంచి "తండ్రీ! నాకు వేఁటకుఁ బోవలయుననియున్నది? ఏలపోఁగూడదు? అన్న యెక్కడకుఁ బోవునో నేనుగూడ నచ్చటి కేలపోఁగూడదు?" అనియెను

అనంతరాముఁడు క్రుద్ధుఁడై "వలదు—నీవు బాలుఁడవు—వేటకు బోఁగూడదు" అనియెను.

దేవ—తండ్రీ! మాయన్నమాత్ర మెంత పెద్దవాఁడు? మాయన్న సేహారాయుద్ధమునఁ బ్రతాపముం జూపినది నా యీడుననే కాదా? ఆయీడున నాతఁడు చూపిన వీరత్వమును మీ పెద్ద సేనానాయకులలో నెవ్వరు జూపినారు? పదునేడేండ్ల యీడున మాయన్న మహాయుద్ధమునే చేయఁగలిగినప్పుడు పదునేడేండ్ల యీడుగల నేను వేఁటాడుటకుఁగూడ దగియుండలేదా? వేటయం దంతటి ప్రాణభయ మున్నదా? ఉన్నచో నట్టి భయంకర కార్యముం గావించుటకు మాయన్న కేల యాజ్ఞ నొసంగితిరి? అట్లయిన యెడల నన్నును గూడ మరలింపుఁడు.

అనంతరాముఁ డొకపస్తతి నేర్పఱుచుకొని యుండెను. అప్పుడాతఁడు కొలువునలువంకలును దిలకించెను—అందఱ చూపులు నాతని మొగమునందే యుండెను. అనంతరాముఁడు తలవంచుకొని మెల్లమెల్లగ దేవలునిఁ గూర్చి "సరే. అట్లయినచో నీవును బొమ్ము!" అనియెను.

దేవలుఁడు పరమానందభరితుఁడై తండ్రియొద్దనుండి యొక్కపరుగున నన్నయొద్దకుఁబోయి యాతని వక్షమున మొగముంచి యెంతయో నేపేడ్చెను. భవానీ ప్రసాదునకును దుఃఖము వచ్చెను. పిమ్మట నాయన్నదమ్ము లిరువురును గలసి వీరపురమునకు బ్రయాణమై పోయిరి.

---

ఐదవ ప్రకరణము

## నిర్జల జీమూతము

తేజస్వతీ నగరమునకు వీరపుర మిరువది క్రోసులదూరమునందున్నది. వీరపురము సామాన్య నగరమైనను సురక్షితమై యుండెను. ఆ కాలమునఁ బ్రతినగరమునకు నొక్కొక్క దుర్గ

ముండెను. రాజులవలెనే జమీందారులుకూడ నాకాలమునఁ బరస్పర యుద్ధములం గావించి యొండొరుల నాక్రమించుకొనుచుండిరి. ఎవ్వఁడు విజయి యగునో యాతనికి రాజసన్మానము కలుగుచుండెను. మన లక్ష్మీపతిరావును వీరపురమునకుఁ జమీందారుఁడై యుండెను. ఆ నగరమునకుఁ జుట్టునున్న విశాలారణ్యమంతయు నాతనిదే ఆతఁడు యోధుఁడనియు వీరపురుషుఁడనియు రాజులందఱు నెఱుంగుదురు. వీరేంద్రకేసరి రాజ్యకాలమునం దాతఁడొక విశ్వాసియగు ప్రసిద్ధ మంత్రియై యుండెను. ఇప్పు డా కాలము తిరిగిపోయినది — ఆతఁ డిప్పుడు మంత్రిసభనుండి తొలఁగింపఁబడి స్వగ్రామమునకు వచ్చియుండెను. ఆతనికి భార్యయును, బుత్రికా పుత్రికలును, భూములును, నమ్మకస్తులగు ప్రజలునుగూడ నుండిరి. కోశమున ధనముకూడ విశేషముగ నున్నది. ఆతని కన్నులలోఁ దేజమును బుద్ధియునఁ బ్రదర్శితములై యుండెను ఆతని సమున్నతలలాటమున నౌదార్యమునుఁ బవిత్రభావమును విస్ఫారితములై యుండెను.

ఇప్పుడు వీరపుర మానంద రసతరంగితమై యుండెను. యువరాజగు భవానీ ప్రసాదు వీరపురమునఁ గాదవిక్షేపముం గావింపనున్నాఁడు. ఆబాలగోపాలము నాతని సందర్శనమునకు వేఁడుకపడుచుండెను. నగరమంతయును బతాకలచేతను బత్రిపుష్పమాలికలచేతను నలంకృతమై యుండెను. నగరద్వారమున లక్ష్మీపతిరావు యువరాజు నెదుర్కొనుటకు సేనలతో నిలిచి నిరీక్షించుచుండెను. యువరాజు నిన్నటిదినముననే రాజధానినుండి బయలుదేరెను. నేఁడు వీరపురమునకుఁ జేరఁగలఁడు. అందఱు నానందోన్మత్తులై యుండిరి. మహారాజగు వీరేంద్రకేసరి తన రాజ్యకాలమునం దొక్కసారి మాత్రమే వీరపురమునకు వచ్చియుండెను. ప్రాతస్స్మరణీయుఁడగు నామహాప్రభుని వీరపురుషుఁడగు యువరా జిప్పుడు మరల నీ నగరమునకు వచ్చుచున్నాఁడు. భయంకర మృగసంకులంబగు నరణ్యమున వేఁటకుఁ బోవును; ఒకదిన మీనగరమున నివసించి యుండును. లక్ష్మీపతిరావు పదచ్యుతుఁడై నప్పటి నుండియు

నాతని రాజోద్యోగు లగౌరవముగఁ జూచుచుండిరి. ఇట్టి దుర్దినములలో యువరాజు సందర్శనలాభము వలన నాతనికిఁ బోయిన గౌరవము మరల లభియించి నట్లయ్యెను.

సేనాపరివేష్టితుఁడగు యువరాజు సమీపించు చుండుటం గాంచి లక్ష్మీపతిరావు పరమానంద భరితుఁడయ్యెను. అప్పు డాతనికి సేహారా రణక్షేత్రమునందలి వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. అతఁడు తనలో "నే నొక పదునేను వేల సైనికులను యువరాజునకుఁ గూర్పఁ గలిగితినా——నిశ్చయముగ నీ వీర బాలున కీతని సింహాసనమును నిరాటంకము గ సమర్పింపఁ గలఁగుదును. ఈ సింహపరాక్రమునిం గాంచి యనంతరాముఁడు జంబుకమువలెఁ బలాయితుఁడై పోవలసినదే!" అని భావించుకొను చుండెను.

యువరాజు సమీపించినతోడనే లక్ష్మీపతిరావు గుఱ్ఱమునుండి దిగి యువరాజునకు దేవళునకును నభివాదము లొనరించెను. యువరాజు వినమితుఁడై లక్ష్మీపతిం గౌఁగిలించుకొని సన్మానించెను. సేనలు వెనుకవచ్చుచుండ యువరాజును, దేవళుఁడును దుర్గప్రవేశము గావించిరి. వారివెనుక జనార్దనుఁడును, లక్ష్మీపతియును, వారి వెనుక వీరపుసైన్యమును, రాజసైన్య మందఱివెనుకను బయలుదేరెను. యువరాజ దేవళులపైఁ బుష్పమాలికా వర్షము కురియుచుండెను. పుణ్యాసతీ మంగళకీర్తనలచే దశదిశలును బరిపూర్ణము లయ్యెను. రాజమార్గమంతయును బుష్పాచ్ఛాదితమై పోయెను. ఆ సోదరు లిరువురును బుష్పమధ్యమునఁ బుష్పసదృశులగు మనోహరాకృతులతోఁ బుష్పమాలికాలంకృతులై మందహాస వికసితవదనులై పవిత్రోక సుందర మందిరమునఁ బ్రవేశింపఁ జేయఁబడిరి.

తదనంతరము సమాదరాభ్యర్థన స్నానభోజనాదులు నిర్వర్తింపఁ బడియెను. పిమ్మట నేయరణ్యము వేఁటకు సముచితమైనదియో విచారింపఁబడియెను. మఱునాఁడు వ్యాఘ్రారణ్యమునకు వేఁటకుఁ బోవునట్లు స్థిరపడియెను. జనార్దన లక్ష్మీపతుల కా వేట

యంతయిష్టముగ లేదు. యువరాజును దేవలుఁడును మాఱువేషములతో నగర సంచారమునకు బయలుదేరిరి.

వారు నగరము వెలుపలికిఁ బోయి చూచిరి. ఎల్లచోటులను మార్గము బాగుచేయుటకై మనుష్యులు నియోగింపఁబడి పనిచేయుచుండిరి. అప్పుడా యిరువురును మార్గపార్శ్వమునందలి యొకపొదలో గూర్చుండి యుండిరి. అచ్చట నిరువురువృద్ధులు నొకవృద్ధురాలును బని చేయుచుండిరి. యువరాజు వారి వంకఁజూచి "మీరీమట్టిని ద్రవ్వుచుంటిరేల?" అని ప్రశ్నించెను.

వృద్ధుఁడు — నీ వెక్కడివాఁడవయ్యా! మా రాజుగారువచ్చియున్నసంగతి నీకుఁ దెలియదా?

యువ — రాజెవ్వరు? అనంత రాముఁడేనా?

వృద్ధు — రాజు — ఆతడు మా రాజు కాఁడు,

యువ — నగే — రాజో యెవ్వరో వచ్చియుండిరి. మీరు మట్టి త్రవ్వుట యేల?

వృద్ధు — ఈమార్గమునుండియే మా రాజు పులివేఁటకు బోవునని నీకుఁ దెలియదా?

దేవ — నీవు పులిని జంపఁగలవా,

ముసలివాఁడు దేవలుని మందహాస వదనమును తెప్పవాల్పకుండఁ జూచుచు "నాయనా! నీ మొగము చూచిన ముద్దువచ్చుచున్నది, కుమారా! మీయిల్లెక్కడ?" అనియెను.

అప్పుడు వృద్ధురాలు "ఆహా! ఈతని మొగము నాఁ లేఁడిపిల్ల మొగమువలెనే యున్నది. నా చిన్న లేఁడి బ్రదికియున్నచో సరిగనింత యందముగనే యుండును." అనియెను.

దేవ — ముసలిదానా! నేను మీ యింటికి వచ్చెదను. నన్నుఁ దీసికొనిపొమ్ము. కాని నేను నిన్న వ్వాయని పిలుచుట యెట్లు?

వృద్ధురాలు — కాదునాయనా! నా కా మొగమింకను మఱపునకు వచ్చుటలేదు.

అప్పుడు యువరాజు "అవ్వా! నన్నుఁ దీసికొని పోయెదవా? నేను నీ లేఁడివలె సంతటియందము కలవాఁడను గానా యేమి?

ఆ వృద్ధురా లొకసారి యువరాజు మొగమువంకఁ జూచెను. కొంచెము సమీపమునకు వచ్చి మఱియొకసారి చూచెను. మఱి కొంచెము జరగి యింకొకసారి చూచెను. మఱి కొంతదగ్గఱగ వచ్చి ఱెప్ప వేయకుండ నదేపనిగఁ జూడ నారంభించెను. ఆమెకుఁ దనివి తీఱుట లేదు. యువరాజు నవ్వుచు "అవ్వా! నా మొగము చూచుటకు నీకు భయమగుచున్నదా? అట్లయినచో నేను నిన్న వ్వాయని పిలువను." అనియెను.

వృద్ధురాలు—నాయనా! నీవు దేవతామూర్తివా? కాకున్నచో నింతియందము మనుజుల కుండునా? మా రాజకుమారుఁడు త్రిలోకసుందరుఁ డని యందఱును జెప్పుకొనుచుండఁగా నేను విని యుంటిని. నీవుకూడ నాతనివలెనే సుందరుఁడవు. అయ్యో! నీవు దేవతవా?

రెండవవృద్ధుఁడు—పోవే నీచురాలా! ఈతఁడు దేవత యెట్లగును? దేవతకు రెండు ఱెక్క లుండును; నాలుగుదు చేతులుండును; ఎంతయో పొడుగుగ నుండును. నీవు దేవతను జూచితివా? కేవల మడవిలోఁ గట్టెలు పిఱుచుకొనుదానికి నగరములసంగతి యేమి తెలియును?

యువరాజు దేవత కాఁడని తెలుపుటవలన వృద్ధురాలికి విచారము కలిగెను. ఆమె యాతని నొకవరము వేడుకొనవలయు నని తలంచెను. ఆ వృద్ధురాలి హృదయభావమును గ్రహించి దేవలుఁడు "అవ్వా! నీవు నీ ముఖ్యాభిప్రాయమును దెలిపితివి కావు. ఈతఁడు నిజముగ దేవత—నే నీతని దాసుఁడను. దేవతయగునో కాఁడో చూచినఁ దెలియుటలేదా? దేవత యెక్కడ సడుగుపెట్టునో యక్కడ బంగారు మొహరీలు దొరకును అనియెను."

దేవలుఁ డొరులకుఁ దెలియకుండ నిసుకలో బంగారు మొహరీలను బడవైచి యువరాజు చేయిపట్టుకొని యాస్థానమునం దడుగు

పెట్టించెను. యువరాజు మందహాసము చేయుచు నిలువఁబడియెను. వృద్ధురాలాతని పాదము లుంచినచోట మట్టిని బెల్లగించెను. తోడనే యొక మొహరీ సూామె కగపడియెను. ముసలిది సూామొహరీని ముట్టకుండఁగనే విస్మయముతో యువరాజు మొగమువంకఁ జూడఁదొడంగెను. మిగిలినవృద్ధులిరువురును జటాజూటుని నాదింతను జూడవచ్చిరి ముసలిది మొహరీని జూచుటలేదు. యువరాజు మొగము వంకనే చూచుచుండెను—నమస్కారము లేదు—మాట లేదు—తృప్తి లేదు—కేవల మొక్కటేచూపు—యువరాజు కన్నులు మెఱసి పోవుచుండెను. అప్పుడు యువరాజ దేవలులు గృహాభిముఖులై పోవుచుండిరి. అప్పుడందొక వృద్ధుఁడు "నేను జెప్పలేదా? వారిరువురును దేవతలే—ఎప్పుడు రాజు నగరమునకు వచ్చెనో యప్పటినుండి దేవతలుకూడ వత్తురఁట!" అనియెను. ఆమాట విని యువరాజు తిరిగి చూచెను. ముసలిది యింకను నట్టే విభ్రాంతయయి చూచుచుండెను.

ఆ మఱునాఁటి యుదయమున నగరమంతయు సమ్మర్దముగ నుండెను. భయభక్తులతో స్త్రీపురుషు లందఱు నత్యాదరోత్సాహులై నిలిచి యుండిరి. చేతులతో బల్లెములు; కొనుక ధనుస్సులు; పార్శ్వములఁ దరవారులు—అందఱకును ముందుగా యువరాజ దేవలు లుండిరి; వెనుక జనార్దన లక్ష్మీపతు లుండిరి. "కాళికా మాతకుజయ!" అను జయధ్వానములు దశదిశలఁ బ్రకంపితములుగఁ జేయుచుండ వేఁట పయనము జరగెను. అందఱు నరణ్యమును సమీపించిరి. అనేకులకు గుండెలు చెదరిపోవుచుండెను. కాని, దేవలునకు మాత్రము భయము లేదు. ఆతనికిఁ దనయన్న సమీపమునందున్నచో యముఁడు వచ్చినను భయము లేదు. వ్యాఘ్రవిహారము యువరాజు వీరహృదయమున కానందదాయకముగ నుండెను. వనమంతయును గల్లోలితముం గావించి యాతఁడు వ్యాఘ్రానుసరణముం గావించెను. కొన్ని చిన్నపులులును వనవరాహములును జంపఁబడియెను. తదనంతర మతిసాహసముతో యువరాజు మహారణ్యమధ్యమునఁ బ్రవేశించెను

ఆతనితోఁగూడ ఘాతుకులవలె దేవల జనార్దను లనుసరించిరి. ఆ వెనుక సిపాయిలు కంటకాఘాతముననో మఱి యే కారణముననో గాని యప్పుడు జనార్దనుని గుఱ్ఱము చలించిపోయెను. ఎట్టయెదుట రెండు పులు లగుపడుటచే వాని నాక్రమింపఁ జూచుచున్న యువరాజు వెనుదిరిగి చూచుటలేదు యువరాజ దేవలు లిరువురును భల్లములను విసరిరి. కాని, యవి రెండును వ్యర్థము లయ్యెను. అప్పు డావ్యాఘ్రములు రెండు నొక్కయుదుటున లంఘించి వారిపై నుఱికెను. యువరాజు బిగ్గరగా "దేవలా! జాగ్రత్త." అని కేక వైచెను.

అసాధారణ శిక్షావంతులగు నా యిరువురు నప్పుడు మోఁకపులు మొఱసినట్లుగా గుఱ్ఱములనుండి క్రిందికుఱికిరి అందుచే నావ్యాఘ్రములయొక్క లక్ష్యము చెదరిపోయెను; అవి యూవేగముచేఁ దూలి పడిపోయెను; కాని, యంతలో లేచి మరల వారి నాక్రమింపవచ్చుచుండెను. అప్పుడు రాజకుమారు లిరువురును కరవాలములం గైకొని యాత్మసంరక్షణమునం గావించుకొనుచుండిరి యువరాజు భయపడిన వానింబోలి యుండుటక వెనుకకు జరిగెను. అప్పుడు జనార్దనుఁడు గుఱ్ఱమునువదలి కాలినడకను బరుగెత్తుకొని యావలికిఁ వచ్చుచుండెను. జనార్దను నతిక్రమించి రాజసైన్యముతో లక్ష్మీపతిరావు కూడ వచ్చుచుండెను.

యువరాజు దేవలుని యవస్థంజూచి చాల విచారించెను. దేవలునిపై నావ్యాఘ్రము పడుటకు సిద్ధముగ నుండెను. దేవలుఁడు దానిని గొట్టుచునే యుండెను గాని, లాభము లేకుండెను. దెబ్బ తగిలిన కొలఁది వ్యాఘ్రము మహాక్రోధముతో లంఘించుచుండెను. అంతలో దేవలుని చేతిలోని తరవారి క్రిందఁబడిపోయెను — ఇఁక రక్షణమున కుపాయ మేమున్నది? అప్పుడు దేవలుఁడు "అన్నా!" అని యొక్క కేక వైచెను యువరా జొడలు తెలియకుండ నెట్లు వచ్చి పడియెనో గాని, యొక్కసారిగ దేవలుని కడ్డముగ వచ్చి నిలిచెను; అంతలో నాపులి నొక దెబ్బతో నేలపైఁ బడఁగొట్టెను. ఈ సమయమున ద్వితీయ వ్యాఘ్రమున కించుక సులువు దొరకుటచే

మఱియొక వెపునుండి వచ్చి యువరాజు నాక్రమించుకొనియెను. దేవలుఁడు "సోదరా! సోదరా!" అని కేకవైచెను. యువరాజు వెనుదిరిగి చూచునప్పటికిఁ బులి గుఱ్ఱముపైఁ బడనుండెను. ఇఁక దప్పించుకొనుట కుపాయములేదు. ఇంతలో రాజసైన్యమునుండి యొక భల్లము విసరఁబడియెను. దురదృష్టవశమున నాయాఘాతముచేఁ బులికిమారుగ నాతనిగుఱ్ఱమే చంపబడియెను. ఆ పడిపోవుచున్న గుఱ్ఱమునుండి యొక్కయుదుటున లంఘించి యువరాజు క్రిందఁబడిపోయెను. ఆపులి పడిపోయిన యశ్వముపైఁ బడియెను. ఆ యువరాజా సమయము నూరకపోనీయలేదు. తన బాకుతో నామూలముగ నా పులిపక్కలోఁ బొడిచెను. ఆ దెబ్బతోఁ బులి క్రిందఁబడిపోవుటయే గాక యా బాకు భూమిలో గ్రుచ్చుకొనిపోయెను. ఎవ్వరి బల్లెపు దెబ్బచే యువరాజుగుఱ్ఱము పడిపోయినదో, యాతని నెవ్వరును జూచి యుండలేదు. కాని జనార్దనుఁ డాతని వెదకిపట్టుటకు యెంతయో ప్రయత్నించుచుండెను.

ఆ మఱునాఁడు మఱియొక వేఁట—అది యింకొక యరణ్యము. ఆ యరణ్యము కేవలము రక్షితమైనది పరిపూర్ణమైయుండెను. పరిరక్షకులు మొదటిదినమందే వనమునంతయును గలఁచి లేళ్ళ నన్నిటి నొక్క చోటికిఁ జేర్చియుండిరి. యువరాజు మహోల్లాసముతో వేఁటాడ నారంభించెను. కొన్ని హరిణములు సంహరింపఁబడియెను. కాని, యింకను నాతనికిఁ దృప్తి కలుగలేదు. జనార్దనుఁ డొక సంశయమును గల్పించియే యుండెను. కాని, యువరాజునకుం గల వేఁట తమకములో నాపూట నచ్చుటలేదు. జనార్దనుఁడు శిక్షితహయారూఢుఁడై యాతని వెనుకనే పోవుచుండెను. మహోల్లాసముచే యువరాజునకును దేవలునకును విశ్రాంతిలేదు. లతలు, గుల్మములు, ముండ్లు, డొంకలు మొదలగునవేవియు నగపడుటలేదు. గుఱ్ఱముల దాఁటించుకొని పోవుచుండిరి. ఆసమయమునం దెవ్వరికి నగపడకుండ నెక్కడనుండియో యొక బాణము రివ్వునవచ్చి యువరాజు తలపాగకుఁ దగిలెను. ఆ వేగముచే నాయుష్ణీషము మస్తకచ్యుతమై క్రిందఁ

బడిపోయెను. ఉత్సాహోన్మత్తుఁడగు యువరాజా సంగతిని గ్రహింప కుండఁగనే హరిణముల వేఁటాడుచుండెను. కాని, యాబాణ మేవంక నుండి వచ్చినదో యావంకకు జనార్దనుఁడు తన గుఱ్ఱమును దాఁటించెను. కొంతదూరముపోయి చూచునప్పటి కొకయశ్వారోహి డొంకను దాఁటి తనగుఱ్ఱమును వాయువేగమున నుఱికించుచుఁ బాఱిపోవుచుండెను. సాధ్యమైనంతవఱకు జనార్దనుఁడును దనగుఱ్ఱమును నావంకకుఁ బరుగెత్తించెను. కాని, యలసియున్న యా గుఱ్ఱము పరుగెత్తఁజాలక వెనుకఁబడియెను జనార్దనుఁడు హతాశుఁడై వెనుకకు మరలెను.

యువరాజెన్నియో లేళ్ళను వేఁటాడి సాయంకాలమున కింటికిఁ బోయెను. జనార్దనుఁ డాశ్చర్యవిద్ధుఁడగు నుష్ణీషము నాతనికిం జూపి "యువరాజా; ఈపాగ యెవ్వరిదో చెప్పఁగలవా? దీనికి బాణ మేల గుచ్చుకొన్నది?" అని ప్రశ్నించెను.

దేవలుఁ డాశ్చర్యముతో "ఇది నా యున్నగారి యుష్ణీషము దీనిని బాణముతోఁ గొట్టినవా రెవ్వరు?" అనియెను.

జనా — ఆమాటయే నేను మిమ్మడుగుచున్నాను!

యువరాజు నిరుత్తరుఁడయ్యెను; తలవంచుకొని నిలువఁబడియెను

జనా — ఏమి యువరాజా! నిన్న రాత్రి నీతోఁ జెప్పినసంగతి యిప్పటికైన మనసునకుఁ బట్టినదా? నేఁటివేఁటలో నీనిరుత్సాహవదనముం బట్టి నేఁ జెప్పినమాట నీహృదయమునం దున్నదనియే నేనను కొంటిని — మంచిది — నిన్న నెవ్వఁడు విసరినబల్లెము నిన్నుఁ జంపక యదృష్టవశమున నీగుఱ్ఱమును దునిమించినదో నేఁడాతఁడు విసరిన బాణమే నీయుష్ణీషమును బడఁగొట్టినది కాదా? ఆబల్లెము గుఱితప్పి నాగుఱ్ఱముపైఁ బడినదని నీవు రాత్రి నాకు సమాధానము చెప్పితివి. ఇప్పుడేమి చెప్పెదవు? కావున యువరాజా! మనకిఁక నేఁటవలదు — ఇంటికి మరలిపోవుదము!

యువ—ఛీ! ఛీ! మీ రేమనుచుంటిరి? తండ్రియును బిన తండ్రియును సమానులు. వారినిందను నేను వినఁజాలను. నాకెల్ల యెడలను వారు పూజనీయులు. సింహాసనము నాపినతండ్రిదే— ఆతఁడుండఁగా నేనేల? నాకు రాజ్యమునందుఁగాని, సింహాసనమునందుఁగాని కోరిక యెంతమాత్రమును లేదు. నా పినతండ్రి నాయందలి యాదరముచే నెప్పుడు నన్ను సింహాసన మెక్కించునో, యప్పుడే నేను సింహాసనస్థుఁడ నయ్యెను. అట్లు చేయకున్నచోఁ గాళికామాతసాక్షిగఁ జెప్పుచున్నాను:—ఈ జీవితకాలమునం దెన్నఁడును నేను సింహాసనము నపేక్షింపఁబోను—రాజ్యభారమును వహించి ప్రయాసపడుటకుఁ బ్రయత్నింపఁబోను.

---

ఆఱవ ప్రకరణము.

# అశ్రువు

జనార్దనుఁడు చెప్పినపద్ధతిని యువరాజు ససైన్యముగఁ దిరిగి వచ్చెను. మందిరమునకు వచ్చి చూచునప్పటి కాతని గదియందలి వస్తువులన్నిటిని వ్యత్యస్తముగఁ జేసి వెదకినట్లుగ పడియెను. జనార్దనుఁ డాలోచనాపరవశుఁ డయ్యెను. యువరాజు క్రోధోద్దీప్తుఁడై ప్రాసాదరక్షకునిం బిలిపించెను. అప్పు డొకయపరిచిత పురుషుఁడు వచ్చి చేతులు జోడించుకొని యువరాజు నెదుట నిలువఁబడియెను. యువరాజా పురుషునిం జూచి "ఎవరు నీవు?" అని ప్రశ్నించెను.

పురు—నేనే ప్రాసాదరక్షకుఁడను.

యువ—ప్రాతవాఁ డేమయ్యెను?

పురు—ఆతనికి మఱియొకపని యయినది.

యువ—నాసామానంతయు గత్తరచేసిన వారెవ్వరు?

పురు—మహాప్రభూ! నా కాసంగతి యేమియును దెలియదు.

యువ—సత్యము చెప్పుము. లేకున్నచో నీకుఁ దగినశాస్తి కాఁగలదు.

ఆ పురుషుని యోష్ఠప్రాంతమున నించుకహాస చిహ్నఁమగపడి భయపడినట్లుగా నంతలో మాయమైపోయెను. యువరాజ జనార్దను లాహాసలేశమును గుర్తించిరి. అప్పుడు ప్రాసాదరక్షకుఁడగు పురుషుఁడు "మహాప్రభూ! మీారేమైనను జేయుటకు సమర్థులు—కాని నాకాసంగతి యెంతమాత్రమును దెలియదు" అనియెను.

యువరాజాతని విడిచి యిటునటుఁ దిరుగుచుండెను. ఇంతలో జనార్దనుఁ డింకొకగదిలోనికిఁ బోయి యొకబాలసేవకునిం గాంచి యాతనిం బట్టుకొని, పరిహరింప నారంభించెను. అట్లుకొట్టుచు జనార్దనుఁ డాతనింజూచి "యువరాజు మందిరమునందలి వస్తువులన్నియు నట్టిటుచేసినవా రెవ్వరు?" అని యడిగెను.

బాల—బాబూ! నేనేమియును జేయలేదు. ఆ ప్రాసాద రక్షకుఁడే చేసినాఁడు.

జనా—ఎవ్వఁడు? ప్రాతవాఁడా? క్రొత్తవాడా?

బాల—క్రొత్తవాఁడే.

జనార్దనుఁ డాబాలకుని విడిచి యువరాజు నొద్దకువచ్చి "యువరాజా! నాకార్యమున కడ్డము చెప్పవలదు—నాయుద్దేశము ను గూర్చి యేమియును బ్రశ్నింపవలదు. నాయుద్దేశము చెప్పవలసి వచ్చినచో నీపెద్దలను నిందింపవలసివచ్చును. నీవేమియును మాటాడకుండఁ జూచుచుండుము. నాయిష్టమువచ్చినట్లు చేసెదను." అని చెప్పెను.

తరువాత జనార్దనుఁడు రెండంతస్తులయందునుగల వస్తువుల నన్నిటిని సరిచూచుకొనియెను. అందొక్కటియు నపహరింపఁబడి యుండలేదు కాని యెల్లవస్తువులు నట్టిట్లు చెదరి యుండెను. దుస్తులును వస్త్రములును మరల మడఁచుట చేతఁకానివారిచే విప్పఁబడి చెదరియుండెను. జనార్దనుఁ డొకసేవకునిం బిలిచి వస్తువుల నన్నిటి నొక్కచోఁ జేర్పించి వానిపై నిప్పు పెట్టించెను. సోఫాలు, వఱు

పులు, దుస్తులు, వస్త్రములు, కుర్చీలు, పుస్తకములు, కలములు, పెట్టెలు, పీఠములు—అన్నియును మండి బూడిదయయి పోవు చుండెను. కేవలము నందొక దుస్తుమాత్రమును జనార్దనుఁడు మంటలో వేయలేదు దానిఁ జేతబట్టుకొని యాతఁడు ప్రాసాదరక్షకుని వెదకుచు బయలుదేరెను. సులభముగనే యాతఁడు జనార్దనున కగ పడియెను. జనార్దనుఁ డాతని నొకరహస్యస్థలమునకుఁ దీసికొనిపోయి "ఓరీ! యువరాజు నీయెడల సంతుష్టుఁడై యీదుస్తును నీకు బహుమానముగ నిచ్చియున్నాఁడు. నీవు దీనిని ధరించిపోయి యాతనికి నమస్కారముం గావించి రమ్ము." అనియెను.

కాని యా పురుషుఁడు దానిని ధరించుటకు సమ్మతింపలేదు. అప్పుడు జనార్దనుఁడు 'నీవు దీనిని ధరింపకున్నచో యువరాజు నవమానించి నట్లగును. ధరింపుము!" అని చెప్పెను.

అప్పటికిని నాతఁడు సమ్మతింపలేదు. అందుచే జనార్దనుఁడు క్రుద్ధవ్యాఘ్రమువలె నాతనిపైఁబడి యాతనిం గ్రిందఁబడద్రోసి గుండెలపై గూర్చుండి మహాభైరవ స్వరముతో "దురాత్మా! రాజద్రోహీ! క్రూరపిశాచమా! ఈ యింటియందలి సమస్త వస్తువులను విషలిప్తములుగఁ జేసివైచితివా? ఇఁక నీకు నిష్కృతిలేదు—ఈదుస్తులను బేలికలుగఁ జేసి నీవు భక్షించి తీరవలయును. అంతవరకును నిన్ను విడుచువాఁడనుగాను." అనియెను.

అంత నా పాపాత్ముఁడు దీనునివలె నేడువనారంభించి. తుదకుఁ దన యపరాధమును జాలవఱ కంగీకరించెను ; క్షమియింపఁ గోరుకొనియెను. కాని జనార్దనుఁ డూరక విడువలేదు. అతనిముక్కును జెవులనుగోసి విడిచిపెట్టుచు "పాపాత్మా! నీవు దురాత్ముఁడగు మీ యనంతరామునితో మనవి చేసికొనుము—నీకిప్పు డెట్టిగతి కలిగినదో యెప్పటికైన మీయనంతరామునకుఁగూడ నట్టిగతియే కలుగును." అని గద్దించిపలికెను.

ఈ ప్రాసాదరక్షకుని మూలమునఁ జేయించినకార్యము వెల్లడి యగుట కనంతరాముఁడు సహింపలేఁడు. అందుచే నిప్పుడేమునినను

వసంతరాముఁ డేమిచేయుటకును సాహసింపఁజాలడని జనార్దను డూహించుకొనియెను. అందుచేతనే జనార్దనుఁడంత నిర్భయముగఁ బలుకఁగలిగెను కాని యంతమాత్రముచే జనార్దనుఁడు నిశ్చింతుఁడై యుండలేదు. ఆమందిరమునందలి ప్రతిగృహమును, సేనానివాసము, సేవకనివాసము, భోజనాగారము, పుష్పోద్యానము మొదలగు స్థలము లన్నియును దిరిగిచూచెను. చూచినకొలది నాతని మొగము వాడిపోవుచుండెను. తుదకాతఁడు యువరాజు నొద్దకువచ్చి "యువ రాజా! మనకు మహావిపత్తు కలిగినది. నీవు శత్రుమధ్యమునం దున్నావు. అశ్వశాలయందును, పాచకాగారమునందును, సేనాని వాసమునందునుగల వారెల్లరును (గొత్తవాండ్రె)—ఎక్కడఁజూచి నను నూతనపరిచారకులే. కేవల మొక్కఁడుమాత్రమే పాతవాఁ డున్నాఁడు. నీవిక నాఁకు దెలియకుండ నెట్టి యాహారమునుగాని పానీయమునుగాని యుపయోగింపవలదు. నీవు నీ పడకటిల్లు వదలి బయటికి రావలదు. నేనిప్పుడు కుమార దేవలునియొద్దకుఁ బోయి యచటనుండి యాహారమును దెప్పించెదను. పర్యంకమును, కుర్చీ లును, సోఫాయును మఱియును గావలసినవస్తువు లన్నియు నటనుండి తెప్పించెదను." అనియెను.

జనార్దనుఁడు వెడలిపోవునప్పటికి సాయంకాల మయ్యెను. అప్పుడు దేవలుఁడు మందిరోద్యానమునఁ బ్రచారము చేయుచుండెను ఆతఁడు జనార్దనుంజూచి పరమానందముతో నెదురుకొని యాతని ముఖలక్షణములంగాంచి భయసంశయావిష్టుఁడై తన యన్న క్షేమ ముంగూర్చి ప్రశ్నించెను. జనార్దనుఁ డాతనికెట్టి ప్రత్యుత్తరమును జెప్పకుండ నుద్యానమునందలి యొకరహస్యస్థలమునకుఁ దీసికొని పోయి జరిగిన రెండుసంవత్సరముల వృత్తాంతమును సంక్షేపముగఁ దెలియజేసెను. ఈ రెండేండ్లనుండియు వసంతరాముఁడు యువరాజుం జంపించి సింహాసనము నాక్రమించుకొనుటకై చేసిన ప్రయత్నముల నన్నిటిని క్రమక్రమముగ నాతనికి దెలియఁజెప్పెను. అనంతర ముప సంహారరూపముగా "కుమారా! దేవలా! ఈమాటలవలన నీ

కోమలహృదయమున కించుక యాఘాతమైయుండునని యనుకొనియె దను—ఇంత కాలమువఱకు నీసంగతులు నీ కె తమాత్రమును దెలియ నీయకుండ దాఁచి యుంచితిని ఇప్పుడైనను జెప్పకయే పోవుదును—కాని దుస్తంత్రముదుర్భరమై మహావిపత్సూచకమై యగపడుచున్నది. ఈసమస్త వృత్తాంతమును నీకుఁ దెలుపకుండఁ సింకను దాఁచియుంచుట కవకాశము లేదు—అందుచేత నే యిప్పుడంతయును జెప్పవలసి వచ్చినది. ఇది తప్పుగాఁ దలంపకుము ! క్షమియింపుము !" అనియెను.

దేవలునినోటినుండి యెట్టిమాటయును వెలువడుట లేదు. అతని మందహాసరుచిరవదనమండలమున గంభీరవిషాదచ్ఛాయ యావరించుకొనియెను. దేవలుని హృదయ మింతగా నొచ్చునని జనార్దనుఁ డూహించియుండ లేదు. జనార్దనుఁ డెన్నియోవిధములఁ బ్రబోధించెను; ప్రశంసించెను: కాని దేవలునినోటినుండి యొక్కమాటయును వెలువడ లేదు. అప్పుడు జనార్దనుఁడు తా నీసంగతుల నేల యుగ్గడించితినని తన్నుఁ దానే నిందించుకొనియెను. చూచుచుండగనే దేవలుఁడు చిన్నపుష్పమాలికంబోలి శిథిలసర్వావయవుఁడై నిలువునఁ గూలఁబడిపోయెను. జనార్దనుఁ డాకస్మికముగ స్తంభితుఁడైపోయెను; అంతలోఁ దేరుకొని దేవలకుమారుని యచేతనశరీరము వక్షమునం జేర్చుకొని మందిరమునఁ బ్రవేశించి కమలమాలికాసదృశంబగు పర్యంకముపై దేవలుని శయనింపఁజేసెను. తోడనే గుఱ్ఱము నెక్కిపోయి జనార్దనుఁడు నిమిషములో యువరాజు నచ్చటికిఁ దీసికొనివచ్చెను. అప్పటికి సేవకుల యుపచారములవలన దేవలున కించుక తెలివికలిగినది. దేవలుఁ డప్పుడు తనసోదరునిజూచి మొగము త్రిప్పుకొనియెను. అప్పుడు యువరాజుద్వేగముతోఁ దమ్ముని నోడిలోనికిఁ జేర్చుకొని మాటిమాటికిని ముద్దు పెట్టుకొనుచుండెను. ఇఁక దేవలునకు దుఃఖమాఁగినది కాదు. అతనితో యువరాజుకూడ నేడువఁ దొడంగెను. సేవకులుకూడ నేడువ నారంభించిరి. జనార్దనుఁ డప్పుడు భృత్యులను వెంటఁబెట్టుకొని వెలుపలికిఁ దీసికొనిపోయెను. పిమ్మటఁ

గొంతసేపటివఱకు నాసోదరు లిరువురును దుఃఖించిరి. దుఃఖానంతరమున సంభాషణము—సంభాషణానంతరమునఁ బ్రేమాభినయనము—తదనంతరమున మందహాసము—కాని. యేమందహాసమునఁ బూవులు వర్షించుచుండెడివో యామందహాస మిప్పుడు దేవలుని వదనమండలమునం దగపడుట లేదు. అప్పుడు దేవలుఁడు "సోదరా! నేను నిన్నుఁ విడిచియుండఁజాలను—నేనుగూడ నీతోడనే వచ్చెదను" అనియెను.

యువరా జేమేమియో చెప్పఁబోయెను గాని, దేవలుని దుఃఖభారమును, విషాదవదనమును గాంచి యేమియు జెప్పజాలకపోయెను. అప్పు డాతఁడు దేవలునిఁ బ్రేమాతిశయంబునఁ గౌఁగిలించుకొని "తమ్ముఁడా! అల్లరమ్మా!" అనియెను.

ఆసోదరు లిరువురు నప్పుడొండొరులచేతులం బట్టుకొని బయటికి వచ్చుటను జూచి జనార్దనుఁడు ద్వారాంతరాళమున నిలువఁబడి కన్నీరు దుడుచుకొనుచు బాష్పగద్గదకంఠస్వరముతో "కుమారా! మీరియన్న యింకను భోజనము చేయలేదు" అనియెను

అప్పుడు దేవలునకు మరల నెల్లసంగతులును జ్ఞప్తికివచ్చెను. అతఁడు తనసోదరుని మొగమువంకఁ దదేకదృష్టితోఁ జూచెను—అంతలోఁ దలవంచుకొనియెను—మరలఁ గన్నెత్తిచూచెను—లజ్జా వమానములాతనికి మర్మాంతికవేదనముం గావించుచుండెను. గ్రీష్మ ప్రతప్తంబగు మల్లికాకుసుమమువలె నాతఁడు సంకుచితుఁడైపోయెను.

---

ఏడవ ప్రకరణము

## అశనిపాతము

యువరాజమందిరము మరలఁ గ్రొత్తవస్తువులచే నలంకరించు నప్పటికి జాముగాత్రి యయ్యెను. తరువాత యువరాజును, దేవలుఁడును దేవలుని యింటనే భోజనము చేసి యువరాజు మందిరమునకు వచ్చిరి. అప్పుడు జనార్దనుఁ డొక అంగరక్షక కవచముం

దీసికొనివచ్చి దీనిని వస్త్రాభ్యంతరమున ధరింపవలయునని యువరాజును నిర్బంధించెను. ఇష్టము లేకపోయినను యువరాజున కా కవచమును దొడిగికొనియే శయనింపవలసివచ్చెను——సోదరు లిరువురు నొండొరులం జూచికొనుచుఁ గ్రమముగఁ నిదురించిరి. అప్పుడొక విశ్వాసియగు సేవకుని గృహద్వారమునఁ గావలియుంచి జనార్దనుఁడు పోయి నలువంకలను దిరిగి పరిశీలించుచుండెను. ఆతఁడు తిరిగి వచ్చునప్పటికి రాత్రి రెండుజాములయ్యెను. అప్పుడు జనార్ధనుఁడు సేవకుల నన్నలకుఁ బంపివైచి ద్వారమునకుఁ గడియ వైచి కొన్ని తరవారులును, కొన్ని యినుప్మల పొదలును విండ్లును, బల్లెములును సేకరించి యథాస్థానములం దుంచి తాను నిష్కోశిత కృపాణపాణియయి ద్వారమునకు వెన్ను నానుకొని కావలి కాయుచుండెను.

జనార్దనుని హృదయమిప్పుడు విశేష చింతాపరిపూర్ణమై యుండెను రెండువత్సరముల వృత్తాంతమంతయు నాతని మనంబున జాగరిత మగుచుండెను. ఆతని బాల్యము, యౌవనము——అప్పటి సంగతులు జ్ఞప్తికి వచ్చెను వీరేంద్ర కేసరి చరిత్రమును——అనంత రాముని చర్యలను మనసునకుఁ దోఁచెను. అప్పుడు రాత్రి మూడవ జాము గడచుచున్నది. గదిలోనిదీపము సన్నముగ వెలుఁగుచున్నది. ఆ యస్పష్టాలోకమునందు యువరాజు వదనము జనార్దనున కస్పష్టముగ నగపడుచుండెను. ఆ సమయమునఁ గిటికీయం దేదియో చప్పుడైనట్లయ్యెను. అది భ్రాంతియేమో యని జనార్దనుఁడు మొట్ట మొదట నుపేక్షించెను. కాని, యంతలో మరల నట్టిచప్పుడే యయ్యెను. అప్పు డాతఁడు లేచి కిటికీయొద్దకుఁబోయి చెవియొగ్గి యాలకించెను ఆ గవాక్షమున కెదురుగ నుద్యానమునం దెవ్వరో యిరువురు మనుష్యులు నిలిచి మెల్లమెల్లగ మాటలాడుచున్నట్లాతనికిఁ బొడకట్టెను. దాని కెదురుగ నింకొక కిటికి యున్నది; ఆ వంకకుఁగూడ బోయి చూచెను. అచ్చట నేమియును వినఁబడలేదు; తరువాత ద్వారమునొద్దకునచ్చి చెవియొగ్గి యాలకించెను; రుద్ధకంఠ

ముతో నిరువురు మాటలాడుకొను చున్న ట్లాతనికి స్పష్టపడియెను ; ఇంక జనార్దనుఁడు స్థిరుఁడై యుండఁజాలకపోయెను ; వేగముగ వచ్చి యువరాజును మెల్లమెల్లగ మేల్కొలిపెను. యువరాజెల్ల సంగతులను దెలిసికొని మౌనమును వహించియుండెను. జనార్దనుఁ డాతనిభావమును గ్రహించి యాతని కెట్లయిన నుత్తేజనముం గల్పింప వలయునను నుద్దేశముతో నసత్యమైనను నీవిధముగాఁ జెప్పెను. “యువరాజా! ఇదిరాజసైన్యము కాదు. వీరు గుప్తఘాతుకులు కారు. బందిపోటుగాండ్రని తోఁచుచున్నది” అనియెను. అట్లు చెప్పకున్నచో బినతండ్రియే దైవముగఁ జూచుచున్న యాతనికిఁ బినతండ్రి దుస్తంత్ర మని చెప్పినచో నమ్మకము కలుగకుండుటయెగాక నిజమైనను దాని కాతఁడు ప్రతీకారము గావించుట కంగీకరింపఁడు

ఈ మాటవలన యువరాజు వదనమునందలి మేఘచ్ఛాయ యంతరించి పోయినది. గుండెలలోని దిగులు వదలిపోయినది. కొంచె మాలోచించినచో యువరాజీమాట సత్యముగ దని సులభముగనే గ్రహించి యుండును. జలములలో మునిగిపోవ నున్న వారికిఁ దృణ ఖండముకూడ రక్షణాధారముగనే తోఁచును. జనార్దనునిచే విడువఁ బడిన యాతృణఖండము నాధారముగఁ దీసికొని యువరాజు శయ్య నుండిలేచి పడమటివైపు గవాక్షముకడకు లంఘించెను. జనార్దనుఁ డింటిలోనిదీపము నార్పివై చెను. ఆ గవాక్షమున కేదియో తాటి నిచ్చెన యమర్పఁబడి యున్నట్లు యువరాజునకుఁ బొడకట్టెను. ఇంచుక సేపచ్చటనుండి యువరాజు నిరీక్షించెను. అప్పుడొక మనుష్యుఁడు మెల్ల మెల్లగ నా నిచ్చెనవెంటఁ బైకెక్కుచున్నట్లు కానవచ్చెను. అప్పుడు యువరాజు ధనుస్సు నందికొని సజ్యము చేసి యొక బాణమును విసరెను. ఆతని లక్ష్యమునకు ఫలము నిమిషములోనే తెలియవచ్చెను. అంతలో నొక యార్తనాదమును, భారపదార్థ పతన శబ్దమును వినఁబడియెను. పిమ్మట నంతయు నిశ్శబ్దమయ్యెను. యువరాజు గవాక్షమును సంపూర్ణముగఁ దెఱచి యంతటను గలయఁ జూచుచుండెను. జనార్దనుఁ డాతనిప్రక్కనే యుండెను. అప్పుడిరు

వురును మనుష్యు లాయంధకారమునఁ గలసిపోవుచున్నట్లు వారికిఁ గానఁబడియెను. ఆ యిరువురును వారిని లక్షించి యొక్కసారిగా రెండు బాణములను విసరిరి. మరల నా నిశ్శబ్ద నిశాంతరాళమును భంగించుచు నార్తనాదములు బయలుదేరెను. ఆశబ్దములతోఁగూడఁ గాలిపోవుచున్న యాయిరువురి ప్రాణములు నజ్ఞాతరాజ్యమున కెగసిపోయెను.

దేవలుఁ డింకను నిదురించుచునే యుండెను. ఆ కేకలవలన నాతనికి మెలకువ రాలేదు. ఆకిటికీనుండి వెలువడు వెలుఁగునందు యువరాజొకసారి దేవలుని సరళపవిత్ర భావవ్యంజకమగు వదనమండలమును దిలకించెను; సమీపించి యొకసారి మెల్లగ నా వదనమును ముద్దు పెట్టుకొనియెను. ఆ నిద్రలోఁగూడ నాసుందర వదనమున నెట్టి నవ్వున్నది ? యువరాజు మరల జనార్దనుని యొద్దకువచ్చి "జనార్దనా ! పద ! ప్రాసాదరక్షకులను మేల్కొల్పుము ! ఈ దొంగలను......"

యువరాజుమాట ముగియకుండఁగనే పెళ పెళ ధ్వనులతో ద్వారము పగులుచుండెను. యువరాజు కృపాణహస్తుఁడై లంఘించి ద్వారమును సమీపించి లోపలఁ బ్రవేశించుచున్న యిరువురు మనుష్యులను ఘోరకృపాణఘాతగతులం గావించెను. మరల నిరువురు త్రోసికొని రాఁజూచిరి. కాని వారిగతియు నట్లేయయ్యెను.

తలుపు బ్రద్దలైన చప్పుడువలన దేవలునకు మెలకువవచ్చెను. అతఁడు కన్నులఁ దెఱచునప్పటికి గదియంతయు నంధకారమయమై ప్రాసాదమున నస్త్రఝణఝణత్కారములు వినవచ్చుచుండెను. అజ్ఞాతభయావిష్టుఁడై దేవలుఁ డప్పుడు "అన్నా !" అని పిలిచెను. ఆస్వర మాయస్త్రఝణత్కారములలో లీనమై యువరాజునకుఁ గర్ణగోచరమయ్యెను. అప్పుడు యువరాజు "తమ్ముఁడా ! భయము లేదు. మనయింట బందిపోటు దొంగలు ప్రవేశించినారు. నీ యెదుటనే దీపస్తంభమున్నది. ఆదీపమును వెలిఁగించి నీతరవారిం గైకొని పడమటివైపు నున్న కిటికీయొద్దఁ గాచికొనియుండుము. ఆద్వారము

నుండి దొంగ లెవ్వరును లోపలఁ బ్రవేశింపకుండఁ జూచుచుందుము-జాగ్రత్త !" అనియెను.

నిమిషములో దేవలుఁడు దీపమును వెలిగించి యన్న చెప్పినట్లుగా నా గవాక్షము నొద్దకుఁబోయి క్రిందికిఁ జూచెను. అప్పుడొకఁడు త్రాటినిచ్చెననుండి పైకివచ్చుచుండెను. కుమారుఁడు సత్వరముగ నొక బల్లెముం దీసికొని యాతని మస్తకమును లక్ష్యముచేసి విసరెను. ఆర్తనాదముతో నాతఁడు క్రిందఁబడిపోయెను. దేవలుఁడు తీక్ష్ణదృష్టులతో నాయంధకారమునఁ బరిశీలించెను ఆకిటికీకిఁ గ్రిందుగ నిద్దరుముగ్గురు మనుష్యులు నిలిచియున్నట్లాతని కగపడియెను. అప్పుడాతఁడు నిశ్శబ్దముగ బాణములను విడుచుచు నాదురాత్ములను సంహరింప నారంభించెను. ఇంతలో దక్షిణగవాక్షమును దెఱచుకొని కొందఱు దుష్టులు లోపలఁ బ్రవేశించిరి. దేవలుఁడు కృపాణహస్తుఁడై వారి నెదిరించి యందొకనిం జంపి మఱియొకని బలముగఁ గొట్టెను. పిమ్మట మఱియిరువురు, వారివెనుక మఱియొక ముగ్గురు నీవిధముగా నా ముక్తవాతాయనమార్గమున వచ్చుచుండిరి. ఆసందర్భముం గాంచి దేవలుఁడు వారి నడ్డగించుట యసాధ్యమని యెంచి ప్రాణములకుఁ దెగించి యుద్ధముచేయ నారంభించెను. కొంతసేపటికి కాతని కోమలహస్తము పరిశ్రాంతమై పోయెను. అప్పుడు దేవలుఁడు "సోదరా ?" అని యొక్క కేక వైచెను.

యువరాజు విద్యుద్వేగముతోఁ దేవలుని సమీపించి చూచుచుండఁగనే యనేక దురాత్ములను యమమందిరమున కతిథులం గావించి దేవలునింజూచి "తమ్ముఁడా ! నీవు బాణములు, కృపాణము, బల్లెము మొదలగు నాయుధములం బూని యీరెండు గవాక్షములను గాపాడుచుండుము." అనియెను.

ఇట్లు చెప్పి యువరాజు జనార్దనునకుఁ దోడుపడుటకై పోయెను. అప్పటికి జనార్దనుని శరీరమంతయును రక్తప్లుతమైపోయెను ; పాదములు తూలిపోవుచుండెను ; బాహుబలము తగ్గిపోవుచుండెను ; ఆతని సర్వశరీరమును బ్రవాహమధ్యమునందలి లతవలెఁ గంపించి పోవు

చుండెను. అప్పుడు యువరాజు చింతాక్రాంత హృదయముతో "దేవలా!" అని పిలిచెను. ఒక్క నిమిషములో దేవలుఁడచ్చటికి వచ్చి నిలిచెను. అప్పుడు యువరాజాతనిం జూచి "తమ్ముఁడా! మంచము నిటకుఁ దీసికొనిరమ్ము!" అనియెను.

దేవలుఁడు మంచమును దీసికొనివచ్చుటకుఁ బ్రయత్నించెను గాని యొక్కఁడును దేఁజాలకపోయెను. అప్పుడు యువరాజొక్క నిమిషము యుద్ధము నాపివైచిపోయి మంచమును దీసికొనివచ్చెను. అప్పటికప్పుడే జనార్దనుఁడు క్రిందఁ బడిపోయెను. దొంగలందఱును గృహమధ్యమునఁ బ్రవేశించుచుండిరి. జనార్దనుని యవస్థంజూచి యువరాజలసియున్నను గొదమసింగమువలె లంఘించి దొంగలపైఁ గుఱుకుచు "దేవలా! జనార్దనుని భద్రముగ మంచముపైఁ బరుండఁ జేయుము—నేనీ నక్కలకుఁ దగినశాస్తి చేసివచ్చెదను" అని బిగ్గరగాఁ గేకవైచి చెప్పెను.

అప్పుడు భీమవిక్రముఁడగు యువరాజు దొంగలసందడినింటి నుండి తఱిమివైచెను. కాని మరల రెట్టింపుబలముతో రెట్టింపుజనులాతని పైఁబడి యాక్రమించిరి. యువరాజున కిఁక మరణమునకంటె నుపాయాంతర మేమియును లేదు. అప్పు డాతనికి దేవలుఁడు స్మృతికి వచ్చెను; అతని యాపాదమస్తకమును విద్యుత్తాడితమైనట్లయ్యెను. ఆయవస్థలో యువరాజు బిగ్గరగఁ గేకవైచి "దేవలా! నీవు పాఱి పొమ్ము! వశ్చిమ గవాక్షముకడఁ ద్రాటినిచ్చెన యున్నది. ఆ మార్గమున దిగిపొమ్ము! నేను ద్వారరక్షణముం గావించెదను." అని చెప్పెను.

దేవ—అన్నా! నిన్ను విడిచి నేనెక్కడకుఁ బోవుదును! చచ్చినను సరియే—ఒక్కసారిగ నే చచ్చిపోవుదము.

యువ—నేనుగూడ నీతో వచ్చెదను—నీవు ముందుగా దిగి పొమ్ము.

దేవలుఁడు సోదరుని యాజ్ఞానుసారముగ గవాక్షమునొద్దకుఁ బోయి క్రిందికిఁ దీక్ష్ణదృష్టులను నిగుడించెను. ఉద్యానమంతయును

జనశూన్యమై యుండెను. అప్పు డాతఁడు దిగుట కారంభించెను. యువరా జప్పుడు తన కుమారాసన సాహాయ్యముచే జనార్దనుఁడు పడి యున్న మంచమునెత్తి గవాక్షముద్వారము నొద్దనుంచి జనార్దనుని శరీరము భుజముపై నుంచుకొని త్రాటినిచ్చెననుండి దిగుట కారంభించెను ; నాలుగై దడుగులు దిగియెనో లేదో కాని యంతలో నా మంచమును దనపై దోసివైచుటకు దొంగలు గవాక్షమునొద్ద నిలిచి యున్న ట్లాతఁడు కనుపెట్టెను. యువరా జతిత్వరితముగ దిగుచుండెను. ఆతఁడింకను క్రిందికి దిగకుండఁగనే దొంగ లా త్రాటి నిచ్చెనను గోసివైచిరి. యువరాజు జనార్దనునితోఁగూడ గుభాలునఁ గ్రిందఁ బడిపోయి యంతలోనే లేచి జనార్దనుని మరల నెత్తికొని పుష్పలతాచ్ఛాదితమగు నాసిగూఢాశ్వశాలయొద్దకుఁ బరుగెత్తెను. దేవలుఁడు కూడ నాతని ననుసరించి పోయెను. గవాక్షద్వారము నుండి యెన్నియో బాణములును బల్లెములును వర్షప్రాయముగ వెలువడుచునేయుండెను. రెండుమూఁడు బాణములు యువరాజునకుఁదగిలి చర్మభేదనముం గావించెను. జనార్దనుని ఏర్పాటుప్రకారము నిరంతరమును సజ్జితాశ్వద్వయము నిలిచియుండు నాయశ్వశాలకు యువరాజు దేవలసహితుఁడై యతివేగముగఁ బోయి తమ్మునితోఁగూడ నాయశ్వముల నధిరోహించెను. ఇరువురును శత్రువులతో గుఱ్ఱములను దాఁటించుకొనుచుఁ బోయిరి. జనార్దనుని దేహము యువరాజు నొడిలో నశ్వముపై సురక్షితమై యుండెను. ఆ యిరువురును దేవలుని ప్రాసాదమునొద్దకుఁ బోవునప్పటికి తెల్లవారు జామయ్యెను.

జనార్దనుని శయ్యపైఁ బరుండఁజేసి సోదరు లిరువురును దీపముల వెలుతురున జనార్దనునకుఁ జైతన్యముం గూర్చు నుపచారములం గావించుచుండిరి. ఎంతసేపైన నాతనికి స్మృతి కలుగుట లేదు. అప్పుడా సోదరు లిరువురును హతాశులై దుఃఖింప నారంభించిరి. కొంతసేపటికి యువరాజు నిద్రనుండి లేచినవానివలె నాకస్మికముగ లేచి నిలువఁబడి "తమ్ముఁడా! నీ కోమలాంగము లన్నియును రక్తసిక్తములై యున్నవి. నీ యారోగ్యముమాట చూచుకొనుము.

నీ గృహవైద్యుని బిలిపింపుము. జనార్దనుని సత్కారవిషయముఁగూడ నాలోచింపుము. నేనిప్పుడే కేంద్రీగారియొద్దకుఁ బోయి మరలివచ్చెదను." అనియెను.

దేవలుఁ డొక్కయుదుటునవచ్చి యువరాజు హస్తమును బట్టుకొని "సోదరా! నేనుగూడ నీతో వచ్చెదను." అనియెను.

యువ---వలదు---తమ్ముఁడా! నీ యొడలంతయును గాయములతో నిండియున్నది. బంగారమువంటి నీమేనంతయు రక్తసిక్తమై యున్నది. ఇట్టి యవస్థలో నిన్నుఁ జూచినచోఁ దండ్రిగారేమను కొందురు? మన మిప్పుడిరువురముగూడ నాయనకుఁ జెడ్డవారమే యయి పోవుదుము. నీవు జనార్దను సత్కారములఁగూర్చి యేర్పాటు చేయుము. నేనిప్పుడే తిరిగి వచ్చెదను

అని చెప్పి యువరాజు వెడలిపోయెను. అతఁడు రాజమంది రమునకుఁ బోవునప్పటికి [illegible] యున్నది. యువరాజు [illegible] వెనుకవైపునుండి [illegible] నాగదిలోనికిఁ బోయి తండ్రిని దర్శించెను. [illegible] ద్వారపాలకుఁ డేమియు [illegible] జాలకపోయెను. యువరాజు లోపల ప్రవేశించి [illegible] నిలిచెను. ఆ యింట దీపము వెలుఁగుచున్నది. అనంతరాముఁ డా వేళయందుఁ గూడ రాజకార్య పర్యాలోచనముం గావించుచుండెను. అనంతరాముఁ డాకస్మికముగ యువరాజుం గాంచి యుపరవశి లేచి నిలుచఁబడి యంతలో నాశ్వాసము గావించుకొని, "ఏమి యువరాజా! నీవిప్పు డేల వచ్చితివి? నీశరీర మంతయును రక్తసిక్తమై యున్న దేమి? నీకన్నులెఱ్ఱనై యున్నవి. నీ దుస్తులు విశీర్ణములై యున్నవి. ఈరాత్రియంతయును నీవు బందిపోటు దొంగతనము చేయుచుంటివా యేమి? ఇక్కడకుఁగూడ నందుకొఱకే వచ్చితివి కాఁబోలును? నీయస్త్రశిక్షా వైశద్యము నీపినతండ్రి యొద్దఁగూడఁ జూపుటకు వచ్చియుంటివా యేమి?" అనియెను.

యువరాజు నిర్విణ్ణుఁడై "తండ్రీ! ఇంతటి నిష్ఠురోక్తులచే నా హృదయపీడనము గావించుచుంటి రేల? మీరు నాకు జనక సమానులు. నేనిప్పుడు నామందిరమున బలవంతముగఁ బ్రవేశించి యాక్రమించిన దస్యులబారినుండి తప్పించుకొని ప్రాణములతో బయటఁబడి యతికష్టముతోఁ బరుగెత్తుకొని మీదర్శనమునకు వచ్చితిని—మీవలనఁ బ్రతీకారము సర్థించి వచ్చితిని—జనార్ధనుఁడు మరణించినాఁడు కుమార దేవలుఁడు కృపాణతాడితుఁడై తన ప్రాసాదమునకు వచ్చియున్నాఁడు నాతలపైగూడ బలమైన దెబ్బ తగిలినది—రక్తము ప్రవహించుచున్నది." అని దీనస్వరముతో మనవిచేసెను.

అనంతరాముఁ డాతనిమాటలతో మాటగలిపి దేవలకుమారుఁడా? ఆతఁడు మగల సుధామందిరమున కేల వచ్చినాఁడు? నీవు నాకుఁ లొంగకపోవుటయే కాక యాతనినిగూడ నా చెప్పినమాట వినకుండఁ జేయుచుంటివా?'' అని గద్దించెను.

యువరాజు చేతులు జోడించుకొని భయస్వరముతో "తండ్రీ! ఈ విషయమున నేనే యపరాధిని. దేవలుఁడే పాపము నెఱుఁగడు. నేనే యాతని నా యింటికిఁ దీసికొనిపోయితిని అది యపరాధమైనచో నన్ను క్షమియింపవలయునని ప్రార్థించుచున్నాను'' అనియెను.

యువరాజు వినీతభావముం గాంచి యనంతరాముని సాహసము చెదరిపోయెను. ఆతఁడు మఱియొక పద్ధతి ననుసరించి ''యువరాజా! ఇటుచూడుము! నీమూలమున రాజ్యమందలి ప్రజలందఱును గేవలము విరక్తులై పోవుచున్నారు. అందఱును రాజద్రోహముం గావించుట కుద్యుక్తు లగుచున్నారు. నీవు నా చెప్పినమాట వినక దేవలునిగూడఁ బాడుచేయుచున్నావు. ఇప్పటి వ్యవహారముం బట్టిచూడఁగా నంతయును దెలిసిపోవుచున్నది. నిన్నుఁ జంపవలయునని ప్రయత్నించు వారందఱు నెవ్వరో నీకుఁ దెలిసినదా? నీ దురాచారములవలనఁ బీడింపఁబడిన ప్రజలే విద్రోహులై నిన్నుఁ జంపవలయునని చూచుచున్నారు. నీవు పండువంటి కులమునకు

భయంకరహాలాహలమై జన్మించితివి. నీ మూలమునం గలిగిన విప్లవదావానలమునc బడి స్వర్గస్థుcడగు వీరేంద్రకేసరివంశ మర్యాద దగ్ధమై పోవుచున్నది నీవీ రాజ్యమునుండి యవ్వలకుc బొమ్ము. ప్రజావిప్లవము చల్లారిన తరువాత నీకు బుద్ధివచ్చినచో నప్పుడు నిన్ను మరలc బిలిపించి నీ సింహాసనమున నధిష్ఠింపcజేసెదను." అని యెను.

యువరాజు నిశ్చేష్టుcడై నిష్పందుcడై నిరుత్తరుcడై పోయెను. ఆతనితల తిరిగిపోవుచుండెను. ఆ యింటిలోని వస్తువులును, గదియు, నీభూమియునుగూడ గిఱ్ఱునc దిరిగిపోవుచున్నట్లుండెను.— అకస్మికముగ నాతcడు నిలిచినచోడనే కూలcబడిపోయెను.

అనంతరాముని యోష్ఠప్రాంతము క్షీణహాస్య రేఖాంకితమయ్యెను. ఆతcడు మరల యువరాజు నుద్దేశించి "నీవిచ్చట నుండవలదు ఇప్పుడే వెడలిపొమ్ము—కాకున్నచో రాజద్రోహులీరాజమందిరమునుగూడ నాక్రమింపcగలరు—నిన్నును నన్నును గూడ సంహరింపcగలరు. నీవు వారిలో నిరువదిముప్పదిమందిని జంపియుందువు. అట్టి నీవు నన్నాశ్రయించితివని వారికిc దెలిసినచో, ఆకోపముచే వారు నన్నును నిన్నునుగూడ బ్రదుకనీయరు. అందుచే నీవు ప్రొద్దుపొడువకుండcగనే యీరాజధానిం బరిత్యజించి మఱియొకచోటికిc బాఱిపొమ్ము. ఈ ద్వారరక్షకుcడు నీకీరాజ్యపుc బొలిమేర వఱకును సహాయుcడై యుండcగలడు. శీఘ్రముగ నీవిటనుండి వెడలిపొమ్ము!" అనియెను.

యువ— తండ్రీ! నీయాజ్ఞ శిరోధార్యమైనది. న్యాయాన్యాయములను విచారింపకుండ నేను మీయాజ్ఞను బరిపాలించుట కెల్లప్పుడును సిద్ధముగ నున్నాcడను. కాని—కాని, తండ్రీ! అకస్మికముగ నవిచారముగ నేకాకినై నేనెకcడc బోవుదును? నేనెప్పుడైన నిల్లు విడిచి యొంటిగc బోయియుంటినా?

అనం— ఏమిభయము యువరాజా? నేను రహస్యముగ నితరుల కెవ్వరికిని దెలియకుండ నిన్నుcగను పెట్టి చూచుచునే యుండెదను.

మంచికాలము వచ్చినప్పుడు మరల నిన్నింటికిఁ దీసికొనియే వచ్చెదను!

అప్పుడు యువరాజు బాలకునివలె నేడ్చుచు "ఒక్కసారి తమ్ముని గన్నులఁ జూచి—"

అనంతరాముఁ డాతనిమాట కడ్డము వచ్చి "వలదు. నీవిప్పుడీ వేషముతోడనే యిటనుండి వెడలిపొమ్ము! సూర్యోదయమైన తరువాత నీవీనగరమునం దెవ్వరికంటను బడఁగూడదు. నేను నిన్నుఁ బితృద్రోహిగ భావించి రాజ్యమునుండి వెడలఁగొట్టితినని ప్రజలందఱును నమ్మవలదా? అయ్యో! ఇష్టములేక పోయినను నన్నిట్టి దురవస్థఁబెట్టి యీవిధముగా జరుపవలసి వచ్చినది. ఏమి చేయుదును? నా దౌర్భాగ్యమిట్లున్నది!" అనియెను.

యువరా జప్పుడు మఱి పితృపాదధూళిని శిరస్సునందాల్చి దుఃఖించుచు—పితృగృహాంతమును—ప్రాణతుల్యుండగు సోదరుని—ప్రియంవదను దనదను చెప్పదగిన వస్తువులను విరక్తునివలెఁ బరిత్యజించి క్షీణపాద విన్యాసముతోఁ బ్రస్థానముం గావించెను.



శ్రీ

# వీర పూజ



## ద్వితీయఖండము — పురుషకారము



### మొదటి ప్రకరణము.



### జయదేవి

"జయంతకుమారా! నీవిచ్చటికేల వచ్చితివి?"

"రాజకుమారుని దర్శించుటకు"

"అట్లయినచో రాజపుత్రిక యనుమతిం గైకొన్నచో బాగుగ నుండును"

"అనుమతి నపేక్షించుచుండినచో నాకీ సందర్శనలాభము లభియింపదు"

"మంచిది అనుమతిం గైకొనకుండ దస్కరునివలె నిచ్చటం బ్రవేశించుట సేనానాయకకుమారున కుచితమైన పనియా!"

ఈ తిరస్కారవచనములు జయంతునియస్థిగతములై హృదయమును వేధించుచుండెను. మాటిమాటికి నీవిధముగ నధిక్షేపింపం బడుచుండియు నాతం డజమీాన్ప్రభుని తనయయగు "ఉమాబాలిక" యనుగ్రహమునుగోరి యజమీాను రాణియగు జయదేవి యంతఃపుర మందిర ప్రాంగణమున రాజకుమారి పాదకమలముల హృదయోచ్ఛ్వాసములం బరగింపవలయునని తెలుపుచుగ వచ్చుచుండెను. ఆమందిరము రాజమందిర ప్రాంతమునందే యుండెను. మందిరాంగణము సమున్నత ప్రాకారపరివేష్టితమై విచిత్రచిత్రవిలసితమై చంద్రకాంత శిలానిర్మితమై యుండెను. ఆయాంగణమునకు బయటం జిన్నపుష్ప

ద్యానముకలదు. అందు నానావిధములగు కుసుమము లంతరాంతరముల వరుసలుతీరి వికసించి పరిమళించుచుండెను. మాధవీమల్లికా చంపక పారిజాతాది వివిధవర్ణకుసుమములు సంసారమునందలి కామినీ కుసుమములవలె నాయుద్యానము నలరించుచుండెను.

ఉద్యానమునకు వెనుకఁ జిన్న నది యొకటి ప్రవహించుచుండెను. దాని వెనుక ననంతమగు వృక్షశ్రేణి ; ఆ వెనుక ననంతపర్వత పంక్తి—దాని వెనుక ననంత నీలాకాశము ; ఆ యనంతనీలాకాశమునకు వెనుక నేమున్నది ?

మహారాజు యుద్ధరంగమునకుఁ బోయియుండెను. రాజకుమారి తండ్రికి శుభముకొఱకును, దేశక్షేమముకొఱకును సఖీపరివృతయయి దేవీపూజ గావించుటకు వచ్చుచుండెను. దేవీగృహమునకుఁ బోవుటకు ముందుగనే జయంతకుమారుఁడు రాజకుమారిం దర్శింపవలయునని మార్గమధ్యమున నిలిచియుండెను.

ఆతనికోరిక సిద్ధించినది—ఆమె సందర్శనలాభము కలిగినది. కాని, స్నేహాదరములకుబదులుగ రాజకుమారి వదనకమలములనుండి కటువచనములు బయలువెడలెను. జయంతకుమారుఁడు లోనలోఁ దానే "నేను తక్కుగుఁడ నేయయినచో నింతయూ వేగముతో మాటిమాటికి నిచ్చటికి వచ్చియే యుండకపోవుదును" అని సమాధానము చెప్పుకొనియెను.

రాజకుమారి ముఖమండలము గులాబికుసుమమువలె నారక్తమైపోయెను. ఆమె యించుక క్రోధకంపితస్వరముతో "యుద్ధరంగమున శత్రుబాధితుఁడై పలాయితుఁడగు యోధునకు రమణీమండలమునఁ దన శౌర్యమును బ్రకటించుటయే వీరధర్మము.—ఇట్టి వీరధర్మము నవలంబించిన నీవునే పెండ్లియాడకున్నచో నింక నీ రాజకుమారికిఁ దగినవరుఁ డెక్కడ లభించును ?" అనియెను.

జయంతకుమారుఁడు—నేను వీరుఁడ నగుదునో, కానో మన రాజ్యమునందఱు నెఱుంగుదురు. మఱియును, సిపాహీసేనలోఁ బ్రతి యోధునకును బ్రత్యేకముగఁ దెలియును.

ఉమా—ఆత్మస్తుతియే వీరత్వమైనచో రాజపుత్రిముండల మునం దంతటను నీవొక్కడవే యద్వితీయ వీరాగ్రేసరుఁడవు.

జయం—రాజకుమారీ! నేను నీయెదుట నావీరత్వముఁజూపుటకు రాలేదు; నీ యధిక్షేపవచనముల నాలకించుటకు రాలేదు; నాహృదయకమలములను నీపాదపద్మములకుఁ గానుకగా నిచ్చుటకై వచ్చియుంటిని. రాజపుత్రీ! ఈ హృదయమును నీవుపేక్షింపఁదగినది కాదు ఈహృదయమునందలి యొక్కపరమాణువైనను నితరచ్ఛాయాకళంకితము కాలేదు; ఎంతమాత్రమును పాపకలుషితము కాలేదు; ఈహృదయమునందలి యుస్ఫుటమగు ప్రతిశబ్దమునందును నుమానామంత్రము జపియింపఁబడుచున్నది; ప్రతిరక్తబిందువునుగూడ నుమాధ్యానరతమై యున్నది. ఈ నిఃశబ్దమునుకలో నీలోకమోహనస్వరూపమును నీ వొక్కసారి సవిమర్శముగఁ జూచుకొనఁగలిగినచో నెప్పుడు నేను నిన్నుఁ బ్రేమించుచుంటినో లేదో నీవు విస్పష్టముగ బోధపడఁగలదు. ఎవ్వఁడు నీ రాజరాజేశ్వరిమూర్తిని దర్శింపగలుగునో వాఁడు తప్పక నిన్ను బ్రేమించి తీరును మనుష్యులమాట యటుండ నిమ్ము—పశుపక్ష్యాది జీవజంతువులును, సూర్యచంద్రాది గ్రహములును, నక్షత్రములును, వేయేల యీ ప్రపంచమంతయును నిన్నొక్కసారి చూచినంతమాత్రముననే విమోహితమైపోవును. అనలజ్వాలాసదృశంబగు నీదివ్యమూర్తిని నాయెట్టయెదుట బ్రదర్శించుచు నీవు నన్నేల భస్మము చేయదలంచెదవు?

ఉమా—నీవు రూపము బ్రేమించుచుంటివా? మంచిది. అట్లయినచో నీవు సౌందర్యము నుపాసింపుము. ప్రకృతి యతిసుందరమైనది; ప్రకృతికర్త యంతకంటెను సుందరుఁడు.

జయం—నీవంతకంటెను సౌందర్యవతివి. నీవంటిసుందరు లెచ్చటను లేరు.

ఉమా—అట్లయినచో నెంతటియున్నతిస్థానమునందుండి భగవదారాధనము చేయుచుంటినో యంతటియున్నతిస్థానమున నిలువఁబడి నాసౌందర్యము నుపాసింపుము, నేను రాణిని; నీవు సేవకుఁడవు.

జయం—నీవు గొప్పదాతవని నేనెఱుఁగుదును నేనల్పుఁడనే; కాని నాహృదయముమాత్ర మల్పమైనదికాదు.

ఉమా—నేనిదివఱకే నా హృదయమును దానము చేసి వైచితిని.

జయం—అలాగా? ఎవ్వరికి?

ఉమా—వీరత్వమునకు—

జయంతుఁ డించుక సేపాలోచించి "రాజకుమారీ! నా వీర చరిత్రములచే నొకనాఁటికీ రాజపుత్ర స్థానమంతయుఁ బ్రతిధ్వనించి వచ్చో" అనియెను.

ఉమా—అప్పుడు నేను నీపాణిగ్రహణము నపేక్షించి నీ సందర్శనమునకై నిన్ను వెదకికొనుచు వచ్చెదను.

జయంతకుమారుఁడు వెడలిపోయెను. ఉమాబాల యుద్యానమునఁ బరిభ్రమించుచుండెను. ఆమెకు శ్వేత, నీల యనుపరువురు చెలికత్తెలు—వారిరువురును దేవీమందిరమునుండి బయలుదేరి యచ్చటకువచ్చి రాజపుత్రింగాంచి "కుమారీ! దేవీమందిరమున నెవ్వఁడో యొక రాజకుమారుఁడు దేవీపూజ చేసికొనుచున్నాఁడు." అని చెప్పిరి

ఉమా—నిరీక్షించి యుండుఁడు! ఆతనిపూజ కెట్టియంతరాయము గల్పింపవలదు

కాని యాతనిపూజ యెంతసేపటికిని బూర్తి యగుటలేదు. రాజకుమారిక యిఁకనిరీక్షింపఁజాలక యదియేమో చూడవలయునను కోరికతో దేవీమందిరాభ్యంతరమునఁ బ్రవేశించెను. అచ్చట నొక రాజకుమారుఁడు దేవీసమ్ముఖమున నిశ్చలుఁడై కూర్చుండి ధ్యానతన్మయుఁడై యుండెను. పుష్పములుగాని, చందనముగాని, బిల్వదళములుగాని, యాతనియొద్ద లేవు మాతృపాదములమీఁదను లేవు. శబ్దము లేదు. చలనము లేదు—ఉపాసకుఁడు స్థిరుఁడయి యుండెను. దేవీ మూర్తియును స్థిరయయియుండెను. తత్సమయ ప్రకృతియును సుస్థిరమైయుండెను.

ఆయారాధకుని పశ్చాద్భాగము మాత్రమె రాజకుమారి కనఁబడుచుండెను. వేడుకతో నామె యప్పుడు నిశ్శబ్దపదసంచాలనముం గావించుచు లోపలికిఁబోయి చూచెను ఆహా! యేమి యాయపూర్వ దివ్యమూర్తి! చంద్రికాస్నాతుఁడగు చంద్రునిపై నమృతాభిషేక మగుచున్నట్లుండెను. దేవలక్షణ లక్షితమగు నాతని ముఖచంద్రమండలము భక్తిరసపరిప్లుతమై యపూర్వ సౌందర్యవిలసితమై యుండెను. ఆ ప్రేమసౌందర్యముల యేకీభావము గంగా యమునా సంగమముంబోలి యతి పవిత్రమైయుండెను. ఆవిశాలలలాటమున దేవతా ప్రతిభ ప్రతిభాసిత మగుచుండెను. సౌందర్యముపై సౌందర్యము వికసించుచుండెను. భక్తిలేకున్నచో మానవుఁ డింతటి సుందరుఁడు కాఁజాలఁడు — ప్రేమవిహ్వలుఁడయి యేడ్చుట కలవాటు పడినఁగాని పాపకళంకము పరిమార్జితము కాఁజాలదు.

రాజకుమారి బాహ్యజ్ఞానవిరహితయయి భక్త్యుద్వేలితయయి ప్రేమపులకితంబగు నాతనివదనమండలమును గాంచుచుండెను. దివ్యశక్తి నుపాసించుచున్న యారాజపుత్రుఁడు నిమీలితనయనములతో మాతృధ్యాననిమగ్నుఁడయి యుండెను. వీరత్వము నుపాసించుచున్న యాయువబాల విస్ఫారితనయనములతో నాసౌందర్యలహరిలో మునిఁగి పోవుచుండెను. ఈవిధముగా గొంతసేపు గడచి పోయెను.

అంతలో నాయుపాసకుని యధరము ప్రకంపిత మయ్యెను. అతఁడు గాఢశుద్ధంబగు కంఠస్వరముతో మెల్లమెల్లగ "తల్లీ! జగన్మాతా! నీవు నాకిప్పు డేరూపముతో సాక్షాత్కరించితివో, యారూప మెల్లప్పుడును నాహృదయమునఁ జిహ్నితమై యుండునట్లు కటాక్షింపుము. తల్లీ! నేనేడ్చియే నిన్నేడ్పింపఁగలను. కాని, యేడ్పును బుట్టించు నవ్వునకు నేనెన్నటికిని గోరఁబోను తల్లీ! ఈలోకమునకు నేనేడ్చుచునే వచ్చియుంటిని. ఏడుపే నాకు దారిబత్తెము. చిన్నతనమున నాతల్లిని బోఁగొట్టుకొని దుఃఖించితిని — నవయౌవనమునఁ దండ్రిని గోల్పోయి యింకను గన్నీరు నిలుపుకొనఁజాలకున్నాను

తల్లీ! స్వర్గసౌందర్యముం గైకొని యొక దేవకుమారుఁడు నా కన్నీటిం దుడువవలయునని వచ్చియుండెను. తుదకు నిర్భాగ్యుఁడనగు నేనాతనిఁగూడఁ బోఁగొట్టుకొంటిని తల్లీ! సర్వమును గోల్పోయిన నేను తుట్టతుదకు నిన్నే యాధారముగఁ జూచుకొంటిని. ఇప్పుడు నాకు నీవే తండ్రివి, తల్లివి, సోదరుఁడవు, సోదరివి, చుట్టమువు, మిత్రమవు నాయీభక్తి లేశమును హరింపఁబోకుము తల్లీ! దిక్కులేని వారికి సర్వస్వమునగు తల్లివి నీవే" అని ప్రార్థించెను ఇంక నాతని నోటమాట వెలువడుటలేదు. ఆతఁడు దుఃఖావిలుఁడై పోయెను.

రాజకుమారి చిత్రప్రతిమవలె నిశ్చేష్టిత యయి నిలువఁబడి పోయెను ఆమె కనుదమ్ములుకూడ నశ్రుపూరితములై పోయెను. అప్పుడు రాజకుమారుఁడు దేవీపాదములపై సాష్టాంగపడి కంపితకంఠస్వరముతో "తల్లీ! పితృదత్తమగు నీ నాకరవాలమును నీపాదముల చెంత నుంచుచున్నాను ఈ పవిత్రకృపాణము నా హస్తసంపర్కముచేఁ గళంకము గాకుండ నట్లాశీర్వదింపుము. ఇప్పటి కీకరవాల మొక్కటియే నా కేకమాత్రజీవనాధారమైయున్నది—రక్షణాధారమై యున్నది" అని వేఁడుకొని తల్లిపాదములకు నమస్కరించి యాతఁడు మెల్ల మెల్లగ లేచి వెలుపలకు వచ్చెను. వెలుపల నిద్దరు రమణీమణులు నిలువఁబడియుండిరి. వారు రాజపుత్రిక సఖులు. వారి నామముల నదివఱకే చెప్పియుంటిమి. ఆ యువతులిద్దరును రసికసుందరులే. అప్పుడు నీలయా రాజపుత్రునింగాంచి యాతనిపై మందహాస కటాక్షములం బరగించుచు 'ఓరమణీమోహన! ఏ హృదయ రాజ్యమున కధీశ్వరుఁడవు కాఁగోరి యీ దేవీసాన్నిధ్యమున పరిప్రార్థనముం గావించుచున్నావు? నావలన నించుకంతయును బ్రయోజనము లేదు. కాని, మా శ్వేతహృదయమున గర్వము ప్రగాఢమై యున్నది. నీ వచ్చట నొకయగ్నిస్ఫులింగము రగులుకొను నట్లొకసారి కటాక్షింపుము!" అనియెను.

శ్వేత—రాజకుమారా! నీ హృదయభావము నించుక సంజ్ఞారూపమునఁ బ్రకటించుటకూడ నీ గాంభీర్యమునకు లోపముగ నగ

పడినదా ? నీభక్తి నీహృదయమునందే యుండనిమ్ము ! ఒక్కసారి గన్నెత్తి తిరిగి చూచినచో నీగౌరవమునకు భంగకరముగఁదోఁచినదా?

ఆమాటలకు రాజపుత్రుడు కాతరుఁడై "క్షమియింపుఁడు. మీరు దేవీపూజకొఱకు ద్వారమునొద్ద వేచియుండి రనుసంగతి నా కెంతమాత్రమును దెలియదు. నా మూలమున మీ పూజల కంత రాయము కలిగియుండవచ్చును. క్షమియింపుఁడు." అనియెను.

ఇట్లు ప్రార్థించి యాతఁడు వెడలిపోయెను. రాజకుమారిక నాతనిఁ జూడనే లేదు. కాని రాజపుత్రి యాతనిదక్క మఱియేపదార్థమును జూచియుండ లేదు. ఉమాబాల ప్రాంగణమునొద్దకు వచ్చి నిలువఁబడియెను. ఇంకను నా రాజకుమారుని మోహనమూర్తి యామె కన్నులనుండి వెలువడ లేదు. అప్పుడామె "శ్వేతా ! ఈ రాజకుమారు నీ దేశమునం దెక్కడనైనఁ జూచితిరా ?" అనియెను.

శ్వేత — ఎవ్వరు? ఇప్పుడిటనుండి వెడలిపోయినయాతఁడేనా? ఉమా ! ఏమి యిట్లు తిరిగెదవు?

ఉమా — నామాటకుఁ బ్రత్యుత్తరము లేదా?

శ్వేత — ఇంకను నేమని చెప్పుదును ? ఆతఁడు వెడలిపోయినాఁడు. ఆతని వెదకితీసికొని రమ్మనియెదవా? ఇప్పుడే పోయినాఁడు.

ఉమా — వలదే ! వలదు ! ఆమాట చెప్పవలదు

నీల — అట్లయినచో నేమనియెదవు? ఆదొంగ చెవులురెండును నులిచి రమ్మనియెదవా ?

ఉమా — ఊరకుండుము ! నే నేమియును జెప్పనక్కఱలేదా ?

శ్వేత — మంచిది, నీవు చెప్పినట్లే చేసెదము. ఏమిచెప్పెదవో చెప్పుము !

ఉమా — వల— నేనిఁకఁ జెప్పఁజాలను.

---

*

రెండవ ప్రకరణము.

# భ్రాంతి

ఆ జయపాలునిచేఁ బూర్వము స్థాపింపఁబడిన యజమీరు రాజ్యమొకప్పుడు వీరత్వమునందును భాగ్యమునందును రాజపుత్రస్థానమున సుప్రసిద్ధమైయుండెను. సువిఖ్యాతమగు చోహానవంశ ప్రతాపముచే నాకాలమున సౌరాష్ట్రదేశమంతయును బ్రకంపితమైపోయెను. భారతవర్షమునకుఁ బరమశత్రు వగు మహమ్మదు గజనీవంటివాఁ డప్పుడజమీరురాజ్యమునుండి తఱుమఁబడిన కుక్కవలెఁ బలాయితుఁడైపోయెను. బూందీ, కోటా, రఘుగడము, సిరోహీ మొదలగు రాజ్యములన్నియు నప్పుడజమీరు ప్రభుని పాదపరాగము నాశ్రయించుకొని యుండెను. కాని, యిప్పు డజమీరు రాజ్యమున కాకాలము తిరిగి పోయినది; మాటిమాటికిని ముసల్మానుల యాక్రమణమునకు లోఁబడి యిప్పుడా రాజ్యము దుర్బలమై దరిద్రాభిభూతమై యుండెను.

రాజ్యమున కుత్తరప్రాంతమున రాజధానినగరముండెను. దానికుత్తరమునఁ జిన్నపర్వత మొకటియున్నది. అది యంత యెత్తయినది కాదు. కాని, దాని శిఖరముపై నిలుచుటకుఁ జాలఁగష్టము. ఆ శిఖరమునందు సుప్రసిద్ధమగు నొకదుర్గము దుర్జేయమై విలసిల్లుచుండెను. ఆపర్వతపార్శ్వమునఁ బ్రసిద్ధమగు నొక విశాలకుల్య యున్నది. చిరస్మరణీయుఁడగు విశాలదేవుఁ డావిస్తీర్ణజలాశయమును ద్రవ్వించెను. అది యానగరమునకుఁ బరిధిప్రాయమై నాలుగు క్రోశముల వఱకును వ్యాపించియుండెను. దానినుండియే సాగరమతి యను నొక వాహిని వెలువడి నగరప్రాంతమునకు సంజీవినియయి యుత్తరాభిముఖముగఁ బ్రవహించుచుండెను.

ఆ పర్వతపాద ప్రదేశమునందే రాజధానీ నగరముండెను. ఇక్కాలమున దుర్గములు ఫిరంగులచే రక్షింపఁబడుచుండెను. ఆ కాలమునందట్టి యాయుధములు లేవు. సరిగ నాకొండ క్రిందనే రాజ

ప్రాసాదమున్నది. దానికి దక్షిణమునఁ బట్టణమంతయు నున్నది; అంతటి సౌభాగ్యవంతములగు నగరము లాకాలమున భారతవర్షము నందంతగా లేవు. అజమీరునగరము మిగులసుందరమైనది. దానికి నలువంకలను విశాలరాజమార్గములును, వానిపార్శ్వము లందాకాశము నంటుచున్న సుందరసౌధములును గన్నులపండువై యుండెను. అంగడులన్నియు నమూల్యవస్తువిస్తులములై యుండెను. రాజమార్గములన్నియు నిరంతరము జనసంకులమై యశ్వగజాద్యారోహకులచే నిండియుండెను. ఆ నగరము నిరంతరమును గుసుమ సుకుమారాంగులగు కామినీకుసుమములచే వికసితమైయుండును.

రాజప్రాసాదము చంద్రకాంత శిలానిర్మితమైనది. రాజమందిరమును, గొలువుకూటమును విచిత్ర చిత్రాలంకృతమై యమూల్యములగు చెక్కడపుఁబనులచే సుందరమై యుండెను. అంతఃపురోద్యానమునందలి చంద్రకాంత శిలాప్రతిమలం గాంచినచో నీ యింగ్లీషువారు మన దేశమునకు వచ్చుటకుఁ జిరకాలము క్రిందటనే భారతవర్షము జగత్ప్రసిద్ధ శిల్పనైపుణీవిలసితమై యుండెనని సంపూర్ణముగ బోధపడఁగలదు. ఇప్పుడు శూరసింహుఁడా యజమీరు రాజ్యమునకుఁ బ్రభువై తన వీరసాహసములచే దేశపూజ్యుఁడై చోహానవంశ శిరోమణియయి విలసిల్లుచుండెను. ఆతని రాణియగు హారవతి పురాతన చోహానరమణీమణుల ననుకరించి స్త్రీలోకమునకాదర్శప్రాయమై యుండెను. ఆమెకుఁ గుమారుళ్ళు లేరు. ఉమాబాల యొక్క తెయే యామెకుఁ దనయ. ఆమె తల్లిదండ్రులచే నల్లారు ముద్దుగఁ బెంపఁబడుచు వారి యంధకారమందిరమునకు మణిదీపమై విరాజిల్లుచుండెను.

వెనుకటి ప్రకరణమునఁ జెప్పఁబడిన సంఘటనమైన రెండు దినములకుఁ దరువాత నా విశాల రాజప్రాసాదమునందలి యొక విశాల మందిరమున బ్రధానమంత్రి కొలువుకూటమునం గూరుచుండి సేనానాయకుని కుమారుఁడగు జయంతకుమారునివలన యుద్ధవార్తలం దెలిసికొనుచుండెను. ఆ మందిరమున ముఖములు పఱపులచే

నలంకరింపఁబడిన నానావిధంబులగు కుర్చీలమర్పఁబడి యుండెను ; గోడలపైన జయపాలుఁడు, మాణిక్యరావు మొదలగు సుప్రసిద్ధ మహాపురుషుల ప్రతిబింబ పటములు కూర్పఁబడి యుండెను. ఆ పటములక్రింద గరవాలములు, భల్లములు మొదలగు నాయుధములు వ్రేలాడుచుండెను.

ఇప్పుడు మహారాజు రాజధానియందు లేఁడు ; సేనాపతియును లేఁడు; సేనలం దీసికొని యుద్ధక్షేత్రమునకుఁ బోయి యుండిరి. ప్రస్తుతమున మంత్రియే రాజును, సేనాపతియు నై యుండెను. జయంతకుమారుఁడు రెండు దినములక్రిందటనే యుద్ధరంగమునకుఁ బోయి యుండెను. ఇంకను గొంతమంది సైనికులను వెంటఁబెట్టుకొని రావలయునని మహారాజాతని మంత్రియొద్దకుఁ బంపించెను సైన్యము కొలఁదిగా సమకూర్పఁబడియెను. ఆ సైనికులను వెంటఁదీసికొని జయంతకుమారుఁడు నేఁడే యుద్ధక్షేత్రమునకుఁ బోవలసి యుండెను. రేపటి యుదయమున కింకను గొంతసైన్యము పంపఁబడును. మంత్రియును జయంతకుమారుఁడును ననేకవిషయములఁగూర్చి మాటలాడుకొనిరి.

మంత్రి—కుమారా! యుద్ధమెచ్చటజరుగునని తోఁచుచున్నది?

జయం——జేవోయూర్ క్షేత్రమున జరుగునను కొనియెదను.

మంత్రి——యుద్ధమెప్పు డారంభమగును ?

జయం——రేపటి యుదయమున నే——

ఆ సమయమునం దొక ద్వారపాలకుఁడు వచ్చి మంత్రికి నమస్కరించి "ఎవ్వఁడో యొకఁడు తన కుద్యోగము కావలయునను నుద్దేశముతో వచ్చి ద్వారమునొద్ద నిలిచియున్నాఁడు" అని మనవి చేసెను.

మం——లోనికిఁ దీసికొనిరమ్ము!

కొంతసేపటిలో నా దేవీమందిరమున మనకగపడిన రాజపుత్రుఁడా కొలువుకూటమునఁ బ్రవేశించి మంత్రి కభివాదనముం గావించి యెదుట నిలువఁబడియెను.

మంత్రి—మీ దేయూరు ?

రా—ఆసంగతి యిప్పుడు తెలుపఁజాలను.

మంత్రి—నీకోరిక యేమి ?

రా—నాకు సైనికోద్యోగము కావలయును.

మం—సైనికోద్యోగమా ? నీకింకను యిరువదియేండ్లయిన నిండినట్లగపడదు. నీవంటి బాలకుల నొడిలోనుంచికొని పోయినఁగాని రాజసైన్యమునకు గౌరవము కలుగఁబోదని నీవూహించితివి కాఁబోలును ?

రా—అది యుభయపక్షములకును గౌరవమే.

మం—నీవు చాల గర్వముగ మాటాడుచున్నావు. నీవంటి వారు లేకున్నచో రాజసైన్యమునకు బలము తక్కువగునా యేమి?

రా—మంత్రిశేఖరా ! రాజపుత్రస్థానమున బాలకులలో వీరులు లేరా యేమి ? అట్లు కాకున్నచో మీకు బాలకులనిన నింతనిరసన బుద్ధి యేల కలుగును ?

మం—నీదురభిమానము సామాన్యముగ లేదు. నీవు మాటలలో నద్వితీయవీరుఁడ వని తోఁచుచున్నది.

రా—మీవంటి జ్ఞానవృద్ధులు—బాగుగ నాలోచించి చూడుఁడు ! మీకుమాత్ర మెప్పుడైనఁ బొరపాటు కలుగదా?

మం—నే నెప్పుడైనఁ బొరపడినట్లు మా రాజ్యమునం దెవ్వరు నెన్నఁడును గనుపెట్టి యుండలేదు.

రా—నే నెప్పటికైన మీ ప్రమాదము మీకు బోధపడునట్లు చేసెదను.

జయంతకుమారుఁ డింతవఱకును మౌనముతోఁ గూర్చుండి యుండెను. అప్పు డాతఁడు లేచి "ఆ సంగతి నేనుగూడ నీ మహామంత్రి కవగతము గావింపఁగలను." అనియెను.

రాజకుమారుఁడు వెనుదిరిగి చూచెను. అట్లు పలికినవాఁడు బలిష్ఠుఁడును, దీర్ఘకాయుఁడును, పంచవింశతి వర్షవయస్కుఁడు నగు నొక యువకుఁడు ! ఆతఁ డమూల్యములగు దుస్తులను ధరించి యుం

డెను. ఆతని కంఠమున ముత్యాలహారము ; కర్ణముల రత్నకుండలములు; కోశమున దారుణకరవాలము--సేనాపతి పుత్రుఁడగు నా జయంతకుమారుఁ డొక ప్రసిద్ధ సేనానాయకుఁడు!

మంత్రి మందహాస వదనముతో "మంచిది. ఇప్పుడు బాలకుల యొద్దనే పెద్దలు నేర్చుకొనవలసియున్నది.'' అనియెను.

జయం-- మంత్రివర్యా? ఈ బాలకుని వదనమునంగల తేజమును, సౌందర్యమును రాజపుత్రస్థానమునందలి సింహాసనస్థులయందు గూడ నగపడుటలేదు విశాలనయనములయం దింతటిపవిత్ర తేజము గల యీతఁడు తుచ్ఛసైనిక పదమున నే కాదు—ప్రాణరక్షక పదమునకుఁగూడ నర్హుఁడని విశ్వసించుచున్నాఁడను.

మం---నాకుఁ జంద్రమండలమువంటి మొగమునుజూచి భ్రాంతిపడునంతటి వయసు గడచిపోయినది నీది పైచూపు—నాది లోపలి చూపు! యుద్ధసమయమున రూపమునకు భ్రమపడి విదేశీయుఁడు నపరిచితుఁడునగు నొక బాలకుని రాజసైన్య మధ్యమునఁ బ్రవేశపెట్టుట యుక్తియుక్తముగ నాకుఁ దోఁచుటలేదు. జయంతా! ఇంకను నాకేమి బోధింతువో బోధింపుము!

జయం—మహామంత్రికిఁగూడఁ బోధింపఁగలుగు నంతటి సామర్థ్యమును, నంతటి యవిధేయతయు నాయొద్ద లేవు నాకీ బాలకుడు సామాన్యునివలెఁ దోఁచుట లేదు కటిప్రదేశమునందలి సుదీర్ఘమగు నమూల్యకృపాణమును, గరమున హీరాంగుళీయకమును, గంఠమున ముత్యాలహారమును నీతని సమున్నతవంశమును బ్రకటించుచున్నవి.

మం యుద్ధానంతరమున రణరంగమునందు వెదకిన్నచో నెన్నియో యమూల్యకరవాలములును, నెన్నియో మణిభూషణములునుగూడ లభియింపఁగలవు.

రాజపుత్రుని వదనమండలము రక్తకాంత్యా జ్వలితమై పోయెను. అంతలో నాతఁ డాత్మసంయమనముం గావించుకొని "అయ్యా! నే నెప్పుడు మీదాసత్వమును గోరి వచ్చితినో యప్పుడే

నా గౌరవ ప్రాభవములను విసర్జించితిని. కాని, మంత్రివర్యా! నీవు జాగరూకుఁడవై యుండుము! రాజపుత్రుని దస్యునిగా భావించిన నీ వెప్పటికైనఁ బదచ్యుతుఁడవు కాకపోవు! ఇఁక నేను సెలవుగైకొని యెదను. స్థానాంతరమునఁ బునర్దర్శన మగుఁగాక!" అని పలికి రాజపుత్రుఁడా కొలువుకూటమును బరిత్యజించి వెడలిపోయెను.

---

మూడవ ప్రకరణము.

# అశ్వము–అంగుళీయకము

రాజపుత్రునకొక వృద్ధునియింట నాశ్రయము దొరకెను. ఆ వృద్ధున కొకభార్యయును బుత్రికయును గలరు. ఆ వృద్ధుని పేరు రామశరణుఁడు—రామశరణున కఱువది యేండ్ల వయసు. అతఁ డిదివఱకు రాజసైనికోద్యోగమునం దుండెడివాఁడు. మూఁడేండ్లకుఁ బూర్వము సిరోహిప్రభువునకు నజమీరు ప్రభువునకును యుద్ధము జరిగినప్పుడు రామశరణుఁ డజమీరు సైన్యములోఁ గలసి యుద్ధమునకుఁబోయి యుండెను. అతని వృద్ధభార్యకుఁ గొంగుబంగారముగు రామశరణుఁ డదృష్టవశమున బ్రాణములతో రణరంగమునుండి తిరిగి వచ్చినమాట—నిజమే—కాని, యాతఁడు సంపూర్ణముగ నింటికివచ్చి యుండలేదు. యుద్ధక్షేత్రమునం దొకపాదము నట్లె యుంచి మఱివచ్చెను. విశేషజ్ఞాపకశక్తిగల యాతని యిల్లాలా సంగతి రామశరణున కిప్పటికిని జ్ఞప్తికిఁ దెచ్చుచునేయుండెను. ఈ మూఁడువత్సరములలో నొకనాఁడైనను నామె యాసంగతి మఱచి యుండలేదు.

అతని తనయపేరు ప్రమద—ప్రమద విధవ. కాని, యామె వయసుత్యల్పమైనది; మనసు కోమలమైనది; ఆమె మొగ మంద మైనది; కన్నులంతకంటెను జక్కనివి. ఆమె సందర్శనమునం దేమి విశేష మున్నదియోగాని యొకసారి చూచినచో మఱియొకసారి

దర్శింపవలయునని యే తోఁచుచుండును. ఇరుగుపొరుగులనున్న పతివ శీలురగు నాతతాయీలుకొంద ఱామెను గాంధర్వవిధిని బునర్వివాహము గావింపవలయునని వేడుకపడుచుందురు ; కాని ప్రమద యెంత మాత్రము నంగీకరించుట లేదు. అంతేకాక యట్టివారి నామె వారి పదునాలుగు తరములవారి నెత్తిపొడుచుచుఁ దిట్టిపోయుచుండును. ప్రమద యించుక కోపస్వభావ.

గృహిణిరూపమునుగూర్చి వర్ణించుటకు మాతరము గాదు. ఆమెయూరువులయుగము పరిమాణమున రెండు గజములకుఁ దక్కువ లేక యుండును. కంఠమునుండి కటిప్రదేశము వఱకును గూనివలె వ్యాపించియున్న యామె యుదరమును వర్ణించుటకు భాషలో బదములే లేవు. ఆహా స్త్రీకంఠమును నిరసించు కంఠస్వరమును, చక్రాకారములై ఘూర్ణిల్లుచున్న తిరుగుడు గన్నులును, విశ్వకబళనోత్సుకంబు లగు శార్దూలదంతములం బోలిన కఠినభీషణ దంతపంక్తులును, వర్ణనాతీతములైనవి. ఆ రణరంగ కరాళమూర్తిని శారదకులే భావనాప్రపంచమున భావనయనములతోఁ జూడవలయునేగాని పదములతోఁ బ్రదర్శింపజాలము. వృద్ధుఁడగు రామశరణుఁడు వికలాంగుఁ డగుటచే ధనార్జనమున నసమర్థుఁ డయ్యెను. ఈసంగతి యాతని కెల్లప్పుడు నాతనిగృహిణి జ్ఞప్తికిఁ దెచ్చుచునే యుండును. రాజకోశమునుండి రామశరణునకు నుపకారవేతనము లభించుచుండెను; కాని యది యత్యల్పమైనది. దానిమూలమున సంసారము గడచుట కష్టము. ఆతని యర్ధశరీరిణి—కాదు, ద్విభాగశరీరిణి—ఆమెయే యెట్లో గుడ్డలు కుట్టియు, పిల్లదెల కిచ్చియు నాలుగుడబ్బులను సంపాదించి దినము గడపుచుండెను. ఇఁక నాకుటుంబమున కాధ్యులెవ్వరును లేరు.

నేఁడు రామశరణునియింటఁ జిన్నపోరాటము జరగుచుండెను రామశరణుని సూపభాండమునకుఁ గావలియుంచి యాతనిగృహిణి కార్యాంతరమునకుఁ బోయెను. కాని, రామశరణుని యనవధానతచే నాకుండ పడిపోయెను. అందువలనఁ దల్లిబిడ్డ లిరువురును రామ

శరణునిపై వాగ్బాణములను వర్షింప నారంభించిరి. ఇఁక నాతనికి రక్షణ మేమున్నది? శత్రునిక్షిప్తంబులగు నసంఖ్య తీవ్రబాణముల నాతఁ డకాతరుఁడై సహించుచునే యుండెను. కాని, కొంతసేటికా బాణవర్షము చల్లారుచున్నట్లగపడుటచే రామశరణుఁడు క్షమాప్రార్థనముల కారంభించెను. అందుచే మరల మహారణమతి భీషణముగఁ బరిణమింప నారంభించెను. నానావిధంబులగు నాయుధము లొక్క పక్షనుండియే ప్రవర్తితము లగుచుండెను. విజిత పక్షమునం దశ్రువర్షమును, క్షమాప్రార్థనములును మాత్రమే—

ఆ సమయమునం దెవ్వరో వచ్చి ద్వారమునొద్ద నిలువఁబడిరి. ఆతఁ డాయిల్లు క్రొత్తగా సద్దెకుఁ దీసికొన్న రాజపుత్రుఁడే— ఆతనిం జూచినతోడనే మహారణము చల్లారిపోయెను. రామశరణుఁడు యోధవేషమును విడిచి లేచి నిలుచఁబడియెను. గృహిణి శీర్షవసనమును సవరించుకొని రణరంగమును వదలిపోయెను. ప్రమదయును దసప్రీయు కరాళమూర్తిని బరిత్యజించి లజ్జాభావముతోఁ దిరిగితిరిగి చూచుచు నంతఃపురాభిముఖయయి వెడలిపోయెను.

ప్రమద విధవయయినను నామె హృదయముమాత్రము రసహీనమైనది కాదు; ప్రేమశూన్యమును గాదు. ఆమె రాజపుత్రున కెన్నియో యుపచారములఁ గావించుచుండెను. ఆతఁడున్నగదిని ప్రతిదినమును దుడుచుచు, నాతని శయ్యాది పరికరములఁ బరిష్కృతములుగఁ జేయుచు, నాతని మలినవసనముల నుదికి యారవైచుచు సేవించుచుండెను. ఎంత చేసినను నామెకుఁ దృప్తి కలుగుట లేదు. ఏది చేసినను నిరాటంకముగ బహిరంగముగనే చేయుచుండెను. ఆమె కావిషయమునఁ బ్రతిఫలాకాంక్ష యేమియును లేదు. కాని, రాజపుత్రుఁ డది యేమియును లక్ష్యము చేయుటయే లేదు.

రాజపుత్రుఁ డేమియు నెఱుంగఁడు; ప్రమద యుత్సాహముతోఁ జేయుపనులను గనిపెట్టఁ జాలకుండుటయే కాదు; ఆ యింట బందఱును ననేక విధముల జగడమాడుచున్న సంగతికూడ నాతఁ

డంతగా గ్రహింపఁ జాలకుండెను. ఆతఁడు వచ్చినతోడనే గృహకలహము జల్లారినది. రాజపుత్రుఁ డా గృహారణక్షేత్రమున నిలిచి రామశరణునిం జూచి "నాకొక గుఱ్ఱము కావలయును" అనియెను.

రామ—ఏరకపు గుఱ్ఱము? యుద్ధాశ్వమా?

రాజ—ఔను.

రామ—సామాన్యముగ దొరకదు.

రాజ—ఏమి?

రామ—మంచిగుఱ్ఱము లీ చుట్టుపట్ల లేవు. అన్ని గుఱ్ఱములను మహారాజే కొనియున్నాఁడు ఇంకను సేనలు సమకూర్పఁబడుచునే యున్నవి; ఇంకను వారికి గుఱ్ఱములు కావలసియున్నవి.

ఇట్లు సంభాషించుచుండఁగా రామశరణుని గృహిణి యచ్చటికివచ్చి భర్తతో "నీ యుద్ధాశ్వమును నీవు దర్బారునుండి తీసికొని వచ్చితివి కాదా? దాని కేఁబది మొహరీలసొమ్ము వచ్చునట్లున్నది. నీ యిష్టమేమో తెలిసికొనవలయు నని వచ్చియుంటిని" అనియెను.

ఆ మాటల యర్థమును రామశరణుఁడు తెలిసికొని యించుక సిగ్గుపడియెను. ఆ కుంటివానికి నల్లదంతములుగల గుఱ్ఱమొకటి యున్నది. దాని నెట్లయిన నధికమూల్యమునకు విక్రయింపవలయు నని యాతనిభార్య చాలదినములనుండి యాశపడుచున్నది; ఒకటి రెండు ప్రయత్నములఁగూడ జేసినది; కాని, యింతవఱకు నామె మనోరథము తీరలేదు. ఇప్పుడు రాజకుమారుని యుద్దేశముం దెలిసి కొని యెట్లయిన ధనము సంపాదింపవలయునను నాశతో దానింత పన్నాగమునుబన్ని యవనికాంతరాళమునుండి యంతలోఁ బ్రత్యక్షమైనది.

రాజపుత్రుఁ డా గుఱ్ఱమును జూడఁగోరెను. గుఱ్ఱమనఁగనే యాతని సర్వాంగములును విద్యుచ్ఛక్తివలె నుత్సాహశక్తి పరివ్యాప్తమయ్యెను. అంతలో గృహిణి యశ్వాన్వేషణమునకు బయలుదేరెను. ఆ యశ్వరాజ మప్పుడొక చెఱువుగట్టునఁ బ్రచారము చేయుచుండెను; దానిముందటి కాళ్ళురెండును బంధము వేయఁబడి

యుండెను. ఆ ఘోటకరాజము తన సౌందర్యముచే నాతటాకమును బ్రకాశింపఁ జేయుచుండెను. సముద్రప్రదేశమున నిలిచినచో నది రెండు మూరల యెత్తుండును: నిడువుగూడా నంతే.—దాని శరీరమును ఛేదించి యెముకలను లెక్కింపవలసిన యావశ్యకము లేదు; దృష్టి మాత్రముచేతనే యా లెక్కఁగట్టవచ్చును దానివయసు మహేంద్రుని యశ్వముతో సమకాలికమై యుండును. వయసుచేతనో మఱి యేకారణముచేతనో యది యించుక వంగియుండెను. అది యప్పుడు సులభముగనే రాజపుత్రునియొద్దకుఁ దీసికొని రాఁబడియెను.

ఆ యశ్వకుమారుని సౌందర్యముం జూచి రాజకుమారుఁడు విస్మితుఁ డయ్యెను. అప్పుడాతఁడామెంజూచి "గుఱ్ఱమేనా ?" అనియెను.

గృహి—ఇదియే యశ్వము!

ప్రమద—ఇదియే యశ్వతరము!!

రాజపుత్రుఁడు నవ్వుచు "బాగుగ నాలోచింపఁగ నాకిది యశ్వతమముగాఁ దోఁచుచున్నది" అనియెను.

ఏమైననేమి—గుఱ్ఱము తీసికొని రాఁబడియెను. గృహిణి కోపముతో నసంతుష్టయయి యా గుఱ్ఱము వీఁపుపై నొక్క చఱపు చఱచెను. ఆదెబ్బతో నది క్రిందఁబడిపోయెనో మఱియేమయ్యెనో యాసంగతింగూర్చి టాడ్డుదొరగారుకూడఁ దమ రాజస్థాన చరిత్రము నందు వ్రాసియుండలేదు. ఆ కారణముచే నప్పటికి నిప్పటికినిగూడ మనకాసంగతి తెలియనేలేదు.

రామశరణ్యుఁడు రహస్యముగ రాజపుత్రునిం బిలిచి "ఇప్పుడు నీకు గుఱ్ఱముతోఁ బ్రయోజన మేమున్నది!" అని ప్రశ్నించెను.

రాజ—రేపటిదిన మొక చోటికిఁ బోవలయును.

రామ—ఎక్కడకు? రణరంగమునకా?

రాజ—ఔను—రాజున్న చోటికి—

రామ—రాజెక్కడ నుండెనో నీకుఁ దెలిసినదా?

రాజ—వినియుంటిని ఇరువది ముప్పది క్రోసులదూరమునం దున్నాఁడఁట.

రామ—నీవు రాజునొద్ద నేయుద్యోగము సంపాదింపవలయు నని ప్రయత్నించు చున్నావు ?

రాజ—సైనికోద్యోగము.

రామ—ఈదేశ శాసనమునుబట్టి యుద్ధసమయమునం దపరి చితులకు సైనికోద్యోగము లీయఁబడవు.

రాజపుత్రుఁ డించుక సే పాలోచించి "మహారాజు యుద్ధవీరుఁ డేనా?" అని ప్రశ్నించెను.

రామ—వీరసాహసములు కలవాఁడే కాని యుద్ధకుశలుఁడు కాఁడు.

రాజ—సేనానాయకుఁడో ?

రామ—అతఁడుఁగూడ నట్టివాఁడే—ఇంతకుఁ బూర్వ మొక సారి సిరోహీప్రభువు మాసేనల నాక్రమించుకొనియెను. ఆ సమయ మునఁ దేజస్వతీనగర ప్రభుఁడగు వీరేంద్రకేసరి సాహాయ్యమే లభి యింపకున్నచో సేనాపతి యధికారము వదలిపోయియే యుండును. కాని సేనాపతి యించుక యుద్ధవిద్యావిశారదుఁడనియే యీ దేశ మునఁ బ్రసిద్ధియున్నది.

రాజ—అట్లయినచో నీ సారి దేశరక్షణమున కుపాయ మే మున్నది ?

రామ—ఇప్పు డా సందేహమంతగా లేదు ; ఇప్పుడు సిరోహీ ప్రభువు స్వయముగ యుద్ధమునకువచ్చి యుండ లేదు ; మఱియును గొండదొరయగు మానరావుకూడ నాతనికి సహాయుఁడుగా లేఁడు.

రాజ—యుద్ధమునకుఁ గారణ మేమి ?

రామ—కారణ మేమియును లేదు. చిరకాలము క్రిందట సిరోహీవంశజులు చోహానవంశజులచేత ప్రభువులుగాఁ జేయఁబడిరి. క్రమముగా "చోహానులు" సిరోహీలకు స్వాధీనులై వారి రాజ త్వము నంగీకరించి యుండిరి. ఆకారణముచే "అజమీరు చోహా

నులకును" సిరోహీ చోహానులకును నైకమత్యము చెడిపోయెను. సిరోహీలు పర్వతరాజుల సాహాయ్యముచే నజమీరుప్రభుని నిర్జించి యారాజ్యము నాక్రమింపఁ దలంచుచుండిరి. ఆకారణముననుు, మాటి మాటికి నాక్రమించుకొనుచున్న మహమ్మదీయులను బాఱదోలి యాత్మ రక్షణముం గావించుకొనవలసి వచ్చుటవలనను నజమీరుప్రభువు దుర్బలుఁడైపోయి తేజస్వతీ నగరాధీశ్వరుఁడగు వీరేంద్రకేసరి నాశ్ర యించెను. వీరేంద్రకేసరి జీవించియున్నంతవఱకు సిరోహీప్రభువు మారాజు నేమియును జేయఁజాలకపోయెను. కడపటి యుద్ధమున మూఁడేండ్లక్రిందట వీరేంద్రకేసరి మరణించెనుగాని, సిరోహీ ప్రభువు నకుమాత్రము తగిన శాస్తియయ్యెను ఆ యుద్ధమునం దాతనికే సం పూర్ణముగ నపజయము కలిగెను. ఇప్పుడు వీరేంద్రకేసరి లేకుండు టచే నిన్నాళ్లకు మరల నాతఁడు తలయెత్తుచున్నాఁడు.

రాజ——ఇప్పటి తేజస్వతీ నగరాధీశ్వరుఁడు సిరోహీప్రభు నకు మిత్రుఁడని వినియుంటిని. ఆయిరువురును గలసి యజమీరు నాక్రమించినచో నిఁక నేమికావలసియుండును?

రాము——అజమీరు రాజ్యము నాశనమైపోవలసి యుండును.

రాజపుత్రుఁడింకను నేమియో చెప్పఁబోవుచుండఁగాఁ బ్రమద యొక్కఁడకుపచ్చి రాజకుమారునింజూచి "అయ్యా! ఎవ్వరో వచ్చి మీదర్శనముకొఱకు ద్వారమునొద్ద నిరీక్షించుచున్నారు" అని చెప్పెను.

రాజపుత్రుఁడు విస్మితుఁడై యీ యపరిచిత స్థానమున నా కొఱకు వచ్చినవా రెవ్వరైయుందురని భావించుకొని వెలుపలకు వచ్చి చూచెను. ద్వారమునొద్ద నొకసేవకుఁడొక సుందరాశ్వమును దీసికొనివచ్చి నిలిచియుండెను. అప్పుడా సేవకుఁ డాతనిం జూచి నమ స్కరించి "అయ్యా! ఈ సేవకుని యపరాధమును క్షమింపవలయును. ఆజ్ఞయగునచో మిమ్మొకమాట యడిగెదను——అయ్యా! మీ పేరేమి?" అనియెను.

రాజ——పేరు చెప్పుటవలనఁ బ్రయోజనము లేదు.

సేవ—మీనివాసము ?

రాజ—అదియును బ్రకటింపఁబడదు.

సేవ—ఈ యుదయమున మీరెచ్చటకుఁ బోయియుంటిరి ?

రాజ—ఈప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట కభ్యంతర మేమియును లేదు—జయదేవీ మందిరమునకుఁబోయి యుంటిని.

సేవ—తరువాత ?

రాజ—పిమ్మట మంత్రిదర్శనమునకుబోయి యుంటిని.

సేవ—అయ్యా! మీకొక యుత్తరమువచ్చినది.

అని చెప్పుచు నాతఁడొక కాగితమును రాజపుత్రుని చేతి కిచ్చెను. అయుత్తరమునం దిట్లున్నది—

"ఎవ్వరు జయదేవీ పాదసన్నిధానమునందుఁ గరవాలము నుంచి యా జగన్మాత యాశీర్వాదము నపేక్షించి ప్రార్థించెనో, యాతడీ యశ్వమునకుఁ దగిన యోధుఁడని యెంచి యీ గుఱ్ఱమాతని యొద్దకు విక్రయమునకై పంపఁబడియెను. దీని మూల్యమైదు మొహరీలుమాత్రమే—ఆమూల్య మీలేఖావాహకుని చేతికిచ్చి యీగుఱ్ఱమును దీసికొన్నచో నాధనము నాకందఁగలదు.

ఇట్లు,
దరిద్రవ్యక్తి."

రాజకుమారుఁ డాయశ్వలక్షణములను నలంకారములనుబాగుగ బరిశీలించి "ఈ యశ్వాధికారి యెన్నటికిని దరిద్రుఁడు కాఁజాలఁడు. ఇంతటి సుందరాశ్వములు మహారాజు నొద్దఁగూడ నుండునో యుండవో సందేహము—ఈ గుఱ్ఱమును, దీని యలంకారములును, నైదు వందల మొహరీల మూల్యమునకుఁ దక్కువగా నుండదని నిశ్చయముగఁ జెప్పఁగలను. నేను మోసముచేసి స్వల్పమూల్యమునకు దీనిని దీసికొనఁ జాలను.

సేవ—ఇందు మీ మోస మేమున్నది? నేను నా గుఱ్ఱమును మూల్యము దీసికొనకుండఁగనే మీకిచ్చివేయఁగూడదా !

రాజ—అపరిచితునియొద్ద నేను దానమును బరిగ్రహింపఁ జాలను.

సేవ—అట్లు తీసికొనుట మీకిష్టము గాకున్నచో నైదువందల మొహరీలనే యిచ్చి దీనిని దీసికొనుఁడు !

రాజ—అంత ధనము నాయొద్ద లేదు ఆ ధనమునకు నాయుంగరమును వినిమయముగ నీవు తీసికొనుట కంగీకరించినచో నేనీ యశ్వమును గైకొనఁగలను. ఈ నాయుంగరము వేయి మొహరీల వెలగలది.

సేవ—ఇప్పుడు మోసముగ ధనము తీసికొన్న యపరాధ భారము నాతలపైఁ బడినది. కానిండు ! ఉంగరము నటు తెండు ! ఇదిగో ! గుఱ్ఱము ! నేను సెలవు గైకొనియెదను.

---

నాలుగవ ప్రకరణము.

# అంకురము

రాజకుమారి రాజమందిరోద్యానమునం గూరుచుండి పుష్ప దళములఁ దుంచి పాఱవైచుచుండెను. శ్వేత పూవులను గోయుచుండెను. నీల దండలను గుచ్చుచుండెను. రాజకుమారి యాపుష్ప మాలికలనుగూడఁ ద్రెంచి పాఱవైచుచుండెను. ఉమాబాల పదునేడేండ్ల రమణీమణి—ఇంకను నామె యవయవ పరిణామము సంపూర్ణముగా లేదు. ఆమె హృదయ మింకను బాగుగ వికసింపలేదు. దేహసౌందర్యమును వికసింపలేదు వసుధాచుంబనశీలంబులగు తన సుదీర్ఘ పినీలవిశీర్ణకుంతలములను సరిగ ముడుచుకొనుట యయిన నామె కింకను బాగుగఁ దెలియదు. మనోముకురముపై నెట్టి యవకుంఠనమునైన వేయఁగలుగుట యామె యింకను నేర్చుకొని యుండలేదు.

ఉమాబాల హృదయము చంచలమైనది ; గతియును జంచలమైనదే; కన్నులును జంచలములైనవియే. కర్ణకుండలములయందలి వజ్రములతోఁగూడ నామె కన్నులును దరళితము లగుచుండును ! మందహాసము చేయుచుండును ; ఆ వజ్రకాంతులకంటె నామె తరళ నయనములే మధుర కాంత్యుజ్జ్వలములై యున్నట్లు గానవచ్చుచుండును. ఆమె కంఠమున వ్రేలాడుచున్న సువర్ణమణిహారము, కటియందలి మణినూపురమును బరిహసించుచుండును ఆమణినూపురము సగర్వముగ మొరయుచు, నితంబముపైఁ లయించి తన యున్నతత్వమును బ్రదర్శించుచుండును. ఆ కంఠహారము దురభిమానముతో వివిధ మణికాంత విలసితమై సమున్నత వక్షోవసనాంచలము నాశ్రయించి మెఱసిపోవుచుండును. ఆమె యంగుళములందలి హీరాంగుళీయకము కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండును ; నవరత్నఖచితంబగు నామె సీమంతభూషణము గంగాధర శిరోభూషణమగు జాహ్నవీ రూపమున విరాజిల్లుచుండును.

ఆ వికసిత కమల సరోవర సమంచితంబును, విహగకలకలాలాప మాధురీ విలసితంబును నగు పుష్పోద్యానమునం గూర్చుండి పుష్పాధీశ్వరియగు నుమాబాల పూవులను జిమ్మివైచుచుండెను. అప్పటికి సంధ్యాసమయ మాసన్నమగుచుండెను. దివమంతయును మందేహాది రాక్షసులతో యుద్ధము చేయుటచే రక్తప్లావిత శరీరుఁడగు సూర్యనారాయణుఁడు నక్షత్రఖచితంబగు నీలాకాశాంతరాళమున కొదిగిపోవుచుండెను. పక్షులన్నియును దండనాయక విరహితులగు సైనికులంబోలి వాపోవుచు నలుదెసలకుఁ బరిభ్రమించి యాశ్రయములను వెదకుకొనుచుండెను ఆ సమయమునం దుమాబాల వీణం గైకొని గానము చేయ నారంభించెను—

"మెలతరో ! తళుకున మెఱపు మెఱసినట్లు
మిఱుమిట్లు గొలిపించెనే ;
అలరు వెన్నెలలో నమృత మొలికినట్లు
ఆనంద మొదయించెనే - తమిమించెనే॥ మె॥

మనసులోనఁ దలపు మగ్నమైనప్పుడు
మఱపువచ్చి ముంచెనే;
కనులలోనఁజూపు గలసినంతనె చిత్త
కమలము వికసించెనే—వాసించెనే॥ మె॥
సొలపుచూపులలోనే సుందరాకారుఁడు
చొచ్చి మాయమాయెనో
నెలతరో! యేమందు నిలువరాక కనుల
నీరునిండిపోయెనే—దిగులాయెనే॥ మె॥

వీణామనోహర కంఠస్వరమునుండి వెలువడుచున్న యీ మధురసంగీత మపూర్వ శబ్దతరంగముల నుత్పాదించుచు నా యుద్యానమును నిర్మలాకాశమును నమృతప్లావితములుగఁ జేయుచుండెను. కాని, యుమాబాల యీ గీతమును ముగింపకుండఁగనే వీణను దూరమునందుంచి లేచి నీలచేతిలోని పూలదండను లాగికొని త్రెంచి పాఱవైచెను. నీల కపటకోపము నభినయించుచు నుచ్చై స్స్వరమున గూఢభావ గర్భితమగు గీతమును గానముచేయ నారంభించెను.

"అందమా! మా! చక్కని చందమామా!
సుందరమగు నీరూపము నల్లని
సంద్రమునను బ్రతిఫలించి తరగల
సందడిఁబడి తూలుచు నిరతంబును
గొందలమునఁ దొందరపడుచే నీ॥ అందమా॥

అప్పుడుమాబాల దిగ్గున లేచి నీలవీణను లాగికొని దూరముగ బాఱవైచి మేలిముసుఁగుతో నామె వదనమండలమును మూసివైచెను. నీలసంగీత మాఁగిపోయెను.

రాజకుమారి హృదయభావమును విస్పష్టముగఁ బ్రకటించుచు "శ్వేతా! నేను యుద్ధక్షేత్రమునకుఁ బోవలయును" అనియెను.

శ్వేత— ఎవ్వరితో యుద్ధము చేయుటకు?——దరిద్రుఁడగు నా పుంజేరివిమాత్రము కొట్టకుము.

శ్వేత చెంపపై నొక్క చపేటము పడియెను. అప్పుడు శ్వేత మందహాసము చేయుచు "నీ యుద్దేశ మేమో చెప్పుము!" అనియెను.

ఉమా— నేను రణరంగ దర్శనమునకై తండ్రి యొద్దకుఁ బోయెదను.

నీల—ఏమి యుద్ధమును జూచెదవు? హృదయములోని యుద్ధమా? కాక తర వారితోడి యుద్ధమా?

ఉమా—నీవు మాటాడకుము! వదరుబోతా!

శ్వేత—చెలీ! నీకుఁ గోపము వచ్చినను సరియే—కాని నీల సరిగ నే చెప్పినది. నీవు యుద్ధమును గల్పించుటకుఁ బోవుచుంటివి.

ఉమా—నేను పురుష వేషముతోఁ బోయెదను. మీరును బురుష వేషములతో గుఱ్ఱముల నెక్కి నా వెంట రావలయును.

నీల—అట్లయినచో నిఁక మాకుఁ బెండ్లి కాదు. ఇట్టి మమ్మెవ్వరు పెండ్లి చేసికొందురు? నీకేమి? నీవు రాజకుమారికవు—కొలఁదియో గొప్పయో యధికారమును నైశ్వర్యమును జూపుటకు నీకవకాశమున్నది. మాకేమున్నది?

శ్వేత—నీ వివాహముంగూర్చి నీ వింకను నేమియును నాలోచించుకొనుట లేదా?

నీల—నీ కింకను బెండ్లియీడు రాలేదు. అందుచే నీకింకను నట్టి యాలోచనమే లేదు

ఉమా—మీ మాటల కేమిగాని—శ్వేతా మఱియా యింకను వచ్చినదో లేదో చూడుము.

శ్వేత యటనుండి వెడలిపోయెను. అప్పుడు రాజకుమారి 'నీలా! ఈ రాజ్యమునం దిట్టి దుష్టశాసన మెన్నిదినముల నుండి యున్నది?" అని ప్రశ్నించెను.

నీల—ఏ శాసనము?

ఉమా—యుద్ధసమయమునం దపరిచిత వ్యక్తులను రాజసైన్యమునం జేర్చుకొనఁగూడదను నిబంధనము—

నీల—అదియా? అందువలన నిప్పుడు నీకేమినష్టమువచ్చినది?

ఉమా—అది కాదు. ఈనియమము కేవల మనాగరక జనో చితమైనదిగాఁ దోఁచుట లేదా?

ఇంతలో శ్వేత మతియాను వెంటబెట్టుకొని యచ్చటికి వచ్చె ను. మతి యా నిపుణమతి యగుదాసి. రాజకుమారి యామెను మిగుల ప్రేమించుచుండును. మతియా యావసవతియగు విధన—వికసించుటకు బూర్వమే విచ్ఛిన్నమైపోయిన సురభిళకోరకము.

రాజకుమారి యామెంజూచి "మతియా! గుట్టు మేమైనది?" అని ప్రశ్నించెను.

మతి — విక్రయించి వచ్చితిని.

ఉమా—ఎవరి కమ్మితివి!

మతి —జయదేవీ పాదపీఠమునఁ గరవాలముసుంచి యాశీర్వ దింపఁగోరిన యువకునకు—

ఉమా—ఆతఁ డే దేశపువాఁడు?

మతి——ఈ దేశపువాఁడుగా నగపడుట లేదు.

ఉమా—ఆతనియొద్ద నశ్వమూల్యముం దీసికొంటివా?

మతి — ఆ.

మతియా మెల్లసంగతులను రాజకుమారికి నివేదించి యొక యుంగరము నామె చేతికిచ్చెను. ఉమాబాల దానిం గైకొని తనయుం గరము కంటెను నది యధికమూల్యము కలదగుటంగాంచి యద్భుతా క్రాంతహృదయ యయ్యెను. తరువాత నుమాబాల మతియాను బంపి వైచి చాలసేపటివఱకు నెన్నియోవిధముల నాలోచించి మెల్లమెల్లగ 'శ్వేతా! నీలా! రణరంగమునకుఁ బోకతప్పదు— రేపటి యుదయ మున నే ప్రయాణము!" అనియెను.

రాజకుమారి ధృఢప్రతిజ్ఞురాలని నీలఁ యెఱింగియుండియును "చెలీ! మనము బయలు దేరుటకుఁ దల్లిదండ్రుల యంగీకారము వలదా" అని ప్రశ్నించెను.

ఉమా— అమ్మ సులభముగ నే యంగీకరించును. నాయన యొద్ద కిప్పుడే జాబువ్రాసెదను.

నీల — నీ వెంట వచ్చినవా రెవ్వరు ?

ఉమా — మీరే

నీల — అంగరక్షకులో ?

ఉమా — రేపు మాతండ్రిగారియొద్ద కెందఱో సైనికులు పోయెదరు వారి సాయమునఁ బోవచ్చును.

నీల — పురుష వేషములతో గుఱ్ఱముల నెక్కి పోవలసిన దేనా ?

ఉమా — ఆసంగతి మొట్టమొదటనే చెప్పితిని.

నీల — ఇంటికిఁ దిరిగివచ్చుట యెప్పుడు ?

ఉ — ఆ మాట యిప్పుడు చెప్పఁజాలను మాతండ్రి చెప్పినట్లు చేయవచ్చును. యుద్ధము చాలదినముల వఱకును జరుగునని తోఁచి నచో మాయమ్మనుగూడ నక్కడకే పిలిపింపవచ్చును. మనము నివ సించుటకు నిరపాయస్థలము లేకున్నచో యుద్ధము ముగిసిన వెంటనే బయలుదేరి రావచ్చును.

నీల — నీవు పోయి చూచునంతవఱకును యుద్ధమాఁగు ననుకొను చుంటివా ?

ఉ — రేపటిదినమున యుద్ధము జరుగునని వార్త వచ్చినది మా తండ్రి యారావళీపర్వత ప్రాంతమునందలి దేవోయార్ సమీపము నను, సేనానాయకుఁడు కురిసమీపమునను సేనలతో నిలిచి యున్నా రఁట. రేపు యుద్ధము జరగును.

నీల — అంతదూరము మనము పోవుట యెట్లు?

ఉ — ఏమి? గుఱ్ఱములున్నవి కావా? పొమ్ము, గుఱ్ఱములను సిద్ధము చేయున ట్లేర్పాటుచేయుము !

శ్వేత — సఖీ ! నీవు గుఱ్ఱమునెక్కి యుద్ధము చూడఁబోయి నచో లోకులు నిన్ను నిందింపరా?

ఉ — నిందించుట యేమి? రాజపుత్రికలశ్వారూఢులై యుద్ధ ములు చేయుట క్రొత్తసంగతియా? ఒకవేళ నన్ను లోకులునిందింతు రనుకొనుము — అంతమాత్రమున నా కేమినష్టము? నేను రాజపుత్రి కను. నేలకొలఁది రాజపుత్రులు నా యనుగ్రహము నపేక్షించి వర

స్వర ప్రతిద్వంద్వులై యున్నారు. నేను లోకాపవాదమునకు భయపడి బంధితురాలింబోలి యింటియందుండవలసినదా!

అని చెప్పుచు నుమాబాల పుష్పహారముతోఁ గంఠము నలంకరించుకొని సంతోషముతో నొయ్యారముగ నడచుచుఁ దల్లి చెంతకుఁ బోయెను.

---

అయిదవ ప్రకరణము.

# సిగ్గులేని సిగ్గు

వేకువజామైనది. ఇంకను ప్రభాతకాంతులు పావపృథ్వీతలమునకుఁ బ్రసరించుట లేదు. పుష్పనికుంజములలో నింకను జీఁకటులు నిదురించుచునే యుండెను. అప్పు డశ్వారోహకులగు ముప్పురు యోధు లజమీరునుండి పశ్చిమాభిముఖులై పోవుచుండిరి వారు మనకుఁ బరిచితులే. ఉమాబాలయును జెలికత్తెలును—ఉమాబాల పురుషవేషమునఁగూడ మనోమోహినియే యయియుండెను; నిబిడ కుంచితవినీలకుంతలదామ ముష్ణీషమున నవరింపఁబడియెను. కాని; యా యుష్ణీష మాకబరీబరమును సంపూర్ణావృతముగఁ జేయఁజాలకుండెను. సమున్నతవక్షోభాగము లోహకవచ సంకలితమై యుండెను. కాని, యా మోహనతనుస్పర్శమణి సంపర్కమున నాలోహము బంగారమయ్యెనో యనునట్లుండెను; నిరంతరమణి నూపురసముంచితం బగు నాకటితట మిప్పుడు కరవాలవిలంబిత మగుచుండెను.

అప్పుడు శ్వేతయు, నీలయును, దమలో "ఆహా! ఏమి యీ సౌందర్యము? మోహనరూపముచేతనే మూఁడులోకముల జయింపఁ జాలిన యీ దివ్యమూర్తికిఁ గటితటమునఁ గరవాలముకూడ నేల? ఆహాహా! నిజముగ నీవే పురుషుఁడవైనచో మా ప్రాణకుసుమములు నీ పాదకమలముల కర్పించి బ్రదికియున్నంతవఱకు నీపాదదాసికలమై భూలోకస్వర్గసుఖము ననుభవింపఁ గలుగుదుముగదా!" అని భావించుకొనుచుండిరి.

రాజకుమారిముందట నర్ధక్రోశదూరమున నశ్వసైన్యమును, వెనుక నరక్రోశదూరమునఁ గొంత సైన్యమును నడచుచుండెను. రాజతనయ సఖీసహితయయి గ్రామములు, వనములు, తటాకములు పర్వతములును దాఁటిపోవుచుండెను. ఆ సమయమునం దాకస్మికముగ వెనుకనుండి యశ్వపదశబ్దము వినవచ్చెను; ఆ మువ్వురు నదరిపడి వెనుదిరిగి చూచిరి. అప్పుడొక యశ్వారోహి వాయువేగముతో విద్యుద్వేగముతో గుఱ్ఱము నడాయించుకొని వచ్చుచుండెను; ఆ యసాధారణాశ్వ చాలనవైశద్య మత్యద్భుతముగా నుండెను. గుఱ్ఱము నంత వేగముగ దుమికింపగల యోధుని రాజపుత్రి యెన్నఁడునుజూచి యుండలేదు చూచుచుండఁగనే యా యోధుఁడు వారిని సమీపించుచుండెను. అప్పు డాతని నా మువ్వురు నానవాలుపట్టిరి— ఆతఁడు జయదేవీమందిరోపాసకుఁడగు రాజపుత్రుఁడే—

రాజకుమారి యశ్వము మందే నడచుచున్నది గాని రాజపుత్రుఁడు నిమిషములో దాని నతిక్రమించి పోవునట్లు తోఁచుచుండెను, అందుచే నామె దనయశ్వమును గశాఘాతములచే నదలించుచు నతివేగముగఁ బరుగెత్తించుచుండెను. కొంతసేపైన తరువాత నుషాబాల మరల వెనుదిరిగి చూచెను. అప్పటికి రాజపుత్రుని యశ్వము మరింత సమీపమునకు వచ్చియుండెను.

అప్పుడు నీల "శ్వేతా! ఈ రాజపుత్రు నడ్డగించి బలవంతముగ నీతని యశ్వమును లాగికొనవలయును" అనియెను.

శ్వేత — రాజపుత్రుఁ డేమి నేరము చేసినాఁడు?

నీల — నీ వెఱుఁగవా? ఈతఁడు మన రాజపుత్రిని వెనుకబెట్టి తాను తప్పించుకొని ముందుఁ బోవలయునని చూచుచున్నాఁడు! ఎంత గర్వము?

శ్వేత — నీ వీతని గుఱ్ఱము నెట్లాపఁగలవో యాఁపుము! చూతము!

నీల — ఇదిగో! చూడుము!

అని చెప్పి నీల తన గుఱ్ఱమును వెనుకకుఁద్రిప్పి రాజకుమారుని మార్గమున కడ్డముగ నిలిపెను రాజపుత్రుఁడు నిమిషములో నీలను సమీపించి ప్రక్కనుండి యామెను దప్పించుకొనిపోవఁ జూచుచుండెను. అంతలో నీల తన కరవాలము నొరనుండితీసి రాజపుత్రుని కడ్డముగ నిలువఁబడియెను. ప్రచండ వాయువేగముతో రాజకుమారునిగుఱ్ఱము వచ్చుచుండెను. నీల తన కృపాణమును గుఱ్ఱమున కడ్డముగానుంచెను. నీల బాలిక—తన కరవాలముంగాంచి రాజపుత్రుఁడు తన యశ్వము నాపునని యామె యనుకొనియెను. కాని, యట్లు జరుగలేదు. నీల తన మనసునందెంతమాత్రమును భావించి యయిన నెఱుఁగని కార్యము నిమిషములో జరిగిపోయెను. రాజకుమారుఁడతి వేగముతో నీలను సమీపించి యామె చేతియందలి కృపాణము నెడమచేతితో లాగికొని దూరముగఁ బారవైచి గుఱ్ఱము నుడాయించెను. ఆ యాకర్షణవేగమును నీల సహింపజాలక గుఱ్ఱమునుండి క్రిందఁబడిపోయెను. అట్లామె పడిపోవుటఁ జూచి దయార్ద్రహృదయుఁడగు రాజపుత్రుఁడు తన యశ్వమునాఁపి చటాలునఁ గ్రిందికిదిగి యామెను సమీపించి చూచెను. అప్పటికే యా ప్రౌఢబాలికయచేతన యయిపోయెను రాజకుమారుఁ డామెను దొడపై నుంచుకొని సాహాయ్యముకొఱకు నలువంకలను దిలకించుచుండెను. అప్పుడు శ్వేత తన గుఱ్ఱమును జరుగెత్తించుకొనుచు నా వంకకు వచ్చుచుండెను. ఆమెంజూచి రాజపుత్రుఁ డించుక ధైర్యమునువహించి శ్వాస సౌలభ్యమునకై యామె వక్షస్స్థిత కంచుకము నించుక వదలించెను— "ఏమిది! ఈమె రమణీమణియా?" ఆకస్మికముగ రాజపుత్రుఁ డదరిపడి తన తొడపైనున్న నీల శిరమును గ్రిందనుంచి విద్యుద్వేగముతో లేచి నిలువఁబడియెను. అంతలోనే సమీపించిన శ్వేత యాతనిం జూచి నవ్వుచు "ఏమి! పాము కనఁబడినదా యేమి" అనియెను

నీలకుఁ దనయంతనే స్మృతి కలిగినది. అంత విశేషముగ దెబ్బ తగులలేదు. ఆమె తత్తరముతో సత్వరము లేచి శ్వేతం జూచి

"నా వక్షః కంచుకమును వదలించిన వాఁ రెవ్వరు?" అని ప్రశ్నించెను.

శ్వేత నవ్వుచు నీలకు రాజపుత్రునింజూపుచుఁ బరిహాసముగా "ఈతఁడే! నిన్నుఁ దన యుత్సంగమునం జేర్చుకొని—" అనియెను.

నీల కపట కోపాభినయముతో "ఏమయ్యా! మీ దేశమునం దాఁడుబిడ్డలు లేరా? మీరు పర దేశమునకువచ్చి రమణీమణుల వెన్నంటివచ్చుచు సమయముదొరకునప్పుడిట్లు సాహసముంజూపుట యందుచేతనా?" అనియెను.

రాజపుత్రుఁడు లజ్జితుఁడై యించుక విరక్తభావముతో "మా దేశమున రమణీమణులు పురుష వేషముతో నీఘులవెంటఁ దిరుగరు; ప్రయాణములుచేయరు; పురుషుల కన్నులయెదుట నేలపైఁ బొరలాడరు" అనియెను.

అతఁడామెకుఁ దగినట్లే చెప్పెను నీలకు బుద్ధివచ్చినది. ఆమె యామాటను మఱపించుటకై ప్రసంగాంతరమునకు మరలించి "ఈ గుఱ్ఱము నీ కెట్లు లభియించినది? ఇది నాది" అనియెను.

శ్వేత—ఈతఁడుమాత్రము నీవాఁడు కాఁడా? కాకున్న నో గుఱ్ఱమును దిగివచ్చి నిన్నేల యెత్తికొనును?

నీల—శ్వేతా! నీకెంత పొగరే! నీ తలకుఁదగని మాటలాడుచున్నావు!

శ్వేత—నాకేమి! తొడలపైఁ బరున్నదానవు నీవు—తప్పు మాటలాడినదానను నేను! బాగుగనేయున్నది!

నీల—నీవు నాతోమాటాడకుము! నేను నీతోనిఁక మాటాడినచో నీ రాజపుత్రునివంటి యశ్వచోరుని చేతులలోఁబడిపోయినట్లే, రాజపుత్రా! చెప్పుము? ఈగుఱ్ఱము నెచ్చటదొంగిలించితివి?

రాజ—నేనశ్వచోరుఁడనుగాను; అశ్వమే నన్నుఁ దొంగిలించినది. నీవంటి రమణీమణి వదనమండలము చెంతకు గడ్డమువచ్చినట్లే నా చెంత కాగుఱ్ఱమువచ్చినది.

నీల—ఇది నాగుఱ్ఱము. కేవలమిట్టి పంచకళ్యాణిగుఱ్ఱమే యీ మార్గమునఁ గొలఁదిదూరమునం దున్నది. నాయీ గుఱ్ఱము నచ్చట విడిచి నీవటనున్న యీగుఱ్ఱము నధిరోహించిపొమ్ము! అట్లు పోయి నచో నీకజమీరపుర యుద్ధక్షేత్రమునం దిట్టిదే మఱియొకగుఱ్ఱ మగ పడును! అప్పటి కాయశ్వముకూడ వలసిపోవును. కాఁబట్టి నీవు దాని నచ్చటవిడిచి యటనున్న గుఱ్ఱము నెక్కి ప్రయాణము చేయుము. "జయదేవి" అను సంకేత శబ్దము నుచ్చరించినమాత్రమున నే యా గుఱ్ఱపువాఁడు నీకాయశ్వము నొసంగఁగలఁడు.

అని చెప్పి నీల మరల నశ్వారోహణముం గావించెను. శ్వేత యను రాజపుత్రుడును దమతమ గుఱ్ఱము ల నధిరోహించిరి. ఉమా బాల రాజపుత్రుని సమీపింపక దూరమునఁదుండియే యాయస్పష్టా లోకమునం దాతని సుకుమార సుందరాకారము నతృప్త నయనము లతో దిలకించుచుండెను. నీల గుఱ్ఱము నెక్కి రాజపుత్రుని పార్శ్వము నుండియే పోవుచు "రాజపుత్రా! అదిగో! చూడుము ఆతఁడే మా స్వామి—ఆతని యొద్దనుండి యొక పరిచయపత్రమును వ్రాయించి నీకిచ్చెదను. నీ వా యుత్తరముం దీసికొనిపోయి యే దండనాయకున కిచ్చినను సైన్యమునందు నీకుఁదగిన యుద్యోగములభియింపఁగలదు" అని చెప్పెను.

రాజపుత్రుఁడు సగర్వముగ "రాజకుమారులకు వారి నిశిత కరవాలముకంటె ముఖ్యమైన పరిచయసాధనము మఱియొకటిలేదు" కావున నితర పరిచయసాధనములతో నా కెంతమాత్రము నావశ్యక ములేదు.

నీల—అట్లయినచో దయయుంచి నీ నామధామములంగూర్చి యు వంశముంగూర్చియు మాకుఁ దెలిపెదవా?

రాజ—ఎల్ల సంగతులును నాయసికోశమునందున్నది. యుద్ధ మునకుఁబూర్వమే రాజపుత్రుఁడును దన్నుఁగూర్చి ప్రకటించు కొనఁబోఁడు—యుద్ధక్షేత్రమున నెల్లసంగతులును దెలియఁగలవు.

అని చెప్పుచు రాజపుత్రుఁ డశ్వము నుదాయించెను. నీలా శ్వేతలు సాధ్యమైనంతవఱ కాతని ననుసరింపఁ బ్రయత్నించిరి—కాని నిమిషములో రాజకుమారుని యశ్వము శరవేగమునం బోయి యదృశ్యమైపోయెను.

అప్పుడు నీల తనలో "ఈతఁడెన్నటికిని గులహీనుఁడు కానేరఁడు—బలపరాక్రమ సంపన్నుఁడు కాకున్నచో నింతటి తేజోనిధి కాఁజాలఁడు; అశ్వవినిమయముగ నీతఁడొసంగిన యంగుళీయముపై భవానీప్రసాద నామాక్షరము లగపడినవి. ఈ దేశమున భవానీ ప్రసాదను రాజకుమారుఁ డెవ్వఁడైన నున్నట్లు వినియుండలేదు ఈ మహాపురుషుఁ డెవ్వఁడై యుండును?" అని యాలోచించుకొనుచు రాజకుమారిని సమీపించి పరిహాససూచక స్వరముతో "స్వామీ! ఇంతసిగ్గేల? ఇంత దూరదూరముగా నుండుటేమి! యుద్ధము చేయఁ బోవుచు నింతసిగ్గా? ఎన్నఁడును సిగ్గెఱుంగని నీకిప్పుడీసిగ్గేల వచ్చినది?" అనియెను.

ఉమా—ఏమని చెప్పుదును? నాకీ పురుషవేషము వేయుటచే సిగ్గగుచున్నది.



ఆఱవ ప్రకరణము

# వీరత్వము

"నీ పేరేమి?"

"ప్రసాదుఁడు"

"నీ నివాసము?"

"ఆ సంగతి నింకను బ్రకటింపఁ దలఁచుకొనలేదు."

"అట్లయినచో నిన్ను మా సేనలోఁ జేర్చుకొనుట కవకాశము లేదు"

"మహారాజు చిత్తము!"

"నీకు యుద్ధము చేయవలయునను కోరికయున్నచో నీవు సిరోహీ సైన్యమునఁ జేరఁగూడదా ?"

"నాకా యుద్దేశమే యున్నచో మీదర్శనమునకై తల్లడిల్లు టేల? ఇంతకుఁ బూర్వమే యట్లు చేసియుందును. సహానుభూతి యించుకంతయును లేని పక్షమునఁజేరి సాహాయ్యముం జేయుట యెట్లు ?"

తేజస్వతీ నగరపు యువరాజగు భవానీప్రసాదుఁడు, జయదేవీ మందిరోపాసకుఁడగు రాజపుత్రుఁడు నొక్కఁడేగాని వేఱుగాదని మా పాఠకుల కఁదఱకును దెలిసియే యుండును. ఆ సంగతి తెలియకుండఁ గప్పిపుచ్చుటకు మాకును నంతగాఁ బ్రయోజన మగపడుట లేదు. కాని యజమీరు ప్రభునియొద్ద నాతఁడు తన పేరు ప్రసాదుఁడని చెప్పి యుండుటచే నింతటినుండి మేముకూడ నాతని బ్రసాదుఁ డనియే వాడుచుందుము.

మహారాజగు శూరసింహుఁ డించుకసే పాలోచించి "నీకు వారియెడల సహానుభూతి లేకుండుటకుఁ గారణమేమి ?" అని ప్రశ్నించెను.

ప్రసా—మా తండ్రి సిరోహీ చేతులలో మరణించినాఁడు.

శూర—ఎక్కడ? ఏ యుద్ధమునందు?

ప్రసా—సేహారా రణరంగమున.

శూర—మీ తండ్రి పేరేమి ?

ప్రసా—క్షమియింపుఁడు! ఆ సంగతి సమయాంతరమున మనవి చేయుదును.

మహారాజు మఱి యేమియును మాటాడలేదు. అప్పు డొక చిన్నపర్వతముపై జిన్నపోరాటము జరగుచుండెను. ఇంకను సంపూర్ణముగ యుద్ధము జరుగుట లేదుగాని, యచ్చటచ్చట నారంభమగుచుండెను. ఉభయపక్షముల నించుమించుగఁ బండ్రెండు వేల సైనికులు చేరి యుండిరి. సిరోహీ సైన్య మర్ధచంద్రాకృతిగ నిలిచి యుండెను.

పర్వతము వ్రక్కను, వనమునందును నెల్లచోటులు నా సైని కులు నిలిచియుండిరి.

అజమీరు సైన్యము చతుష్కోణవ్యూహముగఁ గూర్పఁబడి యుండందు సురక్షితమైయుండెను. అందుఁ జాలపఱుకుఁ బర్వతో పత్య కమునను క్షుద్రనదీసైకతములను నాశ్రయించి యుండెను. అక్కడ నంతగా నున్నతప్రదేశము లేదు. ఒక చిన్నకొండమాత్ర మున్నది. దాని నాశ్రయించుకొన వలయుననియే కొంత యశ్వదళము నూరోక్త దయమునకుఁ బూర్వమే ప్రవేశించి యుండెను. వారాకొండ నాశ్ర యించుకొన్నట్లే యగపడుచుండెను. అజమీరుసైన్యము వారి నాక్ర మింపఁ బ్రయత్నించుచునే యుండెను గాని, లాభ మగపడుటలేదు. మహారాజప్పుడు జయంతకుమారునిం బిలిచి "నీవా సైన్యమును దరిమి యీపర్వతమును వశపఱచుకొనఁగలవా?" అని ప్రశ్నించెను.

జయం—మహారాజాజ్ఞ యయినచో నట్లే చేయఁగలను.

శూర.—మంచిది. రెండువందల యాశ్వికదళములతోఁ బోయి శీఘ్రముగ నాపర్వతము నాశ్రయించుకొనుము.

జయంతకుమారుఁ డతిత్వరితముగ వెడలిపోయెను. అతని వెనుక నిన్నూర్గు రాశ్వికులు బయలుదేరిరి. భీమవిక్రమములో జయంతుఁడు శత్రులనెదుర్కొనియెను అతనిప్రతాపమును సహింపఁ జాలక శత్రుసైన్యము చెల్లాచెదరయ్యెను. ఆపర్వత శిఖరముపై నజమీరుపతాకమునుస్థాపించి యంతలో జయంతుఁడు మరల మహా రాజునొద్దకు వచ్చెను. అతని వీరత్వమున కందఱును విస్మితులై పోయిరి. "నా సైన్యములో నింతటివీరుఁడు మఱియొకఁడు లేఁడు" అని మహారాజు భావించుకొనియెను.

అనతిదూరముననే యుండి యుమాబాల యుద్ధమును దిలకించు చుండెను. ఆమె యిరువంకల నిరువురుసఖులు నుండిరి. ముగ్గురును బురుషవేషములతో నశ్వముల నధిరోహించి యుండిరి. జయంతుని వీరత్వముంగాంచి శ్వేత విస్మితయయి "ఎంతటి సాహసము? ఏమి యీ వీరత్వము!" అనియెను.

ఉమా—ఈ వీరత్వమునం దమానుషధారణత్వ మేమి యును లేదు.

జయంతుఁడు రాజునకు యుద్ధవృత్తాంతమును మనవి చేసెను. రా జాతనిం జూచి "కుమారా! నీవు నీతండ్రికిఁ దగిన తనయుఁడవు. నీవు రణరంగమునఁ జిరవిజయి వయ్యెదవుగాక!" అనియెను.

జయంతుఁడు వినయవినమిత శిరస్కుఁడై మహారాజు నాశీర్వాదమును బరిగ్రహించి "మహారాజా! రాజకుమారిక యుద్ధసందర్శనమునకై వచ్చియుండు నని వినియుంటిని. ఆమె యెక్కడనున్నదో యగపడలేదు" అనియెను.

మహారాజు వ్రేలితోఁ జూపుచు "అదిగో! ఆ వృక్షాంతరాళమునం దామె తన యిరువురు చెలికత్తెలతోడను నిలిచి పరీక్షించుచున్నది" అనియెను

జయం—ఆమె సంరక్షణమున కెవ్వరినైన నియమించితిరా?

శూర—అయిదు వందలమంది యంగరక్షక సైనికులను నియోగించితిని

జయంతకుమారుఁ డేమనుకొనియెనో గాని మఱేమియు మాటాడలేదు. అప్పుడు రాజు ప్రసాదు నాతనికిం జూపుచు "జయంత కుమారా! ఈబాలకుఁడు సైనికోద్యోగమును గోరుచున్నాఁడు— మన చిరకాల నిబంధనము ననుసరించి యీ యపరిచితుని సేనామధ్యమునం జేర్చుటకు సంశయించుచున్నాను. కాని యీతని సరళహృదయమును, సుందరవదనమును జూచి యీతనికి నిరాశం గలిగించుటకు మనసు పుట్టుటలేదు. ఇందు నీ యభిప్రాయ మేమి?" అనియెను.

జయం—మహారాజు నభిప్రాయమే నాయభిప్రాయము.

శూర—ఈ బాలకు నొకసారి పరీక్షింపవలయునని నా యుద్దేశము.

ఇంతలో సేనారంగమున మధ్యప్రదేశమంతయును జెల్లాచెదరగుచుండెను. వారికిప్పుడు తగిన సాహాయ్యము లేకుండినచో వ్యూహ

మంతయును భంగమై పోవునట్లుగ నగపడుచుండెను. మహారాజది యంతయుం జూచి యావేగముతో "జయంతా! సేనలు చెదరి పోవుచున్నవి. నీవు కొంత సైన్యముతోఁ బోయి వారికి సాహాయ్యముం గావింపుము" అనియెను.

జయంతుఁడశ్వారూఢుఁడై విద్యుద్వేగముతో వెడలిపోయెను ప్రసాదుఁడు కేవల దర్శకస్వరూపుఁడగు రాజసమీపమున నిలిచి యుద్ధస్థితుల నాలోకించుచుండెను. అప్పటి యుద్ధావస్థం జూచి ప్రసాదుఁడించుక విచారించెను. అజమీరు సేనలంతటను వెనుదిరుగుచునే యుండెను. దక్షిణ పార్శ్వమునం దించుక భయసూచనలుగూడఁ గానవచ్చుచుండెను. సిరోహీ సైనికులందఱును దక్షిణభాగమునం దొకచోఁ జేరుకొని యజమీరు సైనికులను బాఱఁదోలుచుండిరి. ఆ భాగమునందే యాచిన్న పర్వతమున్నది; రాజకుమారి నిలిచి యున్న వృక్షముకూడ నావైపుననే.

ప్రసాదుఁడించుక వ్యస్తహృదయముతో రాజుం గాంచి మహారాజా! ఇంచుమించుగ వేయిమంది శత్రుసైనికులు దక్షిణ భాగమునం గూడుకొనియున్నారు. వారి నడ్డగించుట కచ్చట మన సైనికులైదువందలకంటె నెక్కువగలేరు. మన సేనలను తత్తిమ్మివైచుటయే శత్రుల యుద్దేశమైనట్లు తోఁచుచున్నది. ఆకారణముననే మనలఁ బరా "తులం జేయవలయునని వారియూహ!" అనియెను.

శూరసింహుఁడు విస్మయముతోఁ జూచెను ప్రసాదుఁడు చెప్పినట్లు విపత్సూచకముగనే యుండెను. ఆబాలకుని సూక్ష్మబుద్ధిం జూచి రాజపరిమిత సంతోషమునందెను. కాని, యప్పుడిక మాటాడుట కొంతసి కవకాశములేదు. తోడనే మహారాజన్నూర్గురు సైనికులతో దక్షిణాభిముఖుఁడై వెడలిపోయెను.

దక్షిణమునందలి యాపర్వతమున కించుక దక్షిణమునందొక చిట్టడవియున్నది. అందు శత్రుసైనికులు కొందఱు దాఁగియుండిరి ఆయడవికిఁ బడమటిదిక్కునందొక యున్నతప్రదేశమున్నది. అచ్చటి వృక్షాంతరాళమునందే రాజకుమారి పంచశతసైన్యముచేఁ బరివేష్టి

తేయయి యుండెను. ప్రసాదుఁడు రాజకుమారి నెన్నఁడును జూచి యుఁడలేదు ఇప్పుడే జయంతకుమారున కామె నిలిచియున్న ప్రదేశమును రాజు సంజ్ఞారూపమునఁ బ్రదర్శించియున్నాఁడు ప్రసాదుఁడిప్పుడా వృక్షమువంకఁ దిలకించెను; అంగరక్షక సేనా పరివృతులగు ముగ్గురు బాలకులుమాత్రము కానఁబడుచుండిరి. ప్రసాదుఁడు సంశయచిత్తముతో నించుక సమీపించిచూచెను; తానదివఱకుఁజూచిన పురుషాకారిణి యగు నీల యాతనికంటఁబడియెను; ఇక నాతనికిఁ దక్కిన యా యిరువురి సంగతియును సులభముగనే తెలిసిపోయెను.

రాజకుమారి యించుక వెనుక కొదిగి నిలిచియుండెను. ప్రసాదున కామె యంత స్పష్టముగా నగపడుటలేదు. కాని రాజకుమారి యుద్దేశపూర్వకముగనే వెనుక నిలిచినదని ప్రసాదుఁడుగ్రహించెను. నీలయు, శ్వేతయును నప్పుడు ప్రసాదునివంకఁ జూచుచుండిరి. అంతలో నా చిట్టడవినుండి భయంకరారావము బయలుదేరెను. నూర్గురు శత్రుసైనికులందుండి బయలుదేరి, రాజకుమారిం బరివేష్టించియున్న సైన్యము నాక్రమింపవలయునని సమీపించుచుండిరి. ప్రమత్తులై యున్న యా యంగరక్షకులు వారిచే నాశ్రమింపఁబడి పలాయితులగుటకుఁ బ్రయత్నించుచుండిరి.

అప్పుడు ప్రసాదుఁ డెవ్వరి యనుమతిని గైకొనకుండఁగనే నిమిషములో రాజకుమారియొద్దకుఁ జేరి సేనాకోలాహలధ్వనులను మించిన భీషణగర్జాస్వరముతో "-చోహాన వీరులారా! చక్రాకృతిగ రాజకుమారిని బరివేష్టించియుండుఁడు! నేను వ్యూహాముఖంబున జాగరూకుఁడనై యుండెదను. శత్రుసేన మనలను ముట్టడించినది— అప్రమత్తులరై యుండుఁడు—శత్రువులను లోనికిఁ జొరనీయకుండ రాజకుమారిని సంరక్షించుచుండుఁడు!" అని హెచ్చరించెను.

రాజకుమారి యావృక్షాంతరాళమునందున్నదని శత్రుసైనికు లిదివఱకెఱుంగరు. కొంత యజమీరుసైన్య మచ్చట నిలిచియుండుటచే వారి నాశ్రమి పవలయునని యా యడవిలో దాఁగియుండిరి. ఇప్పుడు కొలదిసైన్యముతో రాజకుమారి యట నున్నదని తెలియు

టచే వారు ద్విగుణోత్సాహముతో నజమీరు సైన్యమును ముట్ట డింపఁదొడఁగిరి.

ప్రసాదుఁడువచ్చి యజమీరుసైన్యమున కుత్సాహముంగల్పించుటను రాజకుమారి చూచి లజ్జావనతవదనయయి నీలంజూచి "నీలా! నే నేల పురుష వేషముతో నిచ్చటకు నచ్చితిని?" అని చెప్పుచుఁ దలపై నున్న యుష్ణీషమును దీసివైచెను. నిబిడ జలదమాలికాసదృశంబగు నామెకుంతలదామము చెదరి కపోలములను, వక్షమునను వ్యాపించి యశ్వేశరీరమును సమావృతముగఁ జేసివైచెను. గులాబి కుసుమమును నిందించుచు, వినీలకుంతల సమాచ్ఛన్నంబగు నామె సుందరవదన మప్పు డాకస్మికముగఁ బ్రసాదుని కన్నులఁ బడియెను. వికసనోన్ముఖంబగు విమలకమలముంబోలి యామెముఖమండలము ప్రసాదుని నయనముల నాకర్షించెను. అతఁ డామె యాకర్ణ విస్ఫారితనయనములఁ గాంచి ముగ్ధుఁడై పోయెను; శత్రువులు, మిత్రులు యుద్ధము, రాజసైన్యము సర్వమును మఱచి తన్నుఁగూడ మఱచి పోయెను; కేవలమనిమిషనయనములతో నాముఖమువంక నేచూచుచు నిలువఁబడిపోయెను. ఉమాబాల యా చూపులను భరింపఁజాలక పులకిత సర్వావయవయయ్యెను. అప్పుడామె విశాలనయనములు తమయంతనే మూఁతలువడిపోయెను. లజ్జచే నామెమనోహరమూర్తి రక్తచందన చర్చితంబగు జపాకుసుమమువలె నైపోయెను.

భీమ వేగముతో శత్రువు లట్టహాసము చేయుచుఁ బైఁబడుచుండిరి. ఆకోలాహలముచేఁ బ్రసాదుని సమాధికి భంగము కలిగెను. అతఁడు శత్రువులపైఁ బడియుఁబడకుండఁగనే యిరువురు శత్రువీరులను దనకరవాలమునకుఁ బ్రథమకబళములుగఁ జేసివైచెను. ఆ బాలకుని యసాధారణఖడ్గవిద్యా కౌశలముంగాంచి యుభయసైనికులును విస్మితులైపోయిరి. అజమీరుసైనికు లానందోత్సాహముతో జయజయధ్వనులం గావించిరి.

అప్పుడొక బలిష్ఠుఁడగు శత్రువీరుఁడు ప్రసాదు నెదుర్కొని యొక భల్లము నాతనిపైఁ బ్రయోగించెను. ప్రసాదుఁ డతిసాహసముతోఁ జకితునివలెఁ దనగుఱ్ఱము నించుక మరలించి యెడమ చేతితో నాభల్లమును లాగికొని దానినే యాతనిపైఁ బ్రయోగించెను. ఆ దెబ్బతో నాతఁడు భూతలపతితుఁడై పోయెను.

అప్పుడు మహాక్రోధముతో సిరోహీసైనికులు ప్రచండవేగమున నజమీరుసైన్యముపైఁబడిరి. ప్రసాదుఁడు సేనాముఖంబున నుండి తనసేనలకుత్సాహముం గల్పించుచుండెను. శత్రులెవ్వరు నాతని యెదుటఁబడుటకు భయపడుచుండిరి. కాని, వెనుకప్రక్కనుండి యాచక్రవ్యూహమును భేదించి కొందఱు శత్రుసైనికులు లోపలఁ బ్రవేశించుచుండిరి. ప్రసాదుఁడు వెనుదిరిగి చూచుటలేదు—ఎదుటనున్న శత్రుసైన్యమును మర్దించుచుండెను. ఆకారణముచే నాతనికి వెనుకవైపు చూచికొనుట కవకాశము లేకుండెను. ఆ సమయమున స్త్రీకంఠమున వెలువడుచున్న యార్తస్వరము లాతనికి వినవచ్చుటచే నాతఁ డదరిపడి వెనుదిరిగిచూచెను. అప్పటికప్పుడే వ్యూహమును భేదించుకొని శత్రుసైనికులు రాజపుత్రికను ముట్టడించుచుండిరి. అప్పుడాతఁ డున్మత్తునివలె నొక్కయుదుటున నావంకకుఁ బరుగెత్తి "తల్లీ! జగజ్జననీ! ఈభయంకర విపత్సమయమున నస్మత్పితృదత్తంబగు నీకృపాణగౌరవమును గాపాడుము!" అని తనలోఁ దానే లోకమాతయగు కాళిని బ్రార్థించుకొనియెను. అప్పుడు నీల యుచ్చస్వరముతో "రాజపుత్రా! మా రాజకుమారిని రక్షింపుము!" అని కేకవైచెను. ఆవెంటనే శ్వేత "మహారాజున కీవార్త నెఱింగించి మాకు రక్షణముం బ్రసాదించునట్లను గ్రహింపుము!" అనియెను. అప్పుడుమాబాల తనలో "ఈతఁడు మమ్ము రక్షించుటకు వచ్చుచున్నాఁడు—ఇఁక నేమి భయము!" అని భావించుకొనియెను.

ఏడవ ప్రకరణము

# కౌశలము

ఐదార్గురు శత్రువీరులు వ్యూహమును భేదించుకొని వచ్చి రాజపుత్రుని ముట్టడించిరి. అందొకఁడు రాజకుమారి యధిరోహించిన గుఱ్ఱము నాక్రమించి దానికల్లెమును బట్టుకొనియెను. శ్వేత యేడువ నారంభించెను. కాని, యుమాబాల నిర్భయముతోఁ దనకృపాణముచే నాతనిహస్తమును ఖండించివైచెను. అప్పు డింకొకవీరుఁడు వచ్చి యామెకరవాలమును బట్టుకొనియెను. అప్పు డెవ్వరో యా వీరునియశ్వమును బదాఘాతముచే భూతలపతితముగఁ జేసివైచిరి. రాజపుత్రి తలయెత్తి చూచెను. ఆతఁ డెవ్వరు ? అసాధారణప్రతిభానిధి యగు నా బాలవీరుఁడే. ఎట్టయెదుటనున్న భువనమోహిని యగునా రాజరాజేశ్వరీమూర్తిని బ్రసాదుఁడు కన్నారఁదిలకించెను— ఒక్కనిమిషము— కేవల మొక్కనిమిషముమాత్ర మిరువురు నొండొరుల సతృష్ణనయనములతోఁ జూచుకొనిరి. ఆచూపులలో నేమున్నదియో యెవ్వ రెఱుఁగుదురు ?— ఇరువురును గూడఁ దమ్ముఁదాము మఱచిపోయిరి.

ఆ సమయమునఁ బ్రసాదునికవచావృతశరీరమున ఖడ్గాఘాతమయ్యెను. అట్లుకొట్టిన శత్రు వీరుఁడానిమిషమునందే ధరాశాయి యయిపోయెను. అంతలో మఱియిరువురువీరులు ప్రసాదు నాక్రమించుకొనిరి. ప్రసాదుఁడు తన యసాధారణ శిక్షాకౌశలముచే నశ్వము నిటునటు దాఁటించుచు శత్రువులొక్కసారిగఁ దనపై బడుట కవకాశము కలుగకుండ వీరవిహారముం గావించుచుండెను. ఈవిధముగ శత్రువులను మర్దించుచు వ్యూహమధ్యమున శత్రునిశ్శేషముం గావించి మరల నభేద్యవ్యూహనిర్మాణముం గావించెను. తరువాత నెప్పటివలె విఫలప్రయత్నంబగు శత్రుసైన్యము నాక్రమించి మర్దించుచుండెను. ఆ భయంకరప్రతాపము — ఆయమానుషఖడ్గ సంచాలనము — ఆనిరుపమాన కౌశలము — ఆయతిలోకమహా

సాహసము — చూచినవారికెల్ల లత్యాశ్చర్యముం గల్పించు చుండెను.

ప్రసాదుని యెదుట శత్రులపై శత్రులు వచ్చి చచ్చిపడిపోవుచుండిరి. కొందఱిచేతులు, కొందఱి మొండెములు, కొందరిగుఱ్ఱములు తెగిపడిపోవుచుండెను. ఆబాలవీరుని దుర్దమనీయప్రతాపము నడ్డగించుట కెవ్వరికిని సామర్థ్యము లేకుండెను. ఆతఁడు సమీపించినచో శత్రువులు పలాయితులగుచుండిరి. క్రమముగ సైనికులెల్లరును భయభ్రాంతులైపోయిరి. కొంతమంది ప్రాణములం దక్కించుకొని పాఱిపోయిరి.

అజమీరుసేనకైనను సామాన్యనష్టము కలుగలేదు. ఆ యయిదువందల యోధులలో సగమునకుఁబైగా నశించిపోయిరి. బ్రదికియున్నవారిలోఁగూడ జాలమందికి గాయములు తగిలెను. ప్రసాదుని దేహమునం దచ్చటచ్చట రక్తము స్రవించుచుండెను. ఆతఁడట్లే శత్రుసైన్యమును దరిమికొట్టుచుండెను. అప్పుడు నీల యాతని వెనుకకుఁబిలిచి "అయ్యా! నీవంటివీరుఁడీ రాజపుత్రస్థానమునం దెన్నఁడును బుట్టియుండలేదు. వీరప్రసవిణియగు నీరాజపుతానాయందు నీవొక్కఁడనే వీరచూడామణివి. నీవు మాకుఁ గావించిన యీయుపకారమును మేమెన్నటికిని మఱవఁజాలము. నీయుపకారమునకు స్మృతిచిహ్నముగ మారాజకుమారి యీయంగుళీయకమును నీకొసంగుటకు వేడుకపడుచున్నది!" అని చెప్పి, నీల రాజకుమారి యుంగరముం దీసి ప్రసాదుని చేతి కిచ్చెను. ఉమాబాల లజ్జావనతవదనయయి చిత్రప్రతిమవలె నిలువఁబడిపోయెను. అప్పుడు నీల ప్రసాదునింగూర్చి "వీరశిరోమణీ! నీవు పలాయితులై పోవుచున్న శత్రువులను వెనుదరుముట మాని రాజపుత్రిసంరక్షణమునకై యిచ్చటనే యుండవలయు నని మారాజకుమారి కోరుచున్నది. ఏమనియెదవు?" అని పలికెను.

ఆసమయమున సమీపరణక్షేత్రమునఁ గోలాహలధ్వనులు వినవచ్చెను. అందఱును దిరిగిచూచిరి. సమీపమునందలి పర్వత

సానుప్రదేశమునం దజమీరుప్రభు వేడువందలసైన్యముతో వేయి మంది శత్రుసైనికులతోఁ దలపడి పోరాడుచుండెను. అచ్చట నేదియో యనర్థము కలిగినది. రాజకుమారి నిలిచిన చోటికి కారణ రంగమెంతయో దూరము లేదు. ఆ భయసూచక హాహాకారములు తమసేనల లోనే బయలుదేరుచున్నట్లు వారికి స్పష్టముగ బోధపడుచుండెను. అప్పుడు రాజకుమారి యజ్ఞాతభయభ్రాంతయై యతివ్యాకులభావముతోఁ బ్రసాదునిం జూచి "ఆర్యా! ఇప్పుడు నాజనకుఁడు భయంకరవిపదాపన్నుఁడై యున్నాఁడు! దయామతి వగునీ వాతనికి సాహాయ్యముం గావింపుము!" అని వేఁడుకొనియెను.

ప్రసా——నిన్నిట్టి యసహాయస్థితియందుంచి వెడలిపోవుటకు నామన సొప్పకున్నది.

ఉమా——ఈసమీపమునందే యొకనిరపాయస్థలంబున నీకెదురుగనే మేము నిలిచియుండెదము నీవు నిశ్చింతుఁడవై పోయి మాతండ్రికి దోడ్పడుము.

ప్రసాదుఁడప్పుడొకపదియునుండి యాశ్వికులను మాత్రము వెంటఁబెట్టుకొని యప్రతిహతవేగముతో రాజసాహాయ్యమునకుఁ బోయెను అప్పటి కజమీరు ప్రభువు నిజముగ విపద్గ్రస్తుడే యయి యుండెను. ఆతఁడు తన యదమ్యశక్తి సాహసములపై నాధారపడి యేకాకిగ శత్రువ్యూహమధ్యమునకుఁ బ్రవేశించెను ఆతని రక్షణమునకై రాజసైనికులు గూడ వెంటబడిరిగాని శత్రుప్రతాపమునకుఁ జెదరిపోయిరి. కేవలమును గొందఱుయోధులు మాత్రమే యాతనికి సహాయులై పోయిరి. కొలఁది సేపటిలోనే వారందఱును బడిపోయిరి. ఆకారణముచే నేకాకి యగురాజును బట్టిబంధింపవలయునని శత్రువులు ద్విగుణోత్సాహముతో ముట్టడించి యుండిరి. అందుచేతనే యజమీరు సైన్యమున హాహాకారములు బయలువెడలెను. అప్పుడు ప్రాణములకుఁ దెగించి యజమీరు వీరులు రాజరక్షణమునకై ప్రయత్నించుచుండిరి గాని యొక్కొక్కరుగ శత్రుకరవాలముల కాహుతియైపోవుచుండిరి అసిఘాతములనుండి యతితరముగ రక్తము

పరివహించిపోవుచుండుటచే మహారాజు శూరసింహుఁడు ప్రసన్నుఁడై పోవుచుండెను. అప్పుడు ప్రసాదుఁడు సింహనాదముతో ఖడ్గమును త్రిప్పుచు శత్రువ్యూహమును జించుకొని సేనామధ్యమునఁ బ్రవేశించెను. అజమీరు సైనికులలోఁ జాలమంది యాతని వెనుకనే వచ్చి రాజపార్శ్వమున నిలిచి శత్రుచ్ఛేదనముఁ గావించుచుండిరి. అప్పుడెందఱో శత్రువీరులు ప్రసాదుని కృపాణమునకు బలియయిపోయిరి. ఎవ్వరు నాతని నెదిరింపఁజాలకుండిరి. అయిదారుగురు మహావీరులు మాత్రము తమయద్భుతాశ్వశిక్షాకౌశలముం జూపుచు నాతని నాక్రమింపఁజూచిరిగాని వారి ప్రయత్నము విఫలమైపోయెను. ప్రసాదుని సుందరాశ్వమారణరంగమున విచ్చలవిడిగ వీరవిహారము సేయఁ దొడంగెను. ఆతనితరవారి యవలీలగ శత్రుమస్తకములఁ జెండాడ నారంభించెను. ఆకృపాణ మెప్పుడెవ్వరితలపైఁ బడుచున్నదో యెవ్వరికిని దెలియుట లేదు. ఆతనియద్భుత వీరవిహారమును నుభయసైనికులును విస్మితులైపోయిరి, స్తంభితులైపోయిరి. అప్పుడు మహారాజగు శూరసింహుఁడు "నేను పూర్వమునం దొకప్పుడిట్టి ఖడ్గసాధననైపుణ్యమునే — ఇట్టి యసాధారణకౌశలమునే — ఇట్టి యతిలోకవీరత్వమునే — కన్నులారఁజూచి యుంటిని. అవి యిప్పటికిఁ జాల దినములనాఁటి మాటలు!" అని భావించుకొనియెను.

ప్రసాదుని యెదుటఁ జాలదూరమువఱకును శత్రుసైన్యము లేదు. ఆతని ప్రతాపమునకు భయపడి యవనులు పలాయితులైపోవుచుండిరి. అప్పుడొక శత్రువీరుఁడు ప్రసాదుని లక్ష్యముచేసి యొకభల్లమును విసరెను. అది యాతనికిఁ దగులక యాతని యశ్వమస్తకమును భేదించివైచెను. ప్రసాదుఁడు దారుణఘాతముచేఁ గూలఁబడి పోవుచున్న గుఱ్ఱమునుండి యొక్కయుదుటునఁ గ్రిందికి లంఘించి యాప్రతియోధుని మస్తకమును ఖండించి పడఁద్రోసి తా నాతనియశ్వము నధిరోహించెను. ఆతని శీఘ్రకారిత్వమున కధికాశ్చర్యము నొందుచు నజమీరుసైనికులు సముత్సాహముతో "కాళీమాతకు జయ! మహారాజునకు జయ!" అని జయకీర్తనములు గావింప నారంభించిరి.

ఉమాబాల సహచరీపరివృతయయి కొలఁది దూరమునందే యుండి యాయద్భుత వీరవిహారముం గాంచుచునే యుండెను. ఆమె యప్పుడు సంతోషముతో నీలం జూచి "నీలా! ఏమనియెదవు ?" అని ప్రశ్నించెను.

నీల — సఖీ ! మానవులలో నెందును నింతటి వీర శిరోమణు లుండుట యసంభవము ! ఈతఁడు దేవతామూర్తియేమో యని సంశయము కలుగుచున్నది !

అజమీరుసైనికు లప్పుడు ప్రసాదునిచేఁ బ్రోత్సహింపఁబడి తమయపహృతస్థానమును మరల నాక్రమించుకొనుటకుఁ బ్రయ త్నింప నారంభించిరి. శూరసింహుఁడు సేనాసమన్వితుఁడై మరల శత్రువుల నెదిరించెను. సైనికులందఱును రణోపయుక్తస్థానమును బడయఁగలిగిరి. అప్పుడు ప్రసాదుఁడు రణరంగమంతటను గలయఁ జూచెను. సిరోహీ సైన్యము పాఱిపోవుచునేయుండెను. గాని, యా సేన తమసేనకంటె నధికముగనే యుండెను. వారికి మరల నేదియ యిన సాహాయ్యములభియించి మరల వారు పైఁబడినచోఁ గొలఁదిగ నున్న యీసేనతో వారిని నిర్జించుట యసంభవము. సమీపము నందే జయంతకుమారుఁడు సమాన శత్రుసైన్యముతోఁ బోరాడుచు నాత్మరక్షణముం గావించుకొనుచుండెను. ఆతఁడు తమకు సాహాయ్య ముం గావించుటను నాశలేదు. ఉత్తరభాగమున శత్రువులకు భయపడి యజమీరుసేనలు పాఱిపోవుచుండెను. వారి కించుక సాహాయ్యము చేయవలసియుండెను. ప్రసాదున కించుక విచారము కలిగెను. ఎచ్చట జూచినను దమసేనలకే పరాజయము కలుగునట్లు సూచన లగపడు చుండెను. శత్రుసేనయుఁ దమసేనయు సమానముగనే యుండెను గాని శత్రువులవ్యూహరచనయు, వారిస్థితిగతులును నిరపాయములై యుం డెను. యుద్ధము ప్రబలమైన చోటికెల్ల సేనలువచ్చి పడుటకనుకూల ముగ వారు నిలిచియుండిరి.

వ్యూహమునకు వెలుపలఁ గొంతమంది యజమీరు సైనికులు నిలిచియుండిరి. వారికి యుద్ధమునం జేరుకొనుట కవకాశమే లభి

యుంచుటలేదు. ప్రసాదుఁ డచ్చటికిఁబోయి యందొక యోధునింబిలిచి "ఈ యుద్ధమున ఫలాఫలము లెట్లుండునో నీవేమైన నూహించితివా?" అని ప్రశ్నించెను.

యోధు—మాకే జయము లభియించును.

ప్రసా—పొరపాటు పడుచున్నావు—ఆ యుత్తరము వైపు చూచితివా?

యోధు—అదియేమి? మా సేనలే పాఱిపోవుచున్న వే!

ప్రసా—రణరంగమునం దంతట నట్లె జరగుచున్నది.

యోధు—ఔను నిజమే! ఇఁక నుపాయ మేమి?

ప్రసా—ఉపాయమున్నది. నీవు నాతోరమ్ము!

శతాధికమగు నశ్వసైన్యము ప్రసాదుని వెంబడించి బయలు దేరెను అజమీరుప్రభువు యుద్ధముచేయుచున్న కొండకు దక్షిణమున నొక చిన్న యరణ్యమున్నట్లు పాఠకులకుఁ దెలిసియేయున్నది. ప్రసాదుఁడాచిట్టడవిని జుట్టువచ్చి భీమవేగముతో సిరోహీసేనలను వెనుకనుండి యాక్రమించెను. ఎదుట శూరసింహుఁడును వెనుకఁ బ్రసాదుఁడును విజృంభించుటచే నడుమనున్న శత్రుసేనలు నిలువఁ జాలకపోయెను. శూరసింహుఁడు పలాయితు లగుచున్న శత్రువులను వెన్నంటి తఱుముచుండెను. ప్రసాదుఁడప్పుడు కొంతసైన్యముతో జయంతకుమారునకుఁ దోడుపడియెను. అప్పటికప్పుడే జయంతుఁ డసహాయుఁడై శాత్రవ ప్రతాపమును సైరింపఁజాలని సేనలతో వెనుకకొదుగుచుండెను. ఆ సమయమునఁ బ్రసాదుఁడొక వంక శత్రుసేనల నాక్రమించెను. ప్రసాదుని కరవాలముఖంబున శత్రువులపై శత్రువులు స్వర్గస్థులైపోవుచుండిరి. శత్రువు లించుక చలించిరిగాని, మరల నాకస్మికముగ ధైర్యము తెచ్చుకొని ద్విగుణీకృతసాహసులై యొక్కసారిగ నందఱు నాతనిపైఁ బడిరి. ప్రసాదుఁడు ప్రాణముల కాసింపక యతిసాహసముతో శత్రు ప్రతారణముం గావించుచుండెను; కాని, క్రమముగా నాతని కాయాసమధికమయ్యెను. హస్తబలమవసన్నమైపోయెను; శత్రుకృపాణా

ఘాతములచే నాతని కవచ మచ్చటచ్చట భిన్నమైపోయెను. ఆతని సర్వాంగకములును రక్తప్లావితము లైపోయెను. ఇఁక నాతనిచేయి సాగుట లేదు ; కన్నులు తెఱవఁబడుట లేదు ; మెడపైఁ దల స్థిరముగ నిలుచుటలేదు—మహావీరుఁడగు ప్రసాదుఁడు మహారణరంగ మధ్యమునం దాకస్మికముగ నవసన్నుఁడై యశ్వమునుండి క్రిందఁ బడిపోయెను.

---

ఎనిమిదవ ప్రకరణము.

# దేవలుఁడు

ఇప్పటి కెనిమిదిమాసము లయ్యెను. ప్రేమమయదివ్యమూర్తి యగు దేవలు నొంటిగ విడిచి వచ్చితిమి. ఆతని సంగతి తెలిసికొనకుండుట మనకు ధర్మము కాదు. ఆనాఁడు దేవలుడు తనతండ్రి దర్శనమునకుఁ బోయిన యన్నకొఱకు నిరీక్షించుచుండఁగా వైద్యుఁడు వచ్చి యాతని గాయములకు మందువేయఁబోయెను. దేవలుఁ డాతని వారించి ముందుగ జనార్దనుని బరీక్షింపవలయునని యభ్యర్థించెను. వైద్యుఁ డెన్నియోవిధముల జనార్దనుని సర్వశరీరమును బరీక్షించెను. జనార్దనున కింకను బ్రాణములు పోయినట్లు లేదు. అందుచే వైద్యుఁ డాతని గాయములకుఁ గట్టుకట్టి నానావిధములనుండి యేదియో మందును బ్రయోగించెను ; కొన్ని యౌషధబిందువులను నోటిలోఁ బోసెను ; ఇంకను నేమేమియో చేసెను ; క్రమముగా నిశ్వాసప్రశ్వాసములు వెడల నారంభించెను. కాని, యింకను సంపూర్ణముగఁ జైతన్యము కలుగలేదు. ఆతనికి విశేషజ్వరము వచ్చెను ; క్రమముగా వికారప్రలాపములుకూడ బయలుదేరెను. అప్పు డాతని నొకగదిలోఁ బర్యంకముపై శయనింపఁజేసి దేవలుఁ డాతని సంరక్షణమున కొక పరిచారకుని నియమించెను ; పరిచారకుఁడును దానును వైద్యుఁడును దక్క నితరు లెవ్వరు నాయింటిలోనికిఁ బోకుండ నేర్పాటుచేయించెను.

దేవలుఁడు యువరాజుకొఱకు మధ్యాహ్నమువఱకును నిరీక్షించెను. కాని, మరల నాతని జాడయేలేదు ; తరువాత నాతని సమాచారముం దెలిసికొని రమ్మని దేవలుఁ డొక సేవకుని రాజమందిరమునకు బంపించెను. కొలఁదిసేపటిలో నాసేవకుఁ డంతయుందెలిసికొని వచ్చి "రాజకుమారా! యువరాజు రాజమందిరమునకు వచ్చిన మాట నిజమే—కాని యాతఁ డప్పుడే యటనుండి వెడలిపోయినాఁడఁట!" అని మనవి చేసెను

తరువాత దేవలుఁడు తన ప్రాణసోదరునికొఱకు నగరమందంతటను వెదకించెను. ఆతఁ డెచ్చటను నగపడలేదు. అందుచే దేవలుఁడు హతాశుఁడై దుఃఖముతో మంచముపై బడిపోయెను. మఱునాఁడాతఁ డున్మత్తునివలెఁ దండ్రియొద్దకుఁబోయి యాతనిపాదములపై బడి భ్రాతృభిక్షముం గటాక్షింపుమని యెన్నియోవిధములఁ బ్రార్థించెను. అనంతరాముని వజ్రకర్కశహృదయము వేఁడికన్నీటిచేఁ గరఁగునది కాదు ; ఆతని హృదయమునం దప్పుడు దయకు మాఱుగా హాలాహలము ప్రజ్వలించెను. అందుచే నాతఁడు దుఃఖించుచున్న తన కుమారుని బాదములతోఁదన్ని గెంటివైచెను.

ఆ భ్రాతృవియోగదుఃఖముచే దేవలుఁడు మంచము పట్టెను. ఆతని గాయములు రేఁగి రక్తమును జిమ్ముచుండెను. జ్వరము వికారము, ప్రలాపములు—ఆతని సుకుమార శరీరమును గమలించివైచుచుండెను. ఆతఁడు తేలివచ్చినప్పుడును, స్మృతితప్పినప్పుడును గన్నుమూసినప్పుడును, గలగన్నప్పుడును, సోదరుని గూర్చియే ప్రలపించుచుండెను

క్రమముగా దేవలునకు జీవిత సంశయావస్థ తటస్థించెను. అప్పుడనంతరాముఁడు పుత్రునిం జూడవచ్చెను. శుష్కకుసుమ సన్నిభంబగు కుమారుని సుందరవదనముంగాంచి యనంతరాముఁడు దుఃఖపరితప్తహృదయముతో వైద్యునిం జూచి "అయ్యా! నాబిడ్డ బ్రదుకుట కేమైన నాశయున్నదా?" అని యడిగెను.

వైద్యా—సంశయముగనే యున్నది. కాని యువరాజ దర్శనము లభియించినచో నీ కుమారున కారోగ్యము కలుగఁగలదు.

ఇంకను యువరాజుమాటయేనా? అనంతరాముఁడు విరక్తుఁడై మొగము మరలించుకొనియెను ; కొంతసేపైనతరువాత మరల నొకసారి కుమారునివంకఁ జూచెను. అప్పటికా దేవలుని సుందరవదనకమలము పవిత్రమందహాస వికసితమైయుండెను. దేవలుఁ డల్లే నవ్వుచు, "సోదరా! నీకంటె నీరాణియే చక్కనిదిసుమా!" అని కలవరించెను. మరల నాతనిపేరేనా ? ఏమైనను సహింపవచ్చును; గాని యాతనినామము—ఆతనిమాట—మాత్రము విని సహించుట చాల దుర్భరము! అనంతరాముఁడు మహావిరక్తుఁడై యాగదినుండి వెడలిపోయెను.

దేవలుఁ డప్పుడు కలగనుచుండెను. ఆ కలలో నాతఁడును సోదరుఁడును గలసి యంధకారావృతంబును, నుత్తుంగతరంగసంచలితంబును నగు నొకగదియం దీఁదికొనుచుఁ బ్రబల ప్రవాహములఁ జిమ్ముకొనుచుఁ దేలిపోవుచుండిరి—క్రిందిభాగమున నీలజలప్రవాహము—పైభాగమున నీలజలదావృతం బగు నీలాకాశము—దశదిశల నీలవాయుసమూహము—మేఘము గర్జించుచుండెను; వాయుతరంగములును ధ్వనించుచుండెను—ఇరువురును మునిఁగిపోయిరి. అప్పు డాకస్మికముగ జలములపైనుండి యెవ్వరో వారిహస్తములను బట్టుకొన్నట్లయ్యెను. చూచుట కేమియును లేదు ; వినుట కేమియును లేదు ; కేవల మంధకారబంధురము. అన్నదమ్ము లిరువురు నాతఁడు దీసికొనిపోయినట్లెల్లఁ బోవుచుండిరి. క్రమముగాఁ గొంత సేపటికి వెలుతు రగపడియెను ; క్రమముగా నది వర్ధిల్లుచుండెను ; తుట్టతుదకు శతకోటిరవి ప్రతిభాసమానమై కన్నుల మిఱుమిట్లు గొలుపఁజొచ్చెను. అన్నదమ్ము లిరువురు నాశ్చర్యముతోఁ గాంచిరి. ఆకాంతి సూర్యచంద్రులవలనఁ గలిగినది కాదు దీపమాలికలవలనఁ బ్రభవించినది కాదు ఆ దివ్య తేజము నవరత్న

ఖచిత సింహాసనారూఢయు, త్రిలోకసుందరియు, భువన మోహినియు నగునొక రమణీమణి వదనమండలమునుండి ప్రసరించుచుండెను.

అప్పుడా దేవీమూర్తి యా యిరువురు సోదరులను సమీపించి "భవానీప్రసాదా! నేను నిన్నుఁ బెండ్లియాడెదను; ఈ నిమిషమునుండియే నీవు నా ప్రాణనాథుఁడవు" అనియెను.

"దేవీ! నీవెవ్వరు?" అని భవానీప్రసాదు ప్రశ్నించెను.

"నా పేరు భాగ్యము" అని దేవి బదులుచెప్పెను.

అప్పుడా యిరువురు నొండొరుల పాణిగ్రహణములం గావించుకొనిరి; ఇరువురును మందహాసవదనములతో నా రత్నసింహాసనము నలంకరించిరి. ఆ యిరువురను జూచి దేవలుఁ డానంద మందహాసముతో "సోదరా! నీకంటె నీ రాణియే చక్కనిది సుమా! పురుషకారము నీవు—భాగ్యము నీరాణి" అని పలుకునంతలో నాసుఖస్వప్న మదృశ్యమై పోయెను.

దేవలుఁడు మఱియొక కల గనియెను!—అన్నదమ్ము లిరువురును మహారణ్యమునకు వేటకుఁ బోయిరి. అందొక మహామృగముం గాంచి యిరువురును దానిని వెంబడించి నదీనద పర్వతముల నుత్తరించి చాలదూరము వఱకును బోయిరి. అట్లు వారెన్నఁడు నెఱుంగని తావునఁ బ్రవేశించునంతలో నామృగ మొక పెద్ద తరుకోటరమునఁ బ్రవేశించి మాయమయ్యెను. ఇరువురు నావృక్షమును భేదించి యా మృగశృంగములం గాంచి వానింబట్టుకొని యా మృగమును బయటికీడ్చిరి. అప్పుడా మృగ మార్తస్వరముతో "దయాళులారా! నన్నుఁ జంపవలదు— నేను మీ పాదముల నాశ్రయించితిని" అని వేడుకొనియెను.

భవానీప్రసాదు—నీవెవ్వరు?

మృగ—నేను లక్ష్యమును—నేను సాధనమును—నేను ధర్మమును—

భవా—నీ వాశ్రయించిన యీవృక్ష మెవ్వరు?

మృగ—ఇది జ్ఞానము.

అనునంతలో దేవలుఁడు శయ్యనుండి గుభాలున దూలి తీవ్ర స్వరముతో "ఇది యంతయు నసత్యము! నాసోదరుఁడే నా లక్ష్యము! నా సోదరుఁడే నా సాధనము! నా సోదరుఁడే నా ధర్మము నా సోదరుఁడే నా జ్ఞానము" అని పలుకునంతలో నాతనికి స్వప్న భంగమయ్యెను. దేవలుఁడాయాసముచేఁ బర్యంకమునఁ గొట్టు కొనుచుఁ తుదకు నిద్రించెను.

ఈ విధముగా మూఁడు నెలలు గడచెను. దేవలునకీ గండము గడచినది. క్రమముగా నారోగ్యము కలుగుచుండెను; కాని యిం కను మసలుటకు శక్తి లేదు. ఒకనాఁటి సాయంకాలమునం దాతఁడు మెల్లగఁ గఱ్ఱ నూఁతచేసికొని గవాక్షమునొద్ద నిలువఁబడియెను. అంతలో జనార్దనుఁడు వెనుకనుండి వచ్చి "కుమారా!" అని పలుక రించెను.

దేవలుఁడు తిరిగి చూచి "జనార్దనా! నీవే వచ్చితివా? నేను నీకొఱకు నిరీక్షించుచున్నాను. చాలసేపటినుండి యన్నగారి మాటలు చెప్పుకొని సుఖించుట కవకాశము కలుగుటలేదు.

జనా—కుమారా! నేనిప్పుడు నీయొద్ద సెలవుఁ గైకొను టకై వచ్చియుంటిని.

దేవలుఁడు నిశ్చేష్టితుఁడై నిలువఁబడి పోయెను.

జనా—కుమారా! ఆలోచించి చూడుము! ఎన్నిదినము లిట్లుండిన నేమిలాభము? దినములపై దినములు గడచుచున్నవి. కాని, యువరాజు జాడ యించుకంతయును దెలియుటలేదు. ఇఁక నేను ధైర్యమువహించి యుండఁజాలను. ఈసంగతి నీతోఁ జెప్పు టకేఁ వచ్చితిని. నాకు సెలవిమ్ము,

దేవలుఁడు కన్నీటితో "జనార్దనా! నీకింకను శక్తి చేరు కొనలేదు. గుఱ్ఱము నెక్కుటకైనను నీ కోపికలేదు. ఇట్టి స్థితిలో నిన్నొంటిగ నే నెట్లు విడువఁగలుగుదును?

జనా—కుమారా! యువరాజును విడిచిన యీ జీవితముతో ప్రయోజన మేమున్నది? ఆతని వెదకికొనుచుఁ బోయెదను. ఆవిధ

ముగా మరణించినను నాకు సుఖముగనే యుండును ; కాని, రేయుంబవలీవిచారము ననుభవింపఁజాలను.

దేవ—జనార్దనా! నాకు నీవొక్కఁడవే మా యన్నగారి స్మృతి చిహ్నమవై యున్నావు. నిన్నుఁ జూచినతోడనే నా సోదరుని చరిత్రము తలఁపునకు వచ్చును; నిన్ను స్పృశియించినచో మాయన్న జ్ఞప్తికి వచ్చును. నీమాట విన్నచో మాయన్న ప్రియవచనములు హృదయరంగమున జాగరితములగును. నేను మా యన్నవలెఁ బ్రేమింపఁజాలను. మా యన్నవలె భాషింపఁజాలను. సర్వకాలముల యందును మాయన్న నన్ను దలఁచుకొనుచుండును; ప్రేమించుచుండును నీవుకూడ లేకున్నచో నాకు నాసోదరుని యమృతకంఠస్వరము తలఁపునకురాదు. ఆతని మధుర మందహాసవదనము మనోనయనములకు గోచరింపదు నాకింకేమున్నది? జనార్దనా! నీవుపోయినచో నేను మా యన్ననే మఱచిపోవుదును! నే నా కష్టమును సహింపఁగలనా?

జనా—కుమారా! నీవా విషయమున నిశ్చితుఁడవై యుండుము. మీయన్న యాదరము నొక్కసారి యనుభవించిన వారెవ్వరును దమ జీవితకాలమున నాతని మఱవఁజాలరు నేను పోయెదను. కుమారా! నేను యువరాజును జూడఁగలిగినచో మరల నిన్ను దర్శించెదను. లేకున్నచో నీ జీవితమున నీకును నాకును మఱిచూపులు లేవు.

అని చెప్పి జనార్దనుఁడు వెడలిపోయెను. చీఁకటిపడియెను. సేవకుఁడు వచ్చి తలుపులుమూసి దీపమును వెలిఁగించెను. కాని, దేవలుఁడుమాత్రము తదేకధ్యానముతో నచ్చటనే నిలువఁబడిపోయెను.

---

తొమ్మిదవ ప్రకరణము.

# నీ వెవ్వరు ?

రణరంగమునఁ బ్రసాదుఁడు గుఱ్ఱమునుండి పడిపోయిన తోడనే యెవ్వఁడో యొకపురుషుఁ డాతని నెత్తికొని శత్రుసైన్యమును భేదించుకొని యొక్కనిమిషములో గుఱ్ఱముతోఁగూడ నదృశ్యుఁడై పోయెను; తరువాత నదీపులినతలంబున నాతనిం బరుండఁజేసి యాతని గాయములపై శీతలజలంబులఁ జిలుకరించుచుండెను. శరీరమంతటను గాయములున్నవి గాని; యవి యంతటి యపాయకరములు గావు. అతిపరిశ్రమచేతను రక్తక్షయముచేతను బ్రసాదునకు స్మృతి తప్పిపోయినది.

అజమీరుసేనలు పరాజయముంగాంచి పలాయితములయ్యెను. విజయులగు సిరోహీసైనికులశ్వారూఢులై వారిని వెన్నంటి తరుముచుండిరి అప్పు డజమీరుప్రభువు సేనలతోఁగూడ యోహానామీరుదుర్గము నాశ్రయించెను రాజకుమారికయగు సుమాబాలకూడఁ దన చెలులతో నాదుర్గమునందే యుండవలసినదయ్యెను.

ప్రసాదుని వెంటఁబెట్టుకొనిపోయిన పురుషుఁడుకూడఁ బలాయమానంబగు నా సేనాప్రవాహముతోఁ గలసి యోహానామీరు దుర్గమునందే ప్రవేశించెను. ప్రసాదుని శరీర మచ్చట నాతనియొడిలోనే సంరక్షింపఁబడుచుండెను. ప్రసాదునకుఁ దెలివి వచ్చినతరువాత నాతఁడు తానొక ప్రస్తర నిర్మితంబగు చిన్నగదిలో నొక సామాన్యశయ్యపైఁ బరుండియున్నట్లు గ్రహించుకొనియెను. ఆ యింట దీపము వెలుఁగుచుండెను. ఆ నిశ్శబ్దంబగు రాత్రిసమయమునం దప్పుడప్పుడు ప్రహరీకంఠ స్వరములు మాత్రము వినవచ్చుచుండెను; అప్పుడు ప్రసాదుఁడు తనలో "నేనిచ్చట నుంటినేమి ? నన్నిచ్చటికిఁ దీసికొనివచ్చిన వారెవ్వరు ? శత్రువు లేమైరి? రాజకుమారి యేమైపోయినది ?" అని భావించుకొని యాకస్మికముగ

శయ్యనుండి చటాలున లేచెను; క్రింద నెవ్వరో కూర్చుండియుండిరి. అప్పుడు ప్రసాదుఁడు "నీ వెవ్వరు?" అని ప్రశ్నించెను. అంతలో నావ్యక్తి లేచి నిలువఁబడియెను. ప్రసాదుఁడు విస్మితుఁడై పోయెను; ఆవ్యక్తి దుఃఖించుచున్నట్లగపడియెను. ప్రసాదుఁ డావ్యక్తి యొూ పాదమస్తకమును బాగుగఁ బరీక్షించి మృదులస్వరముతో 'నీ వెవ్వరివైన నేమి? నీవు నిస్సంశయముగ నా యొద్దకురమ్ము! నీవు నాకుఁ బూర్వస్మృతిని గలిగించి యానందింపఁ జేయుచున్నావు! నీవంటివాఁడే యొకఁ డొకప్పుడు నన్నుఁ బ్రాణమువలెఁ బ్రేమించుచుండెడివాఁడు; నీవంటివాఁడే యొకఁడు నాకొఱకుఁ బ్రాణములనుగూడ వదలి వైచినాఁడు" అనియెను.

వ్యక్తి—అతఁ డెవ్వఁడు యువరాజా?

ప్రసా—ఏమిది!—అతని కంఠస్వరముకూడ నీ కెట్లు వచ్చినది? నీ వెవ్వఁడవైన నేమి? ఈ యానందస్వరముతోనే మరల మరల నాతోడ మాటలాడుము! ఈవిధముగనే నా కన్నులయెదుట నిలువఁబడి కన్నాఱ నావంకఁ గాంచుచు దుఃఖఁపుము! చాలదినములనుండి యా రూపము తలఁపునఁ బడుటలేదు; ఆ మధురకంఠస్వరము చెవులఁబడుట లేదు; చాలదినము లైపోయెను; ఆ ప్రేమమయవదనమండలము నా కంటికి దూరమైపోయినది.

వ్యక్తి—అతఁ డెవ్వఁడు యువరాజా?

ప్రసా—అతఁడు నా స్మృతి! అతఁడు నా తండ్రి; అతఁడు నా బంధుఁడు; అతఁడు నా సోదరుఁడు; జనార్దనుఁడే లభియించినచో—

వ్యక్తి—లభియించినచో నేమి చేయుదువు?

ప్రసా—ఏమి చేయుదునో భావింపనైనఁజాలను; మానవ భాషణములయందు దా భావమును సూచించుమాటలు లేవు.

అప్పు డావ్యక్తి దుఃఖగద్గద స్వరముతో "యువరాజా! నిరంతరము నీ తలఁపునందుండుటచే సౌభాగ్యవంతుఁడగు జనార్దనుఁడు వీఁడే!" అనియెను.

ప్రసా.—తెలిసినది! నీ వాతని ప్రేతస్వరూపమవు. నీవు మరణించినను నన్ను విడువఁజాలకుంటివి! నాప్రియమైన జనార్దనుని ప్రేతాత్మా! నాచెంతకురమ్ము! నన్నొకసారి కౌఁగలించుకొనుము! నీ వాతని యాత్మవైనను,—గాక వంచకుఁడగు శాత్రవుఁడవైనను సరియే—ఆతనిరూపముం దాల్చి యాతని కంఠస్వరమును వహియించుటచే నీవు నా కెల్లవిధములఁ బ్రియతముఁడవు; రమ్ము; నన్నొకసారి కౌఁగలించుకొనుము!

జనా.—యువరాజా! నేను ప్రేతాత్మను గాను. ప్రవంచకుఁడను గాను—నిజముగ నీ భృత్యుఁడనగు జనార్దనుఁడనే—

ప్రసాదుఁడు హర్షపులకిత శరీరుఁడై విస్మయము వికసిత నయనములతో జనార్దనుని గనుఁగొనుచుండెను. జనార్దనుఁడు ప్రేమవేగముతోఁ జటాలునఁబోయి ప్రసాదుని గౌఁగలించుకొని దుఃఖించుచు "కుమారా! నాకు భార్యలేదు; బిడ్డలు లేరు; ఈప్రపంచమునందు నా కేమియునులేదు. నాకు భార్యయయినను, బిడ్డయయినను నీవే, నీవే నాసర్వమవు; నీవే నా సర్వేశ్వరుఁడవు నిన్ను విడిచి జనార్దనుఁడు మరణింపనైనఁ జాలఁడు—అంతటి ప్రబలాఘాతము లైనను జావలేకపోయితిని—మరల నీదర్శనమునకే వెదకికొనుచు వచ్చితిని!" అనియెను.

తరువాత జనార్దనుఁడు తాను బ్రదికిన సంగతియును, దనవలెనే మరణించుటకు సిద్ధమయిన దేవలుఁడు జీవించిన సంగతియును భ్రాతృవియోగమును సహింపఁజాలక దేవలుఁడు సోదరాన్వేషణమునకై భృత్యుల సకలదిక్కులకుం బంపిన సంగతియును విస్పష్టముగఁ దెలిపి "యువరాజా! మూడుమాసములనుండి నిన్ను వెదకుచు నెన్నియో దేశములు తిరిగితిరిగి తుద కజమీరునకు వచ్చితిని; ఈప్రాంతమున యుద్ధము జరగుచున్నట్లు తెలియవచ్చినది. యుద్ధ మెచ్చట జరగుచున్నదో యచ్చట నీవుందువని భావించి రణక్షేత్రమునకు వచ్చితిని. రణరంగమున నిన్నుఁ గనిపట్టుటకై విశేషముగ శ్రమపడవలసిన యావశ్యకము లేకపోయినది, యుద్ధరంగము

నందలి శత్రువుల కన్నులును, మిత్రులకన్నులును నీ మీఁదనే యుం డెను. రణస్థలంబున వీరవిహారముం జేయుచున్న నిన్నుఁ జూచిన తోడనే స్వర్గస్థుఁడగు మీ జనకుఁడు వీరేంద్రకేసరి మూఁడుమూర్తు లను నా కన్నులఁ గట్టినట్లగపడియెను. యుద్ధసమయమున నెట్లయిన నిన్నుఁ గలిసికొనవలయునని ప్రయత్నించితినిగాని మహాసమరసంకుల సంరంభమును సహించి సేనామధ్యమునఁ బ్రవేశింపఁ జాలకపోయి తిని. నీవు జయంతకుమారునకుఁ దోడుపడఁబోవు సమయమున నా కించుక యవకాశము దొరకుటచే నప్పుడు నేను నిన్ను వెంబడింపఁ గలిగితిని. తరువాత — తరువాత నేమున్నది ? నీవును నేను నిచ్చట మాటలాడుకొనుట తటస్థించినది — పూర్వ మొకప్పుడు నేను నీతో నొక యసత్యమును జెప్పితిని. ఆ సంగతి నిప్పుడు నీకువిస్పష్టముగఁ దెలుపుట నావిధాయకధర్మమై యున్నది!" అనియెను.

ప్రసా — జనార్దనా! నీ వసత్యమేమి చెప్పితివి?

జనా — సుధామందిరమునం దొకనాఁటి యర్ధరాత్రమునఁ జోరు లాక్రమించిన సంగతి నీకు జ్ఞప్తియందున్నదా?

ప్రసా — లేకేమి ? ఆసంగతి నాశరీరమున లిఖయింపఁబడియే యున్నది.

జనా — మనల నప్పు డాక్రమించినవారు దొంగలుకారు.

ప్రసా — ఆ సంగతి నేనును గ్రహించితిని —

జనా — ఎప్పుడు?

ప్రసా — నగర పరిత్యాగమునకుఁ దరువాత —

జనా — ఎట్లు గ్రహించితివి ?

ప్రసా — వారు చాలదూరము వఱకును నన్నుఁ వెంబడించి వచ్చిరి.

జనా — తరువాత నేమి జరిగినది ?

ప్రసా — నేనందుఁ జాలమందిని నిశితశరాఘాతములచే సంహ రించి వైచితిని. మూర్ఛితుఁడై పడిపోయిన యొక్కనివలన నాకెల్ల సంగతులును దెలియవచ్చినవి.

ఆయుప్రియసంభాషణమును విడిచి పిమ్మట వా రిరువురును దేవలునిగూర్చి ముచ్చటించుకొనిరి దేవలునిమాటలు చెప్పుకొనుచు దేవలుని మాటలను భావించుకొనుచు నుండఁగా సుఖదుఃఖములతో వా రిరువురకు నా రాత్రి గడచిపోయెను. మాటమాటకును దుఃఖము పొంగి పొరలుచుండుటచేఁ బ్రసాదుని గండస్థలము లశ్రుధారాసంసిక్తములై పోయెను.

తెల్లవారు సమయమునఁ బ్రసాదుఁడు "జనార్దనా ! జయ మెవ్వరికి లభియించినది ?" అని ప్రశ్నించెను.

జనా—సిరోహీ సైన్యమునకే—

ప్రసా—వారే జయంతురని నేను మొదటనే గ్రహించితిని. వారు నేర్పుచే విజయమును బడసిరి. అజమీరు సైనికులు బలవంతులే యయ్యును రణకౌశలాభావముచే విజితులై పోయిరి. సరే—ఇప్పుడు రాజు శూరసింహుఁ డెచ్చట నున్నాఁడు ? బ్రదికి యున్నాఁడు గద !

జనా—ఆతఁ డీ దుర్గమునందే యాశ్రయముం గల్పించుకొని యున్నాఁడు.

ప్రసా—మఱి—మఱి రాజకుమారి యెచ్చట నున్నది ?

జనా—నాకా సంగతి సరిగఁ దెలియదు. కాని గడచిన రాత్రి మాత్ర మెవ్వతెయో యొక యువతి నీ సమాచారము దెలిసికొనుటకై చాలసారు లిచ్చటికి వచ్చినది. ఆమె దాసి యును గొందును.

ప్రసాదుఁ చాలసే పాలోచించి "శత్రు లెచ్చట నున్నారు?" అని ప్రశ్నించెను.

జనా—ఈ దుర్గమును ముట్టడించియే యున్నారు.

ప్రసా—ఈ విషయమై రాజేమి యాలోచించినాఁడు?

జనా—ఇంతవఱ కేమియును స్థిరపరచుకొన్నట్లగపడదు.

అంతలో జయంతకుమారుఁ డాగదిలోఁ బ్రవేశించి కుశలప్రశ్నానంతరమున "వీరశేఖరా ! రాజకుమారా ! నీక్షేమ సమా

చారముం దెలిసికొనుటకై మహారాజు నన్ను నీయొద్దకుఁ బంపినాఁడు నీకించుక యారోగ్యముగ నున్నచో రాజసన్నిధికి రావలయును. ఏిన్నట్టులైనఁ దీసికొనిరావలయు నని రాజాజ్ఞ యయినది" అనియెను.

ప్రసా.—రాజునకు నాయందిట్టి యనుగ్రహము కలుగుటచే నేను సన్మానితుఁడనైతిని. నా కారోగ్యము కలిగినదనియు, శీఘ్రముగ నేవచ్చి ప్రభుదర్శనముం గావింతుననియు మహారాజునకు మనవి చేయుము.

జయంతకుమారుఁడు వెడలిపోయెను. ప్రసాదుఁ డుచితవసనాలంకారభూషితుఁడై జనార్దనునిం జూచి "జనార్దనా! నీవు నన్నుఁ బ్రసాదుఁ డనియే పిలుచుచుండవలయును. పరాకుగనైన మఱియొక పేరుతోఁ బిలువవలదు. ఈసంగతి జ్ఞప్తియం దుంచుకొనుము. ఏ కారణముచేనైన నీవు నా నామమును బ్రకటించినచో నేనీ దేశమును విడిచి దేశాంతరమునకుఁ బోయెదను. అప్పుడిఁక నీవు నన్ను వెదకి పట్టుకొనఁజాలవు" అని హెచ్చరించెను.

---

పదియవ ప్రకరణము

# పురస్కారము

ప్రసాదుఁ డాలోచనామందిరమునందున్న రాజసన్నిధికిబోయి నిలునఁబడియెను. రాజందఱియెదుటను బ్రసాదుని గౌరవించి పార్శ్వమునఁ గూర్చుండఁబెట్టుకొని "వీరశిరోమణీ! నేను నీనామము నడుగఁదలఁచుకొనలేదు. నీ వంశమునుగూర్చి ప్రశ్నింపఁ దలఁచుకొనలేదు. నీ యిచ్చవచ్చిన నామముతోడనే నీవు వ్యవహరింపవచ్చును. రణరంగమునందు నీవంశ గౌరవములు నాకుస్పష్టముగా బోధపడినవి. నీవు నా ప్రాణరక్షణముం గావించితివి; నా తనయకుల గౌరవములను గాపాడితివి. రాజపుత్ర చరిత్రమునందు నీవంటి

వీరకేసరు లెంతమందియో లేరు. ఇంతటి కౌశలమును, జురుకుఁదనమును నే నిదివఱ కెన్నఁడును జూచియుండ లేదు. కాని యొక్కసారిమాత్ర మిట్టి కౌశలమును నట్టి వీరత్వమును నేనొకప్పుడు చూచియుంటిని." అనియెను.

మహారాజు పూర్వపువీరేంద్రకేసరి శౌర్యవీర్యములం దలంచుకొని యిట్లు చెప్పుచుండెనని సభ్యులకందఱకును దెలిసిపోయెను. అప్పుడు రాజు జయంతకుమారా! ఈవీరబాలకుని ప్రతాపమునకుఁ దగిన బహుమాన మేమి చేయువలయునో యూహించితివా." అనియెను.

జయం— మహారాజా! మన రాజ్యమునం దున్నత గౌరవ మేదియో, యున్నతోద్యోగ మేదియో, దానికీతఁడే తగినవాఁడు; ఈబాలకుఁడు నాకుఁగూడ యుద్ధనైపుణ్యమును బోధించినాఁడు.

రాజు...జయంతా! నీవంటివాఁడు చెప్పఁదగినట్లే చెప్పితివి. ఈ బాలవీరున కైదువందల యశ్వసైన్యమునకుఁ దండనాయకత్వము నొసంగితిని.

అనునంతలో నొకదూత వచ్చి "మహారాజా! ప్రధానదండనాయకుఁడు పరాజితుఁడై తన సేనలతోఁగూడ సిహానాదుర్గము నాశ్రయించియున్నాఁడు," అని చెప్పెను. రాజామాట లాలకించి సంక్షుభిత హృదయముతో "జయంతా! ఈసారి మనయాశలు వదలిపోయినవి. మీతండ్రి విజయముగాంచి వచ్చి మనలనుద్ధరింపఁగలఁడని నేనాశపడుచుంటిని. ఇఁక నాయాశ లేదు. మన సాహాయ్యమునకే యాతఁ డెదురుచూచుచున్నాఁడు. దక్షిణమునం దాతఁడును బర్వతదుర్గమునందు మనమును బంధితులమై యున్నారము. అరక్షితమగు రాజ్యము శత్రుకరగతమై యున్నది. రెండు మూడు దినములలో మన మెట్లైనఁ దప్పించుకొని విజయులమైతిమా రాజ్యము నిలుచును. లేకున్నచో రాజ్యమును, రాజధానియును శత్రువులచే భస్మీభూతమైపోవును" అనియెను.

మహారాజు జయంతుఁడు మొదలగు సేనానాయకులతోఁ జాల సేపు కాలోచించెను. శత్రువ్యూహములను భేదించి దుర్గసంరక్షణ

ముం గావించుకొనునాలోచన నెవ్వరును జెప్పఁజాలకుండిరి. ప్రసాదుఁడు వారి సంభాషణము లన్నియు నాలకించెను. ఏమియును మాటాడలేదు ; ఆలోచనామందిరము విడిచి వెలుపలకువచ్చి దుర్గశిఖరము నధిరోహించి దుర్గము నలుపంకలను బరిశీలించి చూచెను. ఆయోహోనాదుర్గ మారావళీపర్వతములందలి చిన్నశృంగముపై నిర్మింపఁబడి యుండెను. ఆదుర్గమునకు మూడువైపులను సమున్నత పర్వతపంక్తు లున్నవి. ఒక వంకమాత్రము సమోన్నతమగు పర్వతోపత్యక యున్నది. ఆ సమప్రదేశమునందే శత్రువు లాక్రమించుకొని యుండిరి. ఆ దుర్గమునుండి యజమీరుకు పోవలసియున్నచో గిరిమార్గమున నారావళీపర్వతపంక్తులను దాటిపోవలయును. మూడువైపులను సమున్నత పర్వతపంక్తులు ! ఎట్టయెదుటఁ బెద్దపులివలె శత్రుసైన్యము ! ఆ శత్రుసైనికులెవ్వరు నైదుపందలకుఁ దక్కువలేరు. ఆ దుర్గము దుర్భేద్యమైనదని యెఱింగిన వారగుటచే వారు దాని నాక్రమింపకుండ మార్గమునుమాత్ర మడ్డగించి సేనాసహితముగ రాజును బంధించియుండిరి.

ప్రసాదుఁ డప్పుడు దుర్గశిఖరమునందున్న యొక ప్రతిహారిం జూచి యాతనికి వామభాగమునందున్న పర్వతములం జూపుచు "ఈ పర్వతపంక్తుల నడుమునుండి యేదియయిన మార్గమున్నదా ?" అని ప్రశ్నించెను.

ప్రతీ—ఉన్నది.

ప్రసా—మార్గమున్నదని నీకెట్లు తెలిసినది ?

ప్రతీ—నా చిన్నతనమునం డీపర్వతోపత్యకలే నాకుఁ గ్రీడాభూములు. ఇచ్చట మార్గమున్నట్లు చాలమందికిఁ దెలియదు. మన ప్రధానదండనాయకుని దూతకును నాకును మఱియొకరిద్దఱకును మాత్రమే తెలియును.

ప్రసా—ఆమార్గ మెంతవఱకునున్నది?

ప్రతీ—బేవోయార్ యుద్ధక్షేత్రమువఱకును.

ప్రసా—అశ్వికుల కా మార్గమునఁ బోవుట కవకాశ మున్నదా ?

ప్రతీ—కొంచెము శ్రమపడినచోఁ బోవచ్చును.

ప్రసా——బేవోయూర్ క్షేత్రమున కెంతసేపటిలోఁ బోవచ్చును.

ప్రతీ— ఒక్కజాము పట్టును.

ప్రసా—బేవోయూర్ క్షేత్రమునుండి సమతలంబగు మఱియొక మార్గమున నిచ్చటకు వచ్చుట కెంతసేపు పట్టును?

ప్రతీ—ఒకటి రెండు గంటలు.

ప్రసా— ఈ పర్వతమార్గమునుండి నీవు చీఁకటి వేళఁ బోఁగలవా?

ప్రతీ——వేయిసారులు పోయితిని.

ప్రసా—మంచిది. నీ పేరేమి ?

ప్రతీ—ధర్మసింహుఁడు.

ప్రసాదుఁడు దుర్గోపరిభాగమునుండి దిగి రాజునొద్దకుఁబోయి "మహారాజా! ఆజ్ఞయయినచో నాయయిదువందల యాశ్వికులను నే నీరాత్రి పరీక్షించెదను" అనియెను.

రాజు—అయిదువందల సైనికులమాత్రము వెంటఁబెట్టుకొని యిట్టిసమయమున దుర్గమువెలుపలకుఁబోవుట కేవలము సాహసము! నే నీకార్యమున కంగీకరింపఁజాలను.

ప్రసా——మహారాజా! మీ రింతకుముందొక నిమిషముక్రింద టనే నాన్నెపుణ్యముం గూర్చి కీర్తించి యున్నారు. ఆ ధైర్యముచేతనే నేను మిమ్మిట్లు ప్రార్థించుటకు సాహసించితిని.

రాజు—నీ యుద్దేశ మేమియో నాకు స్పష్టముగఁ దెలిసినచో నేనాలోచించి చూచెదను.

ప్రసాదుఁడు విశదముగఁ దెలియఁజేసెను. అప్పుడు జయంతుఁడుకూడ నచ్చటనేయుండెను. అతఁ డుత్సాహముతోఁ బ్రసాదుని చేయి పట్టుకొని "రాజపుత్రా! నీవంటి రణవిశారదుఁ డగు

వీరుండు రాజపుత్రస్థానమునం దెవ్వండును లేడు. నీవు నన్నే దారిని బొమ్మన్న నేనాదారిని బోయెదను” అనియెను.

ప్రసా—నేను మీ ధైర్యసాహసములను గని యుంటిని. మీకు మార్గమును సూచించు సామర్థ్యము నాకు లేదు ఈ యుపాయమునందలి ఫలాఫలములు మీమీందనే యాధారపడియున్నవి. మీరు రెండు వేలమంది యాశ్వికులతో సిద్ధముగానుండుండు. నేను మీకు సంకేతముగ నొక పెద్ద చెట్టుకొన నెక్కి కాగడ వెలిగించి చూపెదను. ఆ వెలుతురు నీ కగపడినతోడనే నీవు సిశ్శబ్దముగ మర్గమునుండి వెలుపలికివచ్చి శత్రువుల నెదిరించి తలపడుము” అని చెప్పెను.

రాజు—ప్రసాదా! నీబుద్ధి సూక్ష్మతయును గౌశలమును జూడంగా నీవు బాలుండవ్వగాం దోచుటలేదు. నీవు చెప్పినయుపాయముకంటె నాత్మసంరక్షణమునకు మఱియొకమార్గము లేదు. కాని నీవంటి బాలకుని నిస్సహాయునిగంజేసి పంపుటకు నాకు ధైర్యము చాలకున్నది మఱియయిదు వందలనుండి యాశ్వికులను గూడ నీ వెంటం దీసికొనిపొమ్ము! శత్రుసైన్యమునుబట్టి చూడంగా నీతోనుండు వేయిమంది యాశ్వికులు మాత్రమేమి లెక్క? ఏమైననేమి? ఇంతకంటె నుపాయాంతరము లేదు.

ప్రసాదుండటనుండి వెడలి మరలం దనగదికోనికి వచ్చెను. అప్పటి కచ్చట నతిసంకులముగ, వాక్కలహము జరిగుచుండెను. ఆ జగడ మంత విశేషమైనది కాదు. ఇరువురిలోని పోరాటము ఒక పక్షమున జనార్దనుండు! మఱియొకపక్షమున నీల—జనార్దనుండు కేవల మాయుధవిహీనుండు కాకపోయినను నీల ప్రసరింపంజేయుచుండు కటాక్ష విద్యుద్బాణవర్షమునుండి యాత్మసంరక్షణముంగావించుకొనుటకు సమర్థుండు కాంజాలకుండెను. యుద్ధ చరిత్రమును మొదటినుండియు వర్ణింపకున్నచో మా నవల యసంపూర్ణమైపోవునేమో యను సంశయముతో నామూలచూడముగ వివరించుచున్నారము.

ప్రసాదుఁడు రాజదర్శనమునకుఁ బోయిన కొలఁదిసేపటిలోనే నీల యాతని గుమ్మము నెదుట సాక్షాత్కరించెను. అప్పుడచ్చట జనార్దనుఁ డొక్కఁడుమాత్రమే యుండెను. అచ్చటఁ బ్రసాదుఁడు లేకుండుటం గాంచి నీల విస్మితయైపోయెను అప్పటి యావశ్యకము నుబట్టి యామెకు జనార్దనునితో మాటాడక తప్పినదికాదు. నీల కుల వధువుకాదు అందుచే నామె నిశ్శంశయముగ జనార్దనుని సమీపించి యాతని తండ్రితాతలంగూర్చి ప్రశ్నింపనారంభించెను. నిన్నటిరాత్రి యామె ప్రసాదునికొఱకచ్చటికి రెండుమూఁడుసారులు వచ్చియున్నది. అందుచే నామెకు జనార్దనుని పరిచయము కలిగినది. ఆ పరిచయబల ముచే నామె నిస్సంశయముగ నాతని సమీపమునఁ గూరుచుండి "అయ్యా! మీ దేయూరు?" అని ప్రశ్నించెను.

జనా—చెప్పుకొనుము! చూతము!

నీల—నీవీ దేశపువాఁడవుగావు.

జనా—నీ వెట్లు తెలిసికొంటివి?

నీల—నీ మొగమునందలి వసంతరాగమును బట్టి—

జనా—ఆలాగా? చెప్పుము! అంతలో నాఁగితి వేమి?

నీల—నీవు కేవలము భృత్యమాత్రుఁడవు.

జనా—ఎవ్వరికి? నీకుఁగాదుగద?

నీల—కాదు—భవానీ ప్రసాదునకు

జనార్దనుని మనసు మఱింత చలించిపోయెను. ఆతఁ డించుక యుద్విగ్నహృదయముతో "భవానీప్రసాదుఁ డెవ్వఁడు?" అని యడిగెను.

"ఈ యుంగరముగల యాతఁడు!" అనిచెప్పి నీల తన వస్త్రాంచలమున ముడిచి తెచ్చిన యుంగరమును బైకిఁదీసి యాతనికిఁ జూపించెను.

జనార్దనుఁడు దర్శనమాత్రముచేతనే యా యుంగరము నానవాలుపట్టి "నీకీ యుంగర మెచ్చట దొరకినది?" అనియెను.

నీల—ఒకవేళ నిది నీదియయినచోఁ నాకు బహుమానముగ నిచ్చెదవా?

జనా—కంఠహారము లేని నేనంగుళీయకమును బహుమాన మిచ్చుట యెట్లు?

నీల – నీకంఠము నింకను రత్నములతోఁ బంధించుట యేల? నీ ముఖమండలము మణిముక్తా ఖచితమైయున్నది. నీ వెప్పుడును నీ మొగము నద్దములోఁ జూచుకొనలేదా?

జనా—అద్దముతో నిమిత్తము లేదు. నీవిశాలతరళనయనముల వంక నొకసారి చూచినచోఁ జాలదా!

ఈ మాటకు నీల చాల సంతోషించెను. చక్కఁదనమును గూర్చి పొగడినచోఁ సంతోషింపనివా రెవ్వరుందురు? అప్పుడు నీల మెఱపులవలెఁ గటాక్షములఁ బరగించుచు "నేనొకతప్పు చేసితిని—లావణ్యరసనిమగ్నమగు నీ ముఖమండలమును నాకన్నులలోఁ దేల్చి పట్టితిని" అనియెను.

జనా—నీవు తేల్చుటలేదు. నేనే నీ కన్నులలోఁ దేలించితిని.

నీల—ఈవిధముగ దాఁటుకొనిపోవుచుంటివా?

ఒక కటాక్షము—మరలఁ గటాక్షముపైఁ గటాక్షము జనార్దనుఁ డస్థిరుఁడై పోయెను. అసంఖ్య శత్రుసేనామధ్యమునందు. గూడ నాతని బుద్ధి యెన్నఁడు నించుకంతయును జెక్కు చెదరలేదు. అట్టివాఁ డిప్పుడు బాలకునివలెఁ జంచలుఁడై పోయెను. అవశుఁడై నీల హస్తమును బట్టుకొనియెను. నీల యాతనిచేయి వదల్చుకొని తనమేలి ముసుఁగు వసనముతో నాతని కంఠమును బిగించిపట్టుకొనియెను. అప్పుడు జనార్దనుఁడు తన కంఠమునకుఁ గలిగిన విపత్తుకై చేతులు జోడించి క్షమాప్రార్థమునం గావించెను.

నీల—నీ కిఁక నీగళబంధమునుండి యెంతమాత్రమును నిష్కృతి లేదు

అప్పటికిని నీల వినీలతరళనయనములనుండి నిశితకటాక్షములే—మృదులారుణాధర ప్రాంతమునుండి మధుర మందహాస

ములే—జనార్దనుఁడు వెఱ్ఱివానివలెఁ జూచుచుండెను. నీల సుందర వదనమండల మెంతటి మనోహరమైనది! జనార్దనుఁడు సాహసముతో "విషమును విషముతోడనే శమింపఁజేయవలయును." అని పలుకుచు యౌవనోన్ముఖంబగు నీలతనువల్లికను హృదయమధ్యమునం జేర్చుకొనియెను. కాని లతమాత్రము వృక్షమును బరివేష్టింపక తీవ్రవేగముతో నా వృక్షమును భూపతితముగఁ జేసివైచెను. అప్పుడు గూడ నాలతాతన్వితరళనయనములం దమృతకటాక్షములే—కోమలాధరమున మందహాసకాంతులే. వృక్షము విహ్వలహృదయముతో నిశ్చలనయనములతో లతవంక నే చూచుచుండెను.

ఈ పట్టునందే యుద్ధము ముగిసినది. అప్పు డాయిరువురకును బ్రిసాదుఁడు కన్నులఁ బడియెను. పడియున్న జనార్దనుఁడు లేచి నిలువఁబడియెను. నీల యెంతమాత్రమును జంచలింపక నిస్సంశయముగఁ బ్రిసాదుని సమీపమునకు వచ్చి నిలువఁబడి "అయ్యా! ఈ యుంగర మెవ్వరిదో మీ రెఱుఁగుదురా?" అని ప్రశ్నించెను.

ప్రిసా— ఇది యొకప్పుడు నాదిగా నుండెడిది. నీకెట్లు లభియించినది?

నీల—ఓహో! మరల నీకిమ్మని యడుగవా యేమి?

ప్రిసా— ఒకసారి యిచ్చినదానిని మరలఁ గైకొనుట యెట్లు?

నీల—ఇట్టివి నీయొద్దఁ జాలఁగ నున్నవి కాఁబోలును! అందు చేతనా యీవిధముగ దానములు చేయుట?

ప్రిసా—నేను దీనిని దానము చేయలేదు; విక్రయించితిని. దరిద్రుఁడ నగునాకు దానములు చేయుటకు సామర్థ్య మెక్కడిది?

నీల చతురవచోనిపుణ—సత్యము చెప్పుచున్న యాతనియొద్ద దాఁపరికె మేల చేయవలయును—కాని నీలమాత్రమా ధోరణిని వదలక "నీ వసత్యమాడుచున్నావు; నీవు దరిద్రుఁడవు కావు. నీపేరు కృత్రిమమైనది; నీ పరిచయముకూడ నట్టిదియే, నీ విప్పుడు నాతో గూడ రావలయును," అనియెను,

ప్రిసా— ఎక్కడకు?

నీల—వచ్చినచో నీకే తెలియును.

ప్రసా—ముందుగఁ జెప్పఁగూడదా ?

నీల—దుర్గశిఖరమునకు—

ప్రసా—పనియేమి ?

నీల—చెప్పెదను రమ్ము.

ప్రసా—క్షమియింపుము. ముందుగఁ జెప్పుము.

నీల—అట్లయినచోఁ జెప్పఁదలఁచుకొనలేదు.

అప్పుడు ప్రసాదుఁడు లేచెను. కాని, జనార్దనుఁ డేమియును మాటాడుటలేదు. ప్రసాదుఁడు నీల ననుసరించి పోయెను. క్రమముగ వారిరువురును దుర్గముమీఁదికిఁ బోయిరి. అచ్చటఁ బ్రసాదుఁడు పర్వతశృంగమువంకఁ దిలకించుచున్న రాజకుమారికం గనుఁగొనియెను. ఆ పర్వతశృంగమునుండి జలధారలు ప్రవహించుచుండెను. ఆ యద్భుత ప్రకృతి చిత్రమునే రాజపుత్రిక తిలకించుచుండెను. అప్పుడు నీల వెనుకనుండి "రాజకుమారీ !" అని పిలిచెను.

ఉమాబాల వెనుదిరిగి చూచెను. ఆమె కన్నులయెదుట నా దివ్యసుందరమూర్తి సాక్షాత్కరించియుండెను. ఏ మోహనమూర్తిం జూచి యామె తనగర్వమును వదలి లజ్జ నభ్యసించినదో—ధైర్యమును వదలి యధైర్యమును నేర్చుకొన్నదో—అదియే యా మోహనమూర్తి ! ఆమె యే దివ్యమూర్తిని దనభావనారంగమునఁ బర్వతములతోడను, నదులతోడను, పక్షులతోడను, సూర్యచంద్రులతోడను సరిచూచుకొని భావించుకొనుచుండెనో యెట్టయెదుట నా దివ్యమూర్తియే ! ఏ మూర్తిని సందర్శించుట కామె యెంతఁగఁ బ్రయత్నించుచున్నదో—ఎంతఁగ నాశపడుచున్నదో—ఆ మూర్తి యెట్టయెదుట సాక్షాత్కరించి యున్నప్పు డొక్కసారియయిన బాగుగఁ గన్నెత్తి చూడఁజాలక పోయెను. వేయిమంది పురుషుల నడుమనున్నను, గోరంత సిగ్గుగాని, కాసంత గద్గదస్వరముగాని యెఱుఁగని రాజకుమారి యిప్పుడా బాలకునిం గాంచి లజ్జావనతవదన యయిపోయెను.

ఇంకఁ బ్రసాదుఁడుమాత్రమో ? ప్రసాదుఁడు మంత్రిముగ్ధుని వలె నా రమణీమణి మనోహరవదనకమలముం గన్నులారఁ గనుఁగొనవలయు నని వేడుకపడుచుండెను. త్రిలోక సౌందర్యమంతయు నీ రమణీమణి చిన్నారి నెమ్మొగమునందే సమకూర్చి యుంచిన వారెవ్వరు ? ఇంతటి సౌందర్యమును—ఇంతటి మాధుర్యమును—ఒక్కచో నాతఁ డెచ్చటను జూచియుండలేదు. పశుపక్ష్యాది జీవజంతువులను, బర్వతములను, వనములను, గ్రహములను, నక్షత్రములను, సర్వమును నాతఁడు తనలో వరుసగ భావించి చూచుకొనియెను ఇంతటి సౌందర్యమాతని కెచ్చటను నగపడలేదు.

సిగ్గు వదలుటలేదు: ఒకరినొకరు కన్నెత్తి చూచుకొనఁజాలకుండిరి కాని, సమయము దొరికినప్పు డొకరికిఁ దెలియకుండ నొక్కరుగ నొండొరులం జూచికొని యానందించుచుండిరి—ఒక్కసారిగ నిరువురు నదరిపడి చూచిరి నీల యచ్చటనుండి వెడలిపోయినది ! మఱి యచ్చట నితరు లెవ్వరును లేరు. ఎంతపని జరగినది ! ఇరువురి తనులతలును బ్రకంపితములై పోవుచుండెను.

ఏమి రాజకుమారీ ! ఇప్పుడేల నీ కింతటిసిగ్గు ! పురుషవేషముతో నశ్వారోహణముం గావించి వేలకొలఁది పురుషులతోఁగలసి నవ్వుచు నవ్వుచు యుద్ధమును సందర్శించుటకై వచ్చుటకు సాహసింపఁజాలిన నీవు—రమణీమందిరముతో నాత్మభవనమునందుండి యీ చిన్నిబాలకునింగాంచి యింత సిగ్గుపడుచుంటివేమి ?

---

పదునొకండవ ప్రకరణము.

# నాయకత్వము

యుద్ధచరిత్రమును వ్రాయుచు మాటిమాటికిని మా పాఠకులను విసిఁగించుట మా యుద్దేశము కాదు. సంక్షేపముగ యుద్ధచరిత్రముం దెలిపి కథలోనికి జరగిపోయెదము.

చీఁకటిపడిన తరువాతఁ బ్రసాదుఁడు వేయిమంది యాశ్వికులను వెంటఁబెట్టుకొని దుర్గవామభాగమునందలి పర్వతము నధిరోహించెను. ధర్మసింహుఁడు ముందు నిలిచి త్రోవఁ జూపుచుండెను. ఆ విధముగ నందఱును నిశ్శబ్దముగఁ బర్వతమార్గమున నేపోయి రాత్రి పదిగంటలకు బేనోయూర్ క్షేత్రమునకుఁ జేరుకొనిరి. తరువాత నటనుండి మరలి శత్రుసైన్యమునకు వెనుకభాగమున వచ్చి నిలిచియుండిరి. అప్పుడు ప్రసాదుఁ డాయాశ్వికులను మూఁడుభాగములుగఁ జేసి శత్రువులకిరుపంకలకు నూర్గురేసి యాశ్వికులును, వెనుకభాగమున నెనిమిదివందలమంది యాశ్వికులును, నిలుచునట్లు నియమించెను; తరువాతఁ దాను నిశ్శబ్దముగ దూరమునందున్న యొక సమున్నతవృక్షము నధిరోహించి సాంకేతికంబగు కాగడను వెలిఁగించెను. తరువాత నాతఁడు నిశ్శబ్దముగ దిగివచ్చి శత్రుపార్శ్వములయందున్న యాశ్వికులకుఁదగిన యేర్పాటులంగాంచి శత్రువుల వెనుక భాగమునను్న యెనిమిదివందలమంది యాశ్వికులను దాను ముందుండి సమయము నిరీక్షించుచుండెను. శత్రుశిబిరము నిస్సబ్ధమై యుండెను; అందఱును నిద్రించుచుండిరి. కేవలము దుర్గద్వారమునొద్ద మాత్ర మొకరిద్దరు ప్రతీహారులు జాగరూకులై కావలిగాచు చుండిరి.

ఆకస్మికముగ దశదిశలఁ గోలాహలధ్వనులు వ్యాపించెను. దుర్గము నెదుట నున్న శత్రుసేనలలోఁ గల్లోలము పుట్టినట్లు నక్షత్రముల వెలుతురున బ్రసాదుఁడు కనుఁగొనియెను. దుర్గమునుండి బయలుదేరిన సేనలచే శత్రుసైన్య మాక్రమింపఁబడియెను. అదియే తగిన సమయమని యెంచి ప్రసాదుఁడు తన యెనిమిదివందల సైనికులతోడను శత్రువులను వెనుకభాగము నందుండి తలపడియెను. ఎదుట జయంతుఁడు — వెనుకఁ బ్రసాదుఁడు — పార్శ్వములయందుఁ బ్రసాదుని యోధులు. అప్పుడే నిద్రనుండి మేల్కాంచి యుద్ధసజ్జితులై యున్న శత్రుసైనికులకుఁ బాఱిపోవుటకుఁగాని యుద్ధము చేయుటకుఁ గాని యానుకూల్యము లభియించుటలేదు. శత్రువులలో నన్యోన్యసాహాయ్యమున కవకాశము లేదు; వ్యూహరచనమునకుఁ దెలిపి

లేదు. తుదకు వారేమియుఁ దోఁపకుండుటచే నిటునటుఁ బరుగులెత్త నారంభించిరి. దురదృష్టవంతులగు వారికే వంకఁజూచినను నజమీారు సైన్యమే యగపడుచుండెను. కాలు నిలుపుటకుఁ దావు దొరకుట లేదు. ఒకటి రెండుస్థలములయందు మాత్రము వారిలోఁ గొందఱొక దళముగఁ జేరుకొని యాత్మరక్షణమునకై ప్రయాసపడుచుండిరి. కాని యంతమాత్రముచే నేమిలాభము ? బంధమునుండి విడివడి యజమీారు సైనికు లప్రతిహత పరాక్రమముతోఁ బైబడి మర్దించు చుండిరి.

తుదకుఁ బ్రసాదుఁడా దారుణనరహత్యావ్యాపారమును సంపూర్తి గావించెను రణావసాన మైనది—శాంతిస్థాపన మైనది. ప్రభాతారుణకాంతులు రుధిరప్లావితమగు రణక్షేత్రమునఁ బ్రతిబింబించు చుండెను. రణరంగమంతయు మృతకళేబర సమాచ్ఛన్నమై విస్పష్టముగ నగపడుచుండెను. ప్రసాదుఁ డప్పుడు శత్రుమిత్రభేదము లేకుండ రణరంగమున గాయములుతగిలి పడిపోయినవారి కందఱకును దగిన యుపచారములం గావించు నేర్పాటులను జేయించెను. ఇంతే కాక యాతఁడు రణరంగమంతయును బరీక్షించి మూర్ఛితులగు వారికి స్వయముగ దాహశాంతిం గావించి సేదఁదేర్చుచుండెను ; కొందఱి గాయములకుఁ గట్లు కట్టుచుండెను ; కొందఱి కాహారమును బెట్టు చుండెను.

ఉమాబాల దుర్గసౌధమునుండి యాప్రభాతకాంతులలో సమర రంగమును బరిశీలించి చూచుచుండెను. అప్పు డామె శత్రువుల కనేక విధముల నుపచారములం గావించుచున్న ప్రసాదునిం గాంచి "నీలా ! ఈప్రపంచమున వీరత్వము సుందరమైనది ; రూపము సుందరమైనది ! దయయును సుందరమైనది ! ఎవ్వని హృదయమున దయయుండదో—భక్తియుండదో—ధర్మముండదో—ఆతఁ డెన్నటికిని సుందరుఁడు కాఁజాలఁడు !" అనియెను.

శత్రువులందఱును విధ్వస్తులై పోయినట్లు రాజు రణరంగము నకు వచ్చి చూచెను. ఇంచుమించుగ రెండువేలమంది శత్రువీరులు

రణక్షేత్రమున నాత్మసమర్పణముం గావించిరి. ఇంకను గొందఱు పట్టుబడిరి. మహారాజగు శూరసింహునకు మహైశ్వర్యము కలిగెను. ఇంతటి యల్పసైన్యముతో నిట్టిఘనకార్యము జరగినది; అప్పుడు రాజు జయంతునిం జూచి "జయంతా! నే నింతకాలము గడపితిని గాని యిట్టి యుద్ధమెన్నఁడును జూచియుండలేదు. ఈశత్రువులబారి నుండి మనల నుద్ధరించుటకై జయలక్ష్మివలెఁ బ్రసాదుఁడు మనకు సాక్షాత్కరించినాఁడు. ఏఁడీ? ప్రసాదుఁ డెక్కడనున్నాఁడు?" అనియెను.

ప్రసాదుఁడు రాజునెదుటకు వచ్చి నిలువఁబడియెను. అప్పుడు రాజాతనిం జూచి యత్యాదరభావముతో "ప్రసాదా! నిన్ను రెండు వేల యశ్వసైన్యమునకు నాయకునిగాఁ జేసితిని. ముందు జరుగఁ బోవు యుద్ధములన్నియును నీ యాలోచనము ననుసరించియే నడచుఁ గాక!" అనియెను.

జయంతుఁడు పరమానందముతోఁ బ్రసాదుని గౌఁగలించుకొని "ప్రసాదా! ఈ రాజపుత్రస్థానమునందు నావంటివీరుఁడు లేఁడని నేనింతవఱకును గర్వించి యుంటిని. ఇప్పుడు నిన్నుఁ జూచి నావంటి యల్పుఁ డీలోకమున నుండఁడని విస్పష్టముగఁ దెలిసికొనఁ గలిగితిని." అనియెను.

అందఱు నానందోత్సవోన్మత్తులై దుర్గమునఁ బ్రవేశించిరి. అందఱి వదనమండలములును బ్రసాదునియశోగానములచేఁ బ్రతిధ్వనితము లగుచుండెను. ప్రసాదుని నాయకునిగాఁ బడయఁగలిగినందులకుఁ బ్రతియోధుఁడును గర్వించుచుండెను. చూడనివా రాతనిఁ జూడ వచ్చుచుండిరి; మాటలాడనివా రాతనితో సంభాషించి యానందించుచుండిరి. అందఱు నాతని గీర్తించుచుండిరి. ప్రసాదుఁడుమాత్రము గర్వోన్మత్తుఁడుగాక "మహారాజా! ఆజ్ఞ యయినచో సేనాపతికి సాహాయ్యముగ సేహానాదుర్గమునకుఁ బోయెదను. ఆతఁ డైదువేల శత్రుసైన్యముచే ముట్టడింపఁబడియున్నట్లు విని యుంటిని. ఆతఁడు మీసాహాయ్యమున కెదురు చూచుచుండును.

ఆలస్యమైనచో ననర్థకము సంభవింపవచ్చును. సెలవైనచో నేనిప్పుడే ప్రయాణమై పోయెదను” అనియెను.

రాజు మాఱుమాట చెప్పక యాతని ప్రార్థనమును మన్నించి “ప్రసాదా! నీకు మూడువేల సైన్యముకంటె నెక్కుడుగ నీయఁజాలను. సేనాపతియొద్దఁ బండ్రెండువేల సైన్యమున్నది. నేను నీ కాలోచనము చెప్పవలసిన దేదియును లేదు. నీవు పోయి నీయిచ్ఛ వచ్చినట్లు చేసి విజయుఁడవై రమ్ము!” అనియెను.

ప్రసాదుఁడు మూడువేల సైన్యమును దీసికొనిబయలుదేరెను. ఆసేనావాహిని యారావలీ పర్వతపాదముల ననుసరించి యుత్తుంగ తరంగితమై సేనానామార్గాభిముఖముగఁ బ్రవహించి పోవుచుండెను. రెండవదినమునఁ బ్రాతఃకాలమునకు దుర్గమునకుఁ బదికోశముల దూరమునందున్న పర్వతపంక్తులలోఁ బ్రవేశించి ప్రసాదుఁడు తన సైన్యము నచ్చటఁ గొంతసేపు విశ్రమింపఁజేసెను. కొంతసేపైన తరువాతఁ బ్రసాదుఁ డధిరోహించి జనార్దనుని వెంటఁబెట్టుకొని దుర్గాభిముఖుఁడై పోయెను. అట్లుపోయి దుర్గమును ముట్టడించిన శత్రువుల కగపడకుండ వారిరువురును దూరమునందే గుఱ్ఱములను దిగి యాగుఱ్ఱముల నొకపర్వతకందరమునఁ గట్టివైచిరి. అప్పుడు వారిరువురును భిక్షుక వేషములతో జగద్ధాత్రిఁ గూర్చి గానముచేసి కొనుచు బయలుదేరిరి. ఆమాతృకీర్తనములతో నరణ్యములు, పర్వతములు బ్రతిధ్వనితములగుచుండెను. ఈవిధముగ నా యిరువురును శత్రుశిబిరమధ్యమునఁ బ్రవేశించిరి.

ప్రసాదుని మధురకంఠస్వరమునకు ముగ్ధులై యెల్లరు నాతని బ్రేమనయనములతోఁ దిలకించుచుండిరి. ఆతఁ డట్లే పాడుచుఁ బ్రతి శిబిరమునను సంచరించుచుండెను. ఒక పార్శ్వమునందలి శిబిరముల నన్నిటిని బరీక్షించునప్పటికి సాయంకాలమగుటచే నాతఁ డటనుండి వెడలిపోయెను. అప్పు డాసైనికు లాతని మఱునాఁడుగూడ రావల యునని కోరిరి. కాని, మఱునాఁ డాతఁ డొక్కఁడు మాత్రమే వచ్చెను. రెండువందల యెంటెలను సంపాదించుభారము జనార్ద

నునిప్పై బెట్టి యాతఁడొక్కఁడే వచ్చియుండెను. జనార్దనుఁడు కావలసిన ద్రవ్యమును జనమును దీసికొని వెడలిపోయెను. అందుచే నేఁడు ప్రసాదుఁ డొక్కఁడే యిచ్చటికి బయలుదేరివచ్చెను. ప్రసాదుఁడు మరల సంగీతము పాడుచు శిబిరములచెంతఁ దిరుగుచుండెను.

సేహోనాదుర్గము దుర్భేద్యమైనది కాదు. ఆప్రదేశముకూడ నంతటి నిరపాయకరమైనదిగాదు. ఆదుర్గమున కొకవంకమాత్రము పర్వతపంక్తి మఱియొకవంకఁ జిన్నగది; తక్కిన రెండువైపులను సమభూమియే ఆగదివైపుఁ బ్రహరి యంతబాగుగ లేదు. పర్వతమువైపునఁగూడ నట్లేయున్నది. తక్కిన రెండువైపులను బాగుగనే యుండెను. ఆనది మార్గమున కించుకదూరమునందున్నది. అది చాలఁ జిన్నది ప్రవాహ మంతవిస్తారముగ లేదు. ప్రసాదుఁ డందుదిగి కాలుసేతులు గడిగికొని ఫలహారము చేయుట కారంభించెను. అప్పు డా సమీపమునం దున్న రక్షకభటుఁ డాతనియొద్దకు వచ్చెను. ప్రసాదుఁ డాతనింజూచి "అదిగో! ఆదుర్గశిఖరముపైనున్న యాతనిని నీవిక్కడనుండి బాణముతోఁ గొట్టఁ గలవా?" అని ప్రశ్నించెను.

"సాధ్యమైనంతవఱకుఁ గొట్టఁగల ననుకొనియెదను." అని చెప్పి యాతఁడు ధనుస్సును, బాణమును సంపాదించి విడిచెను. కాని, యాబాణమంతదూరము పోలేదు. అప్పు డారక్షకభటుడు "ఇంత దూరము శరవిక్షేపముం గావించువీరుఁడు మారాజు సైన్యమునందే లేఁడు!" అనియెను. ప్రసాదుఁడు మందహాసము చేయుచు నాతని యొద్దనుండి ధనుర్బాణములను దీసికొని బాణములను విడుచుచు మాటిమాటికిని దన యసమర్థత నభినయించుచు రక్షకభటుఁడించుక పరాకుగనున్నసమయమునఁ దనవస్త్రాభ్యంతరమునందున్న యొకయుత్తరముందీసి బాణమునకుఁ గట్టి ధనువు నాకర్ణాంతముగ నాకర్షించి బాణమును విడిచెను. గుంయిమని ధ్వనిచేయుచు నాబాణము దుర్గము మీఁదనున్న యాతనిపాదముల యొద్దకుఁ బోయి పడియెను. దుర్గము మీఁదనున్న యారక్షకభటుఁ డాబాణమును జూచి దానిం దీసికొని

యటనుండి వెడలిపోయెను. ప్రసాదుఁడంతయుం గాంచి నిశ్చింతుఁడై తన శిబిరమునకుఁ బోయెను

గాఢాంధకారముచే నిశీథసమయము నిశ్శబ్దమై యుండెను. అందఱును నిద్రాపరవశులై యుండిరి. అప్పుడు ప్రసాదుఁడు తనమూఁడు వేల సైన్యమును దీసికొని శత్రుశిబిర సామీప్యమునకు వచ్చినిలిచెను ఆసైనికులెల్లరును ప్రసాదుఁడు చేయుచున్న పని చేయుటయేగాని కారణము నడుగుట వారికంతయావశ్యకము లేదు.

సంపాదింపఁబడిన రెండువందల యొంటెలును నదీగర్భమున సురక్షితములై యుండెను. పని కలిగినప్పు డుపయోగింపవచ్చునని వాని నాతఁడు తెప్పించి శత్రుపార్శ్వమునం దాయంధకారమున రహస్యముగ నుంపించెను. తరువాతఁ బ్రసాదుఁడు నదీతీరమునం దున్న కొలఁదిమంది శత్రురక్షక భటులను నిశ్శబ్దముగ జంపించి వైచెను. తీరమునకు శత్రుసైన్యము వచ్చునప్పటికి నదియందలి రెండువందల యొంటెలు నొడ్డునకుఁ దీసికొని రాఁబడియెను. ఒక్కొక్క యొంటెకిరువురేసి మనుష్యులు; ఒంటెలపై యోధుల ధిష్ఠించియుండిరి. యోధులకు బదులుగ నా యొంటెలన్నిఁటిమీదను రెండు శాఖలుగల కాగడలమర్పఁబడి యుండెను. ఇదివఱకుఁ గాగడలు వెలిఁగింపఁబడియుండలేదు. కాని, యిప్పు డవి యన్నియు నొక్కసారిగ వెలిఁగింపఁబడియెను. ఆ నాలుగువందల మందియు నాలుగువందల జ్యోతుల నొక్క నిమిషములో వెలిగించిరి. ఒంటెలను దోలవలసిన పని లేదు—ఆ భయముచే నవి యొక్కసారిగ జెదరి శత్రుశిబిరములపైఁబడి చిందరవందర గావించెను. అప్పుడు నిద్రాభిభూతమైయున్న శత్రుసేనావారమున భయంకరకల్లోల ముత్పన్నంబయ్యెను,

ఆ సమయమునం దతి భయంకరమగు నశ్వపదశబ్దము దిఙ్మండలమంతటను బ్రతిధ్వనించెను. పండ్రెండువందలమంది యాశ్వికులు ప్రవాహన్యాయమున దుర్గద్వారమును దెఱచుకొని యొక్కసారిగ శత్రువులపైఁబడిరి. ఆ యశ్వపదశబ్దములచేతను, నాయుధనిస్వనముల

చేతను, నట్టహాసములచేతను నదరిపడి శత్రుసైనికులెల్లరును నిద్ర నుండి మేల్కాంచిరి. అప్పుడు ప్రసాదుఁడు కోశనిర్ముక్త భయంకర కరవాలహస్తుఁడై కొదమసింగమువలె శత్రువులపైకి లంఘించెను. ఎక్కడఁజూచినను గోలాహలధ్వనులే—ఆ కోలాహలధ్వనుల నతిశ యించిన మేఘగంభీరనిస్వరముతోఁ బ్రసాదుఁడు తనయోధుల నుద్దేశించి "ఓ వీరశిరోమణులారా! సోదరులారా! మీనిశిత కృపాణములఁ గోశనిర్ముక్తములం గావింపుఁడు! ఈమూడు వేలమంది శూరులలో నెవ్వరి కరవాలము శత్రురక్తరంజితము గాకుండునో యాతఁడు రాజపుత్రుడు కాఁడు; ఈప్రసాదుఁ డాతని సేనానాయకుఁ డుకాఁడు!" అని యుద్బోధించెను.

ఆతనియాజ్ఞ యింకను ముగియకుండఁగనే "జయకాళీ!" యనుధ్వనులును మూడువేలమంది యాశ్వికుల యున్ముక్త కృపాణ శింజితములు నొక్కసారిగ బయలువెడలెను. ఆ నిమిషమునందే మూడువేలమంది శత్రువుల యుత్తమాంగములు భూదేవికిఁ బూజా ఫలములైపోయెను. క్రోసుదూరమువఱకును వ్యాపించిన శత్రు సైన్యమంతయును ముట్టడింపఁబడియెను. ఆ పదివేలమందియు నొక్క వ్యూహముగఁ జేరుకొని యాత్మరక్షణముం గావించుకొనుచుండిరి, అజమీరు సేనానాయకుఁడు పండ్రెండువేల సైన్యముతో వారిపైఁ బడియెను. మూడునాలుగు గంటలవఱకును నతిదారుణ సంగ్రామము జరిగినది. పిమ్మట సిరోహీసైనికులు పలాయితులైపోయిరి.

విజయము కలిగినది; కాని, సేనానాయకునకు దారుణా ఘాత మయ్యెను. ఆతఁడు దుర్గాభ్యంతరమునకుఁ గొనిపోఁబడి యెను; ఆతని కించుక యారోగ్యముకలిగిన తరువాత నాతఁడు మోహనమీర్, బేవోయార్ యుద్ధక్షేత్రముల సమాచారముం గూర్చి ప్రశ్నించెను. ప్రసాదుఁడు రెండుమూడు మాటలతో నాత నికిఁ బ్రత్యుత్తరమిచ్చి తరువాత నాతనికొక యుత్తరమును జూపిం చెను; అది యజమీరు ప్రభుడగు శూరసింహుని స్వహస్త లిఖితము. అందు "సర్వసేనాధ్యక్షా! ఈలేఖావాహకుఁడగు బాలవీరుఁ డెవ్వఁ

డేమి కోరినను నెప్పుడేమి యాజ్ఞాపించినను తత్క్షణమే నీవు దానిని నెఱవేర్పవలయును—

శూరసింహుఁడు"

అని లిఖయింపఁబడి యుండెను.

సేనాపతి యీయుత్తరముం జదివికొని యత్యాశ్చర్యముతో రెప్పవాల్పకుండ బ్రసాదునివంకఁజూడ నారంభించెను. అప్పుడు ప్రసాదుఁడు "అయ్యా! నాప్రార్థనమును జిత్తగింపవలయును. కడచిన రాత్రి మన మించుమించుగ నిరువదివేలమంది శత్రుసైనికుల నాక్రమించితిమి. అందైదు వందలమందిని మనము బంధించి యున్నారము. ఎనిమిదివేలమంది యుద్ధరంగమున మరణించిరి. మిగిలిన పండ్రెండు వేలమందియును బలాయితులై పోయిరి. వారిని మనము సింహపర్యంతమును దరుమకుండ విడిచి యూరకున్నచో మరల నెప్పటికైన వారు మనల నాక్రమింపకపోరు; కావున వారిని వెంబడించి తరుముటకై యాజ్ఞ దయచేయవలయును" అని ప్రార్థించెను.

సేనా—నీవు చెప్పినమాట నిజమే—ఇప్పుడేమి చేయుమందువు?

ప్రసా—కొంతసైన్యమును వెంటఁబెట్టుకొనిపోయి వారిని దరిమి రావలయునని తలంచుచున్నాను.

సేనాపతి ప్రఫుల్లహృదయముతోఁ బదుమూఁడు వేలమంది యోధులను బ్రసాదుని యధీనులుగాఁ జేసినైచెను. ప్రసాదుఁడా విపులసైన్యముతో శత్రువులను వెంబడించెను.

మేము మాటిమాటికి నశ్వసైనికులం గూర్చియే చెప్పుచుంటిమని పాఠకులు మమ్ముజూచి పరిహసింపవలదు. మన కథాకాలము నాఁటికి ధూమశకటములుగాని, తంతివార్తలుగాని యేవియును లేవు. రాజ్యమును ముట్టడించుటకు శత్రువులు వచ్చుచున్నచో నాశ్వికులగు చారులే సమాచారములఁ దెలుపవలయును; అశ్వికయోధులే శత్రువుల నెదిరించి యుద్ధము చేయవలయును. అందుచే నాకాలమున రాజులెల్లరును నశ్వసైన్యమునే విశేషముగ సంపాదించి యుంచుకొనుచుండిరి. అందుచేతనే మాకిట్లు చెప్పవలసి వచ్చినది.

ప్రసాదుఁడు శత్రువుల కెంతమాత్రమును విశ్రాంతి కవకాశము కలుగనీయకుండ వారి నాక్రమించి నురుమాడ నారంభించెను ; అ ట్లెనిమిది దినములు తరిమి చావఁగా మిగిలిన యయిదు వేలమంది శత్రుసైన్యమును మాత్రము సిరోహీ దేశమునకుఁ బంపివైచెను. అక్కడఁ బ్రవేశించినను శత్రువులకు నిష్కృతి లభియింపలేదు. ప్రసాదుఁడు ప్రబల సేనావాహినితో శత్రు నగరముల నొక్కొక్కటిగ నాక్రమించి తుదకు రాజధానిని ముట్టడించెను. అప్పుడు సిరోహీప్రభువు రణసన్నద్ధుఁడు కాఁజాలకుండుటచేఁ బ్రసాదుఁడు చెప్పిన పద్ధతిని సంధిచేసికొనుట కంగీకరించెను—ఒక సంవత్సరము వఱకును వారజమీారు ప్రభువుతో నెట్టి వివాదములును బెట్టుకొనకుండుటకును, నుభయపక్షములయందును నిర్బంధితులైనవారి నిరువురును విడిచిపెట్టుటకును, బండ్రెండు వేల మొహరీలు సిరోహీప్రభు వజమీారు ప్రభువున కపరాధ ద్రవ్యముగ నర్పించుటకును సంధి గావింపబడియెను—

సంధిపత్రముపై సిరోహీప్రభుని హస్తాక్షరముల లిఖయింపఁజేసి శాంతిస్థాపనముం గావించి ప్రసాదుఁడు విజయుఁడై విజయసైన్యముతోఁగూడ నజమీారునకుఁ దిరిగివచ్చెను.



శ్రీ

# వీర పూజ



## తృతీయఖండము – మోహాంధకారము



మొదటి ప్రకరణము.



### పుష్పమాలిక

అజమీరు నగరము నానావిధ పుష్పపత్ర పతాకలచేతను, వివిధాలంకారములచేతను సమలంకృతమై యుండెను; రాజమార్గములు శ్వేతోష్ణీష తరంగములచే నుద్వేలితములై యుండెను. చిరకాల శత్రుండగు సిరోహీని జయించి ప్రిసాదు డిప్పుడు విజయుండై పురప్రవేశముం గావించుచుండెను. ఆనందోత్సాహములతో నాబాల గోపాలము నాతని సందర్శనమునకై గుంపులు గుంపులుగఁ దోసికొని వచ్చుచుండిరి. ప్రిసాదుఁడు రాజమందిరమునకుఁ బోవు రాజవీధి నానావిధ రత్నాలంకారములచే నలంకరింపఁబడి శృంగారవతి యగు యువతింబోలి యాలోకరమణీయమై యుండెను. కోమలకర నిక్షిప్తంబులగు సురభిళ కుసుమంబులచేతను గుసుమమాలికలచేతను బ్రసాదుని సర్వశరీరమును నాతని యశ్వశరీరమునుఁ గూడఁ దరుణరాగ రంజితంబగు వసంతప్రభాతమునందలి శోభను రామణీయకమును వహించి విలసిల్లుచుండెను.

ప్రిసాదుని గుఱ్ఱమడుగు పెట్టుటకైనఁ దెఱపిలేకుండ రాజమార్గమంతయు జనాకీర్ణమై యుండెను. ప్రిసాదుఁడు మెల్ల మెల్లగ రాజమార్గమునఁ దురగమును నడిపించుకొనుచుఁ బ్రాసాదాభి

ముఖుఁడై పోవుచుండెను. ఆతనికి దక్షిణపార్శ్వమున మందహాస వదనములతో జయంతుఁడును, వామభాగమున జనార్దనుఁడును సగర్వముగ నశ్వారూఢులై నడచుచుండిరి.

వీధిప్రక్కనున్న యొక్క చిన్నయింటిగవాక్షమించుక తెఱవఁబడి యుండెను; ఆ గవాక్షద్వారమునుండి వజ్రనాయకమణి విలసితంబగు గులాబిపూలదండను బోలియున్న యొక కోమలకరపల్లవమునుండి యొక మనోహర పుష్పమాలిక ప్రసాదుని కోమలకంఠమునలంకరించు నుద్దేశముతో నిక్షేపింపఁబడియెను; ఆ పుష్పమాలిక ప్రసాదుని లలాటమునకుఁ దగిలి యశ్వపృష్ఠముపైఁ బడిపోయెను; అప్పుడు ప్రసాదుఁడా గవాక్షమువంకఁ దిలకించెను ఎవ్వరు? ఆతని హృదయాధీశ్వరియుఁద్రిలోకసుందరీ మణియునగు రాజకుమారికయే ఆమె యప్పుడు కిటికీప్రక్క కించుక యొదిగియుండెను—ప్రసాదు—డా పూలదండ నందికొని తన కంఠమునం దలంకరించుకొనియెను. అప్పు డాతఁడు తనలో "ఈసారి నేను నాకొలఁదికిమించిన బహుమానమును బొందియున్నాను, ఈ యజమానిరు ప్రభుఁడు నా కింతకంటె నధికమగు పురస్కారమును గావింపఁజాలఁడు" అని యనుకొనియెను. వేయిమాటలతో నేమిప్రయోజనము? అప్పు డా రాజకుమారికను జూచినవా రితరులెవ్వరును లేరు.

రాజమందిర ద్వారమునకుఁ జేరినతోడనే ప్రధానమంత్రియును, ప్రధాన సేనానాయకుఁడు నాతని కెదురుగవచ్చి గౌరవించిరి. ప్రధానమంత్రి యా ప్రసాదునిం గాంచినతోడనే స్తంభితుఁడై పోయెను. ఆతఁడప్పుడు మహాఘునింబోలి "సిరోహీ విజయమునుం గాంచిన మహావీరుఁ డెక్కడ నున్నాఁడు?" అని ప్రశ్నించెను.

సేనానాయకుఁడు మంత్రికిఁ బ్రత్యుత్తరముగఁ బ్రసాదుని వేర్లితోఁ జూపించెను. ప్రసాదుఁ డప్పుడు మందహాసము చేయుచు "ప్రధానశేఖరా! మరల వచ్చియుంటిని. నేనొకప్పుడు బాల్యచాపలంబున నీతో విశేషించి మాటలాడి యుంటిని; అపచారముగ భావించుకొనవలదు—క్షమింపుము!" అనియెను.

అప్పుడు జయంతకుమారుఁడు మానముతో నూరకుండఁజాలక "మంత్రిశేఖరా! ప్రతిభకలవానికి వయసుతో నిమిత్తము లేదు; ప్రతిభలేనివానికి వయసువలన లాభములేదు; ఇప్పుడైన నీ భ్రాంతిని విడిచి మనస్సును స్థిరపఱచుకొనుము." అనియెను.

మంత్రి నితాంత లజ్జానతవదనుఁ డయిపోయెను. ప్రసాదుడు రాజసభారంగమునఁ బ్రవేశ పెట్టఁబడియెను. పరమాదరముతో రాజాతనిం గౌఁగిలించుకొని "నీ వీరత్వమునకు రాజపుత్రస్థానమంతయును నివ్వెఱపడిపోవుచున్నది. నిన్నుఁ దగురీతిఁ గీర్తించుటకు నాకు సామర్థ్యము లేదు. నీ కేమి కావలయునో కోరికొనుము! నాశక్తి కిమించినది కాకున్నచో నీయెట్టి కోరికనైనను దీర్చుటకు నేను సిద్ధముగ నున్నాఁడను" అనియెను

ప్రసా——మహారాజా! నే నొనరించిన యిక్కార్యము మీ బహుమానలోభము చేఁ జేసినది కాదు. సిరోహీ మీ కెట్టి శత్రువో నాకుఁగూడ నట్టిశత్రువే. అతఁడు నాపితృహంతకుఁడు ఆ పగ తీర్చుకొనుటకే నేను మీ సైన్యమునం జేరి పితృహంతకునకుఁ బ్రతీకారముం గావించి జనకుని ఋణమును దీర్చికొనియుంటిని. నా కార్యము ఫలియించినది బహుమానముపై నాకాశ లేదు.

రాజు——నీకార్యమువలన నా ప్రాణమునకును, మానమునకును రాజ్యమునకును రక్షణము లభియించినది. ఆకారణముచే నేను బ్రదికియున్నంతవఱకును నీకు ఋణపడి యుందును. నీ యిచ్చవచ్చిన బహుమానమును నీవు కోరకున్నచో నా హృదయమునకుఁ బరితుష్టి లేదు.

ప్రసా——మహారాజా! స్వార్థపరత్వముచే నే నొనరించిన యిక్కార్యమున కేలినవారు పురస్కారమీయఁదలఁచి నన్ను నిర్బంధించుచుంటిరి. అట్లయినచో నాకుఁ గావలసిన బహుమానమును మఱియొకప్పుడు వాంఛించెదను. క్షమింపవలయును.

రాజు మంచిది. ఎప్పుడడిగినను నేనిచ్చుటకుసిద్ధముగనున్నాఁడను. నీ కిప్పుడు దుర్గాధిపత్యము నొసంగితిని. స్వీకరింపవలయును.

ప్రసా—చిత్తము.

ఈ విధముగ నాలుగైదు విషయములంగూర్చి సమాలోచన మైన తరువాత మహారాజు ప్రసాదుని నామమును జిరస్మరణీయముగ జేయవలయునను నుద్దేశముతో "రాఁబోవు వసంత పంచమినాఁడు ద్వంద్వయుద్ధముంగూర్చియు, లక్ష్యభేదన నైపుణ్యముం గూర్చియుఁ బరీక్షలు జరుపఁబడును; ఈవీరోత్సవమునకు సమగ్ర రాజపుత్ర స్థానమునందలి సకలయోధులు నామంత్రితు లగుదురుగాక! ఆ పరీక్షలయందు శ్రేష్ఠులుగఁ బరిగణింపఁబడినవారందఱు నుచితబహుమానితులు కాఁగలరు!" అని యాజ్ఞాపించెను.

అప్పుడు మహారాజునొద్ద సెలవుంగైకొని జయంతుఁడును బ్రసాదుఁడును రాజమందిరమునుండి పాదచారులై రాజమార్గమున బయలుదేరిరి. సేనానాయకుని మందిరము నగరమునకుఁ బశ్చిమమునవున్న మైదానములో నున్నది. జయంతుఁడు ప్రసాదునిం దన యింటికిఁ దీసికొనిపోయి "సోదరా! ప్రసాదా! నేను నీకొక నూతన వస్తువును జూపించెదను; అట్టి వస్తువును నీ వెన్నఁడు నెచ్చటను జూచియుండవు" అనియెను.

ప్రసా—అది యెట్టివస్తువు?

జయం—చెప్పుకొనుము చూతము!

ప్రసా—చిత్రపటమా? లతామందిరమా! పరిమళ కుసుమమా? నిశితకరవాలమా?

జయం—కాదు.

ప్రసా—నేను చెప్పుకొనఁజాలను. ఆవస్తువేదియో చూపింపుము!

అప్పుడు జయంతుఁడు మందహాసము చేయుచు "లలితా! లలితా!" అని పిలిచెను. అంతలో గృహమధ్యమునుండి పండ్రెండేండ్లబాలిక పరుగెత్తుకొని వారియొద్దకు వచ్చెను; ప్రసాదుని జూచి యా బాలిక యించుక సిగ్గుపడి జయంతుని సామీప్యమున నిలువఁబడియెను. సౌందర్యమను రాగము చెంత నిలిచినది! అప్పుడు జయం

తుఁడు నవ్వుచు "ఈతఁ డెవ్వఁడో యెఱుఁగుదువా లలితా! ఈతఁడు నీకు మఱియొక సోదరుఁడు—నేను యుద్ధయాత్రకుఁ బోయి యీతని వెదకి తీసికొని వచ్చితిని" అనియెను.

లలిత యించుక సమీపమునకు వచ్చి ప్రసాదుని మొగము వంకఁ దదేకదృష్టితోఁ జూచుచు మృదుమధురస్వరంబున "నీవు నాకు సోదరుఁడ వయ్యెదవా?" అనియెను.

ప్రసా—నీవు నాయొద్దకువచ్చినచో నీకు నీయన్న నయ్యెదను.

బాలిక యించుక ముందటికి జరిగి నిలిచెను. కేవల మాతని యొద్దకు రాలేదు.

ప్రసా—నేను నీ యన్నను గాఁజాలను. నే నెవ్వతెకు సోదరుఁడను గావలయునో యామె నాయొద్దకు రావలయును; నా యొద్దఁ జనవున మెలఁగవలయును. నేను పిలిచినఁ బరుగెత్తుకొని రావలయును.

లలి—నీవు నన్నుఁ బిలువలేదు.

ప్రసా—లలితా! లలితా! సోదరీ! చెల్లెలా! నాయొద్దకు రమ్మి.

ఈసారి లలిత నిస్సంకోచముగఁ బ్రసాదునియొద్దకు వచ్చి యాతనికటిస్థలంబున వ్రేలాడుచున్న కరవాలముఁ నొరనుండి బయటికిఁదీసి "ఈ నరమారణయంత్రము నీయొద్దఁగూడ నున్నదా? జనకుఁడు నరహంతకుఁడు; సోదరుఁడు నరహంతకుఁడు; నీవును నరహంతకుఁడవేనా?" అని ప్రశ్నించెను.

ప్రసా—నరమారణమున దోష మేమున్నది లలితా?

లలి—నరుఁడు సుందరుఁడు. నీవు వ్యాఘ్రములను హింసింపుము; భల్లూకముల సంహరింపుము! సర్పములను విదళింపుము; అందువలన దోష మేమియును లేదు. కాని మానవులనుమాత్రము వధియింపవలదు.

ప్రసా—నరుఁడు సుందరుఁ డని నీ కెవ్వరు చెప్పిరి లలితా?

లలి—ఏమి? నేను సుందరిని; తండ్రి సుందరుఁడు; అన్న సుందరుఁడు; అమ్మ సుందరి; మనము మనుజులము; కావున మన మందఱము సుందరులము; సుందరులగువారి నేల చంపవలయును?

ప్రసా—ఎవ్వరు కుచ్ఛితులో వారిని సంహరింపవలయును.

లలి—కుచ్ఛితు లెవ్వరు? మానవులలోఁ గుచ్ఛితు లెవ్వరున్నారు?

జయం—లలితా! ఈ క్రొత్త యన్న యెవ్వరో నీ కింకను దెలియలేదు. ఎవ్వని చరిత్రమును నీ వెల్లరివలనను వినుచుంటివో యాసిరోహీ విజయుఁడగు మహావీరప్రసాదుఁ డితఁడే!

లలి—అసత్యము—

జయం—ఏమి?

లలి—ఈ నా నూతనసోదరుఁడు సుందరుఁడు—ఈతఁడు ప్రసాదుఁడు కాఁడు. ప్రసాదుఁడు కఠినరాక్షసుఁడు—

జయం—ప్రసాదుఁడు రాక్షసుఁ డెట్లయ్యెను!

లలి—అతఁడు వేలకొలఁది మానవులను సంహరించి వైచినాఁడు.

అప్పుడు జయంత ప్రసాదు లిరువురును లలితయుక్తికిఁ బరాజితులై పోయిరి. అనంతరము లలిత ప్రసాదునిచేయి పట్టుకొని యంతఃపురమునకుఁ దీసికొనిపోయి యచ్చ టెచ్చటఁ దన యైశ్వర్యముండెనో యొక్కొక్కటిగ నంతయు నాతనికిఁ జూపింప నారంభించెను. తన పూలమొక్కలు, తన పెంపుడుపిట్టలు, తనయాటబొమ్మలు మొదలగువాని నన్నిటిని బ్రసాదునకుఁ జూపించెను; తల్లిని జూపించెను; ఇంతేకాదు—ఆ బాలిక వినిర్మలదర్పణసదృశంబగు తనకోమల స్వచ్ఛ హృదయమును గూడ నాతనికి విస్పష్టముగఁ బ్రదర్శించెను. ప్రసాదుఁడు ముగ్ధుఁడై వెలుపలికి వచ్చెను.

తరువాతఁ బ్రసాదుఁడు జయంతునియొద్ద సెలవుఁ దీసికొని వెడలిపోవఁ దలఁచుచుండఁగా లలిత యాతనిం జూచి "నీవు నా యన్నవు కావు" అనియెను.

ప్రసా—అది యేమి లలితా ?

లలి—నాయన్న వయినచో నాయొద్ద నుండవలయును ; నాతో నాడుకొనవలయును ! నన్ను "లలితా" యని పిలుచుచుండవలయును.

ప్రసా—పిలిచెదను—కాని యిప్పుడుకాదు. అప్పుడప్పుడువచ్చి నా సోదరిని సందర్శించి పోవుచుండెదను.

లలి—నీకుఁ దల్లిదండ్రు లున్నారా ?

ప్రసా—ఎవ్వరును లేరు. లలితా ? నేను దుఃఖజీవిని !

లలి—ఎవ్వరు దుఃఖజీవులో వారినే నేను ప్రేమించుచుందును. ఇంతటినుండి నీవు నా సోదరుఁడవు నీవు కఠినరాక్షసుఁడగు ప్రసాదుఁడవైన నగుదువుగాక ! అయినను దుఃఖజీవి వగుటచే నీవు నాకు సోదరుఁడవే.

అని పలుకుచు లలిత ప్రసాదుని హస్తమును బట్టుకొని "నీ చెల్లెలిని విడిచి నీ విప్పు డెవ్వరియొద్దకుఁ బరుగెత్తుచున్నావు ? అన్నా! నీకు నాకంటెను ముఖ్యులెవ్వరున్నారు ?" అనియెను.

ప్రసాదుఁడు నిర్విణ్ణుఁడై నిలువఁబడిపోయెను. జయంతకుమారుఁడు నవ్వుచుఁ బ్రసాదుని వదనమండలమును దదేకదృష్టితోఁ జూచుచుండెను. ఇంతలో సేనాపతియగు కమలసింహు, డచ్చటికి వచ్చి సకలవృత్తాంతమును దెలిసికొని ప్రసాదునిం జూచి యాదర సూచకముగ "ప్రసాదా ! నీవంటిపుత్రుఁడు—నీవంటి సోదరుఁడు—నీవంటి యతిథి—యెంతటివారికి లభియించును ? నీవు నా మందిరమున నా తనయునివలె నుండుట కంగీకరించినచో నేను సుఖినయ్యెదను ; బహుమానితుఁడ నయ్యెదను. ఏ దినమున నిన్ను దర్శించితినో యప్పుడే నేను నీ రూపగుణంబులచే నాకర్షింపఁబడిపోయితిని. ఈ జయంతుఁడును లలితయు ప్రయాణమున కనుమతించుట లేదు" అనియెను.

ఆ దండనాయకుని మందిరమునందే ప్రసాదున కొక నివాస మందిరము నిర్దేశింపబడియెను. రామశరణుని యిల్లు విడిచి రేపటి

నుండి యిచ్చట నే నివసించి యుండెదనని యంగీకరించి ప్రసాదుఁడు వారియొద్ద సెలవుదీసికొని వెడలిపోయెను. తరువాతఁ బ్రసాదుఁడు జనార్దనునితో నాలోచించి దేవలున కొక యుత్తరమును వ్రాసి పంపించెను. ఆలేఖ నరిగ దేవలునకే యందించునట్లు లేఖావాహకునకుఁ దగిన యుపదేశము గావింపఁబడియెను.



రెండవ ప్రకరణము.

# దుఃఖించుచుంటివా?

మఱునాఁటి యుదయమున మహారాజగు శూరసింహుఁడు మహా సమారోహముతో దేవీపూజార్థమై జయదేవీమందిరమునకు బయలుదేరెను. పెద్దపెద్ద యుద్యోగులందఱు నాతని వెంబడించి యుండిరి. ప్రసాదుఁడు, జయంతుఁడు, ఉమాబాల, లలిత, నీల, శ్వేత, రాజు, రాణి మొదలగువా రందఱును జయలక్ష్మీపూజాభిలాషులై భక్తిపూర్ణహృదయములతోఁ బాదచారులై జయదేవీమందిరాభిముఖముగ నడచుచుండిరి.

దేశాచారానుసారముగ రాజును రాణియును ముందుగ దేవిని బూజించుటకై మందిరమధ్యమునఁ బ్రవేశించిరి. ప్రసాదుఁడు ప్రాంగణమునొద్దఁ గనుపెట్టుకొని యుండెను. జయంతుఁడు రహస్యముగ నుమాబాలతో నొకటి రెండు మాటలాడవలయునను నుద్దేశముతో నటునిటు దిరుగుచు నవకాశమును బ్రతీక్షించుచుండెను; సమయము దొరికినది కాని, సంపూర్ణముగ సంభాషించుట కవకాశము లేకపోయినది. ఆ కొలఁదిసమయములోనే జయంతకుమారుఁడు "రాజకుమారీ! ఇన్నాళ్ళకు మరల నీమందిరమునొద్ద నిన్నుఁ జూచుభాగ్యము నాకు లభియించినది. యుద్ధము ముగిసినది—నీవు యుద్ధరంగమున నిలిచి నాశక్తిసామర్థ్యములను నీ కన్నులఁ దిలకించియే యుంటివి!" అనియెను.

ఉమా—సేనాపతికుమారా! ఏమి చెప్పుటకు నా కిష్టము లేదో యామాట నాచే నేల చెప్పింపఁజూచెదవు? ఇఁక నీమాట యెత్తవలదు.

జయం—అట్లయినచో నే నెటులుండఁగలను?

ఉమా—నీవు సాహసుఁడవు: యోధుఁడవు—రాజపుత్రీప్రీతిహేతువగు రణమున నీనామాక్షరములు సుస్థిరములగు నంతటియశస్వి వయ్యెదవుగాక!

జయం—ఉమా! నీవే నాసాహసమవు నీవే నాకీర్తివి. నీవు నాకించుక యుత్సాహమును గల్పించినచో రాఁగల వసంతపంచమి నాఁడు వీరపరీక్షయందు నా సామర్థ్యమును బ్రకటింపఁజాలుదును; అప్పుడు నేను రాజసన్మానమునకుఁ బాత్రుఁడ నయ్యెదను; రాజకుమారీ! ఆ కారణమున నేనీ వీరలోకమున సుప్రసిద్ధుఁడనుగాఁ గలుగుదును; నీవు నాదానవే యగుదువు కాదా?

ఉమా—అసంభవము.

జయం—అసంభవ మెట్లు రాజపుత్రీ?

ఉమా—ఆసంగతి మఱియొకప్పుడు చెప్పెదను.

అని చెప్పి యుమాబాల యటనుండి వెడలిపోయెను. జయంతకుమారుఁడు చింతాక్షుభితహృదయముతో నగరమునకుఁదిరిగివచ్చెను. రాజును రాణియును బుష్పచందనాదులతో దేవిపాదకమలములను బూజించిరి. తరువాత నందఱును గ్రమక్రమముగ దేవీపూజ గావించి గృహాభిముఖులై పోయిరి. కాని రాజపుత్రిమాత్ర మింకను దేవీపూజ చేసికొనలేదు. సమీపనదీతీరమునం గూర్చుండి నీలాశ్వేతలు మృత్తికతో మహాదేవి విగ్రహములను జేయుచు మరలఁ జెరిచి మరలఁ జేయుచుండిరి. మందిరోద్యానమునఁ బూవులు గోయుచు రాజకుమారి యటునిటుఁ దిరుగుచుండెను. ఆ సమయమున దేవీమందిరద్వారము తెఱచిన చప్పుడు వినవచ్చెను. ఉమాబాల విస్మయముతోఁ బోయి చూచునప్పటికిఁ బ్రసాదుఁడు పూజాద్రవ్యముల

సమకూర్చుకొని దేవీ పాదపీఠ సమీపమునఁ గూర్చుండి యుండెను. రాజపుత్రి యాద్వార పార్శ్వమున నిలిచియుండి తిలకించుచుండెను.

రక్తరాగ రంజితంబులగు దేవీ పాదపద్మములు నానావర్ణ పరిమళ కుసుమంబులచే సమాచ్ఛాదితములై యుండెను. ఆ పాద పద్మము లాయుపాసకుని నేత్రాంత రాళములనుండి హృదయకమల మధ్యమునఁ బ్రతిఫలితము లగుచుండెను. భక్తి రసరంజితహృద యుఁడగు ప్రసాదుఁ డప్పుడు గంభీరకంఠస్వరముతో—

"త్రిజగతాధారభూతులై ♦ త్రిగుణులైన
హరిహరబ్రహ్మలకుఁ గూడ ♦ నందరాని
సత్యరూపిణివై జగ ♦ జ్జననివైన
తల్లి! జయదేవి! నీకు వం ♦ దనశతంబు"

అని ప్రార్థించుచుండెను. ఉషాబాల మంత్రముగ్ధవలె నామ ధురకంఠమునుండి వెలువడుచున్న యా విశ్వసంగీతము నాలకించు చుండెను. అటనుండి యొక్కయడుగైనఁ గదలుట కామె సాహసింపఁ జాలకుండెను.

స్తోత్రము సమాప్తమొనర్చిన పిదప నే ప్రసాదుఁడు దేవీచరణము లకు సాష్టాంగప్రణామముం గావించి "అమ్మా! నా మనోబలము పోయినది మరల నా బలమునకొఱకు నీపాద సాన్నిధ్యమునకు వచ్చి యుంటిని. తల్లీ! నేననాథుఁడను, నిర్భాగ్యుఁడను; నాకు దాసత్వమే జీవిక యయినది. జననీ! ఈ దరిద్రుని కన్నులయెదుట నమూల్య రత్నముంబెట్టి యేల యాశ పెట్టెదవు? ఈ యజ్ఞాతకులశీలుఁడును, వస్త్రవ్యవసాయియు, భిక్షుకుఁడును నగునాకు మహారాజులచే నాకాంక్షింపఁబడఁదగినదియు, దేవీదుర్లభయు, ననుపమాన సౌం దర్యశాలినియునగు నుషాబాల లభియించుటయెట్లు? అట్టి స్థితిలో నా దుర్బలహృదయము నుద్వేలితముగఁ జేసివైచునంతటి దురాశను నాకేల కల్పించితివి తల్లీ! జగన్మాతా! నేను దుర్లభపదార్థమునకై యనుసరించిపోవుచుఁ గర్తవ్యమును మఱచిపోవుచున్నాను. స్వధ ర్మము నుల్లంఘించుచున్నాను; నిన్నుఁ బ్రార్థించుటకూడ మఱచు

చున్నాను. ఆ బాలిక మనోమోహనమూర్తి నాకున్మాదమును గల్పించుచున్నది ఈ ప్రేమానలము—ఈ ప్రజ్వలితదారుణదావానలము చల్లారుట కుపాయమును బ్రసాదింపుము తల్లి! ఈనిగూఢ ప్రేమచరిత్రము బయటఁబడుటకుఁ బూర్వమే నా స్మృతియును, నాజ్ఞానమును నశించుపోవున ట్లనుగ్రహింపుము! నా కులశీలములఁ దెలుపువఱకును నా కామె లభియింపదు; నే నెన్నటికి నట్లు తెలుపఁదలఁచుకొన లేదు; నా సంగతి యెంతమాత్రము బయటఁ బడినను నే నిచ్చట నుండఁజాలను. నా పినతండ్రి సర్వజనసమక్షమున నా పరిచయమును గల్పించువఱకును నే నిట్లే యజ్ఞాతవాసము చేయుచుందును. ఆతఁ డట్లు చేయనిచో నా జీవిత మిట్లే గడపివైచెదను—నా పినతండ్రి నన్నెప్పు—డు—"

ఇఁక నాతనినోట మాట వెడలలేదు; తల్లి పాదములపైఁ బడి పొరలుచుఁ జాలసేపు దుఃఖించెను; ఆ దుఃఖముచే నాతని హృదయము శాంతించినది; మెల్లగ నాతఁడు కన్నులు దుడుచుకొనుచు వెలుపలకు వచ్చెను. అకస్మికముగ నాలోకాతీత దేవీమూర్తి యాతనికన్నులఁ బడియెను. ఏ సుందరీమూర్తిని మఱచిపోవుటకై యింత యాలోచనము చేయుచుండెనో, యింత ప్రయత్నము చేయుచుండెనో, యా సుందరీమూర్తియె యింకను నాతనియెదుట సాక్షాత్కరించుచుండెను.

ఇరువురు నన్యోన్యాభిముఖులై యుండిరి, కాని యిరువురును మాటలాడుటలేదు. అన్యోన్యసందర్శనమునకై వ్యాకులపడుచుండెడివారు—పరస్పర సంభాషణమునకై వేడుకపడుచుండెడివారు—కేవల మిప్పు డొకరినొకరు లభిముఖులై యుండియును మౌనముతోఁ దలవంచుకొని బొమ్మలవలె నిలిచియుండిరి. అప్పుడు ప్రసాదుఁడు "జగన్మాత పాదపీఠమునొద్ద నేఁజేసిన ప్రార్థనము నీ రాజకుమారి విని యుండదు గద ?" అని యనుకొనియెను. రాజకుమారి "ప్రసాదా! ప్రత్యక్ష మదనసుందరా! నే నిన్నాళ్ళకు నీవు నన్నుఁ బ్రేమించియున్నట్లు తెలిసికొంటిని; వినియుంటిని;—నీ హృదయము

నా కవగతమైనది—చాలును— ఇఁక నీ కులశీలాది పరిచయముతో నా కెంతమాత్రమును నిమిత్తము లేదు." అని భావించుకొనియెను.

కొంతసేపటికిఁ బ్రసాదుఁడు ధైర్యము తెచ్చుకొని "రాజనందినీ! నీ వింకను నిచ్చటనే యుంటివేమి?" అనియెను.

ఉమాబాల పూజాద్రవ్యములను జూపించెను. ఆమె యింకను దేవీపూజ చేసికొనలేదని ప్రసాదుఁడు గ్రహించెను; ఇరువురునొక్కింతసేపు నిస్తబ్ధులై యుండిరి. అప్పుడు రాజకుమారి "నీవు దుఃఖించుచుంటివా?" అని ప్రశ్నించెను.

ప్రసాదుఁ డా ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పక "నీ కన్నులెఱ్ఱనై యున్నవి; ఇంచుక యార్ద్రములై నట్లగపడుచున్నవి. నీవుదుఃఖించుచుంటివా?" అని మరలఁ బ్రశ్నించెను.

రాజకుమారి తలవంచుకొని "దుఃఖించుటలేదు. నా కన్నులలో నేవియో నలుసులు పడినవి" అనియెను.

ఉమాబాల యసత్యము చెప్పినది. నిజముగ నామె దుఃఖించుచునే యుండెను.

ప్రసా—నేను దుఃఖించితిని.

ఆ సత్య సరళవచనము రాజకుమారి హృదయమర్మమును భేదించివైచెను. ఆమె ప్రాణాంతిక యాతన ననుభవించెను. అప్పుడు ప్రసాదుఁడు "రాజనందినీ!" అని పిలిచెను. రాజకుమారి తనయాకర్ణాంత విస్తృతంబులును, సజలబిందు విలసితంబులును నగు చూపులను ప్రసాదునివదన కమలమునం దుంచెను. విద్యున్మయ నీలమేఘము నీలసముద్రమును నిరీక్షించునట్లుండెను. ప్రసాదుఁ డిఁక మాటాడఁజాలకపోయెను. ఆ చూపులలో మునిఁగి ప్రసాదుఁడు సర్వమును మఱచిపోయెను. ఆనందపరవశుఁడై తదేకదృష్టితో నామె వదనకమలము వంకనే వీక్షించుచుండెను.

ఆ సమయమున నీలయు శ్వేతయువచ్చి రాజపుత్రి పార్శ్వమున నిలిచిరి. అప్పుడు నీల యొకపుష్పహారము నుమాబాల కిచ్చుచు "ఈపుష్పహారముచేఁ బ్రసాదునికంఠము నలంకరింపుము!" అనియెను.

చేయి జరగినదికాదు. ప్రసాదునికంఠము పుష్పమాలికా లంకృతము కాలేదు ప్రసాదుఁ డటనుండి వెడలిపోయెను.

అప్పుడుమాబాల నిలిచినచోటనే కూలఁబడి బాష్పగద్గద కంఠస్వరముతో "నీలా! నేను మిథ్యావాదిని నైపోయితిని. నేనాతనియెదుట నసత్యము చెప్పితిని. నే నాతనికిఁ దగినదానను గాను. ఆతఁడు సత్యావతారము. సత్యమార్గమును నా కాతఁడు బాగుగ బోధించినాఁడు ఈ పాపాత్మురాలి హస్తములచే స్పృశింపఁబడిన యీ హారము వానికంఠము నలంకరించుటకు యోగ్యమైనది కాదు. ఒకసారి నేను వైచిన పుష్పమాలిక యీతని లలాటమునకుఁ దగిలి గుఱ్ఱముపైఁ బడిపోయినది. ఇఁక నిప్పు డాతఁడు నేనాతనికిఁ దగిన దానను గానని యెంచి వెడలిపోయినాఁడు. తల్లీ! లోకమాతా! భవానీ! నన్నాతనిదాసిగ నైనఁ జేసి యనుగ్రహింపవా దేవి? అని యెను.

---

మూడవ ప్రకరణము

# వీఁడేనా వాఁడు?

పిమ్మటఁ గొన్నిదినములు గడచినవి. ఒకనాఁ డనంతరాముఁడు మనకుఁ బూర్వపరిచితమగు నాతని చిన్నగదిలోఁ గూరుచుండి యుజమీరునందలి సుప్రసిద్ధపురుషుల చిత్రపటములను దిలకించుచుండెను. ఆ సమయమునఁ బార్శ్వమునందున్న గూఢద్వారము తెఱవఁబడి యెను— అంత నొకయోధుఁడువచ్చి యనంతరాముని ప్రక్కను నిలువఁబడియెను. ఆతనికి నలువదియేండ్లుండవచ్చును. పేరు మహాదేవరావు—పొట్టివాఁడు—ఉగ్రస్వభావుడు—కపటవినయి—క్రూరుఁడు—అయినను బుద్ధి సూక్ష్మతకలవాఁడు. ఆతఁ డనంతరాము నకు మిగులఁ బ్రేమ పాత్రుఁడై యుండెను. అనంతరాముఁడు తన హృదయభావముల నాతనికంటె మఱియెవ్వరికిని దెలియనీయఁడు.

అయినను వసంతరాముని గంభీరహృదయమును మహాదేవరావుకూడ గ్రహింపఁజాలకుండెను.

మహాదేవుఁ డొకప్పుడు దరిద్రుఁడు. అనంతరాముని దయచే నట్టివాని కిప్పుడు సేనాపతిత్వము లభియించినది. తన సామర్థ్యముచే నాతఁడు క్రమక్రమముగ సర్వసేనానాయకుఁ డయ్యెను. రాజహృదయమును దెలిసికొనుట యెట్లో, రాజును గరగతునిగఁ జేసికొనుట యెట్లో, యాతనికిఁ బాగుగఁ దెలియును. మహాదేవరా వెన్నఁడును యుద్ధమును జూచియయిన నుండలేదు. అయినను నాతనికి సేనాపతిత్వము లభియించినది. అనంతరాముని యుద్దేశమును గ్రహింపఁజాలని వారి విషయమున నాతని నాక్షేపింపకమానరు. రాజసైన్యమున జనప్రియుఁడును, సమర్థుఁడును నగు దండనాయకుఁ డున్నచో నాతఁడు భృత్యునివలె నుండక సర్వవిధముల స్వతంత్రుఁడై యుండును. ఈసంగతి నాలోచించి యనంతరాముఁడు తానే సర్వసేనానాయకుఁడై యుండవలయునని యెంచి పేరునకుమాత్ర మాతని దండనాయకునిగాఁ జేసెను. సమర్థుఁడగు రెండవ సేనానాయకుఁ డుండఁ గూడదనియే యాతని యుద్దేశము.

అనం—ఆతఁ డెవ్వఁడో యింతవఱ కేమైన గ్రహింపఁ గలిగితిరా ?

మహా—ఇంకను దెలియలేదు. కాని త్వరలోనే తెలిసికొనఁ గలనని విశ్వసించుచున్నాను.

అనం—అజమీరునకుఁ బంపినవా రింకను రాలేదా ?

మహా—అయిదారు దినములలో రాఁగలరు.

అనం—అంతటి వీరత్వమును నే నెన్నఁడును వినియుండలేదు. శూరసింహుని రక్షించి సేనానాయకు నుద్ధరించుటయే కాక శత్రువులను నిర్భయముగ వెన్నంటి తఱిమి సిరోహీని చిందరవందర గావించినాఁడు. ఇంతటి ప్రతిభ, ఇంతటిసామర్థ్యము స్వర్గస్థుఁడగు మాయన్న వీరేంద్రకేసరి కొక్కని కేయున్నది. వీఁ డాతనిపుత్త్రుఁడు కాఁడుగద !

మహా—కాఁడు—మహారాజా! భవానీప్రసాదు చాలదినముల క్రిందటనే మరణించినాఁడు.

అనం—ఇప్పటి కెనిమిదిమాసములైనది. అయినను నాకిప్పుడప్పుడాతఁడు చావలేదని సంశయము కలుగుచునే యున్నది.

మహా—మహాప్రభూ! ఒకవేళ నాతఁడు బ్రదికియున్నాఁడే యనుకొందము. అయినను నేను జీవించియుండఁగా నొక్కబాలకుని కొఱకు మీ రకారణముగ నంతగా భయపడియెద రేల?

అనం—సిరోహీవిజయియగు కులశీలములు తెలియని యీ బాలవీరుఁడు ప్రసాదుఁడే యగునేమో యని—

మహా—అది కేవల మసంభవము—నేను భవానీప్రసాదును జూచియుంటిని. కేవలము నాతఁ డొకదుర్బలశిశుమాత్రుఁడు. నా చేతిలోని కరవాలము నెత్తుటకైన నాతనికి శక్తిలేదు.

అనం—నీకాతనిసంగతి తెలియదు. మహాదేవా! ఆతఁ డేఁబదిమంది వీరుల నేకవీరుఁడై మర్దించి సుధామందిరము నుండి తప్పించుకొనఁ గలిగినాఁడు. ఆతనిబాహువులయందు జనకుఁడగు వీరేంద్రకేసరి యసాధారణశక్తి యున్నది! ఆతని కసాధ్యకార్యమను నది యేదియును లేదు.

మహా—మంచిది. అట్లే కావచ్చును. ఆతఁడు జగదేకవీర శిఖామణి—కాని యిప్పు డాతనివలన మన కేమిభయము?

అనం—ఆతఁ డజమీరుసేవలం దీసికొని మనల నాక్రమించిన నో మనసైన్యమునం దాతని నడ్డగింపగలసమర్థుఁ డెవ్వఁడున్నాఁడు?

మహా—మహారాజా! మీరేనా యంతటి పరాక్రమవిహీనులు? అతఁడేనా మహాపరాక్రమశాలి?

అనం—మహాదేవా! నీ వెఱుఁగవు! ఆతనిం గాంచినతోడనే విశ్వాసవిహీనులగు మనసైనికు లందఱును మనలను వదలి యాతని పక్షమునఁ జేరిపోవుదురు.

ఆసమయమున ద్వారపాలకుఁడు వచ్చి యొకయుత్తరమునిచ్చెను. ఆలేఖ దేవలునుద్దేశించి వ్రాయఁబడినది. నిస్సంశయముగ ననంతరాముఁ డాయుత్తరమును విప్పి చదివెను. అందిట్లున్నది—

"దేవలా! నీవు నన్నుఁ జూచుటకు రాఁదలఁచితివేని—అజమీరు సేనాపతిమందిరమున నాసంగతులు నీకుఁ దెలియఁగలవు"

ఉత్తరమునం దెచ్చటను వ్రాసినవారినామాక్షరములు లేవు. ఆయుత్తరమును జదివి యనంతరాముఁ డాద్వారపాలకునిం జూచి "నీకీ లేఖ నెవ్వరిచ్చినారు?" అని ప్రశ్నించెను.

ద్వార—యువరాజగు దేవలుని సేవకుఁడు—

అనం—ఆతని నాయొద్దకుఁ బంపుము—

అంతలో ద్వారపాలకుఁడుపోయి సేవకునిం బంపెను. అనంతరాముఁడు "మిహిరా! ఏమిసమాచారము?" అని ప్రశ్నించెను.

మిహి—దేవరయనుమతి ననుసరించి నేను యువరాజు దేవలుని పరిచారకుఁడనై యున్నాఁడను. ఒకయాశ్వికుఁడు మందిరద్వారము నొద్దకు వచ్చి దేవలునుమాఱు నన్వేషించుచుండెను. నేను సందేహించి మిగులనేరుపుతో నాతనియొద్దనుండి లేఖను సంగ్రహించి యిదివఱకెల్ల లేఖలను మీకెట్లుపంపుచుంటినో దీనినిగూడ నట్లే పంపితిని.

అనం—మంచిపని చేసితివి. నీకార్యమునకు నేను చాలసంతసించితిని.

అని చెప్పి కొన్ని నిష్కములనాతనికి బహుమానముగనొసంగి పంపివైచి "మహాదేవా! ఈయుత్తరము నెవ్వరు వ్రాసిరో నీవు గ్రహించితివా? ఇది యాసిరోహీవిజయుఁ డగుపర్సాదుఁడు వ్రాసిన యుత్తరమే—ఈ తేజస్వతీనగరాధీశ్వరుఁడగు భవానీ ప్రసాదుఁడే ప్రసాదుఁడు! ఈయుత్తర మాతనిదే!" అనియెను.

భయముచే మహాదేవుని వదనము వైవర్ణ్యము నొందెను. ఆతఁడు భయవికృతస్వరముతో "మహారాజా! ఏమని వ్రాసినాఁడు? మననగరము నాక్రమించుటకు వచ్చుట లేదుగద?" అనియెను.

అనం.—ఇంతవఱకు వచ్చుట లేదు; ఇఁకముందు రావచ్చును

మహా—అట్లయినచో మనకేమియుపాయము మహారాజా?

అనం.—ఉపాయము మున్నది—సావధానముగా నాలకింపుము. మనసైన్యమంతయును వెంటఁబెట్టుకొని నీవిప్పు డజమీరునకుఁ బయనమై పొమ్ము. రాజధానిఁ జేరి సేనాపతి మందిరమును భవానీప్రసాదుని వెదకుము. అతఁడు దొరకినచో నేమి చేసియయినను నాతని సంహారించి రమ్ము! అతఁడు మరణించినచో నేనితరుల నెంతమాత్రమును లక్ష్యము చేయువాఁడనుగాను. పొమ్ము. సేనాతరంగములచే నజమీరును ముంచి వేయుము. కాని—అతఁడు కృపాణహస్తుఁడై కన్నులఁ బడుటయే తటస్థించిన యెడల మనయోధులచేతులలోని కరవాలములు జారి క్రిందఁ బడిపోవును—విశ్వాసఘాతుకులగు మన సైనికులు మనలను బరిత్యజించి యూతనితోఁ గలిసిపోవుదురు—నీవు పొమ్ము! ఇప్పుడే బయలుదేరి పొమ్ము! కావలసినంత సైన్యమును దీసికొని పొమ్ము! కాని, సావధానుఁడవై యుండుము. విశ్వాసముగల యోధులను దక్కఁ దక్కినవారిని వెంట నుంచికొనకుము! భవానీప్రసాదుని జంపుటకు నీవేమి చేసినను నాకు సమ్మతమే. ఆవిషయమై యజమీరు ప్రభుసింహా యుద్ధముతటస్థించినను సరియే. అతఁడు మందిరమునందున్నచో మందిరమును భేదించి చంపుము; సింహాసనమునందున్న చోఁ గ్రిందికిఁ ద్రోసి వధియించి రమ్ము! ఎచ్చటనున్న నచ్చటికిఁ బోయి సంహారించి రమ్ము! అతఁడు బ్రతికి యున్నంతవఱకు నాకు శాంతిలేదు; నారాజసింహాసనము నిష్కంటకము కాఁజాలదు.'' అనియెను.

మహాదేవుఁడు సెలవు గైకొని వెడలిపోయెను. తరువాతఁ గొంతసేపటివఱకు ననంతరాముఁ డచ్చటనే ప్రచారము చేయుచుండెను. తుదకాతని కొకయాలోచనము తోఁచుటచే దేవలునికొఱకు భటుని పంపించెను. కొలఁదిసేపటిలోనే దేవలుఁడు వచ్చెను. దేవలుని శరీరమునం దిప్పటికిని బలము చేరుకొనలేదు. ఎనిమిది మాసములైనది. ఇంతవఱ కాతనికిఁ బ్రియసోదరుని సమాచారమే తెలి

యుట లేదు. జనార్దనుఁడైన నట్టిసమాచారమును దెలుపుట లేదు. అన్నగారిదర్శనము లేకుండుటచే దేవలుఁడు దుఃఖించుచుండెను. ఆ దుఃఖమే దేవలుని సర్వాంగములను దహించివైచుచుండెను. అది తక్క యావీరబాలుని హృదయము నెంతటి దుఃఖాఘాతమైనను నొప్పింపగలదా? భూకంపమునకు హిమాలయశృంగమైనను భంగమైపోవునుగాని కోమలమూర్తికా ప్రాచీరము చెక్కు చెదరనైనఁ జెదరఁబోదు.

అసం — కుమారా! నీ విదివఱకే చాలదినములకిందట దేశసంచారము చేయవలయునని కోరియున్నావు. ఇప్పుడు వైద్యులు కూడ నీయారోగ్యమునకు వాయుపరివర్తనము కావలయునని చెప్పుచున్నారు. ఇప్పటి కవకాశము కలిగినది. నిన్నిప్పుడు సిరోహీప్రభువు నొద్దకు రాయబారిగాఁ బంపఁదలఁచితిని. అతఁడు మన శుభాకాంక్షియయి యున్నాఁడు. ఇప్పుడాతఁడు—

అని చెప్పి దేవలునివంకఁ దీవ్రదృష్టితోఁ జూచుచు "ఇప్పు డాతఁడు శూరసింహునిచేఁ బరాజితుఁడై యవమానదుఃఖితుఁడై యున్నాఁడు. ఇట్టి కష్టసమయమున నాతనికిఁ దోడుపడుట మన కవశ్యకర్తవ్యము; అట్లు నేనాతనికిఁ దోడ్పడఁదలఁచి యున్నాను. నేనైదువేల సైన్యముతోఁ బూర్వదిశనుండిపోయి యజమీరు నాక్రమింపఁదలఁచితిని. అతఁడు పశ్చిమదిక్కునుండి యారావళీపర్వతమార్గమున వచ్చి సేనాతరంగములతో నజమీరు ముంచివేయవలెను. ఇది నామాటగా నీవుపోయి యాతనితోఁ జెప్పవలయును" అనియెను.

దేవ — తండ్రీ! అజమీరుప్రభువు మనకుఁ జేసిన యపకారమేమున్నది?

అసం — ఇప్పు డాతఁడు మనకు శత్రుఁడైపోయినాఁడు. నా సోదరుఁడు వీరేంద్రకేసరి కాలమునం దాతఁడు మనకు వత్సరోపహారము నంపుచుండెడివాఁడు. ఇప్పు డది లేదు. ఇంతేకాక యాతఁ డనేకవిధముల మనల నవమానించుచున్నాఁడు. నీవు పయనమునకు

సిద్ధపడుము. వారము దినములలో నీవచ్చటఁ జేరవలయును. అజమీరు మార్గమున సిరోహీకిఁ బోఁగూడదు. అజమీరునకు వామ భాగమునుండిగాని, దక్షిణమునుండిగాని బయలుదేరి పోవలయును.

దేవలుఁడీఁక వాక్యవ్యయము చేయక యటనుండి మెల్లగ వెడలి పోయెను.

---

నాలుగవ ప్రకరణము.

## ఉన్మత్తయగు ప్రమద

ప్రమద చచ్చిపోవుచున్నది — ఎఱుఁగకుండ — సంగతి తెలిసికొనకుండ నామె ప్రేమించినది. ఆమె హృదయమునకు సుఖము లేకుండఁబోయినది. ఆమెకు వేషభూషణముల యుపయోగమే లేకుండఁ బోయినది. ప్రమద యిప్పుడింకఁ బొరుగిండ్లకుఁ బోవుటలేదు; జగడముల మాట మఱచిపోయినది. ఆమె యొంటిగ నింటఁ గూర్చుండి యేమేమొ యోచించుకొనుచుండెను. ఇప్పు డామె యధర ప్రాంతమున నుండి తొలఁగుచున్న మందహాసము లేదు; ఆ సుందరాంగకముల విలాసభంగులు లేవు; ఆ మృదుమధుర వచనములు లేవు; ఆ లలితతర కటాక్షము లెక్కడకుఁ బోయినవో పోయినవి. ప్రమద ప్రసాదుని ప్రేమించినది.

ప్రమద విధవ — ఆమె యామాటయే మఱచిపోయినది. తాను రూపవతిననియు, యువతిననియు నామె యనుకొనుట లేదు. ఆమెకుఁ గేవలము తెలిసిన సంగతి యేమనఁగా — తాను ప్రేమించితిననియే — నేఁటి సాయంకాలమునందామె యించుక చంచలయయి యుండెను. ఒకసారి బహిర్మందిరమున — ఇంకొకసారి గృహాంగణమున — యటియొకసారి వీధిలోపల — చంచలచిత్తముతో నామె తిరుగుచుండెను. ఆమె యేమి వెదకుచున్నదో యెవ్వరికొఱకు నిరీక్షించుచున్నదో యాకార్యము ఫలింపకుండుటచే నిరాశా పరవశ

యయి మాటిమాటికిఁ దిరిగితిరిగి చూచుచుండెను. తుద కామె సంపూర్ణముగ హతాశయయి యొక్క దీర్ఘశ్వాసమును విడిచి "ఇంకను నాతఁడు రాలేదు" అని యనుకొని యిదివఱకుఁ బ్రసాదు డున్నగదిలోఁ బ్రవేశించి యాతఁడు శయనించుచుండు బల్లపై శయనించి యెన్నియోరీతుల భావించుకొనుచు "ఈసారి చాలదినములైనను నాతఁడు రాలేదు. అప్పుడప్పుడు నాతండ్రిని జూచుటకై వచ్చుచుండెడివాఁడు; ఆమూలమున నాకు నాతని దర్శనభాగ్యము లభియించుచుండెడిది. ఈసారి యొక్కసారిగ మహాత్ముఁడు మఱచియే పోయినాఁడేమి చెప్పుమా?" అని యనుకొనుచుండెను.

ప్రమదకు దుఃఖము వచ్చెను. ఆమె మరలఁ దనలో "అతఁడిఁక నిక్కడ నుండఁడు. ఎట్లుండును? అతఁ డిప్పుడు కిల్లాదారు! ఇఁక నేనో? మును పెట్లుంటినో యిప్పుడుగూడ నట్లే యున్నాను. ఇప్పుడాతఁ డెంతటియున్నతుఁడో నే నంతటి నీచురాలనై యున్నాను ఆతఁడు చంద్రుఁడు; నే నంధకారమును: ఆతఁడు సుఖము; నేను దుఃఖమును ఆతఁడు పుష్పము; నేను కంటకమును" అని భావించు కొనియెను.

తరువాత నామె మరల "నేనింతగాఁ బ్రేమించితినని నాకు మొట్టమొదటఁ దెలియనేలేదు ఆతఁ డిటనుండి వెడలిపోయిన తరువాత నా ప్రేమ పొంగిపొరల నారంభించినది. ఇప్పుడా ప్రేమా ప్రవాహము నన్ను ముంచివైచుచున్నది. నేనిఁక నాతనిం బడయఁగలుగుదునా?" అని భావించుకొనియెను.

ప్రమద గవాక్షమునొద్ద నిలువఁబడియెను. నీలాకాశము పక్షులు, పొదరిండ్లు, వృక్షములు, పత్రములు, మనుష్యులు నామె కన్నులఁ బడుచుండిరి. కాని యామె యేమియును మనసుంచి చూచుటలేదు. ఆమె తదేక ధ్యానపరవశయయి "అతని నేను బడయఁజాలకయే యుండినచో నెవ్వతె యాతని బ్రేమించుచున్నదో యామె జీవితమును నా జీవితమువలెనే శుష్కక్షేత్రముగఁ జేసి వైచెదను——ఆమె రాజకుమారి యయినను నా శాపమునుండి యామెకు

నివృత్తి లేదు. ఆమె జీవితమును నిరంతర హాహాకారముగఁ జేసి వైచెదను. నావలెనే యామెయును దగ్ధహృదయముతో నేడ్చుచు నేడ్చుచుఁ దన జీవితమంతయును దుఃఖమయ ప్రపంచమునందే గడపుఁగాక !" అని నిశ్చయించుకొనెను.

తరువాతఁ బ్రమద యతిత్వరితముగ బయటికివచ్చి యేమియో భావించుకొనుచు నిలువఁబడిపోయెను. అప్పుడామె కంఠమునుండి యస్పష్టముగ "అతఁడు రాజకుమారిని బ్రేమించి యున్నాఁడు ఆమె యుంగరమాతని చేతియందున్నది. ఈతని యుంగరము నేను చాలసారులు చూచి యుంటిని. అది రాజకుమారి చేతియందలంకరించి యున్నదేమో యొకసారిపోయి పరీక్షింపవలయును. అట్లే యున్నచో నామె రాజకుమారియే యయినను నా ప్రతిక్రియనుండి యామెయుఁ దప్పించుకొను నుపాయము లేదు. ఆమెను దుఃఖసముద్రమున ముంచివైచెదను. లేకున్నచో నా పేరు ప్రమద కాదు. ఏమిది? వెలుపల నెవ్వరో మాటాడుచున్నట్లున్నది! ఇది యాతని కంఠస్వరమే !" అను మాటలు వెలువడియెను

అంతలో నామె వెలుపలకువచ్చి బహిర్మందిర గవాక్షము నొద్ద నిలువఁబడియెను. ప్రసాదుఁడా గవాక్షము నించుక తెరచిలోపలకు దృష్టులఁ బరగించుచుండెను... ఆమె యింతవఱకు నెవ్వనిభావించుకొనుచున్నదో, యెవ్వని వెదకుచున్నదో యారమణీయ మూర్తియే యెట్టయెదుట సాక్షాత్కరించి యుండెను. ఆశదీర నాతని ముద్దుమొగమును గనుఁగొనియెను. ఆ సుందరాస్య మెప్పటివలెనే మనోమోహనకరమై యుండెను. అతృప్తనయనములతో నతృప్తమనోరథములతోఁ జూచుచుండఁగా నామె హృదయము ప్రజ్వలిత దావానలముం బోలి మఱియును బ్రజ్వలింప నారంభించెను. ప్రమద యప్పుడవశయయి సంకల్పతరంగముల నడఁగింపఁజాలక ప్రేమప్రవాహవేగమునంబడి కొట్టుకొని పోవుచుండెను.

ప్రసాదునకుఁ బ్రజ్వలజ్జ్వాలా భీలంబగు నీ యగ్నిపర్వతమొకటి యున్నదను మాటయే తెలియదు. అతఁడిదివఱకుఁ బ్రమద

నంతబాగుగఁ బరిశీలించి చూడనేలేదు. ఆతఁడు రామశరణు నిం చుక ప్రేమించియుండుటచే నప్పుడప్పుడు వచ్చి యాతనిం జూచు చుండెను. అసహాయావస్థయందుఁ బ్రసాదున కజమీరునగరము నందు ముందుగ నాతఁడే యాశ్రయము నొసంగెను; ఆతని ప్రత ప్త హృదయమును బ్రియవచనములచే నమృతశీతలముగఁ గావించెను. ప్రసాదుఁ డాతని మహోపకారమును దనజీవితకాలమునందు మఱవఁ గలఁడా? అందు చేతనేఁ ప్రసాదు డప్పుడప్పుడువచ్చి యాతనిని జూచుచుండెను, అప్పుడప్పు డించుక ద్రవ్యముకూడ నాతని కొసంగు చుండెను.

ప్రమద ప్రసాదుని చేతివంకఁ జూచెను. ఆతని వ్రేలియందా మె యుంగరమున్నది. ఆమె సర్వాంగములును విద్యుద్వ్యాపితములై నట్లయ్యెను. తల తిరిగిపోయెను. అప్పుడామె యా గవాక్షమునువదలి రాజకుమారిం జూడవలయునను నుద్దేశముతో రాజమందిరాభి ముఖ యయి వెడలిపోయెను.

---

అయిదవ ప్రకరణము

# పాడుచున్న ప్రమద

సంధ్యాకాలము. అరుణకిరణుఁ డింకను నస్తమింపలేదు; ఉమాబాలవదన మండలమువంక వేడుకతోఁ జూచుచుండెను. అస్త మించినచో నామెవదన మెచ్చట నగపడదో యను విచారముచే నాతనిమొగ మెఱ్ఱపడిపోయెను. మందిరోద్యానమునందలి చంద్ర కాంత శిలావేదికపైఁ గూరుచుండి యుమాబాల పూలదండలఁ గ్రు చ్చుచుండెను. ఇప్పు డామె మునుపటివలెఁ బూవులను జిమ్మివైచుట లేదు; అతి ప్రయత్నముతోఁ బూవులఁ గూర్చుచుండెను.

ఉద్యానమధ్యమున నొకపుష్కరిణి యున్నది. దానికి నలు వంకలను బుష్పలతామందిరములున్నవి. ఆ పుష్కరిణియందలి విమల

సలిలములు వాయుసంచలితములై వివిధకుసుమ ప్రతిబింబములై యుండెను. నీలజలంబులలో రక్తకుసుమములఁ బ్రతిబింబింపఁజేయుచు మలయానిలాంకురములు సగర్వముగ వీతెంచుచుండెను. పలువంకలను పుష్పలతలే—ఆపుష్పరాశి మధ్యమునఁ బుష్పసుకుమారిణి యగు రాజకుమారి కూర్చుండి యుండెను.

పూవులగుచ్చుట యయినది. అప్పుడు నీల "రాజకుమారీ! ఈపూలదండచే నెవ్వరికంఠము నలంకరింతువు?" అనియెను.

ఉమా—ఈవృక్షశాఖను—

నీల—అందువలన నీకేమి లాభము?

ఉమా—ఏమిలాభమా? భావనాశక్తి కదియే పూర్ణాహుతి యగుఁగాక!

నీల—సఖీ! నీ వింతగాఁ బ్రేమింతువని మేమిదివఱకు కనుగొనలేము. అట్లే యయినచో గుట్టును బంపుటయే మాన్పించి వెచి యుందుము.

ఉమా—అదియేమి నీలా?

నీల—తండ్రిగారి సంగతి యెఱుఁగవా?

ఉమాబాల మఱి మాటాడక యాకసమువంకఁ దదేకదృష్టితోఁ జూచుచుండెను.

నీల—ఎవ్వని పేరైనను సరిగఁ దెలియదో యట్టివానికి మహారాజు తనతనయ నిచ్చుట కెన్నటికైన నిష్టపడునా?

ఉమా—తండ్రిగారుకూడ నాతని బ్రేమించుచున్నారు.

నీల—ప్రేమింపవచ్చును. గుణమును గౌరవించి దండనాయకత్వమును, ప్రధాన మంత్రిత్వమునుగూడ నీయవచ్చును. కాని రూప గుణములకు లోభించి కులాచారములను వదలుకొనువా రెవ్వరైనా నుందురా?

ఆమాట సత్యమే యని యుమాబాలయు నంగీకరించెను. కాని యనంగమూర్తియైన నామెకు శాంతి యెక్కడిది? ఆమె వక్షస్సుపై పర్వతములు వగిలిపడుచున్నది. ఆమె యధోవదనయయి నిగు

త్తర యయిపోయెను; ఉమాబాలకుఁ బ్రసాదుఁడు లభియించుట కష్టమని నీలాశ్వేతలు నిశ్చయించుకొనిరి; వివిధముచేసైన రాజకుమారి హృదయసింహాసనారూఢుఁడై యున్న యుజ్జ్వలదేవతామూర్తియగు ప్రసాదుని గళంకకాళిమాంకితునిగఁ జేయవలయునని వారాలోచించుకొనిరి; అట్లుచేయుటయే రాజపుత్రికి సర్వశ్రేయమని యుద్దేశించుకొనిరి. అట్లు కాకున్నచో నుమాబాల ప్రబలప్రేమ పరవశయయి యాతనితోఁ గూడఁబోయినచో నుత్తమక్షత్రియవంశ గౌరవమేమి కావలసినది ?

శ్వేత—రాజనందినీ! సేనాపతియగు ప్రసాదుఁడు మహారాజ వంశజుఁడనియే తోఁచుచున్నది. కాకున్నచో సంతతివిలుపగల యుంగర మాతని కెట్లులభియించును ?

శ్వేతయభిప్రాయమును గ్రహించి నీల "పెద్దవారియొద్ద సేవకులలో ననేకులు తుంటరులుందురు; అట్టివారమూల్య వస్తువులను సమయము వేచి దొంగిలించుచుందురు, అట్టివారి కుంగరములకును, కంఠహారములకును గొదవయేమున్నది!" అనియెను.

శ్వేత యించుక రసికతాప్రాగల్భ్యమును జూపుచు "సఖీ! ఈ యుంగర మట్లు దొంగిలించినదియే యగుచో నీ యుద్దేశము ?" అనియెను.

ఉమాబాల విరక్తయయి యాస్థలమును వదలిపోయెను. ఆమె యుద్యానవనమునఁ బరిభ్రమించుచుఁ దనలో "ఆతఁడు తన కులశీలములం దెలుపనని ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. పరిచయముచేసి యాతనికి నన్నిచ్చి పెండ్లిచేయుటకు నాయనగారు సమ్మతింపరు. తండ్రికి వ్యతిరేకముగ నాతని నెట్లయినఁ బరిగ్రహించుటకు నేనును సాహసింపఁజాలను. ఇఁక నుపాయ మేమున్నది? ఆశ యంతయును నాశనమై పోవలసినదేనా? నిరంతర దుఃఖజ్వాలా పరితప్తహృదయముతో నాజీవితమంతయును గడపవలసినదేనా! హా తల్లీ! శంకరీ! నన్ను రాజపుత్రిగా నేల పుట్టించితివి ?" అని పరితాపపడుచుండెను.

ఆమె యట్లే తడఁబడుచున్న పాదములతోఁ జెదరిపోవుచున్న హృదయముతో నిలిచినచోట నిలువక పరిభ్రమించుచు "అతఁడు గూఢ వేషముతో సంచరించుచున్న రాజకుమారుఁడే యయియుండును ; ధనాభావముచే నాతఁడీయుంగరము నీయలేదు. అదియును వ్యాజమాత్రమే.—అతఁడు రాజపుత్రుఁడే యయినను గులశీలములఁ దెలిసికొనుట యావశ్యకమైయున్నది. తెలిసికొనుట యెట్లు? అతని చరిత్రముంగూర్చి నాకుఁ దెలుపువా రెవ్వరున్నారు!" అని భావించుకొనుచుండెను. ఇంతలో దూరమునుండి యొక సంగీతధ్వని యామెకుఁ గర్ణగోచర మయ్యెను. ఆమె యాశ్చర్యముతో నాలకించుచుండెను—

"సుందరాకారంబు జూచి నే వలచి
యనుగుదమ్మిలఁ బొరలాడి వేఁడితిని ;
అదియేమిపాపమో ! యదివఱకున్న
గాసంతచనవును గడ తేరిపోయె :—"

ఉమాబాల చటాలున లేచి నిలువఁబడియెను. గాయిక మరల నీవిధముగ గానము చేయుచుండెను :—

"కన్నులముందున్న కల్పభూరుహము
చెంగున ముడిచిన జీవరత్నంబు
తిలకించుచుండఁగాఁ దెలియకుండగనె
మంతరించినయట్లు మాయమైపోయె :—"

ఉమాబాల సంగీతము వినవచ్చుచున్న దెసకుఁ దిరిగిచూచెను; నీలాశ్వత్థముల చెంతఁ గూరుచుండి ప్రమద గానము చేయుచుండెను. ప్రమద రాజపుత్రింగాంచి నమస్కారముం గావించెను. ప్రమద చిరకాలమునుండి యుమాబాలయొద్దకు వచ్చుచుఁ బోవుచుండెను. అసమర్థుఁడైపోయిన తమ సైనికుని తనయ యనియును, విధవ యనియును జాలిపడి రాజకుమారి యప్పుడప్పుడు ప్రమద కించుక ద్రవ్యమునుగూడ నొసంగుచుండెను. ఆశ్రయము దొరకెనుగదా యని ప్రమద తఱచుగ నుమాబాల దర్శనము చేసికొనుచుండెను. రాజ

కుమారింగాంచి ప్రమద తనసంగీతము నాఁపివై చెను. అప్పుడుమా బాల "ప్రమదా! ఊరకుంటి వేమి? పాడుము?" అని హెచ్చరించెను. ప్రమద మరలఁ బాడనారంభించెను.

"మిలమిలఁ గన్నుల ♦ మెఱసినరూపు
తలపుల కందక ♦ దాఁగిపోయినది ;
జిలజిలసమ్మృతంబుఁ ♦ బలికెడిపలుకు
చెవులకుదవ్వులఁ ♦ జేరిపోయినది ;
ఆతనిపేరైన ♦ నతనియూరైన
సంచుకంతయుఁగూడ ♦ నెఱుఁగలేనైతి—
ఆతని యడుగులో ♦ నడుగులువైచి
తరుణి! నామదిగూడఁ ♦ దరలిపోయినది ;
కన్నుఁగప్పినయట్టి ♦ కళ్యాణమయుని
చిత్తంబుఁగరఁగించి ♦ సేవింతమన్న
నాతనిపేరైన ♦ నతనియూరైన
నడుగంగలేనైతి ♦ నాలింపనైతి—"

నీల— ప్రమదా! నీవు విధవవు కావా?

ప్రమ— నాకు లోకజ్ఞానమే లేనిసమయమున నేను నాభర్తను బోఁగొట్టుకొంటిని.

నీల—అందుచేతనా యిట్టున్నఁడును జూచి యెఱుఁగని నాగరకులను బ్రేమించి వెంబడించుచున్నావు?

ప్రమ— తెలివి తక్కువదానవైన యట్లు చేయుట చేతనే యిట్టు ద్బుచుఁ దిరుగవలసివచ్చినది. న్నందరివారినొద్దనే

నీల—ఇంత వెఱ్ఱియేమి?

ప్రమ—ఏమి చేయుదును సోదరీ!

అని యామె మరలఁ బాడుట కారంభించినారు.

కన్నులు కన్నులఁ ♦ గలసి వచ్చినది?
వెఱ్ఱినై హృదయంబు ♦ పరమునందు,
ఎఱుఁగనివాఁడను పోయితిని!

చిఱునవ్వు కన్నులఁ ♦ జేర్చి చూచితిని
ఆతనిహృదయంబు ♦ నరయఁ గముందె
వేడుకపడి కోరి ♦ వెంగలినైతి
నాతని పేరైన ♦ నతనియూరైన
నడుగంగలేనైతి ♦ నాలింపనైతి !—

శ్వేత—ఆతని నవ్వులనుబట్టియే నిన్నాతఁడు ప్రేమించెనని యనుకొంటివా ?

ప్రమద ప్రత్యుత్తరము చెప్పక మరలఁ బాడఁదొడఁగెను.

కాపట్యమును జూపు ♦ కనుచూపువాఁడు
చిత్త మాకర్షించు ♦ చిఱునవ్వువాఁడు
భావంబుఁ దనియించు ♦ పలుకులవాఁడు
నలినాక్షులఁ గలంచు ♦ నైజంబువాఁడు
ఒకపూవువిడిచి ♦ యొండొకపూవుఁ జేరి
పరిమళంబుగ్రహించు ♦ పద్ధతివాఁడు
దేశదేశంబులఁ ♦ దిరిగెడువాఁడు
ఆసలఁగొలిపి న ♦ న్నలయించినాఁడు !
ఆతని పేరైన ♦ నతని యూరైన
ఇంచుకంతయుఁగూడ ♦ నెఱుఁగలేనైతి——

నీల—ఇట్టి కపటహృదయుని ప్రేమించిన నీకు మరణంబుకాక మఱి యేమున్నది ? నేనైనచో నట్టిముష్కరుని సంబంధమునకు జలాంజలి విడిచి నాకంటికి నచ్చిన మఱి యొకనిని ప్రేమించి మను.

ప్రమద రాజకుమారివంకఁ జూచుచుండెను. ఆమెచూపులు శ్లీతమై, భ్రూయుగళము కుంచితమై తనులత యుండెను. అప్పుడు ప్రమద తనలోఁ దానే నవ్వుచుండెను.

చు ♦ మోహనమూర్తి
క్ష వేళ

విలసనంబులు నూచి ♦ వేషంబునూచి
ఏ రాజతనయుఁడో ♦ యితఁడనుకొంటి,
క్రమముగాఁ దెలిసెనా ♦ కఠినచిత్తుండు
శ్యామసుందరుఁడటే ♦ జలజాయతాక్షి——

ఇట్లుపాడుచుఁ బ్రమద యాకస్మికముగ నిర్వాణపడి చూచెను రాజకుమారి యొక గులాబికొమ్మను బట్టుకొని బలవంతముగ మాగుచుండెను. ఆమె చేతులకు ముండ్లు గ్రుచ్చుకొని రక్తము చిమ్ముచున్నను నామె యాకొమ్మను వదలుట లేదు. ప్రమద యించుక చంచలయయి యదరిపడియెను గాని గానముమాత్రి మూపలేదు. పంచమతానముచే నీలాంకాశము నమృత ప్లావితముగఁ జేసినైచుచుండెను——

విలయసాగరచల ♦ ద్వీచికాలీల
మునుకొని జగమెల్ల ♦ మునిఁగినయట్లు
భువనమోహనుని సు ♦ భ్రూభంగలీలఁ
గాంతాకులఁ బెల్ల ♦ గంపించుచున్న
నదియేమి వెఱ్ఱియో ♦ యతని చెంగటకుఁ
బరువెత్తుచున్నవి ♦ ప్రాణవాయువులు
చెలువరో! చెప్పవే? జీవలోకమున
గష్టంబులోననే గలద సుఖము?——

గీతము పూర్తి యయినది. ఉమాబాల యించుక కోపశీల, ఇప్పు డామె క్రోధగర్జితయయి లేచెను. ప్రమద ప్రగల్భత యామెకసహ్యముగా నుండెను, కాని రాజకుమారి యించుక మనస్సంయమనముం గావించుకొని "ప్రమదా! నీ వీ గీతము నెవ్వరినొద్దనే ర్చుకొంటివి? అని ప్రశ్నించెను.

ప్రమ——కలలో నెవ్వరో నాకీ గీతమును బోధించినారు.

ఉమా——నీ కా కల యెక్కడ వచ్చినది?

ప్రమ——సేనానాయకుని మందిరమునందు.

ఉమా——నీవక్కడ కేల పోయితివి!

ప్రమ—తఱచుగఁ బోవుచునే యుందును.

ఉమా—అచ్చట నీవేమి చూచితివి ?

ప్రమ—కన్నులతో నేమియును జూడలేదు—స్వప్నములోఁ జూచితిని.

ఉమా—సత్యము చెప్పుము—లేకున్నచో నిన్నిచ్చట నేనిలువున నొలిపించివైతును!

ప్రమ—రాజకుమారీ! నీవేమిచేసినను జేయఁగలవు. నేన సత్యము చెప్పుట లేదు. సేనాపతిమందిరమునందలి గాలి తగిలినచో రాజకుమారివగు నీవుఁగూడ నావలెనే సంగీతమును బాడఁగలవు.

ఉమా—నీవిఁక నిటనుండి వెడలిపొమ్ము! ఎన్నఁడును నీవు నాయొద్దకు రావలదు.

ప్రమదకు గావలసిన పని యయినది. ఆమె వెడలిపోయెను.

---

ఆఱవ ప్రకరణము.

## ఉత్సవాలోచనము

వీరోత్సవదినము సమీపించుచున్నది. నేఁడు కృష్ణచతుర్దశి. రాఁబోవు పంచమినాఁడే యుత్సవారంభము. నగరోపకంఠమున దారు నిర్మితమగు పెద్దసభారంగ మేర్పఱుపఁబడియెను. ఉత్సవనియమములంగూర్చి యాలోచించుటకై మహారాజు మంత్రగృహంబున నివసించియుండెను. సహస్ర దీపవిలసితంబగు విశాలగృహంబున సభాజన పరివేష్టితుఁడై సింహాసనాసీనుఁడై యున్న శూరసింహుఁడు లతాగుల్మపరివేష్టితంబగు తటాకమధ్యమునం బ్రకాశించు రాకాచంద్రునివలె విరాజిల్లుచుండెను. మంత్రి సేనాపతి, జయంతుఁడు మొదలగు ముఖ్యులెల్లరును సభాసీనులై యుండిరి; కాని ప్రసాదుఁడుమాత్ర మచ్చట లేఁడు. అప్పుడు రాజు మేఘగంభీరస్వరముతో "వీరవరులారా! రాజపుత్రస్థానమునందలి వీరయోధు

లెల్లరును వీరోత్సవమునకు వచ్చుటకై ప్రయత్నించుచున్నారు. ఉదయపుర మహారాణాకూడ వచ్చునని వినియుంటిని. వచ్చువారి నందఱను మనము సగౌరవముగఁ దోడుకొనివచ్చి తగిన విడుదులయందుంచి యథోచితసత్కారములం గావింపవలయును. దండనాయకా! నీవు నగరమునకుఁ దూర్పుననుండి వచ్చువారల నందఱ నెదురుకొని గౌరవసత్కారములం గావించుచుండుము మంత్రీ! నీవు దక్షిణ భాగమునఁ గనుపెట్టుకొనియుండి విధాయకకృత్యములం గావింపుము జయంతకుమారా! నీ వుత్తరమున సంవరహాద్రికోపకూలమునందుండి తేజస్వతీనగరపు యువరాజు నెదుర్కొని సగౌరవముగఁ దోడుకొని రమ్మి!" అని యాజ్ఞాపించెను.

జయంతుఁడు వినయవిసమితుఁడై "మహారాజా! తేజస్వతీ నగరపు యువరాజు చాలదినములక్రిందటనే పరలోకగతుఁ డయ్యెనని వినియుంటిని. ఇఁక నే నెవ్వరికొఱకు వచ్చుట వేచియుండవలయును?

రాజు—స్వర్గస్థుఁడగు వీరేంద్రకేసరి కుమారునిగూర్చి నేను చెప్పుటలేదు; అనంతరాముని కుమారునిమాట చెప్పుచున్నాను.

జయం—అనంతరాముఁడు తన యన్నకుమారుని జంపించి సింహాసనము నాక్రమించుకొనియెనని లోకులు చెప్పుకొనుచున్నారు. అట్టిచో నట్టి పాపాత్ముని తనయుని సన్మానించి యేల తీసికొని రావలయును?

రాజు—అన్నివిషయములయందును లోకుల మాటలను విశ్వసింపరాదు. అర్ధరాత్రివేళ దస్యులచేఁబడి యా వీరేంద్రకేసరితనయుఁ డగు భవానీప్రసాదు మరణించెనని నేను వినియుంటిని. ఇం దేది సత్యమో దేవునకుఁ దెలియవలయును.

జయం—ఈసమాచారములు రెండు నొక్కటియే—అంగరక్షకపరివేష్టితుఁడగు యువరాజు ప్రాసాదమధ్యమున దస్యులచే నాక్రమింపఁబడి మరణించుట కేవలము రాజుగానున్న యనంతరామునకుఁ దెలియకుండ జరిగినదని గాదని నావిశ్వాసము. అట్టిపాపాత్ముఁడును,

విశ్వాసఘాతుకుఁడు నగు ననంతరాముని పుత్రునకు నాదరసన్మాన ములం గావించుట పాపమున కాశ్రయమిచ్చుటయే— ఈ కార్యభా రము నేలినవారు మఱియొకరిపై నుంచినచో నే ననుగ్రహింపఁబడిన వాఁడ నయ్యెదను.

రాజు— జయంతా! నీవు పొరపాటు పడుచున్నావు. సంఘ మూ దేశముగాని రాజ్యముగాని నడవఁజాలదు రాజపుత్రస్థానము నందలి రాజులనందఱను గౌరవించి యొక్క యనంతరాముని మాత్ర ముపేక్షించినచోఁ బరాక్రమశాలియగు నొక పెద్దరాజుతో శత్రు త్వము తెచ్చిపెట్టుకొన్నట్లగును. మన మాంపత్నించి ననంత రాముఁడు పాపాత్ముఁడైనను బుణ్యాత్ముఁడైనను మన మాతని గౌర వించుట విధాయకకృత్యమైయున్నది ఇంతేకాదు—ఇంకొకమాట యున్నది—

ఆమాట యేమో యీ సభలో నొకరిద్దఱికి మాత్రమే తెలి యును; కాని, చాలమందికిఁ దెలియదు. అప్పుడు జయంతకుమా రుఁడు "మహారాజా! ఆమాట యేమి?" అని ప్రశ్నించెను.

రాజు—అనంతరాముని కుమారుఁడగు దేవలుఁడు సిరోహికిఁ బోవుచుండెనని వినియుంటిని. క్రూరుఁడగు ననంతరాముఁ డాతని నచ్చటికి కేయుద్దేశముతోఁ బంపుచుండెనో తెలియుటలేదు. కాని, యిట్లుపంపుట మనహితముకొఱకుమాత్రము కాదని స్పష్టపడుచున్నది. సిరోహి కేసరి మనకు మిత్రుఁడు—కాని, యిప్పు డనంతరాముఁడు మాత్రము సిరోహికి మిత్రుఁడై యున్నాడు. ఈ పధ సిరోహిరాజ్య ములు రెండు నేకమై మనరాజ్యము నాక్రమించినచో వారిని నిర్జించుట మనకు సాధ్యము కాదు. కావున నా యిరువురును గలిసి కొనకుండఁ బ్రతిరోధించుట మన కవశ్యకర్తవ్యము. ఆతని కుమా రుని మనము సన్మానించినచో ననంతరామునకు మనయం దభిమా నము కలుగఁగలదు. అది మనరాజ్యమునకు సర్వశ్రేయమగు కార్యము. కానిచో— అట్లు కానిచో— ఏమగునో యెవ్వరు చెప్ప గలరు?

జయం — మహారాజా! నాకీ సంగతులన్నియును బాగుగఁ దెలియవు. నాయువి వేకమునకు మన్నింపవలయును. సిరోహీతో సంధిచేసికొని యజమీరును నాక్రమింపవలయుననియే యనంత రాముని యుద్దేశమైయున్నచో నాతఁడు సుమారుగఁడు సంవరతీరమునం దేల వృథా కాలక్షేపము చేయును ?

రాజు—అతఁడు దుర్బలుఁడని వినియుంటిని. పథపరిశ్రాంతుఁడై యారోగ్యముకొఱకు సంవరతీరమున విడిసియుండును. అట్లు కానిచో దాను సిరోహీంకిఁ బోవుచున్నట్లితరుల కెవ్వరికిని దెలియకుండుటకై యట్లు చేసియుండును.

జయం — మహారాజా! ఏలినవారి యాజ్ఞను శిరసావహించు చున్నాను. మిమ్మొకమాట యడుగవలయునని యున్నది. ఈ యుత్సవ సందర్భమునఁ బ్రసాదునిపైఁ నేకార్యభారము నుంచితిరి ?

రాజు —నిమంత్రితులగు మహాపీరులను సన్మానించు కార్యము లందుఁ బ్రసాదుని నియమించుటకు నాకిష్టము లేదు—ప్రసాదుఁడు వీరశిరోమణియే యయినను నాతని కులశీలములు మనకుఁ దెలియవు. ఆతని నియమించినచో నాభిజాత్యసంపన్నులగు క్షత్రియవీరులందఱును దమ్మవమానించినట్లుగా భావించుకొనకమానరు.

జయంతుఁడు సెలవుఁ గైకొని వెడలిపోయెను. మఱికొంత సేపటికిఁ గొలువు చాలింపఁబడియెను.

---

ఏడవ ప్రకరణము.

# నేను నీ కేమగుదును ?

ప్రమద పాటపాడి వెడలిపోవునప్పటికి సాయంకాలమయ్యెను. కాని, జగమింకను సంపూర్ణాంధకార గర్భమునఁ బ్రవేశింపలేదు. నీల ప్రమదగానమునకు సంతుష్టిచెందెను. తానునసమర్పించిన యింధనములకుఁ బ్రమద యగ్నిసంస్కారముం గావించినదని నీల సంతో

పించెను. అప్పుడు నీల యాయసలమునకు వాయుసంపర్కము గల్పించు నుద్దేశముతో "శ్వేతా! దాని కెంత స్పర్ధయున్నదో చూచితివా? కొలందియో గొప్పయో దానికి సంగీతపరిచయము ముండిన నుండుఁగాక! ఇక్కడకువచ్చి మన రాజకుమారియెదుట నీపాటలన్నియు నేల పాడవలయును? రాజకుమారి కీ కుగతు లన్నియు నేల తెలుపవలయును? ఇదియంతయును మన మెఱుఁగమా? మన మేమైన నామెతోఁ జెప్పితిమా?" అనియెను.

రాజకుమారి యా సమీపమునందే యున్నది. నీల మాటలామె చెవులఁ బడియెను. ఆమెకు వినఁబడవలయుననియే నీలయుద్దేశము! కాని, యామాటలవలన రాజకుమారి హృదయమునం బెట్టి భయంకరభావము లుదయించునో బాలికాచపలంబగు నీల హృదయమునకుఁ బోడకట్టలేదు. అగ్నిముఖంబున ఫూత్కారము చేయవలయుననియే నీల యిట్లు చెప్పియున్నది. కాని, యిది ఫూత్కారమాత్రముగఁ దోఁచుటలేదు పూర్ణాహుతిగాఁ బరిణమించినది?

ఆ మాట యాలకించినతోడనే రాజకుమారి యాఁడుసింగము వలె నొక్కయుదుటున లంఘించి "నీవే సంగతి నింతవఱకు నిగూఢముగా నుంచితివి నీలా?" అని ప్రశ్నించెను.

నీల—శ్వేత చెప్పినసంగతి—

అప్పుడు రాజకుమారి శ్వేతకబరీభరముం బట్టుకొని యీడ్చుచుఁ గ్రోధరుద్ధస్వరముతో "నీవేమి చెప్పితివే శ్వేతా?" అని గద్దించి యడిగెను.

కాళికామూర్తిం బోలిన రాజకుమారిం గాంచి నీలాశ్వేతలు భయప్రకంపితలై పోయిరి. ఉమాబాల యిట్టి క్రోధమూర్తిం దాల్చుట వారదివఱ కెన్నఁడును జూచియుండలేదు. అప్పుడు శ్వేత భయకంపిత హృదయముతో "సఖీ! సత్యమో యసత్యమో నాకుఁ దెలియదు. నేనుమాత్రము వినియుంటిని" అనియెను.

ఉమా—ఏమని వినియుంటివి?

శ్వేత యేమువనారంభించెను. ఉమాబాల యామె కేశపాశమును విడిచివైచి యతివేగముగ నా యుద్యానమునఁ బరిక్రమింప నారంభించెను. అప్పుడు నీల తనలో "కార్యము ప్రతికూలముగ నున్నది ఏమిచేయుదును! ఈ రాజకుమారి యే కార్యము బాగుగ జేసినది? ఎవ్వరికిని సంకేతమునా' తల్లిదండ్రుల కించుకంతయును తెలియనీయకుండ నాతని నింతగాఁ బ్రేమించుట యీమెకేటి న్యాయము? ఎవ్వఁడు దుర్లభుఁడో యాతని నేల మతిమాలిన దానివలెఁ బ్రేమింపవలయును? ప్రేమించుటయనిన నింత నెల్లువయా? సమయము ననుసరించి ప్రయోజనము ననుసరించి యోగ్యనిగాఁడని మతియోగ్యని బ్రేమింపవలయును. ఆ జాడయే లేదు! ఇంతవేగముగఁ బ్రేమించుటయా?——" అని యనేకవిధములఁ భావించుకొనఁ జొచ్చెను.

ఆ సమయమున రాజకుమారి "నీలా!" అని పిలిచెను. నీలయొక్క సమీపమునకు బోయి యామెను సమీపించెను. అప్పుడు రాజకుమారి "నీలా! గుఱ్ఱమును సిద్ధము చేయుము చెప్పుము! నగర ప్రచారము చేయవలయును. నీవుఁగూడ నా వెంటరమ్మ!" అనియెను.

వెన్నెల రాత్రియందు రాజకుమారి యప్పుడప్పుడు నగర సంచారము చేయుచు నుండు. బిడ్డయందలి గాఢాభిమానముచేఁ దల్లిదండ్రులామె యిష్టమునకు వ్యతిరేకముగ నెన్నఁడు నాజ్ఞ చేయుట లేదు. ఆ యవకాశమువలన నామె కేవలమును స్వతంత్రురాలై పోయినది.

నీల——అంధకార బంధురమగు నీ యర్ధరాత్రివేళ బయలుదేరుట యేమనుకొంటివి?

ఉమా——నీలా! నిన్నునే నాలోచన లడుగుట లేదు.

నీల తనలో "ఈ సంగతి మహారాజుతో మనవి చేయుదునా? వలదు——అది మంచిపని కాదు—— ఈమెకు మతిపోవుచున్నది, నాకాలోచన తోఁచుట లేదు. నేనేమి చేయుదును? కానున్న దేదియో కాక మానదు" అని భావించుకొని మాఱుమాట చెప్పక వెడలిపోయెను.

నేఁడు కృష్ణచతుర్దశి. పృథివియంతయు నంధకారాచ్ఛన్నమై యుండెను. ఉమాబాల యభిమానపూరిత హృదయమున — అభిమానాంతరాళమునం దెట్లు సకల గుణములును సమాచ్ఛన్నములై యుండెనో, యట్లే వృక్షములు, పత్రములు, పుష్పములు, ఫలములు సర్వమును సంకుచితములై గాఢాంధకారమునఁ గప్పఁబడియుండెను. మణిముక్తాఖచితంబగు నీలసరోవరము మణిముక్తాఖచితంబగు రాజకుమారి నీలావతి తనువుం బోలి హృదయాందోళనముచే నించుక కంపించుచుఁ దూఁగుచుండెను. ఆశావేశోచ్ఛ్వసితంబగు ఉమాబాల యంధకార హృదయముం బోలి క్షీణతారకాలోకితంబగు ప్రకృతి యంతయుఁ దన చీకటిలోఁ దానే దాఁగియుండెను. ఆమె హృదయమునందలి నిరాశచేఁ బీడింపఁబడుచున్న యాశాముఖమునుండి వెలువడు నస్ఫుట కోమలరుచిరాకారములం బోలె నవనీ ప్రచార కోలాహలస్వనము యామిని గగనమువఱకును వ్యాపించి యంధకార ప్రహారములచే నదరిపడి యందందఁ దణఁగిపోవుచుండెను.

ప్రకృతియంతయు నిస్తబ్ధమై యుండెను. ఉద్యానమున వెలుతురు లేదు. అంధకార బంధురమై యుండెను. శ్వేతపట్టి నేల నల్లి కూర్చుండి యుండెను. ఆ యంధకారమున నుమాబాల సగాఘూటముగఁ బరిభ్రమించుచుండెను. దారుణంబగు చలిచేఁ బత్రి పుష్పాదులును, జీవజంతువులును సర్వమును గంపించి పోవుచుండెను. కాని, యుమాబాలకుఁ జలిలేదు. ఆమె హృదయాంతరాళమునఁ దారుణానలము ప్రజ్వలించుచున్నది.

నీల గుఱ్ఱమును దీసికొనివచ్చెను. ఉమాబాల గుఱ్ఱము నధిరోహించి కశాఘాతముం గావించెను. అతివేగముగ నా యంధకారమును భేదించుకొనుచు నశ్వము పరుగెత్త నారంభించెను. నీలయు నశ్వారూఢయై యామె ననుసరించిపోయెను. అంతలో వారు మందిరోద్యానము నతిక్రమించి రాజవీథిం బ్రవేశించిరి. ఆ నగరమున నుత్తరప్రాంతమునందే రాజప్రాసాదమున్నదను సంగతి నిదివఱకే చెప్పియున్నాము. సాయంకాలమైనతరువాత నా సమీపమున

జనులు సంచరింపఁ గూడదు. నడుమనడుమ నొక్కొక్క రక్షక భటుఁడును సిద్ధులు ముగ్గురు రాజోద్యోగులుమాత్రము తిరుగు చుందురు. ఆ సమీపమున ఇతరుల యిండ్లుగాని యంగడులుగాని లేవు. ఆవిశాలరాజమార్గము దీపమాలికా ప్రశోభితమై యుండును. ఆ ప్రదేశమునకుఁ బోయి రాజకుమారి యాకస్మికముగ నడ్డగింపఁ బడియెను.

అడ్డగించిన యాతఁడు జయంతకుమారుఁడు! ఆతఁడు రాజ మందిరమునుండి వెలుపలకు వచ్చినతోడనే యస్పష్ట దీపలోకనము నం దిద్దఱు యువతీమణు లశ్వారూఢలై దూరమునుండి వచ్చుచున్న ట్లు కనుపెట్టియుండెను. సమీపించినతోడనే యాతఁడు రాజకుమారి నానవాలుపట్టి యడ్డగించి యుచ్చైస్స్వరముతో "రాజపుత్రీ! కర్తవ్య మును సక్రమముగ నిర్వహించుటకై నిన్నడ్డగించినందుకు నన్ను క్ష మియింపుము!" అనియెను.

ఉమాబాల యశ్వమును నిలిపి యుత్తేజితస్వరముతో "నీకుఁ గర్తవ్యమేమి?" అని ప్రశ్నించెను.

ఆస్వరము నాలకించి జయంతుఁడదరిపడియెను. "అడ్డ గించితినని యామెకుఁ గోపమువచ్చినది" అని భావించుకొని మృదుల స్వరముతో "ఇంత రాత్రివేళ రాజమార్గమునందతివేగముగ గుఱ్ఱ మునునడిపించుకొనుచుఁ బ్రయాణముచేయుట యపాయకరముగాదా" అనియెను

ఉమా—అశ్వశిక్షానభిజ్ఞులగు ననమర్థులకుఁ దీవ్రశ్వగమన మపాయకరముగ నే తోఁచుచుండును.

జయంతికుమారుని వదనమండల మెఱ్ఱవడిపోయెను. ఆతఁడు కంపితస్వరముతో "ఆత్మసంయమనమునకే యసమర్థులగు వారికశ్వ సంయమనముం గావించుశక్తి యెట్లుండును?" అనియెను.

ప్రజ్వలిత దావానలమున కిప్పుడు వాయుసంయోగ మైనది. ఉమాబాల క్రోధకద్ధ కంఠస్వరముతో "సంయమన ధర్మబోధము నకు నీవే తగిన యుపాధ్యాయుఁడవు. జేనోయాన్ యుద్ధరంగమున

శతృసమ్ముఖమునందుఁ గరవాలమును గోశసంపుటమునం జేర్చి సంయమవ్రతము నవలంబించితివి! కాని, యిప్పు డింటికి వచ్చి యాఁడువాండ్ర యొద్దమాత్ర మా వ్రతనియమములయం దుదాసీన భావమును బ్రకటించుచున్నావు. జయంతకుమారా! నిన్ను నీవే మఱచి మాటలాడకుము! నీయాత్మ సంయమన సామర్థ్యము లోకమున కంతకును దెలిసిపోయినది!

ఈ తీవ్రవ్యంగ్య భాషణములు జయంతునకు దుస్సహము లయ్యెను. అతఁ డించుక తొలఁగి దారి విడిచెను. ఉమాబాల గుఱ్ఱము నడపాయిఁ జేసె కాని, నిమిషములో మరలవచ్చి రాజకుమారి జయంతుని పార్శ్వమున గుఱ్ఱమును నిలిపెను. జయంతుఁడు విస్మితనయనములతో నామె నంతఁ దిలకింప నారంభించెను. అప్పు డుమాబాల ప్రసన్నస్వరములతో "సోదరా! జయంతా! తొందరపడి మాటాడితిని. అపరాధమును క్షమియింపుము! నీ హృదయమును బాధించినచో నా హృదయమును బరితపింపక మానదు" అనియెను.

జయంతుని వీరహృదయముకూడఁ బ్రకంపితమై పోయెను. బాష్పములచేఁ గంఠము రుద్ధమైపోయెను; నోట మాటలేదు; కేవల మా త్రిలోక సుందరీమూర్తి వంకఁ దదేకదృష్టితోఁ జూచుచు నూరకుండెను. ఆ రాజమార్గస్థిత దీపమాలికలను మ్లానభూతములుగఁ జేయుచు నాగాఢాంధకారమును బ్రకాశింపఁజేయుచున్న యుమాబాల రాజరాజేశ్వరీమూర్తి యాతని యెట్టయెదుట నుండెను. అతఁ డప్పుడు తనలో "ఇంతటి సౌందర్యము పృథివియందు లేదు. ఒకవేళ దేవలోకమునం దున్నను నచ్చటి సౌందర్యమంతయు నేకీభవించినచో నీ యందమునకు సరియగునో కాదో చెప్పఁజాలను. నే నేల యీ రూపసముద్రమున మునిఁగిపోఁగూడదు? ఈయగ్ని జ్వాలలఁబడి యేల భస్మమై పోఁగూడదు? ఈ భూప్రపంచమంతయుఁ దేలిపోవుఁగాక! ధనమును, స్వర్గమును భస్మీభూతములై పోవుఁగాక! కీర్తిగౌరవములు లక్ష్యపతితములై పోవుఁగాక! నేనీ యగ్ని

జ్వాలను వక్షమునందుంచుకొని బ్రదికియున్నంతకాలమును రూపమునే యుపాసించుచుండెదను." అని భావించుకొనియెను.

ఉమాబాల యెట్టి ప్రత్యుత్తరమును గానక "జయంతకుమారా! నన్ను నీ సోదరిగాఁ దలంచి నా యపరాధమును క్షమియింపుము. నే నిప్పటికిని వాక్సంయమన సూత్రమును నేర్చుకొనఁజాలనైతిని. నా మనసులోని యుద్దేశమును సరిగఁ జెప్పఁజాలకుంటిని; చెప్పఁగూడని మాటలనే చెప్పి వైచుచుంటిని. అదియే నా యపచారము! ఈ యపరాధమును క్షమింపఁగూడదా?" అనియెను.

జయం—రాజపుత్రీ! నీ కాతరభావముం గాంచి నా హృదయము తల్లడిల్లిపోవుచున్నది. కాని, నీ కాతరత్వముకూడ నెంతయెందముగానున్నది! ఇంకొకసారి నీ ప్రేమకంపిత స్వరముతో "సోదరా" యని పిలువుము! ఇంకొకసారి క్షమాప్రార్థనముం గావింపుము! ఇంకొకసారి నాకా దుర్లభసుఖ స్వప్నసందర్శనముం గావింపుము! నీ ప్రేమ విహ్వలముఖమండలముం గాంచుచు నీ ప్రేమ మధురవచనముల నాలకించుచు మరణమునైన సుఖముగ నెదుర్కొనియెదను." అనియెను.

ఉమా—ఇంకను నీవా మాటల నన్నిటిని మఱచిపోలేదా? నేను నీ కెవ్వతెను?

జయం—నీవు నా కెవ్వతెవా? ఆసంగతి నే నిప్పటికిని దెలిసికొనఁజాలక పోయితినా? నీవు నా సాధనము! నా స్వర్గము; నా దైవము! నిన్ను మఱవఁగలనా? నిన్నే భావించుకొనుచు నీ ప్రపంచము నంతను మఱచిపోయెదను—సుఖము, సౌభాగ్యము, భోగము, ఆశ, సర్వమును వదలివైచెదను. హృదయమునందలి నిగూఢసింహాసనమున నీ దేవీమూర్తిని స్థాపించి యీజగత్తున కించుకంతయుఁ దెలియనీయకుండ రేయుంబవ లుపాసించుచుండెదను. మరణించుచున్నను నీధ్యానమును విడువను. మరణానంతరమున నా యస్థిపంజరమంతయు భస్మావశేషమైపోయినను నా ధూళియందలి

ప్రతిపరమాణువునుగూడ నీమూర్తినే హృదయకమలమున నిలుపు కొని ధ్యానించుచుండగలదు!

జయంతుఁడిఁక మాటాడఁజాలక పోయెను. రాజకుమారి యును మఱియేమియు మాటాడలేదు. ఒక్కంతసే పిరువురును మౌన మును వహించియుండిరి. వారి సంభాషణము వినఁబడ నంతటిదూర మున నీల యుత్కాయరూఢయయి నిలిచియుండెను. ఆమె కామాటలు సరిగ వినఁబడక పోయినను వారి భావభంగులంబట్టి యెన్నియో యాలోచనములు తోఁచుచుండెను. అప్పుడు జయంతుఁడు హృదయా వేగముచే నించుకతూలుచు నస్ఫుటస్వరంబున "రాజకుమారీ! సమ యాంతరమున నొకమాట చెప్పెదనని నీ వొకప్పుడు నాతో ననియుం టివి ఇప్పుడు చెప్పెదవా?" అనియెను.

ఉమా—ఏ మాట జయంతకుమారా?

జయం—జయదేవీ మందిరమునం దొకసారి నా కించుక మోకను గల్పించి యంతలోనే యసంభవమని చెప్పి నిరాశాభిభూతు నిం గావించివైచితివి—ఆ సంగతి నీకు జ్ఞప్తియందున్నదా రాజ కుమారీ?

ఉమా—జ్ఞప్తికి వచ్చినది. కాని నే నెన్నఁడును నీకు లేశ మాత్రమైనను నాశను గల్పించియుండలేదు. అట్లు కల్పించుటయు నసంభవమే.

జయం—అసంభవ మెందుచేత?

ఉమా—ఆ కారణమును వినుటవలన లాభములేదు. మన పరితాపముకూడను—నీహృదయమునం దిఁక నన్నుఁగూర్చిన యాలో చనముల కించుకంతయును జోటీయవలదు. నన్నుఁ బరసతిగా భావించి భగినీన్యాయమునఁ జూచుచుండుము; అన్యభావముతోఁ జూడకుము.

జయంతుఁడు విస్మయముతో "రాజకుమారీ! నీవు పరయువ తివా?" అని ప్రశ్నించెను.

ఉమా—ధర్మముచే నట్లే.

అర్ధరాత్రివేళ మహారణ్యమధ్యమునందాకస్మికముగ వ్యాఘ్రా రావము నాలకించిన యేకాకియగు పాంధునింబోలి జయంతుఁడు వజ్ర ఘోషతుల్యంబులగు రాజకుమారి మృదువచనములనాలించి భయప్ర కంపితుఁడయ్యెను. స్తబ్ధహృదయముతో నాతఁడాకసమువంకఁజూచు చుండెను. పైని నక్షత్రకంటకితంబగు నీలాకాశము శుష్కమై, కఠినమై, నిర్మలమైయుండెను. అతఁడు కన్నులువాల్చి క్రిందికిఁ జూచెను. ఏమున్నది? చేతనావిరహితమగు వసుంధర! ఎదుట ?— అదృష్టముకంటెను గఠినహృదయ యగునుమాబాల! ఆతనిహృద యము ప్రకంపితమైపోయెను; భయముచేఁ గన్నులు మూసికొని పోయెను. ఆతనికిఁ దరణోపాయ మగపడుటలేదు. ఆతనిహృద యాంతరాళమున విశీర్ణశరీరయు, వికృతదశనయు, నగు భయంకర మూర్తి వికటాట్టహాసముచేయుచు నాతని నధిక్షేపించుచుండెను. ఆతఁడు కన్నుల మూసికొనియెను.

అప్పు డుమాబాల కోమలస్వరముతో "జయంతకుమారా!" అని పిలిచెను.

ఆ కోమలస్వరశ్రవణమున జయంతుని నిమీలితనయనము లకుఁ జైతన్యము కలిగెను. ఆతని నిస్తబ్ధహృదయమునకు జడత్వము వదలిపోయెను. అప్పుడు జయంతుని హృదయమును వికసింపఁజేయు టకై రాజకుమారి యనేకవిధముల సంభాషించుచుఁ బ్రసంగవశమున లలిత మాటయెత్తెను. సోదరీగతప్రాణుఁడగు జయంతున కప్పుడు నయనములు వికసించెను. అప్పు డుమాబాల "లలితవంటి సుందరీ మణిని, లలితవంటి సరళహృదయను నేనీ ప్రపంచమునం దెచ్చటను జూడలేదు. కాని, యామెకింకను బెండ్లిచేయలేదేమి? అనియెను.

జయం—నేనామెకు వివాహసంబంధమును స్థిరపఱచియుంటిని కాని, యింకను వివాహము జరుగలేదు.

ఉమా—ఎందుచేత ?

జయం—నాతండ్రి యంగీకరించుట లేదు.

ఉమా—ఏమి?

జయం——వరుని కులగోత్రములు తెలియుటలేదు. కులము తెలియకుండ బిడ్డనిచ్చుటకు నాతండ్రి యంగీకరించుటలేదు.

ఉమాబాలకు సంగతియంతయును దెలిసిపోయినది. అయినను రుద్ధస్వరముతో "వరుఁడెవ్వఁడు ?" అని ప్రశ్నించెను.

జయం—ప్రసాదుఁడు

మెఱపుఁదీగవలె రాజకుమారి చటాలున నశ్వారోహణముం గావించి వెడలిపోయెను. నీలయు నట్లే యామెననుసరించి పోయెను. నిమిషములో వారిరువురును నగరపశ్చిమ ప్రాంతమునకుఁ బోయిరి. సమీపమున మైదానమునందు సేనాపతి విస్తారమందిరము గాఢాంధకారమున వికటమూర్తిం దాల్చియుండెను. సమీపమున నెట్టివెలుతురును లేదు భవనగవాక్షములు చాలవఱకు మూయఁబడియుండెను ఒకటి రెండు కిటికీలనుండిమాత్రము దీపకాంతి వ్యోమవ్యాపియయి శూన్యమున లీనమైపోవుచుండెను.

రాజకుమారి యాయింటియొద్దకుఁబోయి యించుకసేపు నిలిచి మృదుస్వరముతో "నీలా!" అని పిలిచెను; నీల సమీపించెను. ఉమాబాల "ఏమే! నన్నిక్కడకుఁ దీసికొనివచ్చితివి ?" అనిప్రశ్నించెను. నీల తనలోనే నవ్వుకొననారంభించెను. రాజకుమారియే ముందు బయలుదేరినది నీల యామెననుసరించి వచ్చుటమాత్రమే— కాని, యీవిషయమున రాజకుమారి నేరముకూడ నేమియునులేదు. ఆమె యిక్కడకు రావలయునను నుద్దేశముతో బయలుదేరలేదు, మనసు చెదరిపోవుటచే నశ్వారూఢయయి పరాకుగ నిచ్చుటకు వచ్చినది ఆమె విమనస్కయయియుండుటచేఁ దెలియకుండగనే పనిజరిగిపోయినది ఏదియో తెలియఁబడని యాకర్షణశక్తిమూలమున నామె హిమానీ ప్రకంపితాంధకారనిశీథమున నేకాకినియయి సేనాపతిభవనమునకుఁ దీసికొనిరాఁబడినది! అప్పు డామె చకితనయనములతో నలువంకలఁ దిలకించుచు మెల్లమెల్లగా "నీలా! నీవు నన్నిట కేల తీసికొనివచ్చితివే ?" అనియెను

నీలకంతయును దెలిసిపోయినది. ఆమె యాయంధకారములో మందహాసము చేయుచు "అయ్యో తల్లీ! అలాగా? చీకటిలోఁ ద్రోవ దప్పి యిచ్చటకు వచ్చిపడితిమి. ఎక్కడి జయదేవీమందిరము — ఎక్కడి సేనాపతిభవనము! త్రోవదప్పిపోయితిమి. ఇప్పుడేమి చేయుదము ?" అనియెను.

ఈ సమయమున లోపలినుండి లలితకంఠస్వరము వినవచ్చెను. ఉమాబాల యదరిపడియెను. నీల యామె చేయిపట్టుకొని యొకగవాక్షమునొద్దకుఁ గొనిపోయెను. ఉమాబాల చిత్రప్రతిమవలె నీలవంకఁ జూచుచుఁ గిటికీయొద్దకుఁ బోవునప్పటి కొకటి రెండు కంఠస్వరములామె చెవిని బడియెను. క్రమముగ వాక్యము లవగతము లగుచుండెను; ఆవాక్యముల యర్థముకూడఁ దుదకు బోధపడుచుండెను. అప్పుడాకిటికీయొద్ద నున్నవారిలో నొకడు "లలితా! జగదాంబయనుగ్రహమువలన నాకు సుఖము లభియించినచో నిన్నెప్పటికిని విడువఁ బోను" అనియెను.

ఉమాబాల యిఁక వినఁజాలకపోయెను. వాత్యాహతంబగు సముద్రనౌకంబోలి యామె సర్వశరీరమును బ్రకంపితమై పోవుచుండెను. అప్పుడు నీల యామెగుప్పుఁగళ్ళను బట్టుకొని మెల్లగ నడపించుకొనుచు జయదేవీమందిరము నొద్దకుఁ దీసికొనిపోయెను. మందిరమున దీపము వెలుఁగుచున్నది; రాజకుమారింగాంచి ద్వారరక్షకుఁ డించుక యోసరిల్లెను. అర్చకుఁడు మెల్లగ మందిరమునుండి వెలుపలకు వచ్చెను. ఉమాబాల దేవీమందిరమునఁ బ్రవేశించి దేవీ పాదపీఠమునొద్దగూర్చుండి తదేకదృష్టితో దేవీవదనమును గాంచుచుండెను. సకలమును నామెహృదయమునఁ బ్రవేశింపకుండఁ గన్నులలోనే తేలిపోవుచుండెను. దేవీమూర్తి కూడఁ గన్నులలోనే ప్రతిఫలించుచుండెను. కాని, హృదయమునఁ జిహ్నితమగుటలేదు. ఆ పాషాణదేవీసమ్ముఖమునం దామె పాషాణవిగ్రహముం బోలెఁ జాలసేపటివఱకును గూర్చుండియుండెను. అంతలో నామె యాకస్మిక

ముగ వికటస్వరముతో, మందిరమును గంపింపఁజేయుచు "నీలా! నీలా! పొరపాటైపోయినది! అని కేకవైచెను.

నీల ద్వారాంతరాళమునందుండి విచారముతోఁ దనలో "ఇంత వఱకు వచ్చునని యెవ్వరెఱుఁగుదురు? ఈమె ప్రేమముగ్ధయయి పోవుటచేతనే యిన్నిపనులు జరగుచున్నవి. ఈమె ప్రసాదునిం బడయకున్నచోఁ దప్పక మరణింపఁగలదు. అట్లయినచోఁ జాలవిప త్తులు కలుగును. ఈమెసంగతి బాగుగలేదు ఇంతవఱకు వచ్చిన తరువాత నిఁకమరలించుట కష్టము. ఇఁక నొకప్రయత్నముకూడఁ జేసి రాజకుమారి హృదయమును మరలింపవలయును" అని భావించు కొనుచుండెను.

అంతలో నామెయాలోచనాప్రవాహము రాజకుమారి సంభ్ర మాలాపముచే నిరుద్ధమైపోయెను. అప్పుడు నీల యదరపడి "అది యేమి రాజకుమారీ!" అనియెను.

ఉమా — ఆ స్వరమాతనిది కాదు. ఆతని దంతటి కర్కశ స్వరమా! ఎవ్వరో లలిత నాదరించుచున్నమాటలను విని మనము భ్రమపడిపోయితిమి. పద! నీకిప్పుడే నీ పొరపాటు చూపించెదను.

ఆమె యిఁక దేవీపదమునైన దర్శింపలేదు. దేవీమందిరము నందున్నసంగతియే యామెకుఁ దెలియుటలేదు. ఉన్మాదినివలె నస్వస్థ హృదయముతో దేవీమందిరమును విడిచి యశ్వము నధిరోహింపఁ బోయి క్రిందఁబడియెను; తలపై దెబ్బతగిలినను లెక్కింపక మరల నధిరోహింపఁ బ్రయత్నించెను. ఆమెకు వేదనానుభవజ్ఞానముకూడ లేకుండఁబోయినది అప్పు డామెతలపై నొకగుడ్లగూబ వికటకూజి తముం గావించెను.

నీల రాజకుమారిచేయి పట్టుకొని "కుమారీ! ఇంటికిఁ బోవు దము" అనియెను.

ఉమా — వలదు, వలదు. నాతోఁగూడరమ్ము! నీవు పొర పడితివో లేదో చూపించెదను.

నీల—రాజకుమారీ!

ఉమాబాల నిద్రనుండి మేల్కాంచినట్లుగాఁ జకితయయిపోయి యంతలో మనసు కుదురుపఱచుకొని "ఏమి?" అనియెను.

నీల—నీకు మతిపోయినదా యేమి!

ఉమా—నీవే నన్నిట్లు చేసితివి.

నీల—నేనా రాజకుమారీ?

ఉమా—ఔను. నీవే! ముమ్మాఁటికిని నీవే—వేయిసారులకును నీవే—

నీల—నే నేమి చేసితిని?

ఉమా—నీవు నా హృదయమున నిరాశానలమును బ్రజ్వలింపఁ జేసితివి.

నీల—నేనా ప్రమదయా?

ఉమా—ప్రమదయా? క్షుద్రప్రాణి యది యేమి చేయగలదు నీవేచేసితివి. నాజీవిత మనోరథము—నా యుపాసకదైవము—నాకు దుర్లభమని నీవే చెప్పియుంటివి.

నీల—దుర్లభ మెందుచేత?

ఉమా—మరల నీ వేయిట్లడుగుచుంటివా? తల్లిదండ్రుల యనుమతిలేకుండ నే నాతనిం బడయఁజాలుదునా? వారి నంగీకరింపజేసియే వరింతును.

నీల—మంచిది. ఇఁక బ్రమదపైఁ గోపమేల?

ఉమా—అది ఖద్యోతమయ్యును వెన్నెలల వెదచల్లవలయునని యాశపడుచున్నది. నా హృదయమునం దెన్నఁడునులేని యొక భావమును మొలకలెత్తించుట కది ప్రయాసపడినదికాదా?

నీల—ఏమది?

ఉమా—హింస.

నీల యగాధాంధకారములో నవ్వుకొనుచు "అట్లయినచో ననలజ్వాల నుదయింపఁజేసినదా ?" అనియెను.

ఉమా—నీవు పూత్కారము చేసి ప్రజ్వలింపఁజేయకున్నచో నది యేమి చేయఁగలదు! నీలా! నా కింకను స్మృతి తప్పిపోలేదు—మీ కపటకృత్యము లన్నియును నాకుఁ దెలిసిపోయినవి.

నీల—కపటకృత్యములా ?

ఉమా—అవును. నీవును శ్వేతయును బ్రమదచేఁ బాటలు పాడించిన యుద్దేశమేమో నాకు బోధయయినది.

నీల—అట్లు బోధపడినచో హింసోద్దేశము నీ కేల గలిగినది?

ఉమా—నీవు నావలెఁ బ్రేమించినదానవు కావు. ప్రేమయన నేమో నీకుఁ దెలియదు తెలిసినచో హింస యనునది సామాన్యకారణముచేతనే యబుద్ధిపూర్వకముగ నంకురితమగునని బోధపడియే యుండును. అది ప్రయత్నములకు లొంగునది కాదు—యుక్తులచే దూరీకృతమగునది కాదు.

నీ—సరే నేను చెప్పినదంతయు నసత్యమే యనుకొందము—కాని నీవు చెవులార నాలకించిన సంగతికూడ మిథ్యయేనా ?

ఉమా—సత్యమో యసత్యమో పరీక్షింపవలయును.

ఇట్లు చెప్పి రాజకుమారి యతి శీఘ్రముగ నశ్వారోహణముం గావించి నిమిషములో సేనాపతి భవనమునొద్దకుఁ బోయెను. నీలయు నామె ననుసరించెను. వా రిరువురును సింహద్వారమువైపునఁ గాక ప్రసాదుఁడు విడిసియున్న గదివైపునకుఁ బోయిరి. అంతలోఁ దలుపు తెఱచిన చప్పుడయ్యెను; ఇరువురును విస్మితనయనములతోఁ దిలకించిరి; ఎదుటఁ బ్రసాదుఁడు !!

---

ఎనిమిదవ ప్రకరణము

# కన్నీరు

ప్రసాదుఁ డిప్పుడు కిల్లాదారుఁడు. అయినను నాఁతడు దుర్గమున నివసించుట లేదు. ఈ శాంతిసమయమున దుర్గమునం దుండవలసిన ప్రయోజనమును లేదు. ఆతఁ డిప్పుడు సేనాపతిభవనము నందే యుండెను. అ మందిరమునఁ గొన్నిగదులలో నాతఁడు దాసదాసీ పరివృతుఁడై నివసించియుండెను. అతని కాయిల్లు పరగృహముగాఁ దోఁచుటలేదు. జనార్దనుఁడు సకల దుఃఖములను మఱచి తన ప్రభువును సేవించుచు నందే యుండెను, కాని, యిప్పుడు జనార్దనుఁ డించుక చింతాకులుఁడై యుండెను.

నేఁటి సాయంకాలమునకుఁ దరువాత సరిగఁ బ్రమద పాటలు పాడి యుమాబాల చెవులలో గరళమునించుచున్న సమయమునఁ బ్రసాదుఁడు తన మందిరములలోఁ గూర్చుండి జనార్దనునితో నాలోచించుచుండెను. ఆయింట నితరు లెవ్వరును లేరు; దీపము వెలుఁగుచుండెను. అప్పుడు ప్రసాదుఁడు "జనార్దనా! నీవు సరిగాఁ జెప్పితివి. నా లేఖ సరిగ దేవలునకుఁ జేరలేదు." అనియెను.

జనా—నేనీ సంగతి నిదివఱకే చెప్పియున్నాను. మనము పంపినవాఁడు వచ్చి సరిగా దేవలుని చేతికి జాబు నీయలేదని చెప్పి నప్పుడే యాలేఖ యితరులచేతిలోఁ బడిపోయినదని యనుకొంటిని. ఆతనికే జాబందినచో నింతకాలమువఱకు రాకయుండునా ?

ప్రసా—ఆతని కింకను నారోగ్యము కలుగలేదేమో ?

జనార్దనుఁ డేమియు నుత్తరము చెప్పలేదు. చెప్పుట కాలోచింపనైన లేదు. అందుచేఁ బ్రసాదున కనేకాలోచనములు తోఁచెను. అతఁడు వ్యాకులస్వరముతో "జనార్దనా! నీ విప్పుడే తేజస్వతీ నగరమునకుఁబోయి దేవలుని జూచి రమ్ము. నా మనసు పరిపరివిధములఁ బోవుచున్నది. నా సంగతి యంతయును దేవలునకుఁ దెలుపుము. నీవు పొమ్ము—ఇప్పుడే పొమ్ము" అనియెను.

జనా—పోవుటకు నాయడ్డ మేమియునులేదు. కాని, నిన్నొంటిగ విడిచి పోవఁజాలను.

ప్రసా—ఎందుచేత ? ఏమి భయము ?

జనా—ఆసంగతి నీకిదివఱకే చెప్పియుంటిని. కొన్నిదినముల నుండి నా హృదయమునం దేదియో సందేహము కలుగుచున్నది. నీవు పోవుచోటికెల్ల నిన్ననుసరించి నిగూఢముగా నలుగురైదుగురు తిరుగుచున్నవారు. ఒకనాఁటిరాత్రి నీయింటిగవాక్షమును బగులఁ గొట్టుటకుఁగూడఁ బ్రయత్నించినారు. నేను మేల్కనియుండుటచేత వారిపని సాగినదికాదు. ఇట్టి స్థితిలో నిన్నొంటిగా విడిచి యెట్లు పోఁగలను ?

ప్రసా—నీవు నాకొఱకు భయపడవలదు. నీకింతభయమేమి జనార్దనా ?

జనా—ఎవ్వరెవ్వ రేమిచేయుదురో యెవ్వరు చెప్పఁగలరు యువరాజా ?

ప్రసా—జనార్దనా! నలుగురైదుగురు దొంగలకొఱకు వీరేంద్రకేసరి వీరపుత్రుఁడు భయపడఁ బోఁడు. నా సంగతి యుద్ధక్షేత్రమున బాగుగఁ దెలిసియుండవచ్చును. నీవు నిశ్చింతుఁడవై బయలు దేరుము

జనా—నీవొక ప్రతిజ్ఞ గావించినచో నేను నిర్విచారముతోఁ బోఁగలుగుదును.

ప్రసా—జనార్దనా ! ఏమిచేయవలయునో చెప్పుము ?

జనా—సాయంకాలమైన తరువాత నీవిల్లువిడిచి యెచ్చటికిని బోవలదు.

ప్రసా—అట్లే చేయుదును.

జనార్దనుఁడు వెడలిపోయెను. ప్రసాదుఁ డొంటిగఁ గూర్చుండి యాలోచించుకొనుచుండెను. దేవలునిసరళస్వభావము, ఆతనిపవిత్రస్నేహము, దేవోపమసౌందర్యము, ఒక్కొక్కటిగఁ బ్రసాదునితలపులకుఁ దోఁచుచుండెను. మహైశ్వర్యము, పితృరాజ్యము, కాల

క్రీడలు— వాత్యాతాడిత మేఘశకలములం బోలి యాతని మనస్సరో వరమునఁ బ్రతిబింబించుచుండెను. ప్రతిమేఘ శకలమునఁగూడ నొక్క చినుకైనఁ జిలుకరింపకుండఁ బోవుటలేదు. అతని కనుఁ గొలుకులయం దొకటిరెండు జలబిందువులు కానవచ్చుచుండెను. ఆ సమయమునందు "నీ వేడ్చుచుంటివా ? అమ్మతోఁ జెప్పెదను." అనుమాటలు వినఁబడియెను. ఆతఁడదరిపడిచూచెను. ఎట్టయెదుటఁ జంద్రికాప్రాయయగు లలిత ! లలితలో నేమున్నదియో కాని యామెయున్నచోట విషాదము లేదు ; కన్నీరు లేదు. ప్రసాదుఁడు కన్నీటిం దుడిచికొని నవ్వుచు "నా యపరాధమును నే నంగీకరించి తిని. అమ్మతోఁ జెప్పవలదు." అనియెను.

లలి—అట్లయినచో నీవేల దుఃఖించుచుంటివో తెల్పుము.

ప్రసా—నీవింతసేపటివఱకు నాయొద్దకు రాలేదేమి ? మఱచి పోయితివా ?

లలి—నిన్ను నేను మఱచిపోవుదునా ? ఏమి ? నీవు నా సోద రుఁడవు కావా ?

ప్రసాదుఁడు నివ్వెరపడి లలితం జూచుచుఁ దనలో "ఈహారమును దేవలు నికంఠమున నలంకరింపఁగలిగినచో నాదగ్ధహృదయమున కించుక చల్లదనము లభియించును." అని భావించుకొనియెను.

లలి— నీవు నా మొగమువంక నట్లు చూచెదవేమి ? ఏమను కొనుచున్నావు ?

ప్రసా—అనుకొనుట కేమున్నది ? నిన్నువిడిచి క్షణమైన నుండఁజాలనని యనుకొనుచున్నాను.

లలి—అన్నా ! నీవు నన్ను విడువవుగద ?

ప్రసా—నీపెండ్లి యయినచో నీవు నీయత్తవారింటికిఁ బోయెదవుగాదా ?

లలిత యిఁకమాటలాడలేదు ; కాని యించుక సిగ్గుపడనైన లేదు. మరల నామె "సోదరా ! నీవు నన్నెన్నటికిని విడువనని చెప్పుము !" అని బలవంతముగఁ బ్రశ్నించెను.

ప్రసా—లలితా ! నిన్ను విడిచి నేనెక్కడకుఁ బోవుదును ? నేనుండుటకు మఱియొకచో టెక్కడ నున్నది ?

లలిత యించుక మనఃపరితాపమునందెను. అయినను బాలికా చాపల్యముచే "నీవు నన్నెప్పుడు విడిచెదవో చెప్పుము?" అనియెను.

ప్రసా—అధిక దుఃఖముగాని, యత్యధికసుఖముగాని నాకుఁ దటస్థించినప్పుడు నిన్ను విడిచిపోయెదను. అట్లు సంభవింపకున్నచో మీయమ్మ నమ్మా యని పిలుచుచు నేనిచ్చటనే యుండెదను.

లలిత కీమాటలయర్థము బాగుగ బోధపడలేదు. ఆమె యాతృతతో "అత్యధికసుఖమన నెట్టిది ?" అని యడిగెను.

ప్రసా—స్వదేశమునకుఁ బరిత్యాగమనము.

స్వదేశమునుగూర్చియే ప్రసాదునకుఁ గష్టముగ నున్నట్లు లలిత గ్రహియించెను. ఆతని జన్మభూమి గూర్చి ప్రసాదుఁ డెవ్వరి తోడను జెప్పలేదు. అడిగినను జెప్పకుండుటచే నెవ్వరు నా విషయమునం దాతని బ్రశ్నించుట మానుకొనిరి. లలిత మరల దేశము మాట యెత్తకుండ "సోదరా ! నీకట్టి యత్యధికసుఖము లభియించునా ?" అనియెను.

ప్రసా—అసంభవము ! ఒకవేళ జగదంబా కటాక్షముచే నట్టి సుఖము లభియించినను నిన్ను విడువఁబోను లలితా!

లలి—నా కేమియును బోధపడుట లేదు. స్పష్టముగాఁ జెప్పుము !

ప్రసాదుఁడు దీర్ఘశ్వాసమును విడిచి "అట్టి మంచిదినము లభియించినప్పుడు నీ కంతయును జెప్పెదను. ఇప్పు డీకఁ బ్రశ్నింప వలదు." అనియెను.

ఇరువురును గొంతసేపు మౌనముతో నుండిరి. లలిత హృదయమే మనుచున్నదో యామెకుఁ దెలియుటలేదు. ఇదివఱ కామె ప్రసాదుని కన్నీటిం గాంచి జాలిచే నాతని హెచ్చరించినది ఇప్పు డామె కన్నులే యశ్రుజలపూరితములై పోయెను. ప్రసాదుఁ డామె వదనమండలమును దిలకించుచుండెను. కాని, యాతఁడు దుఃఖించుట

లేదు; లలిత మందహాసము చేసెను; ప్రసాదుఁడును నవ్వెను; గాని, యా యిరువురి నయనకమలమును బాష్పరుద్ధము లైపోయెను. కొంత సేపైన తరువాత లలిత "సోదరా? నేనొక కలఁగంటిని. అప్పటి నుండియు నా మనసెట్లో యున్నది. స్వప్నవృత్తాంతమువినియెదవా?" అనియెను.

ప్రసా—లలితా! ఏమికలఁ గంటివి? కళ్యాణమైనట్లు కల వచ్చినదా?

లలిత తల నడ్డముగఁ ద్రిప్పుచు "అదికాదు. ఆశ్చర్యకరమైన స్వప్నము—సరిగా జ్ఞప్తియందు లేదు; వేకువజామున స్వప్నము! ఎవ్వరో వచ్చి నా ప్రక్కను నిలువఁబడిరి; నీవును నెక్కడనుండియో వచ్చి యాతనిప్రక్కను నిలిచితివి. నేను నిన్నువదలి యాతనివంకఁ జూచితిని! ఆతఁడెంతటి సుందరుఁడు! అంతచక్కనివాఁడు దేవతలలోఁగూడ నుండఁడు! ఆతఁడు నాసమీపమున కించుకజరగి వచ్చెను; అప్పుడు నీవు నవ్వితివి; నీ నవ్వుఁజూచి నా కన్నుల నీరు నిండిపోయెను; నేనించుక యోసరిల్లితిని. నేనట్లే నవ్వుచు నాతని నాయొద్దకుఁ జేర్పవచ్చితివి; నా చేతి నాతని చేతులయం దుంచితివి— అప్పుడు నా హృదయ మెట్లున్నదియో నేను చెప్పఁజాలను; ఆ యవస్థలోనే నాకు నిద్రాభంగమైనది—సోదరా! స్వప్న మెన్నటికైన సత్యమగునా?" అనియెను.

ప్రసాదుఁ డెట్టి ప్రత్యుత్తరమును జెప్పఁజాలకపోయెను. ఉత్తరము చెప్పుటకు ముందే జయంతకుమారుఁడా గృహమునఁ బ్రవేశించెను. జయంతునివదనము ప్రగాఢవిరాశాచ్ఛన్నమై యుండెను—ఆతని కాలుసేతులు కంపించి పోవుచుండెను; కన్నులలోఁ గళ తప్పిపోవుచుండెను. లలిత యాతనింజూచి చటాలున దగ్గఱకుఁ బోయి కూర్చుండి "సోదరా! ఇట్లుంటివేమి? అనారోగ్యముగా నున్నదా?" అనియెను.

జయం—లేదు. రాత్రి తిరుగుటచే వలసిపోయితిని. నా తలపై జేయివైచి చూడుము! అనారోగ్యము లేదు.

లలిత సోదరుని తలపై చేయివైచి చెదరిన కుంతలములను సవరించెను. ఆ కోమల కరస్పర్శముచే జయంతుని శిరోవేదనయించుక యుపశమించెను. ఆతఁడు పవిత్రత్వమునకు నిలయమగు లలిత వదనముం గాంచుచుండెను. చూచుచుండఁగనే యాతనికన్నుల నీరు నిండిపోయెను. అందుచే నాతనికి మనశ్శాంతి కలిగెను. అప్పుడాతఁడు "లలితా! నీవు లోపలకుఁబోయి నా కాఁకలి యగుచున్నదనియమ్మతోఁ జెప్పుము!" అనియెను.

లలిత వెడలిపోయెను—ఆ యింటియందలి దీపముకూడఁ గ్రమక్రమముగఁ గునికిపోవుచుండెను.

---

తొమ్మిదవ ప్రకరణము

# నిరాశ

జయంతుని వదనము సామాన్యకారణముచే విషాదాంకితము కాఁజాలదని ప్రసాదుఁ డెఱుఁగును. ప్రసాదుఁ డాతనిని ఁచుక యూఱడించు నుద్దేశముతో సమీపమునకువచ్చి యాతని రెండు చేతులను బట్టుకొని యెట్టెగఁ గందియున్న మొగమువంకఁ జూచుచుండెను. అప్పు డాకస్మికముగ జయంతునికన్నులు ప్రసాదుని హస్తములపైఁ బడియెను. అతని వ్రేలియందు మూఁబాలచే నీయఁబడిన యుంగుఁ ళీయక మున్నది. జయంతుఁ డా యుంగరముం గాంచెను. తోడనే యాతఁ డనాలోచితంబుగ నబుద్ధిపూర్వకముగ "ప్రసాదా! నీకీ యుంగర మెట్లు లభియించిది?" అని ప్రశ్నించెను.

ప్రసాదుఁ డించుక లజ్జితుఁడై పోయెను; తడనే యెట్టిప్రత్యుత్తరమును జెప్పఁజాలక పోయెను. జయంతుఁడు హృదయావేగముతోఁ బ్రసాదుని హస్తమును వక్షమునం జేర్చుకొని "చెప్పుము ప్రసాదా! ఇది నీ కెవ్వరు నీయలేదా? చెప్పుము! చెప్పుము!" అనియెను.

జయంతుని నిరాశాదగ్ధ హృదయచంచలస్వనము నాలకించి ప్రసాదుఁడు సర్వమును గ్రహియించెను. అతఁడేమియుఁ బ్రత్యుత్తర మీయఁజాలకపోయెను. అతఁడు నిరుత్తరుఁడగుటవలన జయంతున కు మఱియును సంశయము కలిగెను. అప్పు డాతని హృదయమునం దెన్నియోభావము లుదయించెను. ఆయావేగముతో నాతఁడు ప్రసాదుని హస్తమును విసరివైచి చటాలున లేచి నిలువఁబడియెను. తోడనే కిటికీయొద్దకుఁబోయి తలుపులను దెఱచెను. అప్పు డాతనికి బాహ్యజ్ఞానమే యున్నచోఁ గిటికీని బగులఁగొట్టవచ్చి తన్నుఁజూచి భయపడి పాఱిపోయి చీఁకటిలో దాఁగియున్న సలుగురు మనుష్యుల నాతఁడు చూచియే యుండును.

కాని, జయంతున కాదృష్టియే లేదు. అతఁడు కిటికీయొద్ద నిలువఁబడి యంధకారహృదయములో నంధకారావృతంబగు శూన్య ప్రదేశమును దిలకించుచుండెను. ఉపరిభాగమున ననంత నీలాకాశము —నలుదెసల నిశ్శబ్దస్తూపాకారనిబిడాంధకారము— హృదయాంత రాళమున నిస్సీమాంధకారము—జయంతకుమారుఁడు శూన్యదృష్టితో గొంతసేపటివఱకును శూన్యమును దిలకించుచుండెను. తరువాతఁ జాలసేపటి కాతఁడు తిరిగి ప్రసాదునియొద్దకు వచ్చి నిలువఁబడి మృదు గద్గదస్వరముతో "ప్రసాదా! ఈప్రపంచమున దుర్లభమైన పదార్థము నీకు లభియించినది. నిన్నాశీర్వదించుచున్నాను. నీ వీరత్నమునకుఁ దగినవాఁడ వయ్యెదవుగాక !" అనియెను.

ఇఁక నాతని నోటమాట వెడలలేదు. ఈసారి జయంతునకు దుఃఖము వచ్చినది. అతని నయన జ్వాలద్వారము వివృతమయ్యెను. కూలంకషమై యశ్రుధారాప్రవాహము ప్రవహింప నారంభించెను. ఏమియుఁ దెలియకుండఁ బ్రసాదుఁడుకూడ నాతనితోఁగలసి యేడువఁ దొడంగెను. బాలురంబోలి యిరువురును దుఃఖించుచుండిరి. ఏల యేడ్చుచుండిరో యిరువురకును దెలియుటలేదు. అశ్రుజలముచే నిరువురి హృదయములును దడిసిపోయెను. ఆ దుఃఖముచే నిరువురకు నించుక మనశ్శాంతి కలిగెను.

ఆ సమయమున గవాక్షముకడ నేదియో చప్పుడయ్యెను. ఇరువురు నదరిపడి లేచి గవాక్షమునుండి యంధకారమునకు దృష్టులఁ బరగించి చూచిరి. ఏమియు నగపడలేదు. అప్పుడా యిరువురు నొకసోఫాపై గూరుచుండిరి.

జయం—ప్రసాదా! రేపు నాకుఁ జాలదూరముపఱకును బో వలసినపని యున్నది. మరల నెప్పుడింటికి వచ్చెదనో చెప్పఁజాలను.

ప్రసా—ఎక్కడకుఁ బోయెదవు?

జయం—సంబరతీరమునకు;

ప్రసా—అచ్చటఁ బని యేమున్నది?

జయం—రాజాజ్ఞ యట్లున్నది—తేజస్వతీనగరపు యువరాజు నెదురుకొని తీసికొని రావలయునని నియమింపఁబడితిని.

ప్రసా—తేజస్వతీనగరపు యువరాజా? అతఁ డెవ్వఁడు?

జయం—విషధేశ్వరుఁడగు వసంతరాముని తనయుఁడు!

తాను మరణించినట్లు ప్రజలలోఁ బ్రవాదములు గలుగుటచే నిప్పుడు దేవలుఁడు యువరాజై యుండెననుసంగతి ప్రసాదున కిదివఱకే తెలిసినది ఇప్పు డాతనికిఁ గడచిన పండ్రెండుమాసముల చరిత్రము నొక్కసారి కన్నులఁ గట్టినట్లయ్యెను. మఱియుఁ దనతండ్రి, తండ్రిరాజ్యము సంపత్తి, ప్రజాభిమానము, బంధుప్రేమము క్రమక్రమముగ నొక్కొక్కటియే యాతనితలఁపునకు వచ్చెను. ఆ యంధకారమునం దల్ప తేజఃకిరణమైనను నాతని కగపడలేదు. ప్రసాదున కేడుపువచ్చెను. దేవలుఁ డిప్పుడు యువరాజు—భావిసింహాసనమున కుత్తరాధికారి! అది యొక్కటియే యాతని మనశ్శాంతి కాధారముగ నుండెను. అతఁ డించుక సేపూరకుండి "జయంతా! ఆ యువరాజు సంబరతీరమున కేల విచ్చేసినాఁడు?" అని ప్రశ్నించెను.

జయం—అతఁడిప్పుడు సిరోహికిఁ బోవుచున్నాఁడు. మార్గాయాసముచే సంబరతీరమున విడిసియున్నాఁడు. ఈనడుమ నాతఁ డస్వస్థుఁడై యుండెననికూడ నేను వినియుంటిని.

ప్రసా—ఇప్పు డాతని నచ్చటి కేల తీసికొనరావలయును?

జయం—వీరోత్సవ సమావేశమునకై యాతనిగూడఁ బిలిచి తిమి. పిలిచినవారిని గౌరవముగఁ దీసికొనిరావలదా ?

ప్రసాదుఁడు దేవలుని జూడఁగలుగుదునను నుత్సాహము చేఁ బరవశుఁ డయ్యెను. ఆతనిం జూచి చాలనాళ్లైనది. ఆతని మాటలు విని చాల దినములయ్యెను. చిరకాలమునకుఁ దరువాతఁ బునర్దర్శనము ! కాని జనార్దనుఁ డేఁడీ ? ఆతఁడు వెడలిపోయినాఁడు. ఇంకను నశ్వశాలయందే యుండెనేమో—ఆతని గలసికొనుట కింకను నవకాశమున్నదేమో— తెలియుటలేదు. ప్రసాదుఁ డతిశీఘ్రముగఁ బార్శ్వద్వారమును దెఱచుకొని యింటిబయటకు వచ్చెను. తలుపు తెఱచిన తోడనే దీపకాంతి వెలుపలఁ బ్రసరించెను. ఆ వెలుఁగులో నశ్వముల నధిరోహించియున్న యిరువురు యువతు లాతనికన్నులఁబడిరి. ప్రసాదుఁ డించుక ముందఱికివచ్చి చూచెను. రాజకుమారి—ఆమె వెనుకఁ బరిచారికయగు నీల !

ప్రసాదుఁడు సంభ్రమముతో రాజపుత్రిని సమీపించెను. ఆతని కన్నులయం దాశ్చర్యోత్సాహములు జాగరితము లగుచుండెను. ఆకాంక్షించుచున్న పదార్థము సాక్షాత్కరించియుండుటచేఁ బ్రసాదుఁ డానందసాగర నిమగ్నుఁడై పోయెను. ఆతని సర్వాంగములును గంపించి పోవుచుండెను. ఇంతరాత్రివేళ నేకాకినివై యేలవచ్చితివని రాజకుమారిని బ్రశ్నించుటకూడ నాతఁడు మఱచిపోయెను. అశ్వశాలయందు జనార్దను నన్వేషించుకార్యముకూడ మఱచిపోయెను. భూమ్యాకాశములయందలి సర్వవస్తువుల నాతఁడు మఱచిపోయెను. అచ్చట నీల యున్నదనుమాటకూడ మఱచిపోయెను. అంధకారమున దీపకాంతులు విలీనములై పోయెను. అతఁడన్నియును మఱచి రాజకుమారి వదనమండలమునుఁ దదేకధ్యానముతోఁ జూడ నారంభించెను.

కలఁగనుచున్న దానింబోలె నుమాబాలయును విహ్వలహృదయ యయిపోయెను అది కలయో సత్యమో యామెకు బోధపడుట లేదు ; విమర్శించుకొనుటకు మనసు చెదరిపోవుచుండెను—కనఁబడు

చున్నదంతయును గలవలెనే తోఁచుచుండెను. అప్పు డామెహృదయమునం దెట్లున్నదియో యెవ్వరు చెప్పగలరు? ఆమె యిప్పుడు ప్రసాదునివంకఁ జూచుటలేదు. అంధకారమునిఁ దలవంచి యావిశ్వమయాంధకారమునే దర్శించుచుండెను. అప్పుడు ప్రసాదుఁడు "రాజకుమారీ!" అని పలుకరించెను.

ఆ కోమలస్వరశ్రవణముచే రాజకుమారి సర్వాంగకములును గంపించిపోయెను; క్రమక్రమముగ నెల్లసంగతులును స్మృతికి వచ్చుచుండెను. ప్రసాదుఁడు, లలిత, నీల, రాత్రి అంధకారము క్రమక్రమముగఁ దలఁపునకు వచ్చుచుండెను. ఆ బాహ్యజ్ఞానముతోఁగూడ నించుకలజ్జయును, నించుక ప్రతీకారానలజ్వాలావేశమును నంకురితము లగుచుండెను ఆకస్మికముగ రాజకుమారి తన గుఱ్ఱమును మరలించెను.

కఠినశిలామయం బగు నయ్యంధకార మార్గమున గుఱ్ఱము మెల్లమెల్లగ నడచుచుండెను. దాని ప్రక్కనుండియే ప్రసాదునియశ్వమును నడచుచుండెను. అప్పుడు నీల ప్రసాదునిఁ జూచి "అయ్యా! మీరింక వెనుకకుఁ బోవచ్చును. లలితాదేవి మీకొఱకుఁ గనుపెట్టుకొని యుండునేమో?" అనియెను.

ఆ సమయమునం దామార్గపార్శ్వమునం దేదియోశబ్దము వినవచ్చెను. ఎవ్వరో నవ్వినట్లు వినవచ్చెను. ఆశబ్దము స్వల్పమైనను నిశ్శబ్దసమయముగావున నచ్చటిమువ్వురకును బాగుగఁ గర్ణగోచరమయ్యెను. మువ్వురు నదరిపడి తిరిగి చూచిరి. అప్పుడు నీల సముత్తేజితస్వరముతో "ప్రసాదా! ఇదిగో! లలిత నిన్ను వెంబడించియే వచ్చుచున్నదే?" అనియెను.

నవ్వుచుఁ బ్రసాదు ననుసరించి వచ్చుచున్న యామె లలిత కాదు. ఆమె ప్రమద. ప్రమద రాజకుమారునియొద్దనుండి వెడలి తిన్నఁగ నింటికిఁ బోయెను. ఆమె తల్లితో రాజకుమారి తన్నుఁ బిలిపించినదని చెప్పెను. పిమ్మట నామె గాంఢాంధకారములో నీలాంబరమును గట్టుకొని వినీలకంచుకమును దొడిగికొని నీలవసనమును

గప్పుకొని పై న్యాధిపతి యింటిపై పునకుఁ బోయెను. అక్కడకుఁబోయి యామె ప్రసాదుఁడున్న గదిని గుర్తించి గవాక్షమున కించుకదూరమునందున్న యొక చెట్టుకొమ్మలలోఁ గూర్చుండియుండెను; ఉమాబాల వచ్చుటయు వెడలుటయు నంతయుఁ జూచి పిమ్మట నింటికిఁ బోవుచు నాయంధకారములో నలుగురైదుగురు మనుష్యులు గవాక్షమునకుఁ గ్రింద నిలువఁబడియుండుట నాకస్మికముగఁ గనుఁగొనియెను. అందులోఁ గొందఱు మెల్లగ జరగిపోయిరి—మరలఁ బ్రవేశించిరి—మరల వెడలిపోయిరి. ప్రమదకుఁ జాల భయమయ్యెను. ద్వారపాలున కీ సంగతి తెలుపవలయునని యామె యనుకొనియెను గాని సాహసింపఁజాలకపోయెను తాను దొంగవలె వచ్చి దొంగలనుబట్టియిచ్చుట యెట్లు? ఆమె యేమియుఁ జేయఁజాలకూరకుండెను.

ప్రమద మరల విస్మయముతోఁ జూడఁదొడంగెను. ఉమాబాల వచ్చుచుండెను. ఆమెహృదయము దహించుకొని పోవుచున్నదని ప్రమద గ్రహించెను. ప్రమద లేచి నిలువఁబడి రహస్యముగ వారల సమీపించి వారిమాటల నాలకించుచుండెను. నీల ప్రసాదునింగూర్చి యనినమాట నాలకించినతోడనే ప్రమదకు నవ్వు వచ్చెను. తన యుద్దేశము ఫలించినదనియెంచి యామె నవ్వుకొనియెను. ఆమె నవ్వుచు నట్లే పలాయితురాలయ్యెను.

ఆ మందహాసనిస్వనము వినఁబడుచున్నదిక్కునుసరించి ప్రసాదుఁడు వెదకుకొనుచుఁ బోవుచుండెను. ఎంతయు న్వేషించినను నెవ్వరు నగపడుటలేదు. అతఁడు తిరిగితిరిగి వేసరి మరల రాజకుమారియొద్దకే వచ్చి "ఎవ్వరు నగపడలేదు. కాని యట్లు నవ్వుచుఁ బోయినవారెవ్వరోగదా ?" అనియెను.

ఉమాబాల యిఁకనచ్చట నిలువలేదు. గుఱ్ఱము నుడాయించి పోవుచుండెను. నీలయుఁ నామె ననుసరించెను. రాజకుమారి పోవుచున్న సమయమున "ఒక్కసారిగ రెండు పడవలపైఁ గాలువెట్టి ప్రయాణము చేయఁబోకుము; అగాధజల నిమగ్నుఁడవై పోఁగలవు" అనియెను.

నలుదెసల నంధకారము. ప్రసాదుఁడా యంధకార మధ్యమున నే కాకియయి నిలిచి యుండెను. ప్రసాదునకప్పు డాత్మవిస్మృతి కలిగెను. ఆతనికి స్మృతి కలుగునప్పటి కెవ్వరో తన రెండుచేతులను బలవంతముగఁ బట్టుకొని యున్నట్లు గ్రహించెను. ఎవ్వరో నలుగురు మనుష్యులు తన్నుఁ బరివేష్టించి యాక్రమించుకొని యున్నట్లాతనికిఁ గ్రమముగ ననుభవ మయ్యెను. అప్పు డాతఁడు తత్తరముతో "నే నిప్పు డెక్కడ నున్నాను? మీరెవ్వరు?" అనియెను.

అప్పుడా నలువురిలో నొకఁడు "మేము నీకుఁ బరమబంధులము! నీకుఁ బెండ్లిచేయుటకై నిన్నుఁ దీసికొనిపో వచ్చితిమి పెండ్లి యయినచో నీకు నయముకాదా?" అనియెను.

అప్పు డింకొకఁ డాజ్ఞారూపముగ "ఆలస్యము చేయవలదు. సహాయులు వచ్చిపడఁగలరు? సత్వరముగ బంధించి యశ్వముపైఁ బడవేయుఁడు!" అనియెను

అట్లాజ్ఞాపించిన యాతఁడు మహాదేవరావు, ప్రసాదుఁడప్పుడు తాను దొంగలచేతులలోఁ బడితినని గ్రహించుకొనియెను. అప్పు డాతనికి జనార్దనుఁడు చెప్పినమాట జ్ఞప్తికి వచ్చెను. అయినను నాతఁడు తనలోఁ "ఇఁక నీజీవితములోఁ బని యేమున్నది? సాధ్యమైనంతవఱకుఁ బ్రతీకారము చేయవలయును" అని భావించుకొనియెను.

అప్పు డాసమీపమునుండి స్త్రీకంఠముతో 'ఓ పురరక్షకులారా! ఎక్కడనున్నారు? శీఘ్రముగ రండు! కిల్లాదారును దొంగలు పట్టుకొన్నారు!" అని కేకలు వెలువడియెను.

అట్లు కేకలువైచిన యామె ప్రమదయే. అప్పుడొక చోరుఁడు వచ్చి యామెను బట్టుకొని కాలుసేతులను బంధించెను. ప్రసాదుఁడా యంధకారమునం దేకాకినియయి బంధింపఁబడియెను.

---

ఏదియవ ప్రకరణము

# వృక్షాంతరాళమునఁ బ్రమద

ఈవిధముగ బంధింపఁబడియుండుట యెవ్వరి కిష్టముగ నుండును ? ప్రమదవంటి చతురమతి కీబంధమునుండి విడివడుట దుస్సాధ్య కార్యము కాదు. ఆ బంధనముకూడ దృఢమైనది గాదు. నిమిషములోఁ బ్రమద బంధములను ద్రెంచి వైచుకొనియెను. దొంగలే త్రోవనుబట్టి యే దిక్కునకుఁ బోయిరో ప్రమద యిదివఱకే కనుపెట్టి యుండెను. వారు నగరము వైపునకుఁ బోవక దుర్గమున కుత్తరముగఁబోయి యంతలో నంధకారమునఁ గలసిపోయిరి. ప్రమద యిప్పుడు నూతనము నవలంబించి సేనాపతి మందిరము వంకకుఁబోయి ప్రసాదుఁడు నివసించుచుండు గదివైపునకుఁ బోయెను. అప్పటికిని బ్రసాదుఁడు తెఱచిన ద్వారము తెఱచినట్లే యుండెను. ప్రమదయా మార్గమునఁ బోయి యొక చిన్నగదిలోఁ బ్రవేశించెను. అందప్పుడు జయంతుఁడును లలితయును గూర్చుండి యుండిరి. జయంతుఁడు బాధపడుచుండెను. లలిత యాతని కుపచారములు చేయుచుండెను ప్రమద లలితం జూచి సంశయముచే వారిని సమీపింపఁజాలక పోయెను. ఆమె ద్వారమునొద్దనే నిలిచి యేమేమియో భావించు కొనుచుండెను.

తుదకామె వెలుపలకువచ్చి యుశ్వశాలవైపునకు బయలుదేరె ను. రాత్రి యప్పటి కింకను జాముదాటలేదు. రక్షకభటులు జాగరూకులై యుండిరి. ప్రమద యొక యుపాయము నాలోచించి యొక భటుని యొద్దకుఁబోయి నిలువఁబడి "కిల్లాదారు గుఱ్ఱముకొఱకు నన్ను బంపియున్నాఁడు—ఆతని గుఱ్ఱమెక్కడ ? శీఘ్రముగ సజ్జితముం గావించి నా కొసంగుము !" అనియెను.

భటు—కిల్లాదా రెచ్చట నున్నాఁడు ?

ప్రమద యించుక నవ్వుచు "ఆతఁడు రాజాంతఃపురమున నున్నాఁడు" అనియెను.

భటుఁడు మఱింతవింతగ నవ్వుచు "నీ వెవ్వరు ?" అని ప్రశ్నించెను.

ప్రమద మందహాసముతోఁ దరళకటాక్షములను బ్రసరింపఁ జేయుచు "నేను రాజకుమారిక పరిచారికను." అనియెను.

భటున కింక సంశయించుట కవకాశము లేకపోయెను. ప్రమద కటాక్షములకు వశుఁడై పోయెను; సజ్జితాశ్వముం దెచ్చి యామె కొప్పగించెను. ప్రమద యాతని చేయూఁతగఁ జేసికొని యశ్వారోహణ ముం గావించెను. ఆ కోమల కరస్పర్శచే రక్షకభటుని చతుర్దశ భువ నాంతరములయందును గల పురుషు లెల్లరును బులకితులై పోయిరి. ప్రమద యుత్తరాభిముఖయయి వెడలిపోయెను రాత్రి గాఢాంధ కారము; పర్వతమార్గము; అయినను బ్రమద నిర్భయముగ గుఱ్ఱ మును బరుగెత్తించుకొని పోవుచుండెను. తఱచుగా రాజకుటుంబ ములయందలి రమణు లశ్వశిక్షానైపుణ్యముకలవారై యుందురు. ప్రమద యట్టి రాజవృత్తిక కాకపోయినను వారికిఁ దీసిపోవునదిగాదు. ఆమె యంధకారమును భేదించుకొనుచు నుంచు, చలి మొదలగు వానిని లక్ష్యముచేయక నా పర్వతమార్గమున మహావేగముతోఁ బ్రయాణము చేయుచుండెను.

కొంతసేపటి కామె దూరమునందలి యొక యస్ఫుటశబ్దము నాలకించెను. తోడనే యామె గుఱ్ఱము నాఁపి క్రిందికి దిగి భూప్రదేశమునఁ జెవియొగ్గి యేమేమియో యాలకించెను. తోడనే యామె మరల నశ్వారోహణముం గావించి సత్వరగమనముతో బయలు దేరెను. అంతలో నశ్వమాకస్మికముగ నాఁగిపోయెను. ప్రమద తలయెత్తి చూచెను. ఎదుట నెందఱో యశ్వారూఢులు తీవ్రవేగ ముతోఁ బోవుచుండిరి. ఆ చీకటిలో వారెందఱో లెక్కించుట కవకాశము కలుగుటలేదు. వారందఱును బ్రసాదుని బందీగాఁ జేసి తీసుకొని పోవుచున్నవారేయని యామె గ్రహించెను. ప్రమద యనుమానమునకుఁ గారణము లేకపోలేదు. ఇంచుమించుగ నిన్నూ ర్గురు సైనికుల నడుమనుండి ప్రసాదుఁడు తీసికొనిపోఁబడుచుండెను.

ప్రసాదునిప్రక్కనే మహాదేవరావు—ప్రసాదుని కాలుసేతులు బంధింపఁ బడలేదుగాని యాతఁడెక్కి యున్న గుఱ్ఱపుకళ్లెము మహాదేవరావు చేతిలో నున్నది.

క్రమముగ వారిగుఱ్ఱము లన్నియు నలసిపోయినవి. విశ్రమస్థలముకొఱకు మహాదేవరావు వెదకుచుండెను. త్రోవప్రక్కనేనిలిచియున్నచో వెంబడించి వచ్చువారికి దొరకిపోవుట తటస్థించును. మహాదేవరావంతయు నాలోచించి మార్గమునకు దక్షిణము నందున్న యడవిలోఁ దనయోధులను విశ్రమింపఁజేసెను. ప్రమదయును వారికించుక దూరమున గుఱ్ఱమునుదిగి గుఱ్ఱమునొక చెట్టునకుఁ గట్టివైచెను. పిమ్మట నామె యించుక ముందఱికివచ్చి—వ్రాయుటకు సిగ్గగుచున్నది—ఒక చెట్టుపై కెక్కెను. ఆమె యా సైనికులను దదేకదృష్టితోఁ జూచుచుఁ జెట్టుమీఁదనేయుండి యా రాత్రిని గడపుచుండెను.

వేకువజామున నే యామె వృక్షమునుండి దిగి గుఱ్ఱమును దీసికొని మఱికొంతదూరము వఱకును బోయి యొక చిన్న సరోవరము నొద్దఁ దనయశ్వమున కాహారసంగ్రహముం గావించి వచ్చునప్పటికి బాగుగఁ దెల్లవారెను ఇఁక నామె దొంగలను సమీపించుటకించుక భయపడియెను. కాని దూరమునుండియే కనుపెట్టి చూచుచుండఁగా నా సేనామధ్యమునం దేదియో కోలాహలధ్వనులు బయలుదేరుచున్నట్లామెకుఁ బొడకట్టెను. అందుచే నామె ప్రాణము లఱచేతఁ బెట్టుకొని యెట్లో యించించుక ముందఱికి వచ్చుచు సమీపమునందొక వటవృక్షము నారోహించి గుజ్జుకొమ్మలో డాఁగికొని పరీక్షించుచుండెను. ఆమె యెవ్వరికి నగపడుటలేదు.

ఆ సేనలోఁ బరస్పరవివాదము కలిగినమాట నిశ్చయమే—తెల్లవారినతోడనే సైనికులు తమ యువరాజగు ప్రసాదు నానవాలుపట్టిరి. తమ యువరాజునే బంధించికొని వచ్చితిమని వారి కిదివఱకుఁ దెలియదు. ఈ సంగతి యెంతమాత్రమును మహాదేవరావు వారికిఁ దెలియనీయలేదు తమ రాజ్యమునకు క్షేమమునకై సిరోహీవిజయి

యగు ప్రిసాదునిబట్టి బంధింపవలయునని మాత్రిము మహాదేవరావు వారికిఁ దెలిపియుండెను. అందుచేతనే వారెల్లరును దస్కరులంబోలి నిరాయుధుఁడగు నాతని నంధకారమున బంధించి తెచ్చుటకు సమ్మతించిరి.

ఎప్పుడు తమ యువరాజు నానవాలు పట్టఁగలిగిరో యప్పుడు వారి యానందమునకుఁ బరిమితిలేదు. ఆవీరప్రభుని వీరపుత్రుఁడు—ఇంతకాలమునుండియు మరణించెనని యనుకొనుచున్న రాజ బాలకుఁడు—ఇప్పుడు యోధకులతిలకుఁడై సిరోహీ విజయకీర్తి మూర్తియయి యెట్టయెదుట సాక్షాత్కరించి యున్నాఁడు. ఆ వీరబాలకుఁడగు యువరాజు భవానీప్రిసాదుఁడు తమ నడుమ బంధితుఁడై నిలిచి యున్నాఁడు. అందఱు పానందోన్మాదముచే "జయ! మహారాజ భవానీప్రిసాదునకు జయ!" అని యైకకంఠ్యముగ జయధ్వానములం గావింప నారంభించిరి.

కాని, యీ జయస్వనములలో నందఱి కంఠములును గలియుట లేదు—యువరాజుంగాంచి యందఱు నానందించుట లేదు—అనంతరామునకు సాహాయ్యముం గూర్పవచ్చిన వారెల్లరును యువరాజున కపకారము చేయుటకే యుత్సహించుచుండిరి. అట్టివారి సంఖ్యకూడ నంత తక్కువగాలేదు—కాని, ధర్మము నెదుట నధర్మ మెప్పటికిని సంకుచితమే యయిపోవుచుండును. అదియే వారికి మౌనవ్రితము నుపదేశించినది.

ఇంతపని జరగునని మహాదేవరావు మొట్టమొదట ననుకొనలేదు. అతఁడించుక విచారించెను. ఆత్మసైనికుల కెన్నియో విధముల బోధించెను. అనేకవిధముల నాశపెట్టెను. కాని, యేమియును లాభము లేకపోయెను. కాని కొంతమందిమాత్ర మాశాపరులై యువరాజును విడిచి దూరమున నిలిచియుండిరి. అందఱు నంగీకరింపలేదు.

ఇందువలనఁ బగలంతయును యువరాజును జంపించుట కవకాశము గలుగకుండఁగనే గడచిపోవుచుండెను. యువరాజ రక్షణము నక్కై యేచుమించుగ నేబదిమంది కోశనిర్ముక్త కృపాణపాణులై

యా శ్వాసులు తమ ప్రాణములనైన నర్పించుటకు సిద్ధముగ నుండిరి. ఇట్లు తటస్థించుటచే యువరాజును నిర్బంధించి తీసికొనిపోవుటకుగూడ నవకాశము కలుగుటలేదు. ఇంక నిట్టివిద్రోహులమూలమునం దేజస్వతీనగర మెట్టిదావానల జ్వాలాభీలమైపోవునో యెవ్వరు చెప్పం గలరు? మహాదేవుం డనేకవిధముల నాలోచించి యెటులయిన రాత్రి వేళ యువరాజును జంపింపవలయు నని స్థిరపఱచుకొనియెను.

కాని, రాత్రివేళంగూడ నట్టిపాపకృత్యమునకు శుభయోగము లభియించినదికాదు; ప్రభుభక్తిపరాయణులగు యోధులందఱును యువ రాజును దయ సముంచుకొని జాగరూకులై యుండిరి. కొందఱు తమ యుష్ణీషములను యువరాజున కుపధానములుగం జేయుచుండిరి. కొందఱు తమయుత్తరీయములతో నాతనికి బర్యంకరచనముం గావించుచుండిరి. కొందఱాతనికి మంచుతగులకుండ సద్దముగ నిలిచియుండిరి. ఆస్వార్థపరులగు వారి యవ్యాజప్రేమమునకు యువరాజు కన్నుల నీరు నించిపోవుచుండెను. మహాదేవరావు దుఃఖితుండై భీతుండై తేజస్వతీనగరమున కొకదూతం బంపించెను.

యువరాజాభిమానులందఱును వెల్లవారుజామున యువరాజును దేజస్వతీనగరమునకుం దీసికొనిపోవలయునని సేనానాయకు నడిగిరి. ఈ యగ్నిజ్వాల నచ్చటికిం గొనిపోవుట మహాదేవున కిష్టముగ లేదు. కాని యాతండు తన భావమును దెలియనీయకుండ ముఖప్రీతికొఱకు సమ్మతించినట్లు నటియించి "పగటివేళ నీతనిం దీసికొనిపోయినచో నజమానుసైనికులు తమ యధికారిం దీసికొనిపోవుచుండిరను క్రోధముతో మనలను వెంబడించి యవమానితులం జేయకమానరు. కావున రాత్రివేళలం బ్రయాణము చేయవలయును" అని వారిని బులిమి పుచ్చెను.

వారీయుక్తిని గ్రహింపంజాలకపోయిరి. అందుచే రాత్రి జామైన తరువాత నందఱును దేజస్వతీనగరమునకుం బ్రయాణము సాగింపవలయునని నిశ్చయించుకొనిరి. ఆ కారణమున నాహారము లేకుండ మరల నొకదిన మా యరణ్యమునం గడచిపోయెను.

వారలందఱును దొంగలనిమాత్రమే ప్రమద గ్రహియించెను అంతకంటె నధికముగఁ దెలిసికొనుటవలనఁ బ్రయోజనమును లేదు. చాలమందిదొంగలు ప్రసాదునిం బ్రేమించుటం గాంచి ప్రమద "నా వలెనే వీరందఱు నీతని నిట్లు ప్రేమించుచున్నా రేమి?" అనుకొనియెను.

ప్రమద నిరాహారిణియయి దినము గడపుచుండెను. ఆ వనమున ఫలవృక్షములుకూడ నేవియును లేవు. కేవలమును మద్దిచెట్లు మాత్రమున్నవి. అందలి ఫలముల నొకటిరెంటి నారగించి నిర్ఝరిణీ జలంబులచేఁ దృప్తి నందుచుండెను. పగలంతయు గుఱ్ఱముమీఁదను రాత్రియంతయు వృక్షమూలమీఁదను నామె కాలము గడపుచుండెను. ఆ దొంగలలోఁ గొందఱు బ్రసాదుని జంపుటకును మఱికొంద ఱాతని రక్షించుటకును జూచుచున్నట్లు క్రమముగ నామెకుఁ దెలిసిపోయెను. అందుచేఁ బ్రమద కించుక యూరట కలిగెను.

మఱునాఁటిరాత్రి దొంగలందఱును బ్రయాణము సాగించిరి. ప్రమదయు నశ్వారూఢయయి దూరమునందుండి వారిని వెంబడించెను; వారు విశ్రమించినచోట విశ్రమించి వారు కదలినతోడనే వారిని వెంబడించుచుఁ బోవుచుండెను. నిరంతరమును వారిని గాచుకొనియుండవలసి వచ్చుటచేఁ బ్రమదకు విశ్రాంతి యనుమాటయే లేకుండెను. నాలుగైదు దినము లడవులవెంటఁ ద్రిప్పి యూరూర పెట్టినచో యువరాజును రక్షింపవలయునను వారి యుత్సాహమును జాగరూకతయును లోపించిపోవుననియు నట్టిసమయమున సులభముగా యువరాజును జంపింపవచ్చుననియుఁ జతురచూడామణి యగు మహాదేవరావు నిశ్చయించుకొనియెను. అట్లే యడవులవెంటఁ ద్రిప్పుచు నాతఁడు వారిని దీసికొనిపోవుచుండెను.

ఎవ్వరితోడ నొకమాటయయిన నాడకుండ నతికష్టముతోఁ బ్రమద రెండుదినములు గడపినది. అప్పుడు ప్రమద "ఆహారము లేకుండ నెంతదూరమైన నడవఁగలను గాని మాటలాడకుండ నొక్కయుడుగైనఁ గడపుట కష్టము" అని భావించుకొనియెను. నాలుగవ నాఁడామె మరల "మాటాడకుండ నెంతకాలమైన నుండవచ్చునుగాని

యాహారము లేకుండ నొక్క జామైన నుండుట కష్టము” అని యనుకొనియెను. తరువాత నైదవనాఁడామె “బ్రదికియున్నంత కాలమును మాటాడకుండ గడపవచ్చును. గాని భోజనము చేయకుండ నొక్క వారమైనఁ గడపుట కష్టము” అని యూహించుకొనియెను. తదుపరి నాఁటిమధ్యాహ్నమున నాహారము లేకుండుటచే నవసన్నయయి గ్రామము యొకచెట్టునీడను బడి నిద్రించెను. అప్పు డామె కర్ణరంధ్రముల యందేదియో శబ్దము వినవచ్చెను. “ఈవిధముగఁ దిండిలేకుండ నేల మరణించెదవు? అశ్వము నధిరోహించి యెట్లయిన దేశమునకుఁ బొమ్ము! ఏదైన నాహారమును భుజించి ప్రాణముల నిలుపుకొనవచ్చును” అని యెవ్వరో హెచ్చరించిన ట్లామెకు వినవచ్చెను.

అప్పు డామె దంతములతోఁ బెదవికఱచుకొనుచు “చచ్చినచో నిచ్చటనే చచ్చెదను —మఱియెచ్చటకును బోవఁజాలను” అనియెను.

---

### పదునొకండవ ప్రకరణము

## ఇంకను బ్రదికియున్నాఁడా?

అనంతరాముని హృదయమునకు శాంతి లేదు మహాదేవరావు బయలుదేరి యజమీరునకుఁ బోయి వారముదినము లైనది. ఇంకను నాతనియొద్దనుండి సమాచారము రాలేదు. మూఁడుదినముల నుండి వార్తాహరణమునకై యజమీరునకు మనుష్యులమీఁద మనుష్యులను బంపుచున్నాడు కాని వారిలో నెవ్వరును దిరిగివచ్చుట లేదు అజమీరు చాలదూరమే యయినను నశ్వారోహణముచేసి పోయినచో రెండుదినములలోఁ జేరవచ్చును—అదేపనిగ విడువకుండ జవనతురంగముపైఁ బ్రయాణము చేసినచోఁ బండ్రెండుగంటల ప్రయాణము. అయినను నింతవఱకు నెవ్వరు నెట్టివార్తయును దీసి

కొనిగాలే దెందుచేత? అనంతరాముని హృదయమున ననేకవిధముల లగు దుశ్చింతలు తోఁచెను.

అప్పు డాతఁడు దుర్గశిఖరము నధిరోహించి యజమీాను వంకఁ దదేకదృష్టితోఁ జూచుచుండెను. క్రమక్రమముగ సంధ్యాస్పష్టచ్ఛాయలు పృథ్వీమండలము నాక్రమించుకొనుచుండెను. అనంతరామునకు బాహ్యజ్ఞానము లేదు. అతఁడు తనలో "మహాదేవుఁడు ససైన్యముగ శత్రువుల చేతికిఁ జిక్కియుండును. భవానీప్రసాదుఁ విపులవాహినీ సహితుఁడై యీ దుర్గమును ముట్టడించుటకు వచ్చుచుండునని తోఁచుచున్నది. వచ్చిన రానిమ్ము! భయమేమి? నేనుదయపురపు రాణాకైనను భయపడువాఁడను గాను; కాని, భవానీప్రసాదనిన భయమగుచున్నది. అతఁడిచ్చటకు వచ్చి నిలువఁబడినచో విశ్వాసఘాతుకులగు నా సైనికు లెల్లరు నాతనిపక్షముఁ జేరిపోయెదరు. అప్పుడు నేనేమి జేయఁగలను? పరమేశ్వరా! నేను నిన్నెన్నఁడును బిలిచియుండ లేదు. అప్పుడు నేనేమగుదునో చెప్పుము. మహాప్రభూ!" అని యాలోచించుకొనుచుండెను. అస్థిరచిత్తముతో నాతఁడట్టె దుర్గశిఖరమునఁ బ్రచారము చేయుచుండెను. అంధకారము ప్రాంతరోపత్యకలదాఁగి వచ్చుచుండెను. అప్పటికి ననంతరాముఁ డజమీారుదిక్కునకు నిరీక్షించుచునే యుండెను. ఆకాశమునం దప్పటికి నించుక వెలుఁగున్నది. అంతలో నొకటిరెండు నక్షత్రము లుదయించెను. అప్పు డాతఁడు పూర్వాకాశమునందలి యొక గొప్పనక్షత్రమువంకఁ జూచుచు భావించుకొనుచుండెను. అప్పు డాతని కాకస్మికముగ నేదియో యుపాయము తోఁచుటచే దుర్గశిఖరమునుండి క్రిందికి దిగి కాఁగడల వెలుఁగున దుర్గమంతయును బాగుగఁ బరిశీలించి రాజమందిరమునఁ బ్రవేశించి ప్రధానులం బిలిపించెను.

వారు వచ్చినతోడనే యనంతరాముఁడు "మన యజమీాను ప్రభునితోఁ దప్పక యుద్ధము జరుగఁగలదు; ఏ రాజొకప్పుడు మన దయను గోరుకొనుచుండెడివాఁడో యట్టివాఁడిప్పుడు మనలను

మాటిమాటికి నవమానించుచున్నాఁడు. నేనా యవమానమును సహింపఁజాలకున్నాను. అజమీరునగరమును సంబరమాదమునఁ గలిపివేయ వలయును"

మంత్రి మహారాజా! కాసీమ్ మహమ్మదు మొదలగు మసల్మానులుకూడ నజమీరును జయింపఁజాలకపోయిరి. అజమీరొకప్పుడు హృదయపురమునకుఁగూడఁ బ్రతిద్వంద్వియయి యుండెను. అట్టి యజమీరిప్పుడు దుర్బలమైయున్నను మనవంటి యల్పరాజ్యముచే జయింపఁబడునదిమాత్రము కాదు

అనం—ఆలాగా? నీవు నన్నెఱుంగవు. అజమీరుమాట యటుంచుము! నేను దలఁచుకొన్నచో సౌరాష్ట్రమంతయును జయింపఁగలను బహిరంగముగఁ గాదు! గూఢోపాయములచేఁ జయింపఁగలను. సరే! దానికేమి—ఇప్పు డజమీరు నాక్రమించుట కెంత సైన్యము కావలయును?

మంత్రి—మీవంటి నేర్పరియయినచో నేఁబదివేలసేనతో నాకస్మికముగ నజమీరు నాక్రమించి జయింపవచ్చును.

అనం—నాలుగు దినములలో నీ వెంత సైన్యమును సమకూర్పఁగలవు?

మంత్రి—మహారాజునాజ్ఞ ననుసరించి యెల్లసమయముల యందును సేనలు సిద్ధముగ నుండునట్లేర్పఱచి యుంచితిని. నాలుగు దినములలో నిరువదివేలమందిని సమకూర్పఁగలను. ఆయాస్థలముల యందుంచినవారి నందఱను బిలిపింపవలయునన్నచో నించుక యాలస్యమగును.

అనం—వారిని గూడఁ బిలిపింపుము. ఆయుధమును ధరించువారందఱును నాలుగుదినములలో నిచ్చటకు వచ్చిచేరవలయును. నాకొక లక్షసైన్యము కావలయును. సేనాతరంగములచే నజమీరును ముంచివేయవలయును.

మంత్రి—ఇంతటి యల్పరాజ్యమునం దింతటి స్వల్పకాలములో నంతసైన్యమును సంపాదించుట దుస్సాధ్యము.

అనం — అట్లయినచో నీ మంత్రిత్వము నిలువదని నిశ్చయించుకొనుము.

అనంతరాముని సంగతి తెలిసియున్న మంత్రి మఱియేమియు మాటాడలేదు. కాని, కార్యదర్శి యేమియు మాటాడకూరకుండఁజాలక "మహారాజా ! క్షమింపుము రాఁబోవు పంచమినాఁడజమీరునందు వీరోత్సవము జరుపఁబడును. నేఁడు పాడ్యమి పంచమినాఁటికి సకలరాజన్యమండలముకూడ నజమీరునందుండును. అట్టి సమయమున నజమీరు నాక్రమించుట దుష్కరకార్యముగాఁ దోఁచుచున్నది" అనియెను.

వీరోత్సవముమాట తలఁపునఁబడినతోడనే యనంతరాముఁడించుక యాలోచించి "అట్లయినచో మన కనుకూలముగనే యున్నది. వీరోత్సవదర్శనవ్యాజమున సహస్రసైన్యముతో నజమీరు నకుఁ బోవచ్చును. ఎవ్వరికిని సంశయము కలుగదు. ఉత్సవానంతరమున మనపని మనము చేసికొనవచ్చును" అని మఱింతయుత్సాహముతో "మంత్రీ ! నీవు సైన్యమును సిద్ధపఱుపుము. వీరోత్సవమునకుఁ బ్రయాణమని ప్రకటింపుము. ఉపమంత్రీ ! నీ విప్పుడే సిరోహీకిఁ బోయి యారాజుతో నామాటలుగా నిట్లు చెప్పుము "శత్రు విజయమునకిదే సమయము ఏఁబదివేల సైన్యముతో మీరువచ్చి యజమీరునకుఁ బశ్చిమప్రాంతము నాక్రమించుకొనవలయును. నేనొక లక్ష సైన్యముతోఁ దూర్పువైపున ముట్టడించెదను. ఉత్సవ క్షేత్రమునందు నిన్ను నేను కలిసికొని మాటాడెదను. ఆలస్యము చేసినచో లాభములేదు. ఇఁక రెండుదినములు మాత్రమె గడువున్నది" అని చెప్పుమనియెను.

ఉపమంత్రి "మహారాజా ! నేను సిరోహీకిఁ బోవుటకే రెండు దినములుపైఁగ నగును" అనియెను.

అనం — ఎట్లయినను నీకార్యభారము నీపై నుంచితిని.

దీర్ఘాభివాదనముం గావించి యాతఁడు మాఱుమాటాడకుండ వెడలిపోయెను. మంత్రియును సెలవుగైకొనియెను. అనంతరాముఁ

డొక్కఁడు నాలోచించుకొనుచుండెను. క్రమముగా రాత్రి గడచు చున్నది. అనంతరాముఁడు మనఃపరితాపముతో నిద్రలేకుండ రాత్రి యంతయును వేగించెను.

తెల్లవారినతోడనే మహాదేవరావు పంపినదూత రాజసన్నిధికి వచ్చి నిలిచెను. అనంతరాముఁడు తత్తరముతో నాతనిం దనచిన్న గదిలోనికిఁ దీసికొనిపోయి దూతవలన నెల్లసంగతులను దెలిసికొని యెను. ఆకస్మికముగ ననంతరాముని గుండెలలోనిబరువు దిగిపోయి నట్లయ్యెను. అంతటియానందము నాతఁడు జీవితకాలమునం దెన్నఁడుఁ ననుభవించి యుండలేదు. అప్పుడాతఁ డానందస్వరముతో "ఆతని మృతకళేబరమును నీవు స్వయముగ దర్శించితివా ?" అని ప్రశ్నించెను.

దూత—మహారాజా ! ఎవ్వరి మృతకళేబరము ?

అనం—ఇంకను నెవ్వరిదనుచుంటివా ? మీ రెవ్వనిబట్టి బం ధించితిరో యాతనిది—

దూత—ఆ బంధితుఁ డింకను బ్రదికియేయున్నాఁడు.

అనం—బ్రదికియున్నాఁడా ? ఇంకను జీవించి యున్నాఁడా? మహాదేవరావు నాయాజ్ఞను దిరస్కరించినాఁడు. మీ రందఱును గూడ విశ్వాసఘాతకులైపోయినట్లున్నారు.

దూత—మహారాజా? మేమందఱము నట్లుకాలేదు. కొందఱు మాత్రమవిశ్వాసులైపోయినారు.

అని చెప్పి దూత సర్వమును వివరించి చెప్పెను. అనంతరా ముఁడు విని క్రోధగర్జితస్వరముతో "విద్రోహులసంఖ్య స్వల్పమై యున్నప్పుడు మీరు వారినిగూడ నేల సంహరింపలేదు ?" అనియెను.

దూత—మేమందఱము నట్లే చేయుదు మనిచెప్పితిమి. కాని, మహాదేవరావుమాత్ర మంగీరింపలేదు.

అనం—అంగీకరింపకుండుటకుఁ గారణ మేమి?

దూత—బంధితుని బాహుబలమునుగూర్చి సేనాపతి భయ పడిపోయినాఁడు.

అనం—మీరు నూటయేఁబదిమంది-విద్రోహులు లేఁబదిమంది మాత్రమే! ఇంకను భయమేనా? పిఱికిపంద! అతఁడు సేనాపతిగా నుండుటకుఁ దగఁడు.

దూత—మహారాజా! ఇంకను గొంత సైన్యమును బంపవలయునని కోరి సేనాపతి నన్ను మీదర్శనమునకుఁ బంపియున్నాఁడు.

అనం—ఇంకను నెంత సైన్యమును బంపినచో మీ వీరసేనాపతి విద్రోహుల నడఁగింపఁగలఁడు?

దూత—ఇఁక నిన్నూర్గురు సైనికులను మాత్రమే—

అనం—మంచిది అట్లే యిచ్చెదను. ఈసారి నా సైన్యము నిచ్చి హావల్దారును బంపిం చెదను.

దూత — ఈదుర్మార్గులనందఱను నేను నిర్జించెదననియు, మీరు నిశ్చింతులై యుండవలయుననియు సేనాపతి మీతోఁ జెప్పుమనిచెప్పియున్నాఁడు.

కాని, యనంతరాముఁడు నిశ్చింతుఁడై యుండఁజాలక పోయెను. ఆనాటిమధ్యాహ్నమే రెండువందల సైన్యమునిచ్చి దూతను బంపివైచెను. అట్లు పంపుచు వారి నందఱను జూచి "ఇందులో నెవ్వఁడు భవానీప్రసాదుని మొండెమును దెచ్చి నాకుఁ జూపునో యాతనికొక కిల్లాయును జాగీరును బహుమానముగ నొసంగెదను" అని చెప్పి వారికుత్సాహముం గల్పించెను.

తరువాత ననంతరామున కించుక మనశ్శాంతికలిగెను. ఆతని హృదయమునందప్పుడు సాగరతరంగములవలె నెన్నియోయాలోచనములు తోఁచెను. మరుస్థలమునందలి యిసుకవలె నాతని హృదయము నీరసమై స్నేహశూన్యమై యుండెను. ఆతని సర్వప్రయత్నములును, సర్వోపాయములును స్వలాభమును గూర్చియే—అప్పుడాతఁడు తనలో "ఈ ప్రపంచమంతయు నా యనుభవముకొఱకే సృజియింపఁబడినది. ఇందు భవానీప్రసాదున కేమున్నది?" అని భావించుకొనుచు భావనాప్రపంచమున రాజపుత్రస్థానమునందలి రాజు లందఱును దనకు భాండాగారికులై యున్నట్లును, చిత్తూరు

రాజచ్ఛత్రము తనయుత్తమాంగముపై విలసిల్లుచున్నట్లును జూచు కొనుచుండెను. భవానీ ప్రసాదుని భిన్నమస్తకము తన హస్తముల యందున్నట్లు భావించుకొని యాతఁ డానందోద్ధతుఁడై చటాలున లేచి నిలువఁబడియెను. నిజముగ నాతని చేతిలోనిది భవానీ ప్రసాదుని యుత్తమాంగము కాదు. అదియొక యుత్తరము!!

ఆకస్మికముగ నాతఁడు హతాశుఁడై కూలఁబడి విమనస్కుఁడై యా లేఖను జదువ నారంభించెను. ఆలేఖ దేవలుఁడు వ్రాసినది. ప్రయాణశ్రమచే నలసిపోయి యాతఁడు సిరోహీకిఁ బోవఁజాలక యజమీరునకు వీరోత్సవదర్శనమునకుఁ బోవఁగోరి తండ్రియాజ్ఞ కొఱకీ జాబును వ్రాసియుండెను.

అప్పు డనంతరాముఁడు తనలో "ఇప్పుడు ప్రసాదుఁడు మన చేతికిఁ జిక్కియున్నాఁడు. ఇఁక దేవలుఁ డజమీరునకుఁ బోయినను నష్టము లేదు." అని భావించుకొని యనుమతించినట్లు ప్రత్యుత్తరము వ్రాసియిచ్చెను. దేవలుని భృత్యుఁడగు ప్రతాపుఁ డాజాబునందు కొని యజమీరునకుఁ బ్రయాణమై పోయెను.

---

పంద్రెండవ ప్రకరణము.

# భాగ్యవధువు

జనార్దనుఁడు యువరాజునాజ్ఞ ననుసరించి యాచతుర్దశినాఁటి రాత్రి చలిలో బయలుదేరి తేజస్వతీ నగరమునకు బయలుదేరెను. ఆతనిగుఱ్ఱ మలసిపోవుటచే నగరప్రాంతమునందలి సత్రమునం దాఁగి యా మరునాఁడు మరల బయలుదేరి పాడ్యమినాఁటి జామురాత్రికిఁ దేజస్వతీ నగరమునఁ బ్రవేశించి యొక సత్రమునందు విడిసియుం డెను. నగరమంతయు కల్లోలకల్లోలముగనుండెను. కత్తిపట్టఁగల మగవాఁడెల్ల నాలుగు దినములలో నజమీరునకుఁ బోవుటకు సిద్ధపడియుండవలయునని రాజాజ్ఞ. అజమీరునందలి వీరోత్సవమునకుఁ

బోవలయునని మాత్రమే యెల్లరకును దెలిసినవిషయమగుటచే నంతట నానందకోలాహలముగ నుండెను.

యావనులందఱును గుంపుగుంపులై యశ్వసంగ్రహమునకుఁ బ్రయత్నించుచుండిరి. రాజస్థానమున వారి కందఱకును, జాలినన్ని గుఱ్ఱములు లేవు ఎవ్వరికి గుఱ్ఱము లేదో వారు పదాతిసైన్యమునఁ జేరవలసియుండెను. అప్పుడొక యువకుఁడు సత్రము నొద్దనున్న జనార్ద నుని గుఱ్ఱము నాక్రమించుకొనియెను. ఆ చతుష్పదమహాశయుఁ డప్పుడు స్తిమిత నయనుఁడై దూర్వాదళసేవనముం గావించుకొను చుండెను. అప్పు డా యువకుఁడు "ఈ గుఱ్ఱ మెవ్వరిది?" అని కేకవైచెను.

తోడనే జనార్దనుఁ డచ్చటికి వచ్చి "ఈ గుఱ్ఱము నాది!" అనియెను.

యు—అమ్మెదవా?

జనా—విక్రయించునది కాదు.

యు—ఈ యశ్వమును నీవేమి చేసికొందువు? నాకిమ్ము!

జనా—నీ నడుమున వ్రేలాడుచున్న తరవారిని విక్రయించె దవా? నేను తగిన మూల్యమునిచ్చి తీసికొనియెదను.

యు—సెబాసు! నేనజమీరు వీరోత్సవమునకు ఖడ్గఖేల నార్థము పోవుచున్నాను. అమ్మినచో నీ కరవాలముకూడఁ గొన వలయునని నే ననుకొనుచున్నాను.

జనా—గుఱ్ఱములే దొరకుట దుర్లభముగా నున్నట్లు తోఁచు చున్నది. మీ రచ్చటి కెంతమంది పోవుచున్నారు?

జనా—మే మందఱమును బోవుచున్నాము—శక్తిపట్టఁగల వా రెల్లరును బయలుదేరుచున్నారు.

అని చెప్పి యువకుఁడు వెడలిపోయెనుకాని జనార్దనుఁడు చాల సేపటివఱకు నాలోచించెను. తరువాత నాతఁడా గుఱ్ఱమును గృహ స్వామి కొప్పగించి రాజవీథిని బ్రవేశించెను. జనులందఱును గార్యో త్సాహముతో సజ్జితు లగుచుండిరి. కొందఱాయుధములకుఁ బదను

పెట్టుకొనుచుండిరి. కొందఱు ప్రాతదుస్తులను వదలి క్రొత్తదుస్తులం దాల్చుచుండిరి. కొందఱు క్రొత్తదుస్తులకొఱకుఁ దండ్రులను బీడిం చుచుండిరి. కొంద ఱజమీరునుండి సుందరయువతిం గొని తెచ్చెదమని భార్యలను భయపెట్టుచుండిరి. కొందఱశ్వమూల్యమునకై భార్యల యలంకారములను దీసికొనుచుండిరి. కొంద ఱజమీరునుండి విశేష ద్రవ్యమును గొని తెచ్చెదమని భార్యల నాశ్వాసించుచుండిరి. కొందఱు తల్లిని వదలిపోవలసి వచ్చెఁగదా యని దుఃఖించుచుండిరి.

ఇది యంతయును జూచి జనార్దనుఁ డీసంరంభమంతయు నజ మీరును భంగింపవలయునను నుద్దేశముతో ననంతరాముఁడు చేయు చున్న ప్రయత్నమే యని గ్రహించెను. కాకున్నచో నింత సైన్య ముతోఁ బ్రయోజన మేమున్నది?—జనార్దనుఁడు మరల సత్రము నకు వచ్చి యనేకాలోచనములతో నా రాత్రిని గడపుచుండెను. అతఁడు శయ్యనుండి యాకస్మికముగ లేచి "యువరాజు మాట విని నే నిచ్చటికేల వచ్చితిని? ఆతని నచ్చట నొంటిగా విడిచి బుద్ధిహీనుఁడనై యేల వచ్చితిని! యువరాజా! ప్రభూ! నేను మూర్ఖుఁడను! పాపాత్ముఁడగు ననంతరామునకు నీసంగతి తెలిసిన దని నే నిదివఱకెఱుఁగజాలనైతిని. నీవు దేవలునికి వ్రాసినయుత్తర మీతనిచేతికిఁ జిక్కినది. అందుచేతనే యనంతరాముఁడింత ప్రయ త్నము చేయుచున్నాఁడు! నేను మూఢుఁడను! అనంతరాముని సంగతి నెఱింగియుండియు నింతపని చేసితిని! జనార్దనా! మహామూర్ఖా! జనార్దనా! నీయువరాజున కెట్టికష్టము రానుండెనో తిరిగి చూచి యాలోచించుకొనుము! మఱియొకలాగైనచో నీకృపాణముతో నీ తలఁగొట్టుకొనుటకంటె గత్యంతర మేమున్నది?" అని నిందించు కొనుచు గుఱ్ఱము నెక్కి గృహస్వామికి జాగ్రత యని చెప్పి బయలు దేరెను

గృహస్వామి నివ్వెఱపడి "ఇంత రాత్రివేళ నెక్కడకుఁ బోయెదవు?" అని ప్రశ్నించెను.

జనా—వేగుజామైనది. నే నిప్పుడు కుమార దేవలుని మందిరమునకుఁ బోయెదను. ఆతఁడిప్పు డే మందిరము నందుండెనో చెప్ప గలవా?

గృహ—దేవలుఁ డిప్పు డీ నగరమునందే లేఁడు నంబరతీరమున విడిసియున్నాఁడు.

జనార్దనుఁడు విస్మితుఁడై "ఇట్లెవ్వరు చెప్పినారు ? నీకు బాగుగ దెలియునా ?" అని యడిగెను.

గృహ—ఆతఁ డిక్కడ లేనిమాట నిజము ! ఆతఁడు నంబర తీరమునందున్న ట్లాతని భృత్యునివలన వినియుంటిని.

జనా—ఆభృత్యుఁ డెచ్చట నున్నాఁడు?

గృహ—ఈ నత్రిమునందే యున్నాఁడు. ఆతఁడు నాకు బంధుఁడు. రాత్రి రెండుజాముల వేళ యువరాజు యొద్దనుండి యుత్తరముం దీసికొని వచ్చియున్నాఁడు.

జనా—నా కాతనిం జూపఁగలవా?

గృహస్వామి జనార్దనుని లోనికిఁ దీసికొనిపోయెను. ప్రబల నాసికాగర్జన ధ్వనులచే మందిర మంతయును ధ్వనింపఁజేయుచు నాతఁ డప్పు డొక సుఖస్వప్నముం గాంచుచుండెను. ఆకలలో నాతఁ డొక గరుడపక్షి నెక్కి యాకాశమార్గమునం బోయి యొకరాజ్యమునఁ బ్రవేశించెను. ఆ దేశమునం దందఱును యువతులే—పురుషులు లేరు. యువతులు సుందరులు—పెద్ద పెద్ద కన్నులు, చిన్న చిన్న చెవులు—గొప్పగొప్ప కొప్పులు ఆ యువతులందఱు నాతని గౌరవించుచుండిరి. కాని, యూతఁడు వచ్చినతోడనే యా యువతులున్న మందిరమున గోలపుట్టెను. ఈతఁడు నాకుఁ గావలయును, నాకుఁ గావలయు నని యందఱు నెవరికివారే వేఁడుకపడ నారంభించిరి. తరువాతఁ గొంత సేపటికి వారిలో వారికి సంధికుదిరెను. తమలో నెవ్వరి నాతఁడు కోరుకొనునో వారాతని వరియించునట్లు సంధి. వాంఛించుభారము భృత్యునిపైఁ బడుటచేఁ జాలఁగష్ట మయ్యెను. ఆతఁడొక యువతిం జూచెను. రెండవయామె యంతకంటెను జక్కనిదిగా నగపడియెను;

ఆమెను నిశ్చయించుకొనఁ దలచునంతలో దధికసుందరి యగు మూఁడవయామెపై నాతని దృష్టిపడియెను ఆ సమయమునందే గృహస్వామి "ప్రితాపా!" అని యాతని మేల్కొలుప నారంభించెను. అందుచే నాతనికి నిద్రాభంగ మయ్యెను. సుందరయువతిని వరించుట కాతని కవకాశము కలుగలేదు ఆతఁడు తన జీవితకాలమునం దట్టి సుఖస్వప్నమును గాంచియుండలేదు. సుందరీమణులపై సుందరీమణు లాతని కటాక్షకింకరీబృంద మైయుండు నదృష్ట మాతనికి లేకపోయెను.

ప్రితాపుఁడు కన్నుఁ దెఱచి లేచి నిలువఁబడియెను. జనార్దనుఁ డాతనిఁ నొక నిమిషములో నానవాలు పట్టెను ప్రితాపుఁడు జనార్దనుని గ్రహించెను. అప్పుడు జనార్దనుఁ డాతని నేకాంతస్థలమునకుఁ దీసికొనిపోయి "నీవు దేవలునియొద్దకే పోవుచుంటివిగాన, నాతనితో నొకమాట చెప్పుము. ఆతనితో నా మాటగా "నీ వెవ్వరికొఱకు వెదకుకొనుచుంటివో యాతఁ డజమీరు నగరమున సేనాపతియింట నీ కగపడఁగలఁడు; నేనుకూడ నచ్చటకు వచ్చుచున్నాను; అచ్చట నన్నుఁ గలసికొనగలవు నీతోఁ జాలవిషయములు మాటలాడ వలసియున్నది; మఱచిపోవలదు" అని చెప్పుము అనియెను.

జనార్దనుఁ డిఁక నాలస్యము చేయుక యశ్వారూఢుఁడై వెడలిపోయెను. అప్పటికిఁ దెల్లవారెను. జనార్దనుఁ డప్పుడే యజమీరునకుఁ బ్రియాణముచేయఁదలంచెను; గాని యాతని యశ్వము మిగుల నలసిపోయినది దగ్గర ద్రవ్యమున్నచో మఱియొక గుఱ్ఱమును గొనిపోయి యుండును. ధనాభావముచే నాలస్యమునకు సహింపవలసివచ్చెను. సమీపమార్గమునఁ బోవలయు నని యెంచి జనార్దనుఁ డటవీమార్గము నవలంబించెను. తదియనాఁటి మధ్యాహ్నమున కాతఁడు మహారణ్యమధ్యమునఁ బ్రవేశించి యొకయేటియొద్దు చేరెను. అలసినగుఱ్ఱ మిఁక నడువఁజాలకపోయెను. అందుచే జనార్దనుఁ డొక చెట్టుక్రింద విడిసియుండెను.

అతఁడు నలువంకలఁదిరిగి చూచునప్పటికొక చెట్టుక్రిందనొక యువతి నిద్రించుచుండెను. ఆతనింజూచి యా యువతి మెల్లఁగ లేచి సమీపమునకు వచ్చెను. జనార్దనుఁడు విస్మయముతో "నీ వెవరు?" అని ప్రశ్నించెను.

యువ—అసంగతి తెలిసికొనుటకు నీకిష్టమున్నచో నీవు ముందుగ నాకేమైనఁ దినుటకుఁ బెట్టగలవా?

జనార్దనునియొద్ద' నొకరొట్టెయున్నది. దాని నామెకుఁ బెట్టెను. ఆయువతి మారుమాటాడకుండ నారొట్టెను దిని యించుక నీరు త్రాగెను. ఇన్నాళ్ళకుఁ దరువాత నామె కించుక యాహారము లభియించినది.

తరువాత నామె మెల్లగ జనార్దనుని సమీపమునకు వచ్చి కూర్చుండెను. అప్పుడు జనార్దనుఁడు "నీకాహారము దొరకుట లేదా?" అని ప్రశ్నించెను.

యువ—నాలుగు దినములనుండి తిండిలేదు.

జనా—అట్లయినచో నీవీ యరణ్యామధ్యమున కేలవచ్చితివి? గ్రామమునకుఁ బోఁగూడదా?

యువ—అచ్చట నన్నుఁ గొట్టెదరు!

జనా—ఎవ్వరు?

యువ—నాభర్త.

జనా—అసత్యము—నీలక్షణములనుబట్టి చూడఁగా నీకువివాహము కాలేనట్లు తోఁచుచున్నది. కాకున్నచో నీవు విధవవైన నై యుండవలయును.

యు—అసత్యముకాదు. నేనొకభాగ్యవంతుని బెండ్లియాడితిని.

జనా—నీ యిల్లెక్కడ?

యు—అజమీరునందు

జనా—నీ పేరేమి?

యు—ప్రమద

ఈమె మనప్రమదయే యని పాఠకులు గ్రహించియే యుందురు. తిండిలేక యడవులఁబట్టి తిరుగుచుఁ దుదకీచెట్టుక్రింద నిట్లే చావవలయు నని యీమె నిశ్చయించుకొని యుండెను. జనార్దనుఁడీమె నిచ్చటఁ జూచెను. జనార్దనుఁడుగాని, ప్రమదగాని యిదివఱకొండొరుల నెఱింగినవారు కారు. జనార్దనుఁడు కొంతసేపటివఱకేమియు మాటాడక యేమియో యాలోచించుకొను చుండెను. అప్పుడు ప్రమద యాతనిం జూచి "నీవిప్పు డెచ్చటికిఁ బోయెదవు ?" అని ప్రశ్నించెను.

జనా—అజమీరునకు—

ప్రమ—తొందరగఁ బోవనక్కఱ లేదుగద ?

జనా—శీఘ్రముగనే పోవలయును.

ప్రమ—అట్లయినచో నీయలసిపోయిన గుఱ్ఱముతో నెట్లు పోయెదవు ?

జనా—ఇంతకంటె నాధార మేమున్నది ?

ప్రమ—ఉన్నది నీకుపాయము చెప్పెదను.

జనార్దనుఁడు విస్మితుఁడై "నీవు సామాన్యబాలికవలె నగపడుటలేదు. కాని యీ మహారణ్యమున నేదస్యులనైనఁ దప్పించుకొని ప్రాణములను దక్కించుకొని యిచ్చటకు వచ్చితివా యేమి ?" అని ప్రశ్నించెను.

ప్రమ—దస్యు లెచ్చట నుందురు ?

జనా—ఈ సమీపమునందే యున్నారు. నేను వారిని జూచియే వచ్చితిని.

ప్రమ—సమీపమునందేనా ? ఎచ్చట నున్నారు ?

జనార్దనుఁడు తూర్పుదిక్కునకు వ్రేలితోఁ జూపించెను. ప్రమద యించుక సేపాలోచించెను. ప్రసాదుని బంధించి తీసుకొనిపోవుచున్నవారు పశ్చిమమార్గమునఁ బోవుచుండిరి; ఇప్పుడు తూర్పునఁ గొంతమంది దస్యులున్నట్లు జనార్దనుఁడు చెప్పుచున్నాఁడు; వారు

మొదటివారికి సహాయార్థమై వచ్చి చేరుచున్నారని ప్రమద నిశ్చయించుకొని "వా రెంతదూరములో నున్నారు ?" అని ప్రశ్నించెను.

జనా—ఎంతయో దూరము లేదు. కాని, యింతలో వారిచ్చటకు రాఁగలరని నాకు నమ్మకము లేదు.

ప్రమ—ఎందుచేత ?

జనా—వారిగుఱ్ఱము లలసిపోయినవి. వారీ రాత్రికి చెట్లక్రింద నుండి యాయాసము తీర్చికొనిగాని, బయలుదేరరని తోఁచుచున్నది.

ప్రమ—వా రెంతమంది యున్నారు ?

జనా—రెండువందలమంది యుందురు

జనార్దనుఁడు చూచినవారు దస్యులు కారు. తేజస్వతీనగరము నుండి పంపఁబడిన సహాయ సైనికులు ! జనార్దనున కాసంగతి తెలియును. కాని, ప్రమదను భయపెట్టి యింటికిఁ బంపుటకై యాతఁ డట్లు చెప్పియుండెను. ఆమాటకుఁ బ్రమద మహాచింతాకులస్వాంతయగుటంజూచి యాతఁడు మరల "భయము లేదు. ఇక్కడనుండి వెడలిపోవచ్చును. నేను నిన్ను మీ యింటికిఁ జేర్చెదను." అనియెను.

ప్రమ—నీవు పొమ్ము ! నేను రాను.

జనా—రావా ? ఎందుచేత ?

ప్రమ—నే నెన్నఁడును బందిపోటు దొంగలను జూచియుండలేదు. ఈసారి యొకసారి చూచివచ్చెదను.

జనార్దనుఁడు విస్మితుఁడై యామెవంకఁ దదేకదృష్టితోఁ జూడఁదొడంగెను. చూడఁగాఁ జూడఁగా నాతని కామె వదనమండల మతిలోకరమణీయమై కానవచ్చెను. జనార్దనుని భావమునుగ్రహించి ప్రమద యించుక మందహాసము చేయుచు "ఈరాత్రి నీవీయరణ్యమునందే నిలువఁదలఁచి యున్నట్లు తోఁచుచున్నదే !" అనియెను.

జనా—లేదు. నా కిప్పుడే పోవలసినపని యున్నది.

ప్రమ—అట్లయినచో నూరక నిలుచుంటివేమి ?

జనా—నీవు నా కేమైన నుపాయము చెప్పెదవేమో యని చూచుచున్నాను.

ప్రమ—అట్లయినచో లెమ్మా! నీ గుఱ్ఱపుజీనును గళ్లెమును దీసికొని నాతో రమ్మా!

జనార్దనుఁ డట్లేచేసి ప్రమద ననుసరించిపోయెను. ఉత్తరముగ నఱమైలుదూరము తీసికొనిపోయి ప్రమద యొక చెట్టుక్రింద జనార్దనుని గూర్చుండఁబెట్టి నేను వచ్చువఱకు నీవిచ్చట నేయుండుమని చెప్పి నిమిషములో నావృక్షసంతరాళమున నంతర్హితయయిపోయెను. ఆమె కొంతదూరము పోవునప్పటికచ్చట నా సైనికుల గుఱ్ఱములు తిరిగి మేయుచుండెను. అట నొకరిద్దఱు రక్షకభటులుమాత్రమే యుండిరి. కాని, యీ యరణ్యానులో రెండువందల గుఱ్ఱములను గేవల మొకరిద్దఱు భటులు కాపాడుట చాల దుర్లభము. అందుచేఁ బ్రమదకు మంచి యవకాశము దొరకెను. ఆమె చెట్లచాటుననేపోయి యందొక గుఱ్ఱమును బట్టుకొని తన పైఁటచెఱఁగును జించి దాని మెడకుఁగట్టిఁ పట్టుకొని యీగుఱ్ఱమును దీసికొనివచ్చి జనార్దనున కొప్పగించెను. జనార్దనుఁడు విస్మితుఁడై ప్రమద వదనము నవలోకించుచుఁ దాను దెచ్చిన కళ్లెమును జీనును గుఱ్ఱమునకుఁగట్టుచు "నీకీ గుఱ్ఱమెట్లు లభియించినది?" అని ప్రశ్నించెను.

ప్రమ—ఆసంగతి తెలిసికొనుటవలన నీకేమియు ప్రయోజనము లేదు.

జనా—నీవు నాకొఱకింత శ్రమపడుటకుఁ గారణమేమి?

ప్రమ—నాకాహారమిచ్చి నీవు నన్ను బ్రదికించుట కేమికారణము?

జనార్దనుఁడు నిరుత్తరుఁడై పోయెను. ప్రమద కృతజ్ఞురాలని భావించి యాతఁడామె యవస్థకు నిశ్చయముగ దుఃఖించెను. కాని, యుపాయములేదు; ప్రభుకార్య మావశ్యకముగఁ జేయవలసి యుండెను; జనార్దనుఁడు నిమిషములో నశ్వారోహణముం గావించెను.

ప్రమద యాతని నించుక యాఁపి "అయ్యా! నా ప్రార్థన మొకటి యున్నది" అనియెను.

జనా—చెప్పుము! నీకేమి కావలయును?

ప్రమ—నీ నడుమున వ్రేలాడుచున్న కరవాలమును నాకు దయచేయవలయును.

జనా—ఈ కృపాణముతో నీ కేమిపని యున్నది?

ప్రమ—ఆఁకలి యయినప్పుడు చెట్ల మొవ్వలను, దుంపలను గోసికొని తినియెదను.

జనా—మొవ్వలను దుంపలను దినుటకా నీవిచ్చట నుంటివి? నీసంగతి నాకెంతమాత్రమును తెలియుటలేదు ప్రమదా!

ప్రమ—సాయంకాలమై పోవుచున్నది. ఇఁక నాలస్యము చేసినచో నీయరణ్యమునఁ బ్రయాణము చేయుట కష్టము. నీవు త్వరగ బయలుదేరవలయును.

జనార్దనుఁడు తన కరవాలమును బ్రమదకిచ్చివైచెను ప్రమద యా కృపాణమును జాగ్రత్తగఁ దనపయ్యెదచాఁటునఁ దాఁచికొనియెను.

---

పదుమూఁడవ ప్రకరణము

## సోదరుఁ డేఁడీ

మఱునాఁటి యుదయమునకు జనార్దనుఁ డజమీరునఁ బ్రవేశించెను. నగరమంతయును జనసంకులమై యుండెను. ఎచ్చటఁజూచిన జనసమ్మర్దమే; సైన్యసంచారమే. ప్రజలవెనుక గుఱ్ఱములు, గుఱ్ఱములవెనుక సైనికులు, ఆ వెనుక నేనుఁగులు, ఆ వెనుక మరల సైనికులు, ఈవిధముగ నగరవీధులన్నియుఁ గ్రిక్కిరిసియుండెను. నగరమునకుఁ జుట్టును రెండుమైళ్ళవఱకును జనసముద్రమైయుండెను. పెద్ద పెద్ద రాజులు మహాసమారోహముతోఁ జేరుకొనుచుండిరి. ఆ మహా

వైభవముచూచి తీరవలయును. కొందఱు కుటుంబసహితులై వచ్చి యుండిరి. రాణులు కొందఱు పల్లకులనధిరోహించి వచ్చుచుండిరి.

జనార్దనుని హృదయము మేనంకకును బోవుటలేదు. అతఁడేమి యును జూచుటలేదు. ఎట్లో యొక్కసారిగ సేనాపతిమందిరమునకుఁ బోవలయునని యాతని యుద్దేశము. జనసమ్మర్దమువలన నవకాశము లేకుండెను. ఎట్లో కష్టపడి యచ్చటకుఁబోయి యతిసత్వరముగ గుఱ్ఱ మునుదిగి లోపలఁ బ్రవేశించెను. సింహద్వారము నొద్దనున్న వసా రాయంతయు జనసంకులమైయుండెను. ఎల్లరును జనార్దనునిఁ జూచిరి గాని యొక్కరుఁ నేమియును మాటాడలేదు. జనార్దనునకుఁగూడ నెవ్వరితో మాటాడుటకు నిష్టము లేదు. అతఁడు క్రమముగ బ్రసా దుని మందిరమునకుఁ బోయెను. ఆ ద్వారము రుద్ధమైయుండెను. జనార్దనుఁడు సివ్వెరపడి ద్వారమునొద్దఁ జెవియొగ్గి యాలకించెను; ఏమియు వినఁబడలేదు; అతఁడు మెల్లమెల్లగఁ దలుపుఁదెఱచి లోపలఁ బ్రవేశించెను; ఇంట నెవ్వరును లేరు; అదియే వాసగృహము; అందలి వస్తువులన్నియు నసంస్కృతములై యుండెను; జనార్దనుఁడు మేడపై కెక్కి చూచెను. అచ్చటఁగూడ నెవ్వరును లేరు; పడకటింటికిఁ బోయి చూచెను; అదియును శూన్యముగనే యుండెను; పర్యంక మపరిష్కృతమై యుండెను.

జనార్దనుఁడు తత్తరముతోఁ బ్రతిగృహమును వీక్షించెను, ఎవ్వరు నగపడలేదు. అప్పు డాతఁడు బిగ్గరగా "యువరాజా! భవానీ ప్రసాదా! ప్రభూ! నీ వెక్కడనున్నావు?" అని పిలిచెను. ప్రతి ధ్వనియేగాని ప్రత్యుత్తరము లేదు. జనార్దనుఁడు హతాశుఁడై నిలు వునఁ గూలఁబడిపోయెను. స్మృతి కలుగునప్పటికొక సేవకుఁడు తన కుపచారములు చేయుచున్నట్లాతఁడు గ్రహింపఁగలిగెను. ఆతని జూచినతోడనే జనార్దనున కెల్లసంగతులును దలంపునకు వచ్చెను. ఆతని శరీరమున సహస్రవృశ్చికదంశన మేకపర్యాయముగ నైనట్లు తోఁచెను. జనార్దనుఁ డట్టియాతనాజ్వాలల ననుభవించుచు "మరల నీపాపపు స్మృతియేల కలిగినది." అని విచారించెను.

సేవకుఁ డించుక పాలను దీసికొని రావలయునని లేచెను. జనార్దనుఁ డాతనియుత్తరీయముం బట్టుకొని యాఁపి మెల్ల మెల్లగ "యువరాజెక్కడ నున్నాఁడు?" అని ప్రశ్నించెను.

సేవ—కొన్నిదినములనుండి యాతనిజాడ తెలియుటలేదు.

జనార్దనుఁడు మఱిమాటాడఁ జాలకపోయెను. కొంతసే పాలోచించి "నే నిదివఱకే యనుకొంటిని—అతని పర్యంకముం జూచిన తోడనే నా కంతయుఁ దెలిసిపోయినది" అనియెను.

సేవ—చతుర్దశి నాఁటిరాత్రి యాతఁ డీతలుపు తెఱచుకొని పోయెను. అది మొదలుగ నాతని జాడలేదు. పోవునప్పుడు దుస్తులనుగాని యాయుధములనుగాని ధరించి పోలేదు. ఆ రాత్రి యాతని నెవ్వరును వెదకలేదు. మఱునాఁడు జయంతకుమారుఁడు సంబరతీరమునకుఁ బోవలసియుండుటచే నాతఁ డుదయమునందే యిచ్చటికి వచ్చెను. ఎక్కడఁ జూచినను ఖిల్లాదారుఁ డగపడలేదు. క్రమముగ నీ వార్త యంతటను వ్యాపించెను అనేకు లాతని నన్వేషించిరి. ఎక్కడను గానఁబడలేదు. కాని కొందఱాశ్వికు లుత్తరదిక్కుగాఁ బోయిన జాడ యగపడియెను. మహారాజాజ్ఞచేఁ గొందఱు సైనికులా యడుగుజాడలనుబట్టి యన్వేషించుచుఁ బోయిరిగాని కిల్లాదారుగాని, సైనికులుగాని వారి కగపడలేదు. మార్గమధ్యమునం దొక పాదరక్షమాత్ర మగపడినది అది కిల్లాదారునిదే యని యానవాలు పట్టి దానినిమాత్రము తీసికొనివచ్చిరి.

సేవకుని యొక్కొక్కమాట యొక్కొక్క యాఘాతమువలె జనార్దనుఁడు స్థిరహృదయముతో నెల్లసంగతులను వినుచుండెనుగాని యచ్చట నిమిషమైన స్థిరముగ నుండజాలకపోయెను. బాలకునివలెఁ గ్రిందఁబడి పొరలుచు నేడువ నారంభించెను సేవకుఁడు పాలు తెచ్చుటకై వెడలిపోయెను. జనార్దనుఁ డేడ్చుచు "ప్రభూ! ఇంత కాలము నకు మరల నిన్నుఁ బోఁగొట్టుకొంటినా? ఎంతటి విపత్తులనైన దాఁటి సిరోహీ విజయమును సాధించిన నీవు నీ సేనామధ్యమునం దుండియు శత్రువులచేతులలోఁ బడిపోయితివా? నే నెన్నియో విధ

ముల నిన్నుఁ గాపాడుకొనుచుంటిని. హా! వీరేంద్రకేసరీ! ఒకసారి వచ్చి నీవెట్టి కాలసర్పమును బాలువోసి పెంచితివో—ఆ క్రూర సర్పము నీ వంశోద్ధారకుఁడగు నేకపుత్రికు నెట్టి యిడుములపాలు గావించుచున్నదో చూచిపొమ్ము! హా పరమేశ్వరా! నీ కైనను దయ లేదా? అనంతరామా! ఇంతమాత్రమున నీకోరిక ఫలించినదని భావింపకుము; నా యువరాజునకు నీ వలనఁ బ్రాణాపాయమె తటస్థించినయెడల నీవు నా కృపాణమునకు బలియయి పోవుదువని నిశ్చయించుకొనుము. నీకే విధమునను నిష్కృతి లేదు. నీ జాగ్రత, నీ సాహాయ్యము, నీ సైన్యము—నిన్నింతమాత్రమును నా బారినుండి రక్షింపఁజాలవు!" అని పలవించుచు విలపింప నారంభించెను.

అప్పుడు వెనుకనుండి యాతనికి "జనార్దనా! ఎవ్వరినిగూర్చి యిట్లనుచున్నావు?" అనుమాటలు వినఁబడియెను. జనార్దనుఁడు తిరిగి చూచెను. జయంత కుమారుఁడు! జయంతునిరూపము మును పటివలె లేదు. అతని సర్వాంగములును శుష్కించి యుండెను కాని జనార్దనుఁడంతగాఁ బరీక్షింపలేదు; అతనికి నమస్కారమైనను జేయక స్థిరభావముతో నిలువఁబడి "వీరేంద్రచూడామణీ! జయంతా! నే నెవ్వని నీయొద్ద నీయింటనుంచి పోయితినో యాతని నీవు భద్రముగఁ గాపాడితివా? ఏఁడీ? అతఁ డెక్కడనుండెనో మరల నా కొప్పగింపుము!" అనియెను.

జయంతుఁడు తలవంచుకొని మృదులస్వరముతో "జనార్దనా! నన్నింకను నిందింపవలసినదే; నేను సహస్రాపరాధములం గావించితిని ప్రాణములున్నచోఁ బసాదు నెట్లయిన వెదకికొని తెచ్చెదను. అట్లు చేసినచో నా జీవితము ప్రపంచమునందలి శ్రేష్ఠకార్యమున వినియోగింపఁబడినదై సార్థకమగును. జనార్దనా! అతఁడు నా కెట్టి ప్రాణమిత్రుఁడో నీ వెఱుఁగవా?" అనియెను.

జనార్దనుఁడు సిగ్గుపడి జయంతునియెదుట భయకంపితుఁడై క్షమాప్రార్థనముం గావించెను. నిమిషములో నాతనికి దుఃఖము పొంగిపొరలుటచేఁ గ్రిందఁబడి పొరలుచు నేడువ నారంభించెను.

ఇంతలో నాకస్మికముగ గృహద్వారము తెఱవఁబడియెను. ఇరువురు నదరిపడి చూచిరి. ఎదుట దేవలుఁడు! జయంతుఁడు చటాలున లేచి నిలువఁబడియెను. దేవలుని జూచినతోడనే జయంతునికన్నీరు మున్నీరై పోయెను. అప్పుడు దేవలుఁడు "జనార్దనా! సోదరుఁడేఁడీ? నీ వేమ్చుచున్నావేమి?" అనియెను.

నిశ్శబ్దమునకు భంగమయ్యెను. జనార్దనుఁ డక్లో పొరలాడి యేడ్చుచు "నీవు చూడఁగోరి వచ్చినవాఁడికఁ నీకుఁ గానఁబడు భాగ్యము లేదుకుమారా! ఎత వెదకినను మఱిగొంటుట్లు లేదు. ఆ రాక్షస ముఖమునుండి యీతని విడిపింపఁజాలము. ఈ తప్పు తయు నెవ్వరిదో యెఱుఁగుదువా? నాది!—నాయనా! నీ నడుమునఁ గృపాణము వ్రేలాడుచున్నది. దానితో నా వక్షమునఁ బొడువుము! నాకీయుపకారమొం జేయుము. నే నింతకాలమునకు వీరేంద్రకేసరి ఋణము తీర్చుకొనఁగలుగుదును" అని పలుకుచు నాతఁడు మూర్ఛితుఁడై పోయెను. జయంతుఁ డాతని కుపచారములఁ జేయుచుండెను. దేవలుఁడుమాత్ర మా ద్వారమునొద్దనే నిలువఁబడిపోయెను.

జయంతునకు మాత్ర మింతకాలమునకుఁ బరిస్థితి సత్యస్థితి బోధపడియెను. అప్పు డాతఁడు తనలో "ఈతఁడు వీరేంద్రకేసరి తనయుఁడే కాకయున్నచో నింతటి బాహుబల మెక్కడనుండును? రాజకుమారీ! నీవు నీకుఁ దగినవానినే ప్రేమించితివి! నీ కాశీర్వాదము! నీవు రాజపుత్రునిం బరిగ్రహించి సుఖయుంపుము!" అని యనుకొనియెను. జనార్దనునకు శీఘ్రముగనే తెలివి వచ్చెను. జయంతుఁ డికఁ నాతని వదలి దేవలుని చేయి పట్టుకొని తీసికొనివచ్చి సోఫాపైఁ గూర్చుండఁ జేసెను. అనంతరాముని కుమారుఁడను నుద్దేశముతో నాతఁ డాతని కిట్టి మర్యాద చేయుటలేదు. దేవలుఁ డిప్పు డతిథి; కేవల మతిథియే కాదు—ప్రసాదునిప్రియసోదరుఁడు. జయంతుఁడు దేవలు ననేకవిధముల నాదరించుచుండెను కాని దేవలుఁ డేమియు మాటాడుట లేదు. నిష్పందుఁడై, నిరుత్తరుఁడై కొయ్యబొమ్మవలె

నుండెను. దేవలునకుఁ జైతన్య మున్నది. కాని, యాతని కేమి యును బోధపడుటలేదు. సర్వము నాతని కగపడుచుండెనుగాని యొక్కటియు నాతని మనసునకుఁ బట్టుటలేదు. అప్పు డాతని కాలోచించుటకుఁగాని భావించుటకుఁగాని యెట్టి శక్తియును లేకుండెను. తలతిరిగి పోవుచుండుటచే నాతఁడు సోఫాపైఁ బడిపోయెను. "కుమారా!" అని జయంతుఁడు బిగ్గరగఁ బిలిచెను. ఆతనికి మరల స్మృతి కలిగినది. దేవలుఁడు మెల్లగఁ గన్నులను విచ్చి జయంతునిం జూచెను.

జయం—కుమారా! నీ సోదరుఁ డేమయ్యెనో నా కింకను దెలియలేదు. పర్వత ప్రాంతవాస్తవ్యులగు మిరాసదారులు వారాతని దీసికొనిపోయియుందురని తోఁచుచున్నది.

దేవ—అన్న యింకను బ్రదికి యుండునా?

జయం—బ్రదికియే యుండవచ్చు ననుకొనియెదను.

అని చెప్పి దేవలున కాతఁడు సకల వృత్తాంతమును విస్పష్టముగఁ దెలియఁజేసెను. అప్పటికి జనార్దనునకుఁ జైతన్యమున్నది. ఆతఁడట్లే పొరలుచుఁ దనలో "ఆ వనమధ్యమునందు సైన్యముం గాంచితిని వారిలో యువరాజుండి యుండునా? వారి కుత్తరమునఁ గొంతమంది యున్నట్లు వినియుంటిని. ఆతని దీసికొనిపోవువారు వారై యుందురా? ఎట్లయినను ననంతరాముఁ డింతవఱకును యువరాజును గరగతము చేసికొనియుండఁడు. అట్లు చేసికొనియేయున్నచో సేనాసహితముగ నజమీరునకువచ్చుట కేల ప్రయత్నించును? కావున నాయరణ్యమునందలి రెండుపక్షములయందును దేనియందో యువరాజు బంధీకృతుఁడై యుండును" అని భావించుకొని చటాలున లేచి తలుపులు తెఱచుకొని క్షణములో నదృశ్యుఁడై పోయెను. జనార్దను

నకు మతిపోయినదని దేవరజయంతులు భయపడి యాతనిం దీసికొని వచ్చుట కొకభటునింబంపిరిగాని యాతనికిమఱిజనార్దనుఁడగపడలేదు.

జనార్దనుఁ డశ్వశాలకుఁబోయి గుఱ్ఱముందీసికొని యధిష్ఠించి యా జనసమ్మర్దమునఁ దోవచేసికొని వెడలిపోవుచుండెను. రక్షక భటుఁడొకఁ డాతని పట్టుకొనఁబోయెనుగాని యవలీలగ నాతని దప్పించుకొని జనార్దనుఁడు దుర్గమునకుత్తరమార్గమునుండి యతివేగ ముగఁ గొంతదూరముపోయెను. అచ్చటఁగూడ నాతని నొకభటుఁ డడ్డగింపఁ జూచెనుగాని యాతని సమీపించుటకైన సమర్థుఁడు కాఁజాలక పోయెను.



శ్రీ

# వీర పూజ



## చతుర్థఖండము—జ్ఞానము



### మొదటి ప్రకరణము.

## మరలఁ బ్రమదయే!

ఆకాశమున నెగసిపోవుచున్న దదియేమి? మేఘమా? పక్షియా? మనుష్యులదుఃఖమును జూడఁజాలక యాతనామయంబగు నీ భూమండలమును వదలి యెవ్వరైన నాకాశమార్గమునఁ బోవు చుండిరాయేమి? ఆకాశమున దుఃఖము లేదా? బాధలేదా? ఆకాశము నం దట్టిబాధాదుఃఖములం గల్పించు స్మృతియే లేదు. కాఁబోలును

ఉద్యానమునందలి విరిసెజ్జపై గనకవల్లింబోలిన రాజకుమారి శయనించి యాకాశమువంకఁ దదేకదృష్టితోఁ దిలకించు చుండెను. అచ్చటచ్చట నాకాశమున మేఘశకలములు పరిభ్రమించు చుండెను. ఒకటి రెండు పక్షులుగూడ నెగురుచుండెను. పక్షులపై మేఘశకలములు మేఘశకలములపై నాకాశము—అనంత నీలాకాశము—ఆకాశములోపల నాకాశము—ఆకాశము వెలుపల నాకాశము—నలువంకల నాకాశము! రాజకుమారి తనలో "ఆకాశ మెంత నీలమైనదో నిశ్చయింపజాలము! ఆకాశ మెంత పెద్దదియో యూహింపఁజాలము. ఆకాశ మెంత సుందరమైనదియో యెఱుంగజాలము—ఇంతటి యనంత నీలాకాశమున నీ మేఘశకల మెందులకు? ఈ యనంత సుందరాకాశ వక్షమునం దీ సీమావరణ

మెందులకు ? ఓ మేఘశకలమా ! నీ వింతుక జరగిపొమ్మా ! ఛిద్రశూన్యంబును, శబ్దశూన్యంబునగు నీ యనంత సుందర నీలాకాశమును నన్ను బాగుగఁ జూడనిమ్మా ? ఈ యనంతమును జూచుచు నేనీ యనంతమున లీనమై పోయెదను ! ఓ మేఘమా ! నీవు ననంత నీల మయమూర్తి వే ! ఈయనంత నీలాకాశమునందు నీ వేమి చూచుచున్నావు ? స్పర్శరూపరసగంధ విహీనంబగు నీ యనంతాకాశమునందు నీ వేమి యాలకించుచున్నావు ? చూచిచూచి నీవు వైవర్ణ్యము గాంచుచున్నావు—మరల నీవు నీ యనంత నీలమయమూర్తి ధరియింపఁగలవా ? నీ క్షుద్రహృదయము ననంత నీలాకాశమునందేల విలీనము చేయఁజాలెదవు ? అది కాదు—నీవు నిరాటంకముగ నేడ్చుటకై యనంతాకాశము వఱకును బోయి తిరుగుచున్నావా ? అయ్యో ! బిగ్గరగ నేడ్చినంతమాత్రమున బాధయెట్లు వదలిపోవును? పాపమెట్లు నశించిపోవును ? స్మృతి యెట్లు లేకుండఁబోవును? ఓ దయామయా ! విశ్వనాథా ! నీ వెచ్చట నున్నావు? నిరాటంకముగ దుఃఖించుట యెట్లో నాకు బోధింపుము ! నేలపైఁ బొరలుచు బిగ్గరగ నేడ్చుట యెట్లో నాకు నేర్పుము !" అని విలపించుచు బాహ్యజ్ఞాన శూన్యయయి రాజకుమారి యాకసమువంకఁ గనుఁగొనుచుండెను. ఆ సమయమునఁ బార్శ్వమునందుండి యెవ్వరో "కుమారీ !" అని పిలిచిరి. ఆమెకు బాహ్యజ్ఞానమే లేదు; మరల నట్లే పిలిచిరి ; ఉమాబాల తిరిగి చూచెను; పార్శ్వమున నీల!

నీల—రాజకుమారీ ! ప్రమద పిలిచినది. పోవుదునా ?

ఉమాబాల చటాలున లేచి "ప్రమదయా ! ప్రమద యెచ్చట నున్నది ?" అనియెను.

నీల—ఇంతకుముందే కొలఁదిసేపటిక్రిందట నామె తనయిల్లు చేరినది. వచ్చినతోడనే నాకు సమాచార మంపినది. ఆమె యిఁక నెంతయోసేపు జీవింపదు. నన్నుఁ ద్వరగాఁ దీసికొనిరమ్మని చెప్పినది

ఉమా—మరలఁ బ్రమదయా ? ఈనడుమ నామె యగపడుట లేదు. ఇప్పుడామెకు నీతో మాటాడవలసినపని యేమున్నది?

నీల—ఆ సంగతి నాకుఁ దెలియదు. ఆమెయొద్దకుఁ బోయినచో సర్వమును దెలియును. చెప్పవలయునని యే నన్నుఁబిలిపించియుండును.

ఉమా - అట్లే పొమ్ము! నాఁకిక నాథుపై నెట్టికోపమును లేదు. ఆమెతోఁ జెప్పుము. ఆమె యపరాధములన్నియు మఱచి పోయితి ననియు, నామెను క్షమించితిననియుఁ జెప్పుము!

నీల వెడలిపోయెను. శ్వేతవచ్చి రాజకుమారి కుపచారములు చేయుచుండెను. శ్వేతయును సుఖవతియయి యుండలేదు. ఆమె జయంతుని బ్రేమించి యుండెను. బేహోయార్ యుద్ధక్షేత్రమున నాతని పరితాపముంగాంచి యాతనికిఁ దగిన పురస్కారము నొసంగఁ బాలక ప్రాణపూర్వకముగ నాతని బ్రేమించియుండెను. అట్లు ప్రేమించిన సంగతి యితరులకుఁ దెలియుటమాట యటుండనిమ్ము! స్వయముగ శ్వేతకే తెలియదు!

ఉమా—శ్వేతా! తండ్రితోఁ జెప్పియో, స్వయముగ బోధించియో యెట్లయిన జయంతకుమారునితో నీకుఁ బెండిలియగునట్లు చేయించెదను.

శ్వేతయేమియు మాటాడక దుఃఖించుచుండెను.

ఉమా—మొట్టమొదట నే నెట్లున్నాను? ఇతరులనిమిత్తము నే నెన్నఁడును భావింపలేదు—స్వసుఖముకొఱకు, స్వలాభముకొఱకు వ్యస్తురాలనై యుంటిని. ఇప్పుడట్లుకాదు — ఇంకొకసారి యాతఁడు నాకగపడినచో సంతోషపూర్వకముగ లలిత నాతనికిచ్చి పెండ్లి చేయింతును. ఆతనిసుఖమే నా యానందము! ఆతని సంతుష్టియే నా స్వర్గము! ఆతని నింకొకసారి కన్నారఁగాంచు నుపాయ మేమున్నదియో చెప్పుము శ్వేతా!

శ్వేత—కిల్లాదారు మరల లభించినచో నిన్నాతని కెట్లయిన నిచ్చి పెండ్లి చేయింతునని రాణి చెప్పినది. ఆమె యభ్యంతర మేమియును లేదు. నీవు దుఃఖింపవలదు. నీ కన్నీరుచూచి నా గుండెలు నీరైపోవుచున్నవి.

ఉమాబాల కన్నీరునించుచు నిట్టూర్పు విడిచి "శ్వేతా! నేఁడు చవితి; రేపే వీరోత్సవము; నేఁటికైదు దినములయ్యెను—అయిదు దినములనుండి యాతఁడగపడుట లేదు ఇప్పు డిష్టమున్నను నాతని దర్శనము లభియించునట్లు లేదు. ఇఁక నేమి చేయుదును?" అని యాకసమువంకఁ జూడఁదొడంగెను ఉత్తరమున నున్న పర్వత పంక్తి నీలాకాశమున విలీనమై యుండెను. సముద్రమును బాదము లతోఁ దన్నుచు నాకాశము నాలింగనము చేసికొనుచుండెనో యను నట్లున్న యా పర్వతముం గాంచి రాజకుమారి "గిరిరాజా! ఇంత గర్వపడవలదు—ప్రేమతుం దెన్నఁడును గర్వమును జూపవలదు. నేనును నీవలెనే యొకప్పుడు రూపగర్వము, కులగర్వము, భాగ్య గర్వముగల హృదయముతోఁ బ్రేమపథమున విహరించితిని. ఇదిగో! చూడుము! ఆ కారణముచేతనే యిప్పుడు నాకీభూశయ్య తటస్థించి నది! ధూళ్యవకుంఠనము లభియించినది. ఇప్పుడు నా కా రూపము మారిపోయినది ఆ యైశ్వర్యమదము సంబరహ్రదమునఁ గలసి పోయినది; ఆ కులగర్వము నిర్మూలమై పోయినది—ఒక్కసారి—ఒక్క నిమిష మాత్రము నా కాతఁడు కన్నులఁబడినచో—నే నాతని పాదములఁ బట్టుకొని నా గర్వమంతయు వదలిపోయినదని ప్రార్థింతును; నా సర్వాభిమానములును నశించిపోయినవని త్రికరణశుద్ధిగ మనవి చేసికొందును." అనియెను.

శ్వేత యామె యవస్థ జూచి దుఃఖముతో "కుమారీ! ఊఱడిల్లుము! దుఃఖముచే నొడలు క్రుంగిపోవుచున్నది ఈ యయిదు దినములలో నెంతగా మారిపోయితివో యొకసారి యద్దమునఁ జూచు కొనుము. కిల్లాదారును మీనజాతి దస్యులెత్తికొని పోయినప్పటినుం డియు నీ కన్నులనీరు కట్టుట లేదని యందఱు ననుకొనుచున్నారు." అనియెను.

ఇంతలో నీలపరుగెత్తుకొని యచ్చటికివచ్చి "కుమారీ! శీఘ్ర ముగ లెమ్ము! మనము పోవలయును, చాలఁగఁ బనియున్నది." అనియెను.

ఉమా—ఎక్కడకుఁ బోవలయును నీలా? ఇఁక నెక్కడకు?

నీల—ప్రమదయొద్దకు—దస్యులు కిల్లాదారును బంధించి తీసి కొని పోవుచుండఁగాఁ బ్రమద చూచినదఁట! ఆమెకూడ వారి ననుసరించి పోయినదఁట! ఆ రాత్రి మన మాతనితో మాటాడు నప్పుడే యీ దస్యులున్నారఁట! ఆమెయు వారి నాలోకించుచునే యున్నదఁట!

ఉమాబాల శుష్కశరీరమునం దాకస్మికశక్తి యుదయించెను తోడనే యామె లేచి నిలువఁబడియెను. నీల పల్లకిని రప్పించెను. రాజకుమారి యందుఁ గూర్చుండెను. శ్వేతయు, నీలయు నామె కంగరక్షకులై పల్లకిని నడపించిరి. అప్పటి కింకను సాయంకాలము కాలేదు. చతుర్థీక్షీణ చంద్రరేఖ పశ్చిమాకాశమునం దస్పష్టముగఁ గానవచ్చుచుండెను.

---

రెండవ ప్రకరణము

# నీవు జారిణివా?

జనార్దనుఁడు వెడలిపోవున ప్పటికిఁ బ్రమద యెప్పటి చోటనే యప్పటియట్లు నిలువఁబడియుండెను. ఆమె యాతనింజూచి తనలో "ఈతనిఁ బిలిచి సకలవృత్తాంతమును దెలుపుదునా? నా కించుక సాయపడు నేమో!—అట్లు కాదు—ఎఱుఁగనివానిని నమ్మి యెల్ల సంగతులు నెఱింగించిన చో నేమి చేయునో? ఈతఁడొక వేళఁ బ్రథమ దళమునకు వార్తాహరుఁడై ద్వితీయదళమునకు వెదకుచుండెనేమో? ఈ రెండుదళములును గలిసికొన్నచో నిఁక నుపాయము లేదు" అని యాలోచించుకొనుచు నేదియు స్థిరపఱచుకొనకుండగనే జనార్దనుఁ డటనుండియదృశ్యుఁడై పోయెను. అప్పుడు ప్రమద తనగుఱ్ఱమునొద్దకుఁ బోయి దానికించుకపచ్చికనువైచి మేపెను. ఆగుఱ్ఱమును బ్రమద యతి ప్రయత్నముతోఁ గాపాడుకొనుచున్నది అది ప్రసాదునిగుఱ్ఱము!

ఆమె యా దస్యులకించుక దక్షిణభాగమునం దొకపొదలో నుంచి యాగుఱ్ఱమును మేపుచుండెను. దానికి జీనును గళ్లెమును సిద్ధముగనే యుండెను.

అజమీరున కుత్తరమువైపుననుండుమార్గము తిన్నఁగ నంబర తీరమునకుఁ బోవును ఆమార్గమునకుఁ దూర్పునందున్న యడవిలోనే మహాదేవరావు సేనలతో విడిసియుండెను. తేజస్వతీనగరమునుండి వచ్చుచుండువా రావైపుననే వచ్చుచుండిరి. కాని, యింకను వారిని సమీపింపలేదు మహాదేవరా వాసమీపమునందే యుండెనని వారి కెంతమాత్రమును దెలియదు. కాని, మఱునాఁటి యుదయమున వారు తప్పక కలిసికొనఁ గలుగుదురు అందుచేతనే ప్రమద తల్లడిల్లిపోవు చున్నది.

తేజస్వతీనగరమునుండి పంపఁబడు సైనికుల సాయముకొఱకు మహాదేవరా వెదురుచూచుచుండెను. యువరాజుపక్షమునం జేరిన సైనికు లాతని బరివేష్టించి ప్రాణముల నాసింపక యాతని గాపాడు చుండిరి. మహాదేవరావు తక్కిన తనయోధులతో వారిని ముట్టడించి యుండెను.

తృతీయాక్షీణచంద్రుఁ డాకాశమునఁ దోఁచుచుండెను ; కాని, యాతనికాంతులచే వెలుతురుమాత్ర మంతిగాలేదు. అచ్చట నస్పష్ట చంద్రికిరణములు ప్రసరించుచుండెను. ఆశిబిరములకు నలువంకలను నెగడులు ప్రజ్వరిల్లుచుండెను. అంధకారమున మండలాకృతిం జూపట్టు జ్వాలామాల తమోవినాశిని యగు ప్రభాతచ్ఛాయంబోలి దూరము నకుఁదోఁచుచుండెను. అందఱును విశ్రమింపఁదలఁచుచుండఁగా నాసమ యమునం దాకస్మికముగ నిశాగగనవిదీర్ణంబగు నొకయువతి యార్త నాదము వినఁబడియెను. ఆ భీషణధ్వని నాలకించి యందఱును విభ్రాంతులై పోయిరి.

క్షణము తరువాత మరలనదియే యార్తనాదము. మొదటి ధ్వనికంటెను సమీపమున వినవచ్చెను. ఆధ్వని వినఁబడుచున్న వైపున కొక్కొక్కరుగఁ గోశనిర్ముక్తకృపాణపాణులై బయలు దేరిరి.

ఆ పోయిన వారంతలోనే తిరిగివచ్చిరి. ఇప్పుడు వారుమాత్రమే కాదు. వారితోఁగూడఁ బ్రమద ; కాని యిప్పుడు ప్రమద భయంకర మూర్తియయి యుండెను. ఆమె విముక్తవినీలకుంతలము లంధ కారములో నంధకారముం గల్పించుచు వాయుతరంగితము లగు చుండెను ; భిన్నభిన్నంబగు నామెవసనము నేలపై జీరాడుచుండెను; ఆమె కోమలసుకుమారశరీరము రుధిరధారాచ్ఛన్నమై యుండెను ; ఆమె విఘూర్ణితనయనద్వయము మహాభయసంచలితమై యుండెను. ఆమెపాదములు తడఁబడిపోవుచుండెను ; ఆమె యోష్ఠద్వయము ప్రకంపితమై పోవుచుండెను. ఆభీషణ బీభత్సమూర్తిం జూచి యెవ్వ రును సమీపింపఁ జాలకుండిరి. అప్పుడొకఁ డామెం జేరి "నీవిట్లు కేకలువైచుటకుఁ గారణమేమి ? ఏకఠిన హృదయుఁడు నిన్నుఁ గొట్టి బాధించినాఁడు ? అయ్యో ! పాపము నీయొడలంతయు రక్తసిక్తమై యున్నదే !" అనియెను.

ప్రమద యీసారి కేకలుమాని నవ్వుచుఁ బాడుట కారంభిం చెను.

పడఁతి నిన్గోరుట ♦ బ్రదికినన్నాళ్లు
లేద్పుటకే యని ♦ యే నెఱుంగుదును.
అగు నైనజన్మజ ♦ న్మాంతరములకు
నీప్రేమకోరుదు ♦ నిన్నె యాచింతు

పంచమతానమునఁ బాటలుపాడుచున్న ప్రమదంగాంచి భయ పడి పాఱిపోయిన వారెల్లరు సమీపింప నారంభించిరి. అందఱి నా నంద ముగ్ధులం జేయుచుఁ బ్రమద మరలఁబాడ నారంభించెను.

నిఖిలేశ ! నీకృపా ♦ న్వితదృష్టియున్న
సద్ధర్మ మేటికి ♦ స్వర్గ మేమిటికి ?
దయతోడ నన్ను నీ ♦ దరిఁజేర్చుకొన్న
నితరసుఖంబు నా ♦ కేమిటికింక —

అప్పుడు మహాదేవరావు ప్రమదను దనయొద్దకు రమ్మని పిలి చెను.

ప్రమ—నేను రాను—నీవు కొట్టెదవేమో ?

మహా—నేను నిన్నుఁ గొట్టను.

ప్రమ—అందఱును నన్నుఁ గొట్టుచుండఁగా నీ వెందుచేతఁ గొట్టవు ?

సమీపమునందే యున్న భవానీ ప్రసాదుఁ డెల్లసంగతులు నాలకించుచుఁ జూచుచుండెను. అతఁడు మొట్టమొదటఁ బ్రమద నానవాలు పట్టలేదు. కొంతసేపటి కాతనికిఁ దెలిసిపోయెను.

యువరాజున కనురక్తులగు సైనికు లాతని నొక చెట్టుక్రిందఁ శయనింపఁజేసి నలువంకలను భల్లములను బాత్రి, దుప్పటులతోఁ బందిరివైచి ప్రక్కలను దడిగట్టిరి. వా రందఱును గాచుకొనుచుండ యువరాజు సరస్వాయుఁడై శయనించి యుండెను. రామచరణుని యేక పుత్రికయగు ప్రమద యీ విధముగ నున్మత్త యగుటంగాంచి ప్రసాదుఁడు చాల విచారించెను.

మహాదేవరావు ప్రమదకించుక తినుట కేదియో పెట్టెను; ఆమె గాయమునకుఁ గట్టు కట్టెను. ప్రమద మహాదేవరావుం గాంచి ముసిముసి నవ్వులు నవ్వుచుండెను. ఆమె యట్లు నవ్వుచు నవ్వుచు నేడువ నారంభించెను. అంతలో నామె భయప్రకంపితయై “నీవు నన్ను గొట్టవుగద ! నేను దెబ్బలు తినఁజాలను—నేనిచ్చట నుండఁ జాలను. నన్ను విడిచిపెట్టుము” అని యేడ్చుచుఁ బ్రమద యాసేనా మండలమును దాఁటి యవ్వలకుఁ బోయెను. మహాదేవరా వామెను వెంబడించిపోయి యామె చేయిపట్టుకొని మరల నామెను సేనామధ్యమునకుఁ దీసికొని వచ్చెను.

ప్రమద మొగము చక్కనిది; మాధుర్య మామె వదనకమలమునఁ బరిపూరితమై యుండెను. ఆమె నయనద్వయముకూడ నతి మనోహరమైనది. ఆ చూపులు హృదయాకర్షకములైనవి. ఆమెం జూచి మహాదేవుఁడు చంచలహృదయుఁడై “ఇదియేమి ? నీకెందుచేత మతిపోయినది ?” అని ప్రశ్నించెను.

ప్రమ—తెలియకుండఁగనే పిచ్చిదాననై పోయితిని. నాతండ్రి నాకు వివాహము చేయకుండుటచే నేనిట్లయితిని. నీవు నన్నుఁ బెండ్లి యాడెదవా?

మహాదేవుఁ డొకనిట్టూర్పు విడిచెను. ప్రమద లేచి యిటు నటుఁ దిరుగ నారంభించెను. సైనికులందఱు నామె ననేకవిధములఁ బలుకరించుచుండిరి ప్రమదయంతయును జూచుచు వినుచుండెను. కాని యేమియు నెఱుఁగనట్లామె నటియించుచుఁ బ్రసాదుఁడున్న స్థానము ను గనుపెట్టెను. అంతలో మరల మహాదేవరావునొద్దకువచ్చి సంగీత ముం బాడ నారంభించెను.

నీవె సూర్యుండవు ♦ నీవె చంద్రుఁడవు;
నీ కాంతిలోపల ♦ నేమున్నియుంటిఁ;
గన్నులు చల్లఁగాఁ ♦ గాంచుటకంటె
నేనేమియునుగూడ ♦ నినుఁగోరలేదు;
సుందరాకార ! నా ♦ చూపులలోనె
వెడలక యేప్రొద్దు ♦ విహరింపుమయ్య!—

మహా—నీవు నాతోఁగూడ మాయూరువచ్చెదవా!

ప్రమద—ఏల?

మహా—నీకు మందు నిప్పించెదను.

ప్రమద ప్రత్యుత్తరము చెప్పక యా సేనావారమును దాఁటి యొకచెట్టుక్రిందఁ బరుండెను. మహాదేవరావు మరలఁబోయి యామె నుబట్టి తీసికొనివచ్చి యొక నెగడియొద్ద నామెను గూర్చుండఁజేసి క్రమముగ నిద్రావివశుఁడయ్యెను. అందఱు నిదురించుచుండిరి ప్రమద పాడుచుండెను—

కొంగున ముడివేసి ♦ కొనఁగోరలేదు
అరసి నీతోవల ♦ కడ్డురాలేదు
చిరకాలదాసినై ♦ సేవించుచుంటి
సమధికానందంబు ♦ సమకూర్పుమయ్య!—

మహాదేవరా వులికిపడి లేచునప్పటికిఁ బ్రమదమేలిమునుఁగు జాలి యుండుచుండెను. తోడనే యాతఁడామెనుబట్టుకొని యా వస్త్రమును దీసి పారవైచెను. ప్రమద బిగ్గరగ నేడువదొడఁగెను. ఆమె యవస్థంజూచి మహాదేవరావు విచారించుచు "ఈమెను వహ్నియొద్ద నుంచఁగూడదు శిబిరమున కవ్వలనుంచినచోఁ గ్రూరజంతువులు హింసింపఁగలవు శిబిరములో మగవారిచెంతనుంచుట మరియాదగాదు ఏమి చేయుదును?" అని యాలోచించుకొని ప్రసాదుని నిర్బంధించియుంచిన పటావరణమునకు సమీపమునం దామె నుంచెను. ప్రసాదుఁ డానడుమ నొక చెట్టుక్రిందఁ బరుండి యుండెను. చెట్టుకొమ్మలు సేనామండలమున కవ్వలివఱకును వ్యాపించియుండెను ఆ వృక్షము చాల నెత్తయినది. దానికొమ్మ యొకటి విఱిగిపోయినది. రెండవకొమ్మ చాలదూరమువరకును వ్యాపించియున్నది యువరాజు పటాభ్యంతరమున శయనించియుండెను. ఆతఁడు ప్రమద మాటల నాలకించి తొంగిచూచెను. ప్రమద యాతనింజూచి "నీవును నన్నుఁ గొట్టెదవా ?—నీమనుకొ(?)వలె నన్నుఁ గఱచి బాధింపవలదు" అనియెను.

ప్రసా—మాటాడకుము ! నెమ్మదిగ శయనింపుము.

ప్రమద శయనించెను. మహాదేవరా వామెపై నొక కంబళము గప్పి వెడలిపోయెను. అందఱును నిదురించుచుండిరి. సేనామండలముచుట్టు నిరువురు రక్షకభటులుమాత్రము తిరుగుచుండిరి. తృతీయచంద్రుఁ డిదివఱకే యస్తమించుటచే నంధకారము ఘనీభూతమైయుండెను. ఇంధనాభావముచే నెగడులు చప్పగఁ జల్లారుచుండెను. సమయము దొరకినదని యెంచి ప్రమద యించుక జరగి ప్రసాదునిపైఁ జేయివైచెను. ప్రసాదుఁ డులికిపడి లేచెను. ప్రమద తెర యెత్తకుండఁగనే మృదుస్వరముతో "మాటాడకుము! నేను పిచ్చిదాననుగాను. నిన్ను విడిపించుటకై యిట్లు వచ్చియుంటిని" అని చెప్పుచుఁ దన ముఖము తెరలోనుంచి యాతనితో ననేక సంగ

తులంగూర్చి మాటలాడెను. పిమ్మట నామె చటాలున లేచి గానము చేయ నారంభించెను.

నీవె సూర్యుండవు ♦ నీవె చంద్రుఁడవు
నీ కాంతిలోపల ♦ నేమున్నియుంటి ;
కొంగున ముడివేసి ♦ కొనఁగోర లేదు
అరసి నీత్రోవల ♦ కడ్డురాలేదు ;
పడతి నిన్గోరుట ♦ బ్రతికినన్నాళ్ళు
లేమ్చుటకే యని ♦ యే నెఱుంగుదును ;
అయినను జన్మజ ♦ న్మాంతరములకు
నీప్రాపె కోరుదు ♦ నిన్నియాచింతు—

ఇట్లు పాడుచు నామె యా శిబిరమును దాఁటిపోయెను. ఆ సంగీతధ్వనిచేఁ గొందఱకు మెలకువవచ్చినది. కొందఱికి మెలకువయే లేదు. మేల్కాంచినవా రించుకతలయెత్తి చూచిరి. కొందఱు మరల నిదురించిరి. అప్పుడు మహాదేవునకు మెలకువ వచ్చుటచే నాతఁడు ప్రమదం జూచి "ఎక్కడకుఁ బోయెదవు ?" అని ప్రశ్నించెను.

ప్రమద ప్రత్యుత్తరము చెప్పక యట్లేపాడుచుండుటచే మహాదేవుఁ డామె దుప్పటమును బట్టుకొనియెను ప్రమద యేడ్చుచు "నన్ను గొట్టవలదు—నీ పాదములఁ బట్టుకొని వేడుకొనుచున్నాను. నేను మీ సమీపమున శయనింపఁజాలను. మీ రందఱును బురుషులు !" అనియెను.

మహా—అట్లయినచో నెచ్చట శయనింతువు ?
ప్రమ—ఆ చెట్టుక్రింద.
మహా—ఇఁక నెక్కడకును బాఱిపోవుగద ?
ప్రమ—పోను.

మహాదేవుఁ డామెను విడిచిపెట్టెను. తరువాతఁ బ్రమద యా యంధకారములోఁ గొమ్మపట్టుకొని చెట్టుపైకెక్కెను. మహాదేవుఁడు చీఁకటిలోఁ జూడలేదు. కాని, యాకులు చప్పుడునుబట్టి బ్రమద చెట్టెక్కుచున్నట్లు దెలిసికొనియెను. ప్రమద యా కొమ్మనుండి

యా కొమ్మకుఁ బ్రాకుచుఁ జప్పుడు చేయుచుండుటచే నిదురించు చుండువారు మేల్కాంచి యామెను దిట్టనారంభించిరి కొంతసేపటి కాతిట్లును చల్లారినవి. మరల నందఱును నిద్రాపరవశులై పోయిరి. అప్పుడు ప్రమద చెట్టుమీఁదనుండియే తన కట్టుబట్టను విప్పి కంబళ మును గట్టుకొనియెను. ప్రమద యిల్లువెడలు సమయమున నీలవస్త్ర ధారిణియయి బయలుదేరినసంగతి పాఠకులకు జ్ఞప్తియందుండ వచ్చును. ప్రమద యా వస్త్రమును బేలికలుగఁ జీల్చి త్రాడువలెఁ జేసి యొకదానినొకటి ముడివైచి యాకొమ్మపై నుండి క్రిందికి వ్రేల వైచెను. ప్రసాదుఁడు సమయమును గనిపెట్టి చూచుచున్నవాఁడే కావున నప్పు డావస్త్ర రజ్జువుం బట్టుకొని మెల్లమెల్లగ వృక్షారోహణ ముం గావించెను. అతఁడు శాఖారోహణముం గావించి యాత్రాడును లాగి ప్రమదవైపునకు విసరివైచెను. అప్పుడు ప్రమద ముందుగను, ప్రసాదుఁడు వెనుకగను నా కొమ్మపై ముందటికిజరిగిపోవుచుఁ గ్రమ ముగ వా రిరువురును నిమిషములో సేనామండలమునకు వెనుక శాఖావతరణముం గావించి క్రిందికిదిగిరి. ప్రమద యా యంధకార ములోఁ బ్రసాదుని చేయిపట్టుకొని యాకుల చప్పుడుకాని త్రోవం బట్టి యాతని దీసికొని పోవుచుండెను.

ప్రమద యొక చెట్లగుంపులో గుఱ్ఱమును గట్టివైచినదని యిదివఱకే చెప్పియుంటిమి. ఇప్పుడామె యాతని నావంకకే తీసికొని పోయి గుఱ్ఱమునొద్దనిలిపి "ప్రసాదా! ఇది నీ గుఱ్ఱమే! ఈ సేనలో దీనితో సమముగ బరుగెత్తుగుఱ్ఱ మొక్కటియును లేదు. ఇప్పుడీ యశ్వము సజ్జితమైయున్నది. నీవు దీని నధిరోహించి శీఘ్రముగ నిటనుండి వెడలిపొమ్ము!" అనియెను

ప్రసా—నీవో?

ప్రమ—నేనా? నే నెక్కడకు రావలయును?

ప్రసా—ఇంటికి రావా?

ప్రమ—నేను గృహమును బరిత్యజించితిని.

ప్రసా—అట్లయినచో నీవు జారిణివా ?

ప్రమ—ఆ మాటయు నిజమే.

భవానీ ప్రసాదు మఱి మాటాడఁజాలకపోయెను. ఒక్క నిమిష మూరకుండి "ప్రమదా! నీవు కులటవైనను నాకుఁ బ్రేమ పాత్రురాలవు. నా జీవితకాలమునం దెన్నఁడును నీవుచేసిన మేలును మఱవఁజాలను" అనియెను.

ప్రమద యా చీఁకటిలో మొగము ద్రిప్పుకొనియెను. ప్రమద ప్రత్యుపకార వాంఛచే నిట్లు చేయలేదనుసంగతి భవానీ ప్రసాదు గ్రహింపఁజాలకపోయెను. అతఁడు మృదుస్వరములో "ప్రమదా! నేను చెప్పినచో నీతండ్రి నిన్నింట నుంచుకొనుట కంగీకరించును. లెమ్మా! ఇంటికిఁ బోవుదము రమ్మా!" అనియెను.

ప్రమ—ఏ సుఖముకొఱకు నేనింటికి రావలయును?

ప్రసా—నీకిల్లున్నది; తల్లిదండ్రులున్నారు—కాని నాకే మున్నది ప్రమదా?

ప్రమ—నీకు—నీకు—నీకీర్తి యున్నది; నీ ధర్మమున్నది; నీయాశ యున్నది—మఱి—మఱి—అన్నిటికంటె నధికురాలగు నీ యుమాబాల యున్నది

ఏనామ మాతని హృదయమున నిరంతరమును జాగరితమగు చుండెనో యా మధురనామ మితర కంఠమునుండి వెలువడుటచే నాతని హృదయము కంపించిపోయెను. అప్పు డాతఁడు తన రెండు చేతులను గుండెలపైనుంచుకొని మెల్లమెల్లగ "ప్రమదా! ఆ యాశ చేతనే యింతవఱకును జీవించియుంటిని. ఆ యాకర్షణము చేతనే బ్రదుకుకొఱ కింతటి ప్రయత్నముం గావించితిని" అనియెను.

ఇంతలో వెనుకనుండి "అప్పుడే బ్రతికి బయటఁబడితి ననుకొనుచుంటివా?" అని యెవ్వరో గద్దించి పలికినట్లయ్యెను.

ప్రమద తిరిగి చూచెను. మహాదేవరావు కత్తినెత్తి ప్రసాదుని నరకుటకు సిద్ధముగ నుండెను. ప్రమద యుదరిపడి యా యిరువుర నడుమను నిలిచి తనవక్షము నాతనికత్తి కడ్డముగనుంచి తన పైఁటలోనున్న బాకుతో మహాదేవుని వక్షమునం బొడిచెను. తోడనే

మహాదేవుఁడు భయంకరార్తనాదముతో నరణ్యమును బ్రకంపిత

ముగఁ జేయుచు భూతలపతితుఁడై పోయెను.

ప్రసాదుఁడు తిరిగిచూచెను. ప్రమదయును గంపించి పోవు చుండెను. తోడనే యాతఁడు పతనోన్ముఖం బగు ప్రమద దేహమును గౌఁగిలించుకొని బాహుమధ్యమునం దుంచి పట్టుకొనియెను. ఆ యానందస్పర్శనముచేఁ బ్రమద సర్వాంగకములును బులకితములై పోయెను—ఇంకను నా యానంద స్పర్శము నే కోరుకొనుచుండెను. మహాదేవుని యార్తనాదముచే సైనికులు మేల్కాంచి నలుదెసలకు బయలుదేరిరి పదశబ్దము సమీపించుచుండుటచేఁ బ్రసాదుఁ డిఁక నాలస్యము చేయుట తగదని యూహించి యచేతనంబగు ప్రమదశరీరమును బాహుమధ్యమునం దుంచుకొని చటాలున నశ్వారోహణముం గావించెను.

ఆ యంధకారమున మార్గము గపడుట లేదు. ప్రసాదుఁడు గుఱ్ఱముమీఁదనే భారము వైచి యది పోయినట్లెల్లఁ బోవుచుండెను. కొలఁదిసేపటిలో నశ్వము రాజమార్గమునుబట్టెను. అప్పుడు ప్రసాదుఁడు దక్షిణాభిముఖముగ నతివేగమున గుఱ్ఱమును బరుగెత్తించుచుండెను.

---

మూఁడవ ప్రకరణము.

# బ్రతుకునను నాశ యున్నదా?

కొలఁదిసేపటికిఁ బ్రభాతకాంతులు దిక్కులఁ బ్రసరింప నారంభించెను. ప్రసాదుఁ డట్లే యజమీాఁదన కభిముఖుఁడై పోవుచు నొక చిన్ననది యొడ్డునకుఁ జేరెను. ఆతఁ డా నదియొడ్డున గుఱ్ఱమునుండి దిగి సికతాతలంబునఁ బ్రమద యచేతన శరీరమునుంచి యామె కంచుకమును విచ్చి హృదయమును బరీక్షించెను. కృపాణాఘాతము గురుతరమైనదిగనే యగపడియెను. భుజమునుండి వక్షమువఱకును

బలమైనగాయము పడియుండెను. రక్తస్రావముచే శరీరమంతయును దడిసిపోయినది. ప్రసాదుఁడిఁక నాలస్యముచేయక తన తలపాగను జించి జలంబులఁదడిపి యామెగాయములపై వైచి కట్టెను. ముఖమునందును శిరమునందును జలసేచనముం గావించుచు నందందు స్రవించుచున్న రక్తమును దుడిచి వైచుచుండెను ఆమె యొడలంతయును జీరుకొని పోయి యుండుటచేఁ బ్రసాదుఁడు విస్మితుఁడై పోయెను. కత్తితో నొడలంతయును జీరుకొని నట్లగపడుచుండెను. ముండ్లడొంకలమూల మున నట్లు జరిగియుండు ననుకొనుట కవకాశము లేదు. ప్రమద యొద్ద నాయుధ మున్నది. ఆమె యున్మత్తవేషమును బ్రకటించుటకే స్వయముగ నట్లుచేసికొని యుండునని ప్రసాదుఁడు నిశ్చయించుకొనియెను.

అందుచేఁ బ్రసాదునిగుండె ఝల్లుమనియెను. అతఁడు తనలో "ప్రమదకు నిజముగనే మతిపోయియుండునా? కాదు. అట్లు జరగి యుండదు. నన్ను బంధముక్తునిం జేయుటకే యీయామె యింతపని చేసినది. ఈమె పిచ్చిదికాదు ఇంతపనిచేయుటకుఁ బ్రమదకుఁ బ్రయోజన మేమున్నది? ఈమె యెందుచేత గృహమును ద్యజించి వైచినది? తన యొడలంతయును జీరుకొని చావునకైన నంగీకరించి యేల యింతపని చేయుట కంగీకరించినది? ఇంత పనిచేయుటవలన నీమె కేమిలాభముండునని తలంచుకొన్నది?" అని భావించుకొనుచుఁ బ్రమద యుత్తమాంగమును దన తొడలపై నుంచుకొని గాయములపై జలసేచనముం గావించుచుండెను.

ప్రమద కే యుపచారమునను జైతన్యము కలుగుట లేదు. ప్రసాదుఁ డీమెకుఁ గొంచెము పాలుపోసిన నెట్లుండునో యని తలంచెను. ఆసమయమునం దొకస్త్రీ తలపై నొకకలశము నుంచుకొని మెల్లమెల్లగ నా దారిని బోవుచుండెను. ప్రసాదుఁ డామెం బిలిచి "అమ్మా! నా కించుకపాలను దెచ్చిపెట్టఁగలవా? ఇచ్చట నొక యువతి మరణాసన్నయై పడిపోయినది. పాలు తెచ్చి యిచ్చినచో నీకెంతయో పుణ్యముండును" అనియెను.

ఆ స్త్రీ తోడనే యా సమీప గ్రామమునకుఁబోయి నిమిష ములో నించుక కాచినపాలను దీసికొనివచ్చెను. ప్రసాదుఁ డాత్రముతోఁ బ్రియద ముఖ వివరమునం దొక్కొక్క క్షీరబిందువును జిలుకరింప నారంభించెను. ఆ పాలు లోనికిఁ బోవుటలేదు. చెక్కుల నుండి జారిపోవుచుండెను. అప్పుడు ప్రసాదుఁడు "ఇఁక నాశలేదు; ఈమెకుఁ బ్రాణము పోయినది." అని యెంచి క్షోభశోకోన్మత్తుఁడై పోయెను.

ఆ సమయమునందే "ఆదొంగ యిచ్చటనే యుండును. ఈ యిసుకలో నా దురాత్ముని యశ్వపద చిహ్నము లగుపడుచున్నవి. వాఁడీ త్రోవనే పోయియుండును" అనుమాటలు ప్రసాదునకు విన వచ్చెను.

ప్రసాదుఁడు తిరిగి చూచెను. అయిదుగు రాశ్వికులు కృపాణ హస్తులై తన కెదురుగనే వచ్చుచుండిరి. వారిం జూచి భయపడి యాపాలం దెచ్చినయువతి పాఱిపోయెను. అప్పుడు ప్రసాదుఁడు మెల్ల మెల్లగఁ దనతొడపైనున్న ప్రియద యుత్తమాంగమును గ్రిందికిదించి, యామె బాహుద్వయము నామె వక్షమునందుంచి, యిసుకలో మెల్లగ నామె శరీరమును భద్రముగనుంచి తన కెదురువచ్చుచున్న యాశ్వికులను సమీపించెను. ప్రసాదుఁ డప్పుడు ప్రళయకాల రుద్రమూర్తిం దాల్చియుండెను. ఆతని భయంకరముం గాంచి యందుఁ గొందఱు భయవిహ్వలులై పోయిరి. ప్రసాదుఁడు వారింగాంచి "మీరిచ్చటి కేలవచ్చితిరి?" అని ప్రశ్నించెను.

ఒకఁడు—నీవు మాతోఁ జెప్పకుండఁ బాఱిపోయితివి. నిన్ను మరలఁ దీసికొని పోవలయునని వచ్చితిమి.

ప్రసా—సరే—ఏమైననేమి? తరువాతఁ జూచుకొందము. ముందుగ నీ మృతదేహమునకు సత్కారముం గావింపవలసియున్నది. ఈలోపున మీ రెంతమంది వచ్చినను నన్ను సమీపింపనైనఁజాలరు.

ఒక—సమీపింతుమో, బంధింతుమో యా సంగతి యిప్పుడే తెలియఁగలదు. నీ వేమైన నెదిరించినచో మీ యిరువురకు నొకసారి

గనే సత్కారముం గావించెదము. ఇట్లు పలుకుచు నందఱు నొకటిగఁ జేరి ప్రసాదు నాక్రమింపఁ బయత్నించిరి.

ప్రసాదుఁడు సింహమువలె గర్జించుచు "ఇఁక జాగ్రతగ నుండుఁడు ! నా జన్మదేశ యోధులరక్తముతో నా హస్తములఁ గళంకితములుగఁ జేయఁజాలక యింతవఱకును సంశయించుచుంటిని !" అనియెను.

ఆ మాటలను లక్ష్యముచేయక యందఱు నొకసారిగఁ బ్రసాదునిపై బడిరి. వారిచేతులలోఁ గృపాణములకంటె నితరాయుధము లేవియును లేవు. తీసికొనుటకైనను వారి కవకాశము లేకపోయెను. ప్రసాదుఁ డప్పుడు ప్రమదపడియున్న చోటునుండి యించుక ముందఱికి వారికి లొంగకుండ గుఱ్ఱమును బ్రచరింపఁజేయుచుఁ దీవ్రమూర్తియయి విజృంభించుచుండెను. ఇంతలో మఱికొందఱు వచ్చి చేరిరి. ప్రసాదుఁ డసాధారణ రణకౌశలముంజూపుచు నొక్కొక్కరిగఁ దన కృపాణమునకు బలిచేయుచుండెను. క్రమముగ నందఱును గతాసులై పడిపోయిరి. ఒక్కఁడుమాత్రము క్షమాభిక్షంగోరి ప్రాణముల దక్కించుకొని పాఱిపోయెను.

అప్పుడు ప్రసాదుఁడు వెనుకకుఁ దిరిగిచూచెను. ప్రమదకించుక స్మృతి కలిగినది. అతి సంతోషముతోఁ బోయి ప్రసాదుఁ డామెకించుక పాలను బోసెను. ప్రమద యనిమేషనయనములతోఁ బ్రసాదునివంకఁ జూచుచుండెను. అప్పు డనేకులగు నాశ్వికులా యేటిత్రోవను దనవైపునకే వచ్చుచున్నట్లు ప్రసాదుఁడు కనుగొనియెను. పది, యిరువది, ముప్పది, నలువది, ఏఁబది—ఈవిధముగ నొకదళమువంక మఱియొకదళముగ వారెల్లరును గుఱ్ఱములనుదాయించుకొనుచువచ్చుచుండిరి. ప్రసాదుఁడు ఖడ్గహస్తుఁడై త్రిశూలపాణియగు ప్రళయకాల రుద్రునివలె నిలువఁబడి యుండెను. దూరమునందుండియే యాశ్వికులందఱు నాతని నానవాలుపట్టి "జయ ! మహారాజభవానీ ప్రసాదునకు జయ !" అని యుచ్చైస్స్వరమున జయధ్వనులం గావించిరి.

ఆ కేకలు చెవినిఁ బడుటచేఁ బ్రమద గడగడ వడంకెను. ప్రసాదుఁడు చూచి యామె సమీపమున నిలువఁబడియెను. అప్పుడు ప్రమద "ఈ జయధ్వను లెవ్వరినిగూర్చి ?" అని ప్రశ్నించెను. ప్రసాదుఁడు కొంతసేపటివఱ కేమియును జెప్పఁజాలక యామె సమీపమునం గూర్చుండి "ప్రమదా ! నీ యెదుట నాసంగతిని దాఁచుకొనఁజాలను— అట్లు దాఁచుకొనుటకుఁగూడ నాకధికారము లేదు. ప్రమదా ! నేను నిమధేశ్వరుని సోదరపుత్రుఁడను !" అనియెను.

ప్రమద విస్మయముతో "నీవు స్వర్గస్థుఁడగు వీరేంద్ర కేసరి తన యుండవా ?" అనియెను.

ప్రసా—అవును.

ప్రమదకన్నులు మూతలు పడిపోయెను. ఇఁక నామె కన్నులఁ దెఱవఁదలఁచుకొన లేదు. నిమిషములో స్మృతి తప్పి పడిపోయెను. ఆమెకు స్మృతిం గూర్చుటకై ప్రసాదుఁ డెన్నియో యుపచారములం జేయుచుండెను. తన పక్షముంజేరి వచ్చిన సైనికులలో నొకనిని సమీపగ్రామమునకుబంపి యొకపల్లకిని దెప్పించి ప్రసాదుఁడు ప్రమద నా పల్లకి యందుంచి యా పల్లకితోఁగూడ నా సైనికులను వెంటఁబెట్టుకొని యజమీరునకు బయలుదేరి పోయెను. ఆ యాశ్వికులందఱు నాతని ననుసరించి పోయిరి.

అప్పటి కెనిమిదిగంటల పొద్దెక్కెను. అజమీ రిఁక నెంత యోదూరము లేదు. ఈవిధముగఁ బ్రయాణము చేసినచో రెండు జాముల కజమీరు చేరవచ్చునని యందఱకు నాశ కలుగుచుండెను. అజమీరునకుఁ బోవుచుండు యాత్రికులెందఱో వారికి మార్గమునం దచ్చటచ్చట నగపడుచుండిరి. అందఱి నతిక్రమించి వారు ప్రయాణము సాగించుచుండిరి.

ప్రసాదుఁడు తన గుఱ్ఱమును బల్లకి ప్రక్కనుండియే నడిపించుచు నప్పుడప్పుడు తెరఁదీసి ప్రమదం జూచుచు నామె వదనము నందిచుక పాలను పోయుచు, గాయములపై శీతలోదకములఁ జిలుకరించుచుఁ బ్రయాణము చేయుచుండెను. ఇంతలో నాకస్మికముగ నొక

యాశ్వికుఁ డున్మత్తునివలె నజమీారునుండి యెదురువచ్చుచుండెను. అచ్చట మార్గమించుక యిరుకుగ నుండుటచేఁ బల్లకిబోయలు కొంచె మొగరిల్లుటకు ముందుగనే యా యున్మత్తుఁ డాపల్లకిపైఁ బడియెను. వాహకుల భుజములనుండి పల్లకి క్రిందఁబడిపోయెను వాహకులును గ్రిందఁబడిపోయిరి. ఆ యున్మత్తుఁడు వారిపైఁ బడి యెను. ప్రసాదుఁడు నాతనితోవచ్చు నాశ్వికులునుగూడ నాతని నాన వాలుపట్టిరి. ఆతఁడు ప్రభుభక్తి పరాయణుఁడగు జనార్దనుఁడే!

ప్రసాదుఁడు గుఱ్ఱమును దిగి ముందుగఁ బల్లకియొద్దకుఁబోయి చూచెను. ప్రమద తలక్రిందుగఁ బడిపోయెను. ప్రసాదుఁ డామెను మరల భద్రముగఁ బరుండఁజేసి మొగముపైఁ గ్రమ్ముకొనియున్న ముంగురులను సవరించి యామె వదనవివరమునం దించుక పాలను బోసెను. ప్రమద మనసార నాతని నొకసారి చూచెను.

జనార్దనుఁడు లేచి యువరాజు పార్శ్వమునకువచ్చి నిలువఁ బడి యానందోత్సాహ వివశుఁడై బాలకునింబోలి యేడువ నారం భించెను. మాటిమాటికి యువరాజును గౌఁగిలించుకొనుచు నాతని హస్తమును మొగముపైఁ జేర్చుకొనుచు వదనమును మూర్కొ నుచుఁ దనివితీరని చేష్టలం గావించుచుండెను. అప్పుడు జనార్దనుని కన్నులకు యువరాజుతప్ప నితరులెవ్వరు నగపడుటలేదు. ఆతఁ డేడ్చుచు నాతనివంకనే చూచుచుండెను. ఇంతలో నాకస్మికముగ నాతనిదృష్టి పల్లకివంకఁ బ్రసరించెను. చూచినంతనే యాతఁ డాన వాలుపట్టి "ఇదియేమి? ఈమెయా ప్రమదయేనా!" అని కేకవైచెను.

ప్రసా—ఏ ప్రమద జనార్దనా ?

జనా—మహారణ్యమున నాలుగుదినము లనాహారయయి పడియున్న ప్రమద.

అని జనార్దనుఁ డెల్లసంగతులను వివరణముగఁ దెలిపెను. ప్రసాదుఁడు విని యూరకుండెను. మార్గమధ్యమునం దాతనిముఖము నుండి యెవ్వరు నెట్టిమాటయు నాలకింపలేదు, జలభారాక్రాంతం బగు జలదముం బోలి యాతఁడు మెల్లమెల్లగఁ బ్రయాణము చేయు

చుండెను. అతఁడఁజమీారుచేరి ప్రమదను రామశేఖరునింటఁ బ్రవేశ పెట్టి భద్రముగఁ గాపాడ నియోగించెను. తరువాతఁ బట్టణమునందలి సుప్రసిద్ధవైద్యుల కందఱకును వార్తలం బంపించెను. అతఁడు ప్రమద ప్రక్కనే కూర్చుండియుండెను. కదలలేదు. అంతలోఁ గొందఱు వైద్యులువచ్చి గాయములను బరీక్షించిరి వారిం జూచి ప్రసాదుఁడు "బ్రదుకునను నాశయున్నదా?" అని ప్రశ్నించెను.

"ఆశయేమియును లేదు"

---

నాలుగవ ప్రకరణము

## కన్నీరు—ఎడఁబాటు

సాయంకాల మైనతోడనే రామశేఖరుని గృహిణి ప్రమద శయనమందిరమున దీపమును వెలిఁగించెను. ఆ గదిలో నింక నెవ్వరును లేరు; అప్పుడు ప్రమద హీనస్వరముతో "అమ్మా! నీల యింకను దిరిగి రాలేదా?" అని ప్రశ్నించెను.

తల్లి—ఏమి తల్లీ! నీల యింకను రాలేదు.

ప్రమ—అలాగా? అట్లయినచో నింక జూపులు లేవను కొని యెదను.

ప్రమదతల్లి యేడువ నారంభించెను. ఆసమయమున ద్వారమునొద్ద నడుగులచప్పుడు వినవచ్చెను. ప్రమద యాతురముతోఁ దిరిగి చూచెను—ఎదుట నీల! చూచినతోడనే ప్రమద తొందరతో "నీలా! నీవొక్కతెవేనా?" అని ప్రశ్నించెను.

నీల—కాదు. నేనొక్కతెనే కాదు.

అప్పుడు ప్రమద తల్లిం జూచి "అమ్మా? నీవు వీధినడవలో నుండి యెవ్వరు నీ గదిలోనికి రాకుండఁ జూచుచుండుము!" అనియెను. ప్రమదతల్లి వెడలిపోయెను. అప్పుడు నీల యుమాబాల నా

గదిలోనికిఁ దీసికొనివచ్చెను. ఆ వెనుకనే శ్వేతకూడ నచ్చటికి వచ్చెను.

ప్రమద మనోభావముచేతనే రాజకుమారికిఁ బరిణామమును గావించి "శ్వేతా! నీలా! మీ రిరువురును నన్ను క్షమించి కొలఁది సేపటివఱకు నవ్వలిగదిలోఁ గూర్చుండి యుండుఁడు! నీలా! నీవు నా కించుకపాల నొసంగిమఱిపొమ్ము!" అనియెను. బందిపోటు దొంగలచరిత్రము వినుభాగ్యము లేకుండఁ బోవుచున్నందుకు నీలాశ్వేతలు విచారించిరిగాని గత్యంతరము లేక యిరువురు నవ్వలిగదిలోనికిఁ బోయి కూర్చుండిరి. అప్పుడు ప్రమద మృదుస్వరముతో "రాజకుమారీ! నేను మహాపాపాత్మురాలను; క్షమించుటకయోగ్యురాలను. నేను నీకు సకలవృత్తాంతమును విస్పష్టముగ మనవిచేసెదను. అంతయును జిత్తగించి నీకు దయగలిగినచో నన్ను క్షమియింపుము!" అనియెను.

ప్రమద సర్వవృత్తాంతమును రాజకుమారికిఁ దెలియజేసెను. ఒక్కమాట యయినను దాఁచియుంచలేదు. మెల్లమెల్లగ నెల్లసంగతులం దెలిపి తుట్టతుదకుఁ బ్రమదమృదుస్వరముతో "రాజకుమారీ! నీ వెవ్వని బ్రేమించితివో యాతని హృదయమును నీవు బాగుగ నెఱుంగవు. నీ యల్పహృదయమునకు మహత్తరమగు నాతనిహృదయము బోధపడునదికాదు. నీహృదయము దుర్బలమైనది. అభిమానతేజోభరాలసమైనది -- ఇఁక నాతఁడో — దేవతామూర్తి! అసత్యప్రతారణముల కతీతుఁడు!" అనియెను.

రాజకుమారి యెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. కేవలము నొక్కటేరీతిగ నేడ్చుచుండెను. ఆ యశ్రుధారలచే నామె వక్షస్స్థలమంతయుఁ దడిసిపోవుచుండెను. ఎందుచే నట్లేడ్చుచుండెనో పాపమామెకును దెలియదు. కాని కన్నీటికిమాత్రము విరామము లేదు. చాలసేపటి కామె కన్నీటి నడంచుకొని "ప్రమదా! ఈ నిమిషమునుండి నీవు నా సోదరివి. నాకు గురుసమానురాలవు. నీయీ ప్రబోధమును — ఈ స్వార్థత్యాగపరత్వమును నా హృదయరంగమున బ్రదికి

యున్నంత కాలమును జాగరితములై యుండునట్లు నన్నాశీర్వదింపుము !'' అనియెను.

ప్రమ — రాజకుమారీ ? ఎల్లసంగతులును నిష్కపటహృదయముతో నీ కెఱింగించితిని. ఇఁక నన్ను క్షమియింపవా ?

రాజ — నిన్ను క్షమియించుటయా ? మంచిది. క్షమియించుటయే నీకోరిక యయినచో నట్లే క్షమియించెదను. ఇందెవ్వరు మహాపరాధినులో నిన్నును నన్నును దైవమే యెఱుంగును.

ప్రమద క్రమక్రమముగ నవసన్నయయిపోవుచుండెను. ఉమాబాల యామెనోటిలోఁ బాలను బోయుచు ''ప్రమదా ! జగన్మాత యనుగ్రహమున నీకు శీఘ్రముగనే యారోగ్యము కలుగును. రేపు సాయంకాలము మరల నిన్నొకసారి వచ్చిచూచెదను '' అనియెను.

ప్రమద మఱియేమియు మాటాడలేదు. వర్షావసానమునందలి మెఱుపువలె నామె యధరప్రాంతమునం దించుక హాసచిహ్న మగపడి యంతలోనే విలీనమైపోయెను. ప్రసాదుని కులశీలములంగూర్చి యెంత మాత్రమును బ్రమద రాజకుమారికిఁ దెలుపలేదు. సమయము తటస్థించినప్పు డాతఁడే తెలుపఁగలఁడని యామె భావించెను. ఏ సంగతి ప్రకటించుట ప్రసాదుక కంగీకారము లేదో యా సంగతిని రహస్యముగనే యుంచుట యామె కవశ్యకర్తవ్యముగఁ దోఁచెను.

రాజకుమారి సెలవు గైకొని వెడలిపోయెను. ప్రమదతల్లి యచ్చటికి వచ్చెను. ప్రమద తల్లింజూచి ''అమ్మా ! నాకుఁ గాలము సమీపించుచున్నది. ఇఁక నెంతయోసేపు జీవింపను. తల్లీ ! నా సర్వాపరాధములను క్షమియింపుము. బ్రదికియున్నన్నాళ్ళును నిన్నేడ్పించితిని. ఇంచుకంతయును సుఖపెట్టలేదు. ఎన్నఁడును నీతో సంతోషముగ సంభాషింపలేదు. అమ్మా ! ఇదివఱకు నేను పశువువలె సంచరించితిని — ఎన్నఁడు నెవ్వరిని బ్రేమించినదానఁగాను — ప్రేమించుట యననేమో యంత్యకాలమునఁ దెలిసికొనఁగలిగితిని. ఈదుఃఖమనుభవించుటకే కాఁబోలును ! ప్రేమమాధుర్యము నా కింతకుఁ బూర్వ మెందుచేతఁ దెలిసినదికాదు ?'' అనియెను.

తల్లి యేడువ నారంభించెను. ప్రమద కన్నులనుగూడ నీరు నిండిపోయెను. అప్పుడు ప్రమద "అమ్మా! నడవలో నెవ్వరున్నారు?" అనియెను.

తల్లి కన్నీరు తుడుచుకొని "అమ్మా! మీ నాయనయు, వైద్యులును గిల్లాదారును గూర్చుండియున్నారు" అనియెను.

ప్రమ—వైద్యుల నింటికిఁ బొమ్మనుము. కిల్లాదారును, నాయనను లోపలికిఁ దీసికొనిరమ్ము.

కొంతసేపటికిఁ గిల్లాదారగు ప్రసాదుఁడు వచ్చి ప్రమదసన్నిధిని నిలువఁబడియెను. అతని వెనుకనే రామశరణుఁడు కన్నులనీరు చేసికొని నిలిచియుండెను. అప్పుడు ప్రమద తండ్రిపాదధూళిని శిరమునం దాల్చి చాలసేపేడ్చెను—క్షమాప్రార్థనముం గావించెను—తుదకు వివశయయి పడిపోయెను. ప్రమద యవస్థంజూచి యిఁక నెంతయోసేపు బ్రతుకదని ప్రసాదుఁ గ్రహించెను. అప్పుడు ప్రసాదుని చెక్కులశ్రుజలప్లావితములై పోయెను. ప్రమద హీనస్వరముతో "ప్రసాదా! ఏడ్చుట యెందులకు?" అనియెను.

ప్రసాదుఁ డట్లే దుఃఖించుచు "ప్రమదా! నీవు నా కొఱకు నీ ప్రాణములను బోఁగొట్టుకొంటివి. ఈమాట నా కెన్నటికిని మఱవు రాదు. నిన్ను బ్రదికించుకొనుట కుపాయము కలదేని దానికొఱకు నేను నా సర్వస్వమును వినియోగింపఁగలను." అనియెను.

ప్రమద మఱియును హీనస్వరముతో "అందువలన నేమి లాభము!" అనియెను.

ప్రసా—నీవు బ్రతికి యున్నచో నేను బ్రతికియున్నంతకాలమును నిన్ను నా సోదరిగఁ బ్రేమించుచుండెదను.

ప్రమద కన్నులను మూసివైచెను; ఏమియును మాటాడలేదు ప్రసాదుఁడు మరల "ప్రమదా! నీవు నా కాత్మత్యాగముం గూర్చియు స్వార్థత్యాగముంగూర్చియు దృష్టాంతపూర్వకముగ నుపదేశించితివి. నీవక్షయస్వర్గలోకాధీశ్వరివై యుండెదవుగాక! ఇదియే నా యాశీర్వాదము." అనియెను.

కన్నులను దెఱవకుండఁగనే ప్రమద యత్యస్ఫుట స్వరముతో “ నేను—స్వర్గమును—గోరుట—లేదు—మోక్షమును — వాంఛించుట—లే—దు. నన్నాశీర్వదింపుము—నాకు — మరల—జన్మమే యున్నయెడల—నప్పుడుఁగూడ—నీ విధముగనే—మరణము—నాకు లభియించునట్లు—నన్నా శీర్వదింపుము—” అనియెను.

పాపము, ప్రమద యిఁకఁ గన్నులను దెఱవనేలేదు !!!

---

అయిదవ ప్రకరణము

# ప్రసాదుఁడు—దేవలుఁడు

ప్రమద కగ్నిసంస్కారాది కార్యముల జరిగించు నేర్పాటులం గావించి ప్రసాదుఁడు వాసస్థానమునకు వెడలిపోయెను. అప్పటికి జాము రాత్రి యయ్యెను. జనార్దనుఁడు ప్రసాదుని బ్రేమించివచ్చిన యోధులను వెంటఁబెట్టుకొనిపోయి కోటలోనుంచి, యూతఁడు మరలి వచ్చెను. ప్రసాదుఁడు జయంతునివలన దేవలుఁడు వచ్చినసంగతిని వినియెను. అందుచే నెప్పుడు దేవలునిఁ జూతునా యని ప్రసాదుని హృదయము తత్తరపడుచుండెను. తోడనే యూతఁడు జనార్దనుని వెంటఁబెట్టుకొని యశ్వారూఢుడై వినోదరంగాభిముఖముగ బయలు దేరెను. ప్రసాదుఁ డచ్చటకుఁ బోయి క్రోశవ్యాప్తమై జనసంకులమై యున్న శిబిరావాసస్థానమున దేవలుని విడిది యెచ్చట నున్నదో తెలిసికొనుటకు బ్రయత్నించెను. కాని తెలిసికొనుటకుఁ గష్టసాధ్యముగా నుండెను. జనార్దనుఁ డొకరిద్దఱు మనుష్యుల నడిగి తెలిసికొనఁదలఁచెను గాని వారివలన సంతృప్తికరములగు ప్రత్యుత్తరములు లభియింపలేదు. ప్రసాదుఁడు బాగుగ నాలోచించి పూర్వదేశాగతులగు నతిథులు పూర్వరంగమునందే విడిసియుందురని నిశ్చయించుకొని యూ దిక్కునకుఁబోయి నిషధేశ్వరుని యావాసము నన్వేషించుచుఁ దుదకు సఫల ప్రయత్నుఁడయ్యెను.

ఆ రాత్రివేళ నాక్షేత్రమంతయు నతిలోకసుందరముగా నుండెను. మధ్యభాగమున నున్నతమందిరమును దానికి నలువంకల విశాల ప్రాంగణములును—ఆ ప్రాంగణములకు నలువంకలను దారు నిర్మితంబులగు నసంఖ్యగృహశ్రేణులు—ఆ శ్రేణులకు నడుమ నడుమ విశాలమార్గములు—వాని వెనుక గృహశ్రేణులు—మార్గములయం దెల్లయెడల వేలకొలఁది దీపములు—గృహశ్రేణులయం దసంఖ్యదీపములు—ఆ యసంఖ్యదీపావళు లాయసంఖ్యమానవ కంఠస్వర ప్రతిధ్వనిత విశాలరంగమునందలి యంధకారమును బాఱఁదోలుచుండ నా రంగసౌధము, పతంగకూజితంబును, ఖద్యోతవిలసితంబును నగు మహామహీరుహముంబోలి విలసిల్లుచుండెను.

దేవలుని గృహద్వారమునఁ గొందఱు రక్షకభటులు కావలి కాచుకొనియుండిరి. ప్రసాదుఁడు సమీపించినతోడనే వారాతని నానవాలుపట్టి తత్తరముతో లేచి నిలువఁబడి యానందకోలాహల ధ్వనులం గావించిరి. భృత్యుఁడగు ప్రతాపుఁడుమాత్రము దేవలుని శయనమందిరమునం దుండెను. ఆ కోలాహలము నాలకించి యాతఁడు బయటికి వచ్చి యువరాజుం గాంచి దేవలునికిఁ దెలుపుటకై యొక్క పరుగున లోపలికిఁ బోవఁజూచెను. ప్రసాదుఁ డాతని వారించి తా నొక్కఁడును మెల్లగ దేవలుని పడకటింటికిఁ బోయెను. జనార్దనుని గూడ రానీయలేదు.

ఆ గదిలో దీపము వెలుఁగుచున్నది. దేవలుఁడు నిద్రించుచుండెను. ప్రసాదుఁడు మంచమునొద్ద నిలువఁబడి మెల్లగా "దేవలా!" అనిపిలిచెను.

శోకాతుర యగుతల్లి, నిదురనుండి యదరిపడిలేచి కెవ్వునఁ గేకవైచి యేడ్చుచున్న బాలకునిం జూచి, యెట్లదరిపడునో యట్లే భవానీ ప్రసాదునిపలుకు నాకర్ణించి దేవలుఁ డులికిపడి లేచి కూర్చుండెను. కన్నెత్తి చూచునప్పటి కెదుట సోదరుఁడు! దేవలుఁడు చటాలున లేచిపోయి యన్నను గౌఁగిలించుకొనియెను; ఒక్కసారి మాత్ర మన్నా! యని పిలిచెను; ఇఁక మాటాడలేదు; అన్నభుజముపైఁ

దలఁచుకొని యవిరామముగా నేడువనారంభించెను. భవానీప్రసాదు కూడఁ దమ్ముని గౌఁగిలించుకొని యేడ్చెను. దుఃఖమించుక తగ్గినంతనే యొండొరులఁ దదేకదృష్టితోఁ జూచుకొనుచుండిరి అంతలోనే యొండొరులం గౌఁగిలించుకొని మరల దుఃఖించుచుండిరి. హిమవాయు సంచలితంబులగు శిశిరకమలములం బోలి వారిరువురు నొకసారి కౌఁగిలించుకొనుచు నొకసారి యొండొరులం జూచుకొనుచు దనివితీరని భావములలో మునిఁగిపోవుచుండిరి.

తరువాతఁ బరస్పరమును దమతమ కష్టసుఖములఁగూర్చి వారిరువురును ముచ్చటించుకొనిరి. యువరాజు నాఁటినుండి నేఁటి వఱకును జరిగిన సంగతుల నన్నిటిని దమ్మునకుఁ దెలియఁజేసెను. తాను తేజస్వతీ నగరమును విడిచి వచ్చుటకుఁ గారణముమాత్రము మాతనికిఁ దెలుపలేదు. ఆవిషయముంగూర్చి దేవలుఁడును బ్రశ్నింపలేదు. అందులకుఁ గారణము తనతండ్రియే యని దేవలుఁ డిదివఱకే నిశ్చయించుకొని యుండెను.

సకల వృత్తాంతము నాలకించి దేవలుఁడు "అన్నా! అజమీరునందొక బాలసేనానాయకుఁడు పండ్రెండు వేల సైన్యముతో సిరోహీ విజయముం గైకొనెనను వార్త విన్నప్పుడే యాతఁడు నీవే యయియుండునని యనుమానించితిని. ఆసందేహము తీర్చుకొనుటకే నేనిప్పు డిచ్చటికి వచ్చియుంటిని" అనియెను.

ప్రసాదుఁ డామాటలను మరలించి "తమ్ముఁడా! నీకొక వస్తువును జూపించెదను—ఒక్కసారి చూచినచో దాని నెప్పుడును జూడవలయుననియే నీవు వేడుకపడుదువు" అనియెను.

దేవ—అన్నా! అదియేమో చూపింపవా!

ప్రసా—ఇప్పుడు కాదు. రేపు నీకుఁ జూపించెదను. వీరోత్సవాంతరమున నిన్నచ్చటికిఁ దీసికొనిపోయెదను.

దేవ—వీరోత్సవరంగమున నీవును విలాసవిహారముం గావించెదవా?

ప్రసా—వలదు. తమ్ముఁడా! అట్లయినచో నే నెవ్వఁడనో యందఱకును దెలిసిపోవును.

దేవ—ఒకవేళఁ దెలియకుండనున్నచో నట్లు చేసెదవా?

ప్రసా—అట్లయినచో నష్టము లేదు.

చాల రాత్రియగుటచేఁ బ్రసాదుఁడు వెడలిపోఁజూచెను. కాని దేవలుఁడు విడువలేదు. అతఁడు అన్నా! నీ ప్రక్కలోఁ బరుండి చాలదినము లయ్యెను. నీపాదములఁ బట్టుకొని వేఁడుకొనుచున్నాను. ఈ రాత్రి నాయొద్ద శయనింపుము!” అనియెను.

ప్రసాదునకు గత్యంతరము లేకపోయెను. అప్పుడు ప్రసాదుఁడు “దేవలా! నా సంగతి యెవ్వరికిని దెలుపవలదని నీ సేవకుల కందఱకు నాజ్ఞాపింపవలయును” అనియెను. దేవలుఁ డట్లే కావించెను.

నిద్రించుటకుముందు దేవలునింజూచి ప్రసాదుఁడు “దేవలా! తెల్లవారుజామున నే లేచి మన యిచ్చటినుండి జయదేవీ మందిరము నకుఁ బోవలయును” అనియెను.

దేవలుఁడు మాఱుమాట చెప్పలేదు—అప్పు డాతని హృదయమునం దేదియో యొకయుపాయము తోఁచెను.

---

ఆఱవ ప్రకరణము.

# సౌందర్యము—మాధుర్యము

సూర్యోదయమునకు ముందుగనే యన్నదమ్ము లిరువురును బడకనుండి లేచిరి ప్రసాదుఁడు “దేవలా! మాతృమందిరమునకుఁ బోవుదము రమ్ము! ఆ జగన్మాత నా కనేక కష్టములను దొలఁగించి నది. రణక్షేత్రమునకుఁ బోవుటకు ముందుగనే తల్లిసిదర్శించి వత్తము రమ్ము” అనియెను.

దేవ—అన్నా! నే నిప్పుడు రాఁజాలను. నా కించుక పని యున్నది!

ప్రసా—పని యేమున్నది ?

దేవ—ఒకసారి మహారాజును దర్శింపవలయును. మఱియు, నజమీాను ప్రభువునుగూడఁ జూడవలదా ?

ప్రసా—ఎందులకు ?

దేవ—తరువాతఁ జెప్పెదను.

ప్రసాదుఁ డొక్కఁడుమాత్రమే దేవీమందిరమునకుఁబోయెను. అచ్చట జనసమ్మర్ద మేమియును లేదు. ఒక రిద్దఱు ద్వారపాలకులు మాత్రమే యుండిరి. ఉద్యానమునందొక తోఁటవాఁ డుండెను. ప్రసాదుఁ డా తోఁటవాని కుటీరమునొద్ద గుల్మమునుంచి పూవులను గోయుచుండెను. పూలసజ్జ నిండినతోడనే ప్రసాదుఁడు దేవ్యాలయమునం బ్రవేశించి కన్నీటితోఁ బ్రీతిపుష్పమును దడుపుచు దేవీ పాదములను బూజించుచుండెను. తల్లి పాదకమలములను సుగంధ కుసుమములతో నలంకరించుటచే నాతని కించుక మనశ్శాంతి కలిగెను. అప్పు డాతఁడు శోకగద్గదస్వరముతో,

"సర్వలోకేశ్వరివి నీవు ♦ సర్వజనని !
సర్వసంరక్షిణివి నీవు ♦ శాంతమూర్తి !
అనయ మాపన్నులై చేరు ♦ నాశ్రితులకు
నెలమిఁ జేకూర్చునాశ్రయం ♦ బీవుతల్లి !—"

అప్పు డెవ్వరో మేలిముసుఁగు వైచుకొని ద్వారపార్శ్వమున నిలుచుండి యేడ్చుచుండిరి. బాహ్యజ్ఞాన శూన్యుఁడైయున్న ప్రసాదున కా దుఃఖస్వరము చెవులఁబడుట లేదు. అట్లేడ్చుచు నిలిచియున్న యామె రాజకుమారియే—ఆమె ప్రియుఁడు నిరపాయుఁడై సుఖముగ నింటికిఁ దిరిగివచ్చెను—అప్రియుఁ డామెను మనఃపూర్వకముగఁ బ్రేమించి యున్నాఁడు—అందుచే నామె భక్త్యానందరస పరిప్లుత హృదయయయి తన కట్టియదృష్టముం జేకూర్చిన జయదేవిని బూజింపవలయునని వచ్చి యుండెను. ఆమె దేవీ మందిరద్వారమునకు వచ్చునప్పటికే ప్రసాదుఁడు దేవీపూజ చేయుచుండెను. అందుచే నీలాశ్వేతల నాలయ ద్వారమునందుంచి యామె గర్భ

లయద్వారమునొద్ద నిలిచియుండెను. ప్రసాదుఁడు పూజాకార్యమును నిర్వర్తించుకొని లేచి యీవలకు వచ్చుచు ద్వారపార్శ్వమునం దున్న యుమాబాలంగాంచి చిత్రప్రతిమవలెఁ నిలువఁ బడిపోయెను.

కొంతసేపటివఱ కిరువురును నీరవులైయుండిరి ఇంచుక సేపటికిఁ బ్రసాదుఁడు "రాజకుమారీ!" అని వలుకరించెను

ఏమి యీ ప్రణయమధురభాషణము ! ఎంతకాలమునకుఁ దరువాత—నెన్నికష్టములు గడచినతరువాత మరల నేటి యీ ప్రియ దర్శనము! ఆ చతుర్దశిరాత్రికిని మఱి యీపంచమీప్రభాతమునకును నడుమ నెన్ని యుగయుగాంతరములు గడచినవి ! ఈ సహస్రవర్ష వియోగానంతరమున సాక్షాత్కారము ! అప్పు డేమని పలుకరింప వలయును ? ఏమి చేయవలయును ? హృదయ ప్రపూర్ణంబగు ప్రేమ తేజమును బ్రకటించుట కుపాయమేమున్నది ? రాజకుమారి కన్నుల నీరు నిండిపోయెను. ఆమె శోకగద్గదస్వరముతోఁ "రాజపుత్రా ! ఇంకను గూఢముగఁ జరింపవలసిన యావశ్యకము లేదు ఇప్పుడు నీవు నీసర్వవృత్తాంతమును స్పష్టముగఁ దెలుపుట యుచితము— నేను నిన్ను నాప్రాణములను, నా హృదయసర్వస్వము నర్పించి ప్రేమించుచున్నాను. ఈ ప్రేమప్రవాహము నడ్డగించుటకుఁగాని, యనుసరించుటకుఁగాని, నేనశక్తురాలనై యున్నాను. నేను రాజ నందినినై యుజయినీనగరమునం దుండఁజాలను. అందుకొఱకే నిన్నుఁ జూడవచ్చితిని. మంచి సమయము దొరకినది. ఏమిచేసినను నీచిత్తము—నాభాగ్యము !" అని యుమాబాల వెక్కి వెక్కి యేడువఁ దొడంగెను.

ప్రసా—రాజకుమారీ! నీవు నన్ను దయతోఁ బ్రేమించు చుంటివని ప్రమదవలన వినియుంటిని. నీదయను నేనెన్నటికిని మఱవఁ జాలను. కాని, నీవు నాకు దుర్లభురాలవు. నీవు మహాప్రతాపశాలియు చోహానవంశధురంధరుఁడు నగునజయినీప్రభుని యేకపుత్రికవు. నేనో ?—అజ్ఞాతకులశీలుఁడును, సామాన్యుఁడు నగునొకసేవకజన మాత్రుఁడను.

రాజకుమారి యట్లే యేడ్చుచు మృదుగద్గదస్వరముతో "నీపరిచయము—" అనునంతలోఁ గంఠస్వరము రుద్ధమైపోయెను. వాక్యము ముగింపఁజాలకపోయెను! కాని ప్రసాదుఁడామెమనోభావమును గ్రహించి "నాపరిచయమా? నేనజమీరుప్రభుని దాసుఁడను. నా పూర్వవృత్తాంత మేమియో యెన్నటికి నెవ్వరికిని దెలుపువాఁడఁ గాను. అట్లు తెలిపినచో నాకులగౌరవమునకును, నాతండ్రితాతలకును, నాజ్ఞాతులకును జగజ్జనసమక్షమునఁ దీరనికళంకమునుగల్పించిన వాఁడ నగుదును. లోకులచే నీసడింపఁబడుచుఁ గులహీనునివలె నూఱు సంవత్సరములైనఁ గడపుటకు సహింపఁగలనుగాని, నా పెద్దలకును, నావంశమునకును గళంకమును గల్పించి మెలఁగుట క్షణకాలమైనను సహింపఁజాలను—ఇది నాకోరికఁ గాదు—నీకోరికయుఁ గాదు—సర్వజగత్ప్రభుత్వగౌరవముకొఱకుఁ గాదు—స్వర్గవైభవము కొఱకుఁ గాదు—కేవలము నుత్తమవంశగౌరవసంరక్షణముకొఱకు—" అనియెను.

ఉమాబాల కన్నులను మూసికొని ముంగురుల నించుక సవరించుకొనుచు నాఁడుసింగమువలె గ్రీవాభంగముం గావించి "ఈ యజమీరునగరమున నీసంగతి యెంతవఱకుఁ దెలిసినదో యింతవఱకే చాలును. నీకులశీలములతో నాకు నిమిత్తము లేదు. నీ వీనగరమునందలి నికృష్టజాతిప్రజలకంటెను హీనవంశమున జన్మించినను—జన్మించి యుందువుగాక నీకులము——నీ గౌరవము——నీ శీలము——నికృష్టములే యగుఁగాక—అయినను నే నీజగన్మాత యగుజయదేవీ సాన్నిధ్యమున సత్యముగఁ జెప్పుచున్నాను—నీ వెట్టివాఁడవయినను, నాకన్నులకు నీయెదుట మీ వారుమహారాణాకూడఁ గులహీనుఁడుగా నగపడుచున్నాఁడు" అనియెను.

ప్రసాదుఁడు మఱిమాటాడ లేదు—కొయ్యవలె నిలువఁబడి పోయెను అంతటి దేవీదుర్లభమూర్తి—అంతటిమనోమోహనసుందరీ మూర్తిని—అతఁడిదివఱకెన్నఁడునుఁ జూచియుండలేదు. ఆ సుందర వదనమునందలి యశ్రుసంసిక్తములగు విశాలనయనములు, హిమవారిసిక్తంబులగు నీలోత్పలములం బోలియుండెను—ఆపాదలంబి

తంబులగు కుటిలకుంతలము లనావృతగండస్థలంబులను, భుజంబులను, బాహువులను నావరించుకొనియుండెను. ఆ స్ఫీతనాసికాచంపకము-ఆ కంపితాధరప్రవాళము-అజ్యోతిర్మయీమూర్తి-సౌందర్య రాశియై విరాజిల్లుచుండెను. తన్నును బ్రపంచమును మఱచి ప్రసాదుఁ డనిమిష నయనుఁడై యామెవంకనే చూచుచుండెను. ఉమాబాలప్రణయ ప్రథమసంభాషణ మాతనిహృదయము నానందరసపరిప్లుతముగఁ జేసివైచెను.

అప్పుడు నీల పరుగెత్తుకొని యచ్చటకు వచ్చి "రాజకుమారీ! రాజులందఱును వచ్చుచున్నారు. జనులు గుంపులుగుంపులై వచ్చుచున్నారు. నీవిఁక నిచ్చట నుండఁగూడదు తల్లికి బ్రణామము చేసి యింటికిఁ బోవలయును" అనియెను.

ప్రసాదుఁడు మందిరము వెలువడి వచ్చి యశ్వము నధిరోహించెను. వచ్చుచున్న జనసంఘముం గాంచి యాతఁడు దీర్ఘశ్వాసమును విడిచి గృహాభిముఖుఁడై వెడలిపోయెను.

---

ఏడవ ప్రకరణము

## ప్రయాణము-సమ్మేళనము

నాఁటిపీనోత్సవమునఁ బ్రసాదుఁడే శ్రేష్ఠవీరుఁడని మహారాజు నగరమున వార్తాప్రచారముం గావించెను. ఉత్సవము పూర్తియగు నప్పటి కపరాహ్ణ మయ్యెను. ప్రసాదుఁడు దేవలునిశిబిరమునం దించుక సేపు విశ్రమించి "దేవలా! నేను నీకొక వస్తువుం జూపెద నని చెప్పితిని. జ్ఞప్తియున్నదా?" అనియెను.

దేవ—లే కేమి సోదరా!

ప్రసా—అట్లయినఁ బోవుదమురమ్ము.

దేవ—ఇంకను నీవు గుఱ్ఱమును దిగవా?

ప్రసా—ఇప్పుడింకను యుద్ధము చేయవలసియున్నది.

సాయంకాలమునకు ముందుగనే యిరువురు నశ్వారూఢులై బయలుదేరిరి. జనార్దనుఁడుకూడ వారితోఁ బోయెను. కాని త్రోవలో నేదియో యాతనికి జ్ఞప్తికివచ్చుటచే జనార్దనుఁడు వారికి జెప్పకుండఁగనే యెక్కడకో వెడలిపోయెను. అన్నదమ్ములిరువురును జనుల నడుమనుండి రాజమార్గమున గుఱ్ఱములను మెల్లగఁ నడిపించుకొనుచుఁ బోవుచుండిరి. త్రోవలో దేవలుఁడు యుద్ధము, పరాక్రమము, కీర్తి, యుద్ధనైపుణ్యము మొదలగు విషయములంగూర్చి సంభాషించుచుండెను. ప్రసాదుఁడు మౌనముతో నాలకించుచుండెను.

ఆసమయమున దారినిబోవుచున్న జనసంఘములో నొకఁడితరులం జూచి "ఏమైననేమి? వీఁడే—ఒక్కఁడై యైదుగురను గొట్టఁగలడా? అనియెను.

ద్వితీయుఁడు—ఆ. అంతకంటె నెక్కువమందినే జయింపఁ లేదా—ఆమహారాజకుమారుఁడు?

త్రోవను బోవుచున్న యింకొకఁ డామాట నాలకించి "మీరు యుద్ధమును జూడలేదా? చూడకుండఁగనే యిట్లు వాదించుకొనుచుంటిరా?" అనియెను.

ప్రథ—నీవందఱికంటెను వీరుఁడైన బాలకుని జూచితివా?

తృతీ—అతని పేరు నీకుఁ దెలియునా?

ప్రథ—తెలియదు.

అప్పుడు యుద్ధోత్సవమును జూచివచ్చినమఱియొకఁడు 'అమానుషపరాక్రమముం జూపినరాజకుమారులు చాలమందియున్నారు. కాని యట్టివారి నేఁబదిమంది నోడించిన మహావీరుఁ డొక్కఁడే యుత్సవమున కంతకును బ్రధానుఁడై పేరు తెచ్చుకొన్నాఁడు" అనియెను.

ఆ సమయమున దేవలప్రసాదులు వారి నతిక్రమించి పోయి గోధూళికా సమయమునకు సేనాపతిభవన సామీప్యమును జేరి గుఱ్ఱములను దిగి ద్వారమునొద్దకుఁ బోయిరి, ప్రసాదుఁ డచ్చటకు

వచ్చుటకు ముందుగనే యాతని విజయవార్త యచ్చటివారికిఁ దెలియ వచ్చెను. ఆతనిం జూచినతోడనే ద్వారపాలకు లానందముతో జయ ధ్వనులం గావించిరి. అచ్చటనుండి కదలి సోదరు లిరువురును లోపలఁ బ్రవేశించిరి. ఆ సమయమునం దాకస్మికముగ వా రిరువురకు నొక మనోహర చిత్రమగపడియెను. ఉన్మత్తగవాక్ష సమీపమున లలిత యొక గోరవంకను జేతిపై నెక్కించుకొని యూర్ధ్వవదన యయి నిలువఁబడి యుండెను. అస్తంగతారుణకాంతు లామె కోమలవదనకమలముపైఁ బ్రసరించుచుండెను. చంపకకుసుమముపై నరుణకమలమువలె—నీలాకాశోత్సంగమునందలి నవజలధరమాలికం బోలి—చంద్రికిరణవిలసిత కోమల వక్త్రాంతరాళ నవవికసిత కుసుమముం బోలె నాలోకరమణీయమై యుండెను. ఆ సుందరవదనముపై వినీలకుటిలకుంతలములు తమాలవల్లికలంబోలి విలసిల్లుచుండెను. ఆ కుంతల మధ్యమున విశాల తరళనయనములు చంచలాపాంగముల నూర్ధ్వముఖంబుగఁ బ్రసరింపఁజేయుచుండెను. ఆ తాంబూల రాగాధరపల్లవమున మృదుమధురహాసకాంతులు మెఱసిపోవు చుండెను. ఇరువురు నాలోకించుచుండిరి; ఆలకించుచుండిరి. లలిత యాకసము వంకఁ జూచుచు మాటాడుచుండెను. ఆమె కన్నులు మొగమును దిప్పుచు సమీపవృక్షాంతరాళమునందున్న గోరవంకతో మాటాడు చున్నది!

లలి—నీవు రావెందుచేత ?

గోర—క్యా, క్యా.

లలి—అట్లయినచో నీకు నేనేమియుఁ బెట్టను.

గోర—క్యా, క్యా.

లలి—నీవు మాట వినుపించుకొనుట లేదు. నీ కేమియును బెట్టను జుమా!

చెట్టుపైనున్న పక్షి యేమియు వినిపించుకొనక యూరక రొద చేయ నారంభించెను. చేతిలోనున్న గోరవంకయు దానితోఁగలసి

విలపింప నారంభించెను. లలిత తనచేతనున్న గొరవంకను బైకి విసరివైచుచు "అట్లయినచో నీవును బొమ్ము!" అనియెను.

ప్రసాదుఁడిఁక నూరకుండఁజాలక యుచ్చస్వరముతో నవ్వుచు "లలితా! నీ వెవ్వరితో జగడమాడుచుంటివి!" అనియెను.

లలిత తిరిగి చూచి "అన్నా! అన్నా!" అని పిలుచుచుఁ బరుగెత్తుకొని ప్రసాదునియొద్దకుఁ వచ్చి చూచెను. అన్న ప్రక్కనితరుఁ డెవ్వఁడో నిలిచియుండెను. అందుచే లలిత యించుకతొలఁగి నిలువఁబడియెను. అప్పుడు కిటికీనుండి దీపకాంతులు దేవలుని మొగముపైఁ బ్రసరించుచుండెను. ఆతనిం జూచి లలిత విస్మయావేగకంపితస్వరముతో "ఏమిది! ఆతఁడే యితఁడు!" అనియెను.

ప్రసాదుఁడు విస్మితుఁడై "ఇదియేమి లలితా!" అనియెను.

లలి—స్వర్గమునందలి దేవతామూర్తి చంద్రమండలమునుండి దిగి వచ్చియున్నాఁడు!

లలిత స్వప్నవృత్తాంతము ప్రసాదుఁడు మఱచిపోయెను. ఇప్పుడాతని కాకస్మికముగ జ్ఞప్తికి వచ్చుటచే నవ్వుచు "అట్లయినచో నీ స్వప్న మిప్పటికి సంపూర్తియయినది లలితా!" అని పలుకుచు నాతఁడు లలిత వామహస్తముం బట్టుకొని దేవలుని దక్షిణహస్తమునందుంచి "లలితా! నా సర్వస్వమును నీకు ధారవోసితిని—నా స్థానమును—మాతృస్థానమును—నీవు స్వీకరింపుము" అనియెను.

ప్రసాదునికన్నుల నీరు నిండిపోయెను. దేవలుఁడు చూచి తానును దుఃఖించెను. ఎందుచేతనో తెలియదుగాని లలితకన్నులను నీరు నిండిపోయెను. సమయవిశేషమునుబట్టి దుఃఖమును హాసమువలెనే సాంక్రామికావస్థనందుచుండెను. బద్ధహస్తులైయున్న యా మువ్వురి హస్తములయందును గన్నీరు సమ్మిళిత మయ్యెను—ప్రయాగయందలి త్రివేణీ సంగమముంబోలి—గురుచరణములయందు భక్తిదాస్య సమ్మిళితమయ్యెను.

ఆ సమయమున సేనాపతి యా గదిలోనికి వచ్చెను. ఆతఁడు మాటాడుచు మాటాడుచు ద్వారమునుండి వచ్చుచుండెను.

"ప్రసాదా! నీవు వచ్చితి వనిమాత్రమే వినియుంటిని—నేఁటి యుద్ధమున—"

ఇఁక మాట జరుగలేదు. సేనాపతి యాశ్చర్యముతోఁ జూచెను. ప్రసాదున కిరువంకలను లలితా దేవలులు నిలిచియుండిరి! లలితా దేవలుల సమ్మిళితకరకమలములు ప్రసాదుని కరకమలములపై నుండెను. సేనాపతి యాశ్చర్యముతో "ప్రసాదా! ఏమిది?" అని ప్రశ్నించెను.

ప్రసాదుఁడు యథాప్రకారముగనే నిలువఁబడి "నామనోరథ మిన్నాళ్ళకు ఫలియించినది. నీ యనుమతికి నిరీక్షింపకుండఁగనే సోదర భావముతో నీ లలిత హస్తమును మహారాజగు ననంత రాముని తనయుఁడు దేవలుని హస్తమునఁదుంచి "కన్యాప్రదానముంగావించితిని" అనియెను.

తండ్రి యేమనునో యని లలిత తల్లడిల్లిపోవుచు దేవలునిం గాంచి "అట్లయినచో నీవు దేవతామూర్తివి కావా? ఆకాశము నుండి దిగి రాలేదా?" అనియెను.

సేనాపతి నవ్వుచు "నీకేమి మతిపోయినదా?" అని యనంత రము గంభీరస్వరముతో "ప్రసాదా! నీవేమి చేసినను మంచిదే. నీ కార్యమునకు నా యభ్యంతర మేమియును లేదు. ఈనందనపారి జాత కుసుమమును వీరోత్సవానంతరమున యువరాజు దేవలుని హస్తముల కర్పింపవలయునని నేనిదివఱకే యనుకొంటిని. అని తనఁకుం దోడుకొని మందిరమునం బ్రవేశించెను.

దేవలున కేమియును బోధపడలేదు. ఆతనికింపుక తెలివియు, నింపుక మఱపుగ నుండెను. ఆతనికి సోదరునియందుఁ బరిపూర్ణ విశ్వాసమున్నది. ఆతఁ డేమిచేసిన నదియే యాతనికిఁ బ్రియము! కాని, యన్నగా రింతకుఁబూర్వ మింతటి ప్రీతికరంబగు కార్యమును గావించి యుండలేదు. ఆ కల్పనాతీత మాధుర్యము—ఆ యసమాన మోహన సౌందర్యము—ఎచ్చటనుండి తెచ్చి సోదరుఁడు తనకు సమకూర్చినాఁడు? ఈసంగతి యాతఁ డిదివఱకుఁ గలలోనైనను

భావించియుండలేదు. ప్రేమయన నెట్టిది ? అతఁ డిదివఱకు సోదరు నొక్కనినే ప్రేమించి యుండెను. కాని, హృదయమునుమార్చివైవఁ జాలిన యిట్టి మాధుర్యము నాతఁడు గ్రహించియుండలేదు. ఇది యెంతటి మనోమోహనకరముగా నున్నది ! ! ×

---

ఎనిమిదవ ప్రకరణము.

# వివాహసంభ్రమము

మఱునాఁడు లక్ష్యభేదనక్రీడ ... విశాలరంగమునం దెచ్చటను ప్రసాదుఁ డగపడుటలేదు. మహారాజు మొదలుగ నెల్లరును బ్రసాదుని కొఱకు వెదకించుచుండిరి. కాని యెవ్వరికి నాతఁడగపడుటలేదు. మూఁడవనాఁడు పారితోషికప్రదానము. నాఁడుగూడఁ బ్రసాదుఁ డగ పడలేదు. కాని పరీక్షయందుఁ బ్రసాదుఁడే శ్రేష్ఠవీరుఁడని నిశ్చయింపఁబడియెను. పుష్పమాలికలును, జందనమును నాతనికిఁ బొందఁదగినవై యుండెను. వీరమండల మధ్యమున మహారాజుచేఁ బుష్పహారమును బడయవలయునని యనేకవీరులు కోరుకొని యుండిరి. కాని యట్టి గౌరవమును బడయుటకుఁ బ్రసాదుఁ డొక్కఁడుమాత్రమే తగియుండెను. అయినను బ్రసాదుఁ డా గౌరవము నెదురుకొనుటకు రాలేదేమి ?... అందఱకు నది మహాశ్చర్యకరముగానుండెను. మహారాజు విచారముతో "ఈపుష్పహారమును—ఈ చందనమును—నే నితరుల కెవ్వరికి నీయజాలను—ఇవి ప్రసాదునికొఱకు సమకూర్పఁబడినవి ?" అనియెను.

ఉత్సవ ద్వితీయ దినమునం దనంతరాముఁ డజమీరు నగరమునం దడుగుపెట్టెను. వీర శిబిరములకు రెండుమైళ్ళ దూరమునం దొక పర్వతోపత్యకాస్థానమునం దాతఁడు సపరివారముగ నివసించి యుండెను. అతనితోఁగూడ నేఁబదినలుగు రంగరక్షక సైనికులు మాత్రముండిరి. ఉత్సవ ద్వితీయ తృతీయ దివసములయందుం

గ్రీడారంగమునఁ బ్రవేశించి యనంతరాముఁ డెల్లయెడలఁ బ్రసాదుని కొఱకుఁ దన దృష్టులను బరగించి చూచెను. కాని యాతఁ డగపడ లేదు. ప్రసాదుఁడుపలాయితుఁడై పోయెనని దూతముఖంబున విన్నది మొదలుగ మహారాజు దెబ్బపడిన పాముంబోలి రోజుచుండెను. ఆతని హృదయమున హాలాహలము ప్రజ్వరిల్లుచున్నట్లుండెను. మాటి మాటికిఁ గ్రీడారంగమును బరిశీలించి చూచుచుండెను.

అనంతరామున కెచ్చట నాలకించినను బ్రసాదుని యశఃకీర్తనములే—శత్రులు, మిత్రులు, పరిచితులు, అపరిచితులు–అందఱు నాతనిఁ గీర్తించువారే. ఏఁబది వేలమంది ప్రజలొక్కసారిగఁ బ్రసాదునిఁ గీర్తించుచుండుటచే ననంతరాముఁ డున్మత్తప్రాయుఁడై పోయెను. ఆతనికి దిగ్భ్రాంతి కలుగుటచే ననంతరాముఁ డనుచరులంగాంచి "ప్రసాదుని భిన్నమస్తకము నెవ్వరు తెచ్చి నాకర్పింతురో వారికిఁ బదివేల వరాలను బారితోషికముగ నిచ్చెదను" అని యాశ పెట్టెను.

మూఁడవనాఁడు పారితోషిక ప్రదానములైనతరువాత ననంతరాముని యాహ్వానముచే సిరోహీ రాజు వచ్చి యనంతరామునిగలిసి కొనియెను. ఆ సమ్మేళనమువలన ననంతరామునకు లాభము లేక పోయెను. సిరోహీ రాజున కజమీరుప్రభునితో సంధి భంగముచేసి కొనుటకిష్టము లేకపోయెను. ఆతఁడనంతరామునిం జూచి "ఏ గృహమునకు మన మతిథులమై వచ్చియుంటిమో యా గృహమును దగ్ధభూతముగఁ జేయఁదలంచుట యుచితముకాదు" అనియెను.

అనం—సిరోహీ రాజున కీ ధర్మచింత యెప్పుడు కలిగినది ?

సిరోహీ రాజించుక క్రోధకంపితస్వరముతో "వీరేంద్రకేసరి తనయుఁ డెప్పుడు మరణించెనో యప్పటినుండి—" అనియెను.

అనంతరాముఁడు నాసికాభ్రూలతల నించుక కుంచించి "కాదు– ఈ మాట యసత్యము !" అనియెను.

సిరోహీ రాజు కృపాణము నొరనుండి తీసి పట్టుకొని చటాలున లేచి "ఏమంటివి! నేనసత్యమాడితినా మహారాజా! అనంతరామా!" అనియెను.

అనంతరాముఁడు "వీరేంద్రకేసరి తనయుఁడు మరణింపఁలేదు. బ్రదికియే యున్నాఁడు" అనియెను.

సిరో—ఈ మాటలకు నీవు దృష్టాంతరమును జూపింప వలయును.

అనం—అంధునకు దృష్టులం బ్రసాదించుట యసాధ్యము కాదా? ఏ భుజంగ శిశుదంశనమున నీ శరీరమింతను రుధిరప్లావితమగుచున్నదో యా మహాబాధ ననుభవించిన నీ వింకను నా భుజంగశాబక పితృకుల క్షయముం గావించుటకు నిరాకరించుట కేవలమును విస్మయావహముగా నున్నది!

సిరో—మహాబలుఁడగు నా ప్రసాదుఁడేనా వీరేంద్రకేసరి తనయుఁడు?

అనం—ఔను—ఈ కాలభుజంగము జీవించియున్నంతవఱకు సిరోహీనిషధరాజ్యములకు నెమ్మదియనుమాట యుండదు. నీ వించుక సాహాయ్యముం గావించినచో నాతని నాశనముం గావించుటయే కాక, యా యజమిూనును సంబరహ్రదమున ముంచివైచెదను.

సిరో—దురదృష్టవశమున నాకు నీ మాటలు రుచించుట లేదు. నీ మూలమున ధర్మజ్ఞాని నగుభాగ్యము నాకు లేదు కాఁబోలును! అంతపని జరగినచో నప్పుడు నీకుఁ బ్రత్యుత్తర మిచ్చెదను.

అని చెప్పి యాతఁడు లేచెను. అప్పు డనంతరాముఁడు "ఓహో! నీసహనశీలము కొనియాడఁదగినది విదితుఁడగుశత్రుని గూడ నీవు క్షమింపఁగోరుకొనునట్లు తోఁచుచున్నది. శత్రుపాదముల నాలుకతో నద్దుకొనుటయే ధీరత్వమునకు గురుత్వము కాఁబోలును! ఓహో! నీవు రాజపుత్రస్థానమున నూతన ధర్మస్థాపకునివలె నగపడుచున్నావు" అనియెను.

సిరో—ఎట్లయినను దస్యుతస్కరవిశ్వాసఘాతకులగు కుల ద్రోహులకంటె నే నించుక శ్రేష్ఠతరుఁడనే!

అని చెప్పి యాతఁడు వెడలిపోయెను.

ప్రసాదునికొఱకు కందఱును వెదకుకొనుచుండఁగా నాతఁడు తన విడిదియుందేయుండి లలిత బొమ్మలపెండ్లి యాటలను గాంచుచుండెను. అప్పుడు లలిత ప్రసాదునింగాంచి "అన్నా! ఆతఁడు నీ కేమగును? అనియెను.

ప్రసా—ఎవరు నా కేమగుదురు లలితా?

లలి—నీవు నిన్నటిదినమున నీ వెంటఁ దీసికొనివచ్చినయాతఁడు

ప్రసా—దేవలుఁడా? ఆతఁడు నీ కలలోని దేవత—

లలి—అవును. ఆతఁడు నీ కేమగును?

ప్రసా—తమ్ముఁడగును.

లలి—అందుచేత నే యింత ప్రేమ—

అని యంతలోనే శోకగద్గదస్వరముతో "అట్లయినచో నిఁక నీవు నా యన్నవుకావా?" అనియెను.

ప్రసా—ఎందుచేత లలితా?

లలి—నీవు రాజపుత్రుఁడవగుటచేత—

ప్రసా—అయినంత మాత్రమున దోషమేమి లలితా? నేను నీకును సోదరుఁడనే; దేవలునకును సోదరుఁడనే—

లలి—అన్నా! ఆమాట యనవలదు. నీ పాదములకు మ్రొక్కెదను.

ప్రసా—ఏమాట లలితా?

లలి—నేను రాజపుత్రుఁడను గానని చెప్పవా?

ప్రసా—రాజపుత్రుఁడు నీకేమి యుపకారము చేసినాఁడు?

లలి—రాజపుత్రులు మానవ హింసకులు—జంతు హింసకులు—సోదరీ సోదరులను వదలిపోయెదరు—వారి హృదయ మతినిష్ఠురమైనది.

ప్రసాదుఁడు పకపక నవ్వుచుండెను. కాని లలితమాత్ర మప్రతిభురాలు కాలేదు. కొంతసేపైన తరువాత "అన్నా! స్వప్నమెప్పటికైన సత్యమగునా? కాని, స్వప్నమువంటి సత్యమే మంచిది. కౌనా కాదా?" అనియెను.

ప్రసా—మా దేవలుఁడు చంద్రునివంటి సుందరుఁడు—దేవతా మూర్తికంటె దేవలుఁడు మంచివాఁడు—కాదా లలితా ?

లలిత యేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. కొంతసే పేమియో యాలోచించి "మంచిదన్నా! ఎవ్వరికిఁ బెండ్లియగునో వారు తన తల్లిని, దండ్రిని, తమ్ములను, అన్నలను, బొమ్మలను, వెంటఁబెట్టుకొని యత్తవారింటికిఁ బోవలయునఁట గాదా ?" అనియెను.

ప్రసాదుఁడు నవ్వుచు గంభీరభావముతో "అక్కఱలేదు. ఒక బొమ్మయయినను దీసికొనిపోనక్కఱలేదు." అనియెను.

లలి—అట్లయినచో పెండ్లి చేసికొనుట యెందులకు?

ప్రసా—తల్లిదండ్రులను, సోదరీసోదరులను, సర్వమును విడిచి యుండఁగలిగినవారే పెండ్లి చేసికొందురు.

లలి—అట్లయినచో వివాహము చాలఁ గష్టకార్యమె—

ప్రసా—కష్టమైనచో మాని వేయఁగూడదా ?

లలి—సగము మనసు తండ్రియింటను, సగము మన సత్తవారి యింటను, నుంచినచోఁ జాలదా ?

ప్రసా—చాలదు—మన సంతయు నత్తవారి యింటిమీఁదనే యుండవలయును. తండ్రిపై నెంతమాత్రము నుండఁగూడదు.

లలి—అది యెట్లు సాధ్యమగును ?

ప్రసా—ఎందులకు సాధ్యముకాదు ?

లలి—చిన్నతనమునుండియుఁ బెంచిన తల్లిదండ్రుల ప్రేమను నిమిషములో మఱచిపోయితినేని నేను బ్రేమించితినను మాట యేమున్నది? అట్టి తల్లిదండ్రుల ప్రేమమునే త్యజించిననాకుఁ బ్రేమయందు విశ్వాస మెట్లుండును ?

ప్రసాదుఁ డాశ్చర్యముతో లలితవంకఁ జూచుచుండెను. ఆ సమయమున దేవలుఁడు గదిలోనికి వచ్చెను. దేవలుని ముఖము విషాదాచ్ఛన్నమై యుండెను గాని లలితా ప్రసాదులను గాంచిన

తోడనే యింటుక వికసితమయ్యెను. అప్పుడు దేవలుఁడు "అన్నా నిన్ను జనార్దనుఁడు పిలుచుచున్నాఁడు!" అనియెను.

ప్రసాదుఁడు బయటికివచ్చెను. లలితాదేవలు లాగృహము నందే యుండిరి. ప్రసాదునిజూచి జనార్దనుఁడు నవ్వుచు "నీవిప్పుడే దుర్గమునకుఁబోయి సేనలను సిద్ధముచేసికొని యుండవలయును— ఇట్లు నీకు రాజాజ్ఞయయినది." అనియెను.

ప్రసా— ఏమి జనార్దనా! శత్రుభయమేమైనఁ గలిగినదా యేమి?

జనా— కలిగియుండవచ్చును— నాకా సంగతి బాగుగఁ దెలియదు.

ప్రసా— జనార్దనా! నీవెచ్చట నుందువు?

జనా— నేను రెండుచోటుల నుండవలయునుగాదా?

నిజముగ జనార్దనునకు రెండు తావులు లేవు. అనంతరాముఁడజమీాసనం దడుగుపెట్టినప్పటినుండి జనార్దనునకు నిద్రాహారములు లేవు. అతఁడు కొంచెము రొట్టెతిని, నీరుత్రాగి నిరంతరమును బ్రసాదుని గాఁచుకొనుచుండెను. అతని గృహము, గృహద్వారములు, గవాక్షములు వేయికన్నులతోఁ జూచుచుండెను. అతని సేవకులను నమ్ముటలేదు. అతని పర్యంకవసనములు, అతని పుష్పమాలికలు, అతని ఫలాహారములు జాగ్రతగఁ బరిశీలించుకొనుచుండెను. సామాన్యముగ నట్టివస్తువులు విషలిప్తములగుట కవకాశముండునని యాతని యనుమానము. ఇప్పుడు ప్రసాదునకు దుర్గమునకుఁ బోవలయునని యాజ్ఞయయినది. దుర్గమున శత్రుభయముండుట కవకాశములేదు; కాని జాగ్రతగ నుండవలయును. రాజాజ్ఞయేలయయ్యెనో జనార్దనునకుఁ దెలియునుగాని ప్రసాదున కాతఁడు తెలుపలేదు.

అనంతరాముఁడు సేనలఁగూర్చుకొనుచున్నసంగతి జనార్దనుఁడిదివఱకే చూచియుండెను. కాని యాసంగతి యజమీారు ప్రభునకుఁ దెలుపుట మఱచిపోయెను. ఆకస్మికముగఁ దలఁపునకువచ్చుటచే

నాతఁడు జయంతకుమారునితో ననంతరాముఁడు మొదటినుండియుఁ జేయుచున్న ప్రయత్నములంగూర్చి సర్వమును దెలియఁజేసెను. జయంతుఁడా సంగతి రాజునకుమనవిచేసెను. రాజు మంత్రికిదెలిపెను. మంత్రి దూతలనుబంపి తెలుసుకొనఁగా ననంతరాము డసంఖ్యా సైన్యముం గూర్చుకొనివచ్చి సైనికుల నందందు దాఁచియుంచినట్లు తెలియవచ్చెను అందుచే రహస్యముగ నజమీరునందును యుద్ధ ప్రయత్నములు చేయవలసివచ్చెను.

---

తొమ్మిదవ ప్రకరణము

## ఉత్సవాంతము

ఉత్సవము పూర్తియయినది. దూరదేశాగతులగు వీరు లెందఱో విజయధ్వజమును స్థాపింపవలయునను నాశలతో వచ్చియుండిరి. వారి యాశలన్నియును జలబుద్బుదములంబోలి విరిసి యనంతజలంబుల నిమగ్నములై పోయెను. ఇప్పుడట్టి వారందఱును హతాశులై తమ తమ నగరములకుఁబోయిరి. ఉత్సవమైన యయిదవనాఁటికే గోట్ల కొలఁది ప్రజలచే శబ్దాయమానంబైన క్రీడారంగము కేవల జనశూన్యమైపోయి నట్లయ్యెను. అజమీరున విడసిన రాజమండలము కూడ వెడలిపోయెను. కాని, యందఱునుబోయి యుండలేదు. ఉన్నవారి సంఖ్యకూడ నంత తక్కువగాలేదు అయిదాఱువేలమంది యుండిరి. వారందఱును నిషధదేశమునుండి వచ్చిన యనంతరాముని పరివారమైనట్లు పురరక్షకులవలనఁ దెలియవచ్చెను.

అనంతరాముఁడు శిబిరమునుండి గదలలేదు; అజమీరునందున్న తన పరివారము నట్లెయుంచెను; ఇంతేకాక యజమారు చుట్టును గూఢస్థానములయందు వేలకొలఁది సైనికులను నిలిపి యుంచెను. అనంతరాముఁ డెంత రహస్యముగ నిట్లుచేసినను నజమీరు ప్రభునికన్నులలో దుమ్ముగొట్టఁజాలకపోయెను. గూఢచారులవలన

నెల్లనుంగతులును దెలిసిపోయెను. ఈయుత్సవ సందర్భమున నజమీరుప్రభువు శాంతిరక్షణముకొఱ కనేక శస్త్రధరులగు యోధులను నగరమందంతటను, నగరమునకుఁ జుట్టును రెండుమైళ్లు దూరమువఱకును నిలిపియుంచెను. వారి యనుమతిలేకుండ నగరమునం దితరు లెవ్వరును బ్రవేశింపఁగూడదు నగరరక్షణమున కింతమంది యిట్లు పనిచేయుచున్నట్లు నగర ప్రజలకుగూడఁ దెలియదు అంత నెమ్మదిగ శాంతిస్థాపనము గావింపఁబడియెను ప్రసాదుఁ డీతరవిషయముల యందంతగాఁ బనిచేయక నగరరక్షణమునందే తగిన కట్టుదిట్టములం గావించెను.

దశమినాఁటి సంధ్యాకాలమునకు నగరమున కుత్తరప్రాంతమునందలి కొండపైనున్న దుర్గమునందలి ప్రస్తరస్తూపమునొద్ద వేల కొలఁది సైనికులు సన్నద్ధులై యుండిరి నాలుగువేలమంది ధనుర్బాణములఁ దాల్చి నిలిచియుండిరి. శత్రువు లెవ్వరో యెచ్చటనుండిరో వారి కెవ్వరికిని దెలియదు. కిల్లాదారునకును దెలియదు దశమిచంద్రుఁడు పశ్చిమాకాశమున కించుక ప్రాలుచుండెను. అప్పుడు జయంతకుమారుఁడు రాజపరివారముతోఁ దుర్గమునఁ బ్రవేశించెను. కాని, మహారాజమాత్యుఁడు రాలేదు ఆతఁడు సేనాపతి సహితుఁడై నగర రక్షణమునకు నిలిచి యుండెను.

రాత్రి యిరువది గడియలైనది చంద్రుఁ డారావళీ పర్వతపంక్తులలో మఱుఁగుపడియుండెను. అప్పుడు దూరాగతజల ప్రపాత శబ్దము బోలి యొకశబ్దము వినవచ్చుచుండెను. శబ్దము సమీపించుచున్న కొలఁదిని వారి యుత్సాహము పొంగిపోవుచుండెను ఇంతలోఁ గ్రమముగ వేలకొలఁది శత్రుసైనికులు దుర్గమును నగరమును ముట్టడించియున్నట్లు డఱుకును దెలియవచ్చెను. నగరమంతయు జాగ్రతగనే యున్నదని యనంతరాముఁడు గ్రహియించెను. అయినను నాకస్మికముగఁ దన సైన్యమునంతటి సైన్యము నజమీరుప్రభుఁడు సంగ్రహింపఁజాలఁడని నిశ్చయించుకొనియెను—ఆ యు టయును నిజమే—అనంతరాముఁడు దుర్గరక్షణమునకుఁ బ్రసాదుఁడు నియమింపఁబడియె

ననువార్తం దెలిసికొని యధికసైన్యముతో దుర్గమునుముట్టడించెను. నగర సైనికులు దుర్గమునఁ జేరకుండుటకై నగరమునుగూడ నాక్రమించెను.

దుర్గముచుట్టును చీమల పుట్టలవలె సైనికులందఱును వ్యాపించి యతికష్టముతో దుర్గమున కెగఁబ్రాఁకుచుండిరి. వారు సగముదూరము పోవునప్పటికి దుర్గము వారికి బ్రత్యుత్తర మిచ్చెను—పర్వతమునుండి కఠిన శిలావర్షము వారిపైఁ గురియుట కారంభమయ్యెను. ఆ శిలాఘాతములచే దుర్గారోహకులగు ననేకయోధులు పచ్చడులై పోవుచుండిరి. అప్పుడు నిషధసైన్యమున హాహాకారములు బయలుదేరెను. అప్పుడందఱు నొకసారి దుర్గమును బ్రాఁక నారంభించిరి. దుర్గముపైనున్న సైనికులు నలువంకలను సర్దుకొని శిలావర్షము గురియించుచుండిరి; శరవర్షమును గురియించుచుండిరి. శత్రుసైనికులలోఁ బడినవారు పడుచుండఁగా నెక్కెడువా రెక్కుచుండిరి. క్రమముగా శత్రువులు గిరిశిఖరమువఱకును వ్యాపించిరి.

చీఁకటి పడిపోవుచుండెను. జయంతప్రసాదులు దుర్గమంతటను దిరుగుచు యోధులను బ్రోత్సహించుచుండిరి. జనార్దనుఁడు ఛాయవలెఁ బ్రసాదు ననుసరించియుండెను. ఇంతలో శత్రువులు దుర్గదక్షిణ ప్రాచీరమునఁ బ్రవేశింప నారంభించిరి. ప్రసాదుఁడు శరవేగమున నావంకకుఁబోయి వారి నడ్డుకొనియెను. శత్రువులు వెనుక కొదిగి మరలఁ బైబడ నారంభించిరి. ఒకఁడు మరణించినచో నిరువురాస్థానమున నిలుచుచుండిరి ఆమార్గమున సైనికులపై సైనికులువచ్చి పడుచుండిరి.

అప్పుడు ప్రసాదుఁడు ప్రాచీరద్వారమును మూసివైచి తాను బయట నిలిచియుండెను. కొందఱు సహాయసైనికులతోఁ గృపాణహస్తుఁడై నిలిచి శత్రువుల నెదురించుచుండెను. శత్రువు లాతని ప్రతాపమును సహింపఁజాలకుండిరి. కొందఱా శిఖరమునుండి క్రిందఁ బడిపోవుచుండిరి. ఆ యిరుకుత్రోవ నిద్దఱు ముగ్గురకంటె నధికముగఁ బ్రవేశించుట కవకాశములేదు. ఆమార్గమును గృపాణహస్తుఁడై

ప్రసాదుఁ డరికట్టి యుండి శత్రువుల నురుమాడుచుండెను. మఱి యొకవంక జయంతుఁడు నిలిచి శత్రువులకు గతినిరోధముం గావించి కసిమసంగుచుండెను. దుర్గమధ్యమునుండి వెడలు నిరంతర బాణాసారము శాత్రవానలమును జల్లార్చివైచుచుండెను. దుర్గమునకెదుటి మూడుత్రోవలు నీవిధముగ బంధింపఁ బడిపోయెను. ఇఁక శత్రువులు వెనుకత్రోవను బట్టిరి.

దుర్గము శత్రుముక్తమైనతోడనే ప్రసాదుఁడు పదివేల సైనికులతో బయలుదేరెను. జనార్దన జయంతు లాతని వెంబడించి యుండిరి. ప్రసాదుఁడు వెనుదిరిగి చూచి "జయంతా! నీవు దుర్గమునకుఁ బొమ్ము. అందఱమును బయటికి వచ్చుట మంచిపనికాదు." అనియెను

జయం — యుద్ధము లేనిచోటికిఁ బోవలసినపని యేమున్నది? స్త్రీల నడుమనుండి దూరమున జరగుచున్న యుద్ధమును జూచుటకై నన్నుఁ బంపుచుంటివా?

ప్రసాదుఁడు మఱి మాటాడలేదు. జయంతుఁడు సంతోషముతోఁ గృపాణహస్తుఁడై ప్రసాదు ననుసరించి పోయెను. పోవుచు నాతఁడు తనలో "ప్రసాదా! నీవు నా కెట్టివాఁడవో నీ వెఱుంగవు— ఏది నా సర్వస్వమై యుండెనో యామె నిన్నుఁ గామించినది—ఆమెకు నీవు ప్రాణాధిక ప్రియుఁడవు! నేను నిన్నొంటిగ విడిచియుండఁగలనా నీ సామాన్య కష్టమునకుఁగూడ నా ప్రాణములను వినియోగించి నిన్ను రక్షించెదను—ఆ మూలమున మరణించుటకూడ నాకెంత సుఖమును గొన్నావు! నాకంతటి యదృష్టము లభియించునా?" అని యనుకొనుచుండెను.

---

పదియవ ప్రకరణము

# అనంతరాముడు

ప్రసాదుఁడు శత్రు సన్నిహితుఁడగు నప్పటికి వెలుఁగు వచ్చెను. ఉదయాకాశ కిరణములు రక్తరంజితములగు దుర్గప్రాచీరములపైఁ బ్రసరించుచుండెను. ఇంకను గ్రిందిభాగమునందంత వెలుతురు లేకున్నను దూరమునందలి జనులుకూడ నగపడునంతటి యవకాశము కలిగెను. ప్రసాదుఁడు శత్రులనందఱ నొక్కటిగఁ జేరనీయక ఖండఖండములుగఁ జేసి యాక్రమించెను. కాని, శత్రుసంఖ్య ముప్పదివేలకు మించియుండెను. ప్రసాదుఁ డంతవఱ కాలోచింపక స్వల్పసైన్యముతో నా సేనాసాగరమునఁ బ్రవేశించి విజృంభింప నారంభించెను. శత్రువులు చెదరిపోవుచుండిరి. కాని, యందఱు నొక్కటిగఁ జేరుకొనుచుండిరి. నేర్పుతోఁ బ్రసాదుని యల్పసైన్యమును ముట్టడింపఁ బ్రయత్నించుచుండిరి. ప్రసాదుఁడు తన సైన్యమును దృఢవ్యూహముగ నమర్చుకొని పార్శ్వమునందుండి శత్రువులం దాకెను.

ప్రసాదుఁ డించుక ముందఱికిఁబోయి చూచెను. ఏమిది? నా జనకుఁ డనంతరాముఁడా? ఇది నిషధసైన్యమా? ఇట్లగునని నే నెన్నఁడును భావింపనైనలేదే! ఇట్లు జరుగునని స్వప్నమందైన లేదే! ఇప్పుడు నాకు నా పినతండ్రితోడి యుద్ధమా? ఎవ్వఁడు నాకు గురుసమానుఁడో; సర్వదా పూజనీయుఁడో, పితృవంశ గౌరవమునకు స్థానభూతుఁడో యాతనితో యుద్ధము చేయుటయా? ఒకనికి దాసుడనైన కారణముచేఁ బినతండ్రితో మహారణము చేయవలయునా! ఛీ! ఛీ! ఇఁక నేనీ దాసవృత్తిని బరిత్యజించి వైచెదను! ఒక్క నిమిషమైన నేనీ దేశమునం దుండఁజాలను! అంతమాత్రమునఁ జచ్చిపోవుదునా?——కాని, నా హృదయేశ్వరి!——" అని యనుకొనుచుఁ బ్రసాదుఁడు వెనుకకుఁ దిరిగి చూచెను. సూర్యకిరణ ప్లావితంబగు దుర్గశిఖరమునంగల వారెల్లరు నాతనికన్నులఁ బడుచుం

డిరి. ప్రసాదుఁడు దూరమునందుండియు వారిలో నుమాబాల నాన వాలు పట్టఁగలిగెను. అంతలో నాతనిమనసు చెదరిపోయెను. మరల ముందటికిఁజూచి "జయంతకుమారా! ఈ సేనాభారమంతయు నీ తలపైఁ బెట్టితిని— దుర్గమును రాజపరివారమును నీవే రక్షించు కొనుము!" అనియెను.

తరువాతఁ బ్రసాదుఁడు తన కరవాలమును జటాలున నొరలో నుంచి చేతులుజోడించుకొని వినమితవదనుఁడై పోయి యనంతరాముని సన్నిధిని నిలువఁబడియెను.

అప్పుడు రాజనందని దుర్గశిఖరమున నిలిచి రణక్షేత్రమున దర్శించుచుండెను. నీల, శ్వేత, లలిత ముఫ్ఫురు నామె సమీపము నందే యుండిరి. అప్పుడు లలిత "అక్కా! నీపాదములకు మ్రొక్కె దను. నన్నుఁ గ్రిందికి దింపివేయుము! మనుష్యులు మనుష్యులు చంపు కొనుచుండగా నేను చూడఁజాలను" అనియెను;

ఉమా—ఏమిభయము లలితా? శత్రువులను జంపుటయే రాజపుత్రిల ధర్మము. దస్యులు పైఁబడినప్పు డాత్మరక్షణమునకై వారిని మర్దింపవలదా?

లలి—కాని, యీ విధముగాఁ జంపుట నే నెన్నఁడును జూడలేదు.

ఉమా—చూడ కేమి?

లలి—ఇరువురు సోదరులు నిరువంకలనిలిచి యుద్ధము చేయు చున్నారు.

ఉమా—ఇరువురు సోదరులెవరు లలితా?

లలి—సోదరుఁడగు ప్రసాదుని నీ వెఱుఁగవా?

ఉమా—ఎఱుఁగుదును—ఆతని సోదరుఁడా? ఆతని సోదరుఁ డెచ్చటనుండెనో చూపింపుము;

లలి—అదిగో! ఆ మెట్టగుట్టమును దిగి రాజునొద్ద నిలువఁబడి యున్నాఁడు.

నీల-ఆతఁడనంతరాముని తనయుఁడు-యువరాజగు దేవలుఁడు-

లలి—అవును.

ఉమా—లలితా! సత్యము చెప్పుము! యువరాజగు దేవలుఁడు కిల్లాదారగు ప్రసాదునకు సోదరుఁడని నీకెవ్వరు చెప్పినారు?

లలి—నా సోదరుఁడగు ప్రసాదుఁడే చెప్పినాఁడు! అతఁడు నా హస్తమును దన తమ్ముఁడగు దేవలుని హస్తమునందుంచి కన్నీరు విడిచినాఁడు—యువరాజుకూడఁ బ్రసాదు నన్నాయని పిలుచుచు దుఃఖించినాఁడు. అక్కా! అదియేమి నీ వట్లున్నావు?

ఉమాబాల హృదయావేగముచేఁ గూలఁబడిపోయెను. ఆమె నయనము లానందాశ్రుధారా వర్షితములై పోయెను. ఆమె పైఁట చెఱఁగు మొగమున కడ్డముచేసికొని యేడ్చుచు "నీలా! ఇన్నాళ్లకు గన్నులఁ దెఱచితిమి—ఉంగరముపైనున్న నా మాతృకరములు నీకు జ్ఞప్తియందున్నవా?" అనియెను.

నీల—భవానీ ప్రసాదు.

ఉమా—ఇంకను బోధపడలేదా నీలా? నీవు సిపధేశ్వరుఁడగు వీరేంద్రకేసరి పేరు వినియుంటివా? మనప్రసాదుఁ డాతని తనయుఁడు!

నీల—కిల్లాదారు వీరేంద్రకేసరి తనయుఁడేయైనచో నాతనికి మనయొద్ద దాసత్వ మెందులకు?

అంతలో రణక్షేత్రమునఁ గోలాహలధ్వనులు బయలుదేరెను. అందఱు నా వంకకుఁ దిరిగిచూచిరి. కృపాణము నొరయందుఁ జేర్చి రణక్షేత్రమునఁ బ్రసాదుఁడు తలవంచుకొని నిలిచియుండెను. అతని యెదుట నశ్వారూఢుఁడగు వసంతరాముఁడు వృద్ధవ్యాఘ్రమువలె మండిపడుచుండెను. శత్రువునెదుట నీ విధముగ నిలిచియున్న ప్రసాదుసింగాంచి చోహానవీరు లెల్లరు నాశ్చర్యపడుచుండిరి. నిమధసైనికు లెల్లరును యువరాజుంగాంచి స్తంభితులై పోయిరి. ఉభయపక్షముల వారును యుద్ధముమాని నిలిచి చూచుచుండిరి. అప్పు డవసంతరాముఁడు ప్రసాదునిం గాంచి "సిరోహీవిజయుఁడగు కిల్లాదారు ప్రసాదుఁడవు నీవేనా? ఉత్సవరంగమున జగదేకవీర బిరు

దమును గాంచినవాఁడవు నీవేనా ? మంచిది. ఇప్పుడు నీ ప్రతాప సామర్థ్యములను జూచెదఁగాక ? సామర్థ్యమున్నచో నిప్పుడు నీ ప్రాణరక్షణమును గావించుకొనుము !" అని గర్జించుచు ననంత రాముఁడు తన హస్తమునందలి భల్లమును బైకెత్తెను—ప్రసాదుఁడు మాఱుమాటాడలేదు——నిశ్చలుఁడై నిలిచియుండెను. అప్పు డుభయపక్షములయందును హాహాకారములు బయలుదేరెను. ఈ కోలాహల ధ్వనులు దుర్గశిఖరమునందున్న రాజకుమారి కర్ణములం బడియెను.

ప్రసాదుఁ డాత్మరక్షణమున కెట్టి ప్రయత్నమును జేయుట లేదు—అటనుండి యొక్కయడుగైనఁ గదపలేదు—అనంతరాముఁడు విస్మితుఁడై యెత్తిన బల్లెమును క్రిందికి దించివైచి యించుక విచారమును విస్మయమును గలవాఁడై గంభీరస్వరముతో "ఏమిది ? నీ సింహపరాక్రమమంతయు నిప్పు డేమైపోయినది ? నీ మొలనున్న యాకరవాలము కేవల మలంకార మాత్రమేనా ? ఛీ ! ఛీ ! నీవు వీరకులకలంకుఁడవై పోయినట్లు నీకు బోధపడుట లేదా ?" అనియెను.

ప్రసాదుని సర్వశరీరము నొక్కసారిగఁ గంపించిపోయెను ; అంతలోనే స్థిరమై నిశ్చలమైపోయెను. అప్పు డనంతరాముఁడు "నిరాయుధుఁడవైన నిన్నుఁ జంపఁగూడదని తలంచితిని—కాని యిట్టి వీరకులకళంకుఁడవగు నిన్ను నీచ జంతువును జంపినట్లు చంపవలయును" అని పలుకుచు మరల భల్లమును బైకెత్తెను. ఈసారిమాత్ర మనంతరాముఁడు దృఢహస్తుఁడై బల్లెమును ప్రసాదుని వక్షమునకుఁ లక్ష్యము చేసి వట్టుకొనియెను. అకస్మికముగ నా భల్లముఖంబున కెదురుగఁ దనవక్షమునుంచి దేవలుఁడు ప్రసాదున కడ్డము వచ్చి నిలువఁబడియెను. ఆ సాహసమును గాంచి నివథసైనికులెల్లరు నైకకంఠ్యముగ "జయ ! కుమార దేవలునకు జయ !" అని జయధ్వనులం గావింప దొడంగిరి.

ప్రజ్వలితానల మాజ్యాహుతిచే మఱింత ప్రజ్వలితమయ్యెను. అనంతరాముఁడు జాలనిబద్ధంబగు సింహంబుంబోలి గర్జించుచు

"కుమారా ! నీ యపరాధము క్షమింపఁగలిగినది కాదు. నీ యీ నేరమునకు నిన్నుఁ గారాబద్ధునిం జేసి వైచెదను" అనియెను.

దేవలుఁడు భయపడలేదు ; నడుమున వ్రేలాడుచున్న కరవాలమును దీసి తండ్రిపాదములయొద్దనుంచి తలవంచి నిలువఁబడియెను. కారాగృహ వాసనమునకైన నంగీకరించెనుగాని యించుకంతయు నటనుండి జరుగ లేదు. అప్పు డనంతరాముఁడు బిగ్గరగా "కిల్లాదారుఁడగు ప్రసాదునిఁబట్టి బంధింపుఁడు !" అని యాజ్ఞాపించెను.

ప్రసాదు నెఱింగినవారును, నాతనియెడల ననురక్తులగు వారును నాతనిఁ బట్టుకొనుటకు ముందఱికి రాలేదు. కొందఱటునిటు గాక యూరకుండిరి. ఆతని నెఱుఁగనివారును, నాతనియం దనురక్తి లేనివారును ప్రలోభవశమునైన నేమి రాజాజ్ఞా ప్రతిపాలనోద్దేశముచే నైననేమి ప్రసాదుని బట్టుకొనుట కుద్యుక్తులైరి.

అప్పుడు వృద్ధమంత్రియగు లక్ష్మీపతిరావు వారి నడ్డగించి "మీ రెవ్వని బంధింపఁబోవుచుంటిరో యెఱుఁగుదురా ? ఏ వీరేంద్ర కేసరి మిమ్ము బిడ్డలవలెఁ బాలించి పోషించెనో, యెవ్వఁడు మీకును నిషధ రాజ్యమునకు గౌరవాభివృద్ధులం గావించియుండెనో యా పూజనీయుఁడగు వీరేంద్రకేసరిని మీరు మఱచిపోయితిరా ? ఈ ప్రసాదుఁ డాతని యేక పుత్రుఁడు ! మీకు యువరాజు !" అని హెచ్చరించెను.

ఆతని మాటల నాలకించి కొందఱు వెనుకకు మరలిరి. కొందఱు మరలలేదు. అప్పుడు లక్ష్మీపతిరావును మఱికొందఱు ప్రసాదానురక్తులగు దండనాయకులును దమతమ దళములతో రణరంగమును వదలిపోయిరి. అప్పటికిని బ్రసాదుని గొందఱు బంధింపఁబోవుచునే యుండిరి. కాని యాతనిం బట్టుకొనుట సామాన్యకార్యమా ? జయంత జనార్దనులు ప్రసాదునియొద్దనే యుండిరి. మహారణ్యమున మహాదేవరావును విడిచివచ్చిన నిషధసైనికులు వచ్చి దుర్గమువలెఁ బ్రసాదునకు రక్షకులై నిలువఁబడిరి. అంతలోఁ జోహానవీరులందఱును జేరుకొని ప్రసాదునకుఁ జుట్టును మండలవ్యూహముగాఁ జేరి యుండిరి. ఇంతవఱకును బ్రసాదుఁడు మౌనమును వహించియేయుం

డెను. ఇప్పు డాతఁడు జయంతుని బిలిచి "నేను పట్టువడినచో వీరందఱు నజమీరు వదలి నిషధదేశమునకుఁ బోయెదరేమో యడుగుము!" అనియెను. కాని యామాట యెవ్వరును జెవినిబెట్టలేదు.

అప్పు డనంతరాముఁడు క్రుద్ధవ్యాఘ్రమువలె నా మండల వ్యూహముపై లంఘించెను ఆ యెగువున కావ్యూహము కొంచెము చెదరెను గాని యంతలో జయంతుఁడు శత్రుసైన్యముల నెదిరించి తాకెను. కాని జయంతుఁడు ప్రాణములతో నుండఁగాఁ జూచుట కదియే కడసారి! ఆస్వార్థత్యాగి—ఆయుదార హృదయుఁడు—ఆ మహాపురుష శేఖరుఁడు—ఆ జయంతకుమారుఁడు. శూలవిద్ధ లలాటుఁడై భూతలశాయి యయిపోయెను

ఆ దారుణ కృత్యముం గాంచి యజమీరు సైనికులందఱు నొక్కుమ్మడిగ నెగసిపడి నిమిషములో నిషధసైన్యమును జిందరవందరగఁ జేసివైచిరి. కాని యింకను ననంతరాముఁడై దాఱువందల మంది సైనికులం గూర్చుకొని యుద్ధము చేయుచునే యుండెను. కాని వారిలోఁ గొందఱు క్రమక్రమముగఁ బడిపోవుచుండిరి

అప్పుడొక యజమీరుయోధుఁ డనంతరామునిపై లంఘించి కరవాలముతో నాతనితల నరకుటకు సిద్ధముగ నుండుటను బ్రసాదుఁడు చూచి తత్తరముతో నొక్కయోధునిచేతి భల్లమును లాగికొని కృపాణ హస్తుఁడగు నా చోహాసనీయుని దక్షిణకరమునఁ గఠిన యష్టితోఁ దీవ్రాఘాతముం గావించెను. తోడనే యాతనిచేతి కరవాలము క్రిందఁబడిపోయెను.

అనంతరాముఁ డదియంతయును జూచెనుగాని యాతఁడు తనలో "వీఁడు నన్నుఁ గొట్టుటకే బల్లెమును బ్రయోగించి యుండునా? అట్లయినచో భల్లముఖంబున నం బొడువక కఱ్ఱతోఁ గొట్టుటెందుకు?" అని యోచించుకొనుచుండెను.

ఇంతలోఁ బ్రసాదుఁడు మేఘగంభీర తీవ్రస్వరములతో "ఓవీర యోధులారా! ఇందెవ్వఁడీ మహారాజుపైఁ జేయి చేసికొనుటకు సాహసించునో యాతఁడు నిశ్చయముగ నాకుఁ బరమశత్రుఁడు!

నిరాయుధునిం గావింపుఁడు ? కాని, యెంతమాత్రము నీతనిఁ గొట్ట వలదు" అని హెచ్చరించెను.

ఆ సమయమునకు సరిగ నజమీరు సేనాపతి కమలసింహుఁ డున్మత్తునింబోలి గుఱ్ఱమును బరుగెత్తించుకొనుచు నచ్చటఁ బ్రవేశిం చెను. తన కుమారుఁడు మరణించిన సంగతి యాతనికి నగరమునఁ దెలియవచ్చెను ఆతఁడు పుత్రసందర్శనార్థమై వచ్చియుండెను ; కాని, యప్పుడే జయంతు కుమారుని మృతశరీరము దుర్గమునకుఁ దీసికొనిపోఁబడియెను.

సేనాపతి యెవ్వరితోడను మాటాడకుండ రణక్షేత్రమంత యును గలయఁజూచెను. శవముల నన్నిటిని బరీక్షించెను—నలువం కలఁ దిలకించెను. చోహానవీరుల మొగములన్నియు విషాదచ్ఛాయా వృతములై యుండెను. అప్పుఁ డాతఁడు దీర్ఘశ్వాసమును విడుచుచు "అనంతరాముఁ డెక్కడ నున్నాఁడు ?" అని గర్జించెను.

ఒకఁడు—పాఱిపోయినాఁడు.

అనంతరాముఁడు సమీపమునందే నిలిచి యుద్ధము చేయు చుండెను. ఆతని కామాట వినఁబడియెను. అది యవమానముగ భావించి యనంతరాముఁ డప్పుడు తీవ్రస్వరముతో "సుక్షత్రియ వీరుఁడగు ననంతరాముఁడు సృగాలములకు వెఱచి పాఱిపోవువాఁడు కాఁడు ! శక్తియున్నచోఁ బట్టుకొనుఁడు !" అనియెను.

అప్పటికిని నూర్గురుయోధులను సాయముచేసికొని యనంత రాముఁడు నిలిచి పోరాడుచునేయుండెను. చోహానవీరు లెందఱో యాతని ముట్టడించిరి గాని, యొక్కఁడు నాతని సమీపింపఁ జాల కుండెను. ఆతని సింహపరాక్రమముంగాంచి యందఱును భయవిస్మి తులై పోయిరి. తుట్టతుద కనంతరాముఁ డాయాసముచే మూర్ఛి తుడై పోయెను—అప్పుడు సేనాపతి యానతిచే నాతఁడు కారా గృహమునకుఁ గొనిపోఁబడియెను.

---

పదునొకండవ ప్రకరణము.

# కారాగృహము

చాలమంది నిషధసైనికులు కారాబద్ధులైరి. దేవలుఁడు మాత్రము ప్రసాదుని మందిరమునం దుంపఁబడియెను. యుద్ధానంతర మున సాయంకాలమునకు రాజపరివార మంతయును నగరమున బ్రవేశించెను. జయంతుని మృతదేహముతో సేనాపతి స్వగృహము నకు వచ్చెను. దుర్గభారమంతయుఁ బ్రసాదునిపై నుండెను. ఏకాదశి చంద్రుఁ డస్తమించెను. గాఢాంధకార మెల్లెడల వ్యాపించియుం డెను. పురరక్షకులు హెచ్చరించుచుఁ దిరుగుచుండిరి. చీఁకటిలో నొకరికొక రగపడుటలేదు అప్పు డొకపురుషుఁడు ముసుఁగు వైచు కొని మెల్లమెల్లగ వసంతరాముఁడు బంధింపఁబడియున్న గృహమున కభిముఖుఁడై పోవుచుండెను రక్షకభటుఁ డాతనింజూచి "ఎవరు నీవు? ఎక్కడకుఁ బోయెదవు ? నీవు రాజకీయోద్యోగివే యయినచో సాంకేతికవచనమును జెప్పఁగలవా ?" అని యడిగెను.

ఆగంతుకుఁడు "ప్రమద" అనియెను. ఆమాట విన్నతోడనే భటుఁ డాతని వదలి వెడలిపోయెను. ఆగంతుకుఁ డసంతరాముఁడు బంధింపబడిన గృహమునొద్దకుఁబోయి తన ముసుఁగును దెఱచివైచె ను. ద్వారరక్షకు లాశ్చర్య సంభ్రమములతో నాలోకించిరి—అతఁడు కిల్లాదారు ప్రసాదుఁడు! తోడనే వారొసరిల్లి నిలువఁబడిరి. అప్పుడు ప్రసాదుఁడు "పారామారుట యెప్పుడు" అనియెను.

భటు—రెండుగంటల తరువాత,

ప్రసా—అపరాధి యెచ్చట నున్నాఁడు ?

భటు—ఈయింటిలో,

ప్రసా—ద్వారమును దెఱచి చూపుము !

భటుఁడు ద్వారమును దెఱచి లోనికిఁబోయి చూచివచ్చి "ప్రభూ! బంధితుఁడు నిద్రించుచున్నాఁడు" అని చెప్పెను.

ప్రసా—అతని మేల్కొలుపుము.

భటుఁ డట్లే చేసెను. తరువాతఁ బ్రసాదుఁడు "తలుపుమూసి వైచి తాళమును నా కిచ్చి నీవు నీ యింటికిఁ బొమ్ము!" అనియెను.

భటుఁడట్లే వెడలిపోయెను. తరువాతఁ బ్రసాదుఁడు తలుపు తెఱచి ద్వారమునొద్ద నిలిచి మృదుస్వరముతో "లోపలనున్నవా రీవలకు రావచ్చును" అనియెను.

బంధితుఁడు — ఎట్లు!

ప్రసా—తలుపులు తెఱవఁబడి యున్నవి.

బంధి—వచ్చి యేమి చేయవలయును?

ప్రసా—దక్షిణపర్వత ప్రాంతమున సజ్జితాశ్వము నీ కొఱకు సమకూర్పఁబడి యున్నది.

బంధి—నీ వెవ్వరు?

ప్రసా—నా సంగతి తెలిసికొనుట మీకంత యావశ్యకము కాదు.

బంధి—ఈ శత్రునగరమున నాకు బంధువు లెవ్వరును లేరు. ఒక్కఁడున్నాఁడు కాని యాతనికి నా కుపకారము చేయు సమర్థత లేదు

ప్రసా – ఊరక కాలక్షేపము చేయఁగూడదు—పారిపోవుటకు సమయ మాసన్నమగు చున్నది

బంధి—పాఱిపోవుట నాకిష్టము లేదు.

ప్రసా—ఏమి?

బంధి—కుక్కవలెఁ బలాయితుఁడనై పోవుటకంటె నవమాన మింకేమున్నది?

ప్రసా—కుక్కచావు చచ్చుటకంటె నది మేలుకాదా?

బంధితుఁడు మాటాడలేదు. అనంతరాముఁడు ప్రసాదుని కంఠస్వరమును జాలదిసములనుండి వినుటలేదు కావునఁ గంఠస్వర శ్రవణమాత్రమున నాతని కానవాలుపట్టుట కవకాశము లేకుండెను. గాఢాంధకారమునం దేమియు నగపడుటలేదు అప్పుడు ప్రసాదుఁడు "తెల్లవారినతోడనే విచారణ మారంభమగును—తరువాత శిక్ష విధింపఁబడును" అనియెను.

అనం—శిక్షవలన నేమగును ?

ప్రసా—మరణము.

అనం—అది నేఁ గోరుకొనుచున్నదే.

ప్రసా—రణమరణమునకును శిక్షారూప మరణమునకును భేదము లేదా ?

అనంతరాముఁడు కొంతసే పూరకుండి "నీవు నన్నధిక్షేపించుటకై వచ్చితివా ?" అనియెను.

ప్రసా—అందువలన నా కేమిలాభము ?

అనం—నీవు నన్నుఁ గష్టముల పాలుచేయఁ దలఁచి యిట్లు చెప్పుచుంటివేమో ?

ప్రసా—ఒకవేళఁ జేయదలఁచినను నేను నీ కింతకంటె నెక్కువ కష్టమును గల్పింపఁజాలనుగాదా ?

అనం—అట్లయినచో లెమ్ము ! అంగీకరించితిని.

ప్రసా—రమ్ము.

అనంతరాముఁడు లేచి ప్రసాదుని వెంటనే బయలుదేరెను. ఆతఁడు ద్వారమునుదాఁటి యివ్వలకు వచ్చునప్పటికి దీపపు వెలుతురు ప్రసాదుని మొగమునఁ బ్రసరించెను. అనంతరాముఁడు నివ్వెఱపడి నిలువఁబడి పోయెను. కొంతసేపటి కాతఁడు "భవానీ ! నీవు నన్ను రక్షించుటకై వత్తువని నే ననుకొనలేదు. నీ యుద్దేశమేమో నాకుఁ దెలియుటలేదు. నీకు నాపై ప్రేమయుండునని నాకు నమ్మకమేమియును లేదు. ఒకవేళఁ బ్రేమించినను నిన్నిపనులు జరగిన తరువాత నీ హృదయమునకుం దట్టిప్రేమయుండుట కవకాశములేదు. ఇట్టిస్థితిలో నిట్లు చేయుటకుఁ గారణ మేమో బోధపడుట లేదు" అనియెను.

ప్రసా—నేను నిన్నుఁ బ్రేమించుచుండు కారణమున వచ్చితిని, రాజద్రోహము చేయుటకై రాలేదు.

అనం—అట్లయినచో నిది యేమిపని ?

ప్రసా——నా పితృవంశమునకును, జన్మభూమికిని గళంకము కలుగకుండఁ జేసికొనుటకై యిట్లు చేయవలసివచ్చినది.

అనం——మంచిది—తెలిసినది. నాకు మరణశిక్ష యయినచో నీవంశమునకు, గళంకము కలుగునంటివిగదా! నీవు రాజద్రోహము చేయఁదలఁచితివే! అందువలన నీకే మగును?

ప్రసా——మరణ దండము.

అనం——నీకు మరణదండమైనచో నప్పుడుమాత్రము నీవంశ మర్యాద యెట్లు నిలువఁబడును?

ప్రసా—నేను నాకులశీలములను బ్రకటించుకొనకుండ నిచ్చట సేవకమాత్రుఁడనై యున్నాను. అందుచే నా మరణమువలన నా కులమునకుఁ గళంకము లేదు.

అనం——నీ విచ్చట నీవంశ నామములఁ దెలుపుకొనకుండ నుం డుటకుఁ గారణ మేమి?

ప్రసా——వంశగౌరవ సంరక్షణముకొఱకు.

అనం——అసత్యము! నా భయముచే నీవిట్లు దాఁగియుంటివి. నీమాట లన్నియు నసత్యములే. వంశగౌరవముకొఱ కాత్మత్యాగము చేయువా రెంతవారు కావలయును! నీ విప్పుడు నాయందలి ప్రేమచేఁ గారాగారమునుండి తప్పింపఁ దలఁచితివో, కాక నన్నుఁ ద్రోసివైచి నీ సింహాసనము నాక్రమించుకొనుట కీ పన్నాగము పన్నితివో—ఏమైన నేమి—నా చిరకాలభయము నేఁటితో దీరిపోవునుగాక!

అని యనంతరాముఁడు ప్రసాదునిపై లంఘించి యాతని మొలనున్న తరవారిం దీసికొని యించుక జరగి రెండుచేతులతో నా కృపాణమును బైకెత్తి ప్రసాదునికంఠమునకు గుఱిచేసి ప్రచండా ఘాతముం గావించెను. ఆదెబ్బ ప్రసాదున కెచ్చటఁ దగిలినను బ్రసాదుఁడు మరణింపవలసినదే—కాని యట్లు జరుగలేదు. ఆకత్తి కొన ద్వారమునకుఁ దగులుటచే లక్ష్యముచెదరి ప్రసాదుని యెడమ భుజముపైఁబడి కవచమును జీల్చివైచి మాంసములోనికిఁ జీల్చుకొని

పోయెను. రక్తము ప్రవహించుచుండెను. ఆ దెబ్బ యదటునకుఁ బ్రసాదుఁడు క్రిందఁబడిపోయెను.

ప్రసాదుఁడు పడినతోడనే యనంతరాముఁ డాతని సమీపించి కత్తిని లాగికొనఁ జూచెను. రక్తప్లావితమగు భవానీ ప్రసాదుని శరీరముంగాంచి యాతఁడించుక నివ్వెఱపడి నిలిచియుండెను. అప్పుడు ప్రసాదుఁడు హీనస్వరముతో "తండ్రీ! కొట్టుము. ఇందు నష్టమేమున్నది? తెల్లవారకుండఁ జచ్చిపోవుదును. మరణదండమున కంగీకరించియున్న నాకు నీ చేతులలో మరణించుటకంటెఁ గావలసినదేమున్నది? కాని యొకమాట వినుము? చెప్పుట మఱచిపోయితిని. సాంకేతికవచనము "ప్రమద" ఈమాట చెప్పినచోఁ బురరక్షకు లెవరును నిన్నడ్డగింపరు. నీవు నీ యిచ్ఛవచ్చినట్లు పోవచ్చును. ఈ మాటమాత్రమే మఱచిపోవలదు" అనియెను.

అనంతరాముని చేతిలోని కృపాణము క్రిందఁబడిపోయెను. ఆతఁడు ప్రసాదుని సమీపమునఁ గూరుచుండి "భవానీ! ఏమనుచుంటివి? నాకు బోధపడుట లేదు; ఇంకొకసారి చెప్పుము!" అనియెను.

ప్రసా—"ప్రమద" యను సంకేతవచనము నీ వుచ్ఛరించినచో నిన్నెవ్వరు నడ్డగింపరు. నీకొఱకు గుఱ్ఱమచ్చట సిద్ధముగ నున్నది. శీఘ్రముగఁ బొమ్ము!

అనంతరాముఁ డటనుండి కదలలేదు. ప్రసాదుఁడు మాటిమాటికి నాతని త్వరపెట్టుచుండెను. అప్పు డనంతరాముఁడు "భవానీ! నేను నిన్నుఁగొట్టి నీ శరీరమును రక్తప్లావితముగఁ జేసితిని. గుఱితప్పిపోయినది కాని లేకున్నచో నీవీసరికి ఖండఖండములై యుందువు" అనియెను.

ప్రసాదుఁడు ప్రత్యుత్తర స్వరూపముగఁ దనయుంగరము నాతని వ్రేలి కలంకరించి హీనస్వరముతో "చంపుము! నీకడ్డమేమి? కాని నీవు శీఘ్రముగ దప్పించుకొని పోవలయును—పొమ్ము ప్రమద, ఉంగరము, గుఱ్ఱము వీనిని మాత్రము మఱచిపోవలదు" అనియెను.

తోడనే యనంతరాముఁడు లేచి కత్తిం దీసికొని బయలుదేరి కొంతదూర మరిగి మరలవచ్చెను. ఏమియో యాలోచించుకొని యా యంధకారమునం బడి వెడలిపోయెను. దుర్గద్వారమునొద్దకుఁ బోవు నప్పటి కొకభటుఁ డాతనిం గాంచి "ఎవరువారు?" అని పలుక రించెను.

అనంతరాముఁడు "ప్రియుడ" అనియెను. భటుఁడు వెడలి పోయెను. అప్పు డనంతరాముఁడు విస్మితుఁడై "భవాని నన్నవ మానించుటకై యిట్లుచేసి యుండలేదు." అని యనుకొనుచుఁ బోవు చుండెను. అప్పుడొక భటుఁడాతని దుర్గద్వారమును దాఁటించెను. తరువాత ద్వారము బంధింపఁబడియెను. అనంతరాముఁ డచ్చట నిలువఁబడి పోయెను.

భటు—రమ్ము.

అనం—రాను—మరల లోపలికిఁ బోయెదను.

భటు—అట్లుపోవుట కుపాయము లేదు.

అనం—తలుపు తెఱచున ట్లాజ్ఞాపింపుము.

భటు—నా యాజ్ఞ చెల్లదు.

అనం—అట్లయినచో నన్నపరాధిగఁబట్టుకొని తీసికొనిపొమ్ము.

భటు—అది నావలనఁ గాదు.

అనం—ఎందుచేత?

భటు—నా కా యధికారములేదు.

అనం—నీకేమి యాజ్ఞయయినది?

భటు—నిన్ను గుట్టమునొద్దకుఁ దీసికొని పోయి యొప్పగింప వలయునని

అనం—ఆజ్ఞాపించిన వా రెవ్వరు?

భటు—కిల్లాదారు.

అనం—నే నపరాధిని—కారాగృహమునుండి తప్పించుకొని పాఱిపోవుచున్నానే!

భటు—నీవెట్టివాఁడ వైనను నిన్ను మరలఁ బట్టుకొని తీసికొని పోవుట నా కధికారము లేదు. నిన్ను గౌరవింపవలయు ననియే నాకాజ్ఞ యయినది.

అనం—నేను మీ ప్రభువునకు శత్రుఁడను—అనంతరాముఁడను.

భటు—అట్లయినను నీశరీరమును స్పృశించుటకుఁగూడ మాకు శక్తి లేదు. మఱి యెవ్వరైన నీకుఁ జెఱుగు చేసినచో నట్టివారిని నేనుజంపి తీరవలయును.

అనం—ఒకవేళ నేను హత్యచేసి పాఱిపోవుచున్నచో నీవేమి చేయుదువు?

భటు—అట్లయినను గిల్లాదారుని యానతి పరిపాలింప వలయును.

అనం—అట్లయినచోఁ బద!

ఇరువురును బర్వతోపత్యకకుఁ బోయిరి. అచ్చట గుఱ్ఱము సిద్ధముగా నుండెను. అనంతరాముఁడు గుఱ్ఱము నధిరోహించెను. భటుఁడు మరలి వచ్చెను—అప్పటికిఁ దెల్లవారినది.

---

పండ్రెండవ ప్రకరణము

## కోరిక—ప్రయత్నము

అనంతరాముఁడు వెడలిపోయిన కొంతసేపటికిఁ గ్రొత్త పారా హాండ్రువచ్చిరి కారాగృహము తెఱచియుండెను. అనంతరాముఁడు లోపలలేఁడు. ప్రసాదుఁడు ద్వారమునొద్ద మూర్ఛితుఁడై పడియుండెను. అప్పు డందఱును దత్తరముతో నలువంకలకుఁ బరుగెత్తిరి. ప్రసాదునిజంపి యనంతరాముఁడు చెఱసాలనుండి పాఱిపోయెనని నగరమంతటను బ్రవాద మయ్యెను. దేవల జనార్దను లావార్తనాల కించి యతిత్వరితముగఁ బ్రసాదునియొద్దకు వచ్చిరి. ప్రసాదునియవస్థ జూచి దేవలుఁడేడ్చుచు "అయ్యో? ఇట్టియన్నను మాతండ్రి గ్రహింపఁజాలక పోయినాఁడే!" అని విలపింప నారంభించెను. ప్రసాదు

నకుఁ దగిలిన దెబ్బ సామాన్యమైనదియే—కాని, రక్తస్రావముచే నాతనికి స్మృతి తప్పిపోయినది. దేవల జనార్దనులు గాయమునకుఁగట్టు కట్టించి యాతని నింటికిఁ దీసికొనిపోయిరి.

తెల్లవారినది. నేటిదినమున రాజసభలో నపరాధులంగూర్చి విచారణ జరుగును. అపరాధు లందఱును సభకుఁ గొనిపోఁబడిరి. అనంతరాముని కొఱకు వెదకిరి గాని, యాతఁడగపడలేదు. మంత్రులు సామంతులు, దండనాయకులు మొదలగు రాజోద్యోగులందఱు నుచిత స్థలంబుల నివసించియుండిరి. మహారాజు సింహాసనారూఢుడై ముందుగ ననంతరామునిం బిలిపించెను. తోడనే మంత్రిలేచి యాతఁడు పాఱిపోయెనని మనవి చేసెను. మహారాజు క్రోధగర్జితుఁడై పారావాంద్రను బిలిపించి విచారించెను. వారివలన సర్వవృత్తాంతమును దెలియుటచే రాజు ప్రసాదుని సభకుఁ దీసికొని రావలయునని యాజ్ఞాపించెను. ప్రసాదుఁడు పల్లకి నధిరోహించి సభకు వచ్చి ధర్మసింహాసనమునకుఁ బ్రణామముం గావించి నిలువఁబడియెను.

అప్పుడు రాజు ప్రసాదునిం జూచి "ప్రసాదా! నీ యవస్థం జూచి నాకుఁ జాలవిచారముగ నున్నది ఏమైనను రాజశాసనము ననుసరించి నీకుఁ గష్టముం గల్పించుటకు నేను బాధ్యుఁడనై పోయితిని" అనియెను.

ప్రసాదుఁడు మాటాడలేదు. రాజువంక నొకసారి చూచెను చుట్టుపక్కల దృష్టులం బరగించెను. ఆ సభామంటపమున నెక్కడఁ జూచినను వేలకొలది ప్రేక్షకులును, నపరాధులును నిలిచియుండిరి. అందఱి కన్నులను బ్రసాదునిమీఁదనే యుండెను.

రాజు—ప్రసాదా! రాత్రి నీవు కారాగృహమునొద్దకు బోయితివా?

ప్రసా—పోయితిని.

రాజు—అనంతరాముఁడున్న గదియొద్దకుఁ బోయితివా?

ప్రసా—పోయితిని.

రాజు—పారావాండ్రను బొమ్మంటివా ?

ప్రసా—పొమ్మంటిని.

రాజు—ఎందుచేత ?

ప్రసా—అనంతరాముని విడిపించు నుద్దేశముచేత.

ఇట్లు ప్రత్యుత్తరము వచ్చునని యెవ్వరు నూహింపలేదు. అందుచే నందఱును నివ్వెఱపడిపోయిరి. రాజించుక క్రోధసూచక స్వరముతో "నీవేనా యపరాధము నంగీకరించు చుంటివి ?" అనియెను.

ప్రసా—నే నింతవఱకసత్యమనుమాట యెఱుంగను.

రాజు—ఈ నేరమునకు శిక్షయేమో యెఱుఁగుదువా ?

ప్రసా—ఎఱుఁగుదును—మరణదండము.

రాజు—నీవట్టిశిక్ష ననుభవించుటకు సిద్ధముగ నుంటివా ?

ప్రసా—మనఃపూర్వకముగ సంసిద్ధుఁడనై యుంటిని.

రాజు—నీవే యింతటితప్పు చేసితివేమి ప్రసాదా ?

ప్రసా..రాజు శిక్షింప సమర్థుడు గాని, హృదయోద్దేశమును బలవంతముగ గ్రహించుట కాతని కధికారము లేదు.

రాజు—నీవు నా చెఱసాలయందలి యపరాధిని దొంగతన ముగ విడిపించితివి· నీ యుద్దేశము నడిగి తెలిసికొనుటకు నా కధి కారము లేదా !

ప్రసా—మహారాజా ! ఇట్లు విధాయకముగ జరుగవలసి యుండుటచేతనే నే ననంతరాముని విడిపించితిని. నేను రాజదండ మునకు భయపడలేదు. అనంతరాముని రక్షించుటకై నూఱుమంది కటికవాండ్ర కత్తిదెబ్బలకుఁ దలయొగ్గుట తటస్థించినను సిద్ధం దేహ ముగ నంగీకరింతును—మహాప్రభూ ! నేను రాజద్రోహిని— నాకుఁ దగిన శిక్షను విధియింపుఁడు !

అందఱును విస్మితులై పోయిరి. అప్పుడు రాజు "ప్రసాదా ! అనంతరాముఁడు నీ కేమగును !" అనియెను.

ప్రసా—మహారాజా ! క్షమియింపవలయును.

రాజు—ప్రసాదా! నిన్నుఁ గత్తితోఁ గొట్టినవా రెవ్వరు? అనంతరాముని విడిపింపఁ బ్రయత్నించిన నిన్నాతఁడు కొట్టఁడుగదా? ఇఁక నిన్నుఁ గొట్టినవా రెవ్వరు?

ప్రసా—ప్రభూ! క్షమియింపుఁడు — ఈ మీ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము చెప్పఁజాలను.

రాజు—నీ వన్నిటికి నిట్లే చెప్పుచున్నావు—నీ యపరాధము సామాన్యమైనది కాదు—నీకు మరణదండనము కావలసియున్నది.

ప్రసా—రాజాజ్ఞ శిరసావహించెదను. కాని, నాది యొక్క ప్రార్థన మున్నది.

రాజు—ఏమది? చెప్పుము!

ప్రసా—అనంతరాముని విడిపింపవలయును.

రాజు—అనంతరాముఁడు పాఱిపోలేదా?

ప్రసా—పలాయితుఁడైన వెంటనే యాతని బట్టుకొనుట కనేకులు పరుగెత్తిపోయియున్నారు. వారి కాతఁడు తప్పక దొరికియుండును. మరల నాతని బంధితునిం జేసి వారు తీసికొనిరాక మానరు.

రాజు—అనంతరాముఁడు మరల దొరికినచో నాతనికి మరణదండనము తప్పదు.

ప్రసా—మహారాజన కొకమాట జ్ఞప్తికిఁ దెచ్చుట కనుజ్ఞ యిచ్చెదరా?

రాజు—ఏమో చెప్పుము!

ప్రసా—వీరోత్సవ సమయమునం దెవ్వరు వీరులుగఁ బరిగణింపఁబడుదురో వారి కోరికలు తీర్పఁబడునని ప్రకటించితిరి. ఉదయపురపురాణానన్ను శ్రేష్ఠవీరునిగఁ బరిగణించినాఁడు. దేవరకు జ్ఞప్తియందున్నదా?

రాజు—ఉన్నది నీ కోరికయేమి?

ప్రసా—అనంతరాముని విడిపించుటయే—

రాజు——ఇది యనుచితమైనకోరిక——అనంతరాముఁడు మహా పాపాత్ముఁడు ప్రాతఃస్మరణీయుఁడగు వీరేంద్రకేసరి తనయుని బలవంతముగఁ జంపించినాఁడు.

ప్రసా——అది కేవల మసత్యము—ప్రమాణము లేకుండఁ గేవల జనప్రవాదమునే నమ్మియుండుట మీవంటి మహారాజుల కుచితము కాదు.

రాజు——ఏమయిన నేమి! నీయీ కోరికమాత్రము తీర్పఁ జాలను.

ప్రసా——సిరోహీ విజయానంతరము మీరు నాకుఁ గావలసిన బహుమాన మిచ్చెదనని వాగ్దానము చేసియున్నారు. ఆవశ్యకమైనప్పుడు కోరికొందునని యప్పుడు మనవిచేసియున్నాను. ఇచ్చెదనని మీరును సెలవిచ్చియున్నారు.

రాజు——ఔను. జ్ఞప్తియందున్నది.

ప్రసా——ఆ వరమును బట్టియైన నిప్పు డనంతరాముని విడిపింపవలయును.

రాజు——అనంతరాముఁడు విశ్వాసఘాతుకుఁడు. ఆతఁడు నా యింటి కతిథియయి వచ్చి దస్యుఁడై పరిణమించినాఁడు. నీవు మఱియొక కోరిక కోరుకొనుము.

ప్రసా——ఇఁక నాకుఁ గోరికలు లేవు. నన్ను వధ్యభూమికిఁ గొనిపోవునట్లు ఘాతుకుల కనుజ్ఞయిందు.

సభయంతయును నిస్తబ్ధమైపోయెను. ప్రసాదుని నిర్భీకత్వమున కందఱును విస్మితులైపోయిరి. రాజించుక సేపాలోచించి "ప్రసాదా! నీ విప్పుడు నీ ప్రాణరక్షణముం గోరిగొనుము——ఇచ్చుటకు సిద్ధముగా నున్నాను" అనియెను.

ప్రసా——ఎవ్వఁడు సత్యపరిపాలన విషయంబునఁ గాతరుఁడయ్యెనో యట్టివానియొద్ద నేను ప్రాణభిక్షమును వాంఛించి యాచింపఁ జాలను—ఓ ఘాతుకులారా! ఎచ్చటనున్నారు? నన్ను వధ్యస్థానమునకుఁ గొనిపొండు!

అంతలో సభారంగమునఁ గోలాహలధ్వని యుదయించెను. దీర్ఘదృఢశరీరుఁడగు నొకవ్యక్తి సభ్యుల నొత్తిగించుకొని రాజపీఠము నొద్దకుఁ బోవఁ బ్రయత్నించుచుండెను. అతనిశిరోభాగ ముష్ణీషము చేతను, దక్కిన భాగమంతయు నార్ద్రవస్త్రముచేతను నాచ్ఛాదితమై యుండెను. అతని ముఖాద్యవయవములు విస్పష్టముగ నగపడుట లేదు. అతఁడు రాజసన్నిధికిఁ బోయి పాగయును, పైవస్త్రమును దీసివైచెను. తోడనే యందఱు నాతని నానవాలుపట్టి విస్మయాక్రాంతులై లేచి నిలువఁబడిరి. అతఁడు మహారాజగు ననంత రాముఁడు !

అనంతరాముఁ డా యసంఖ్యజన సమాజమధ్యమున నిర్భయుఁడై నిలిచి వీరదర్పముతో "నేనే యనంతరాముఁడను—నేనే వీరేంద్రకేసరి సహోదరుఁడను—భ్రాతృపుత్రహింసకుఁడను నేనే—పాఱిపోయినవాఁడను నేనే—మీ రాజవిచారణ నైపుణ్యమును జూచుటకై నేనే మరల నిచ్చటకు వచ్చితిని !—ఇంతసేపటివఱకు నెవ్వరికిఁ దెలియకుండ నిందుండి యీ యద్భుతవిచారణ పద్ధతిని గాంచుచున్నాను" అనియెను.

రాజు—ఎవరక్కడ ? రక్షకభటులీ యనంతరాముని బందీకృతునిం గావింపుఁడు !

అనం—బందీకృతునిం జేయుట సామాన్యకార్యము కాదు—నేను బందీకృతుఁడ నగుటకే వచ్చియుంటిని. ఇప్పుడు నా దగ్గఱ కెవ్వరును రావలదు—నేఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పనిండు. ఈ లోపల నూఱుమంది వచ్చినను నన్నిచ్చటనుండి యొక్కయడుగైనను గదపఁజాలరు.

రాజు—విశ్వాసఘాతుకున కింకను జెప్పఁదగిన దేమున్నది ?

అనం—రాజా ! శూరసింహా ! నేను విశ్వాసఘాతకుండనే యగుదును—కాని నీవలెఁ గృతఘ్నుడఁను గాను—అసత్యవాదిని గాను—

రాజు—కృతఘ్నతయా ? నేనెట్లు కృతఘ్నుఁడను ?

అనం—ఈ బాలకుఁ డొకప్పుడు నీమానప్రాణములను రక్షించెను. ఆ సంగతి మఱచిపోయితివా ? కోరినకోరిక నొసంగెదనని చెప్పియుండియు నా మాటకు విరుద్ధముగ నీవిప్పు డీ మహోపకారిని వధ్యభూమికిఁ బంపించుచున్నావు, ఇదియేనా నీ కృతజ్ఞత ? ఇదికృతఘ్నత కాదా ? ఇదియేనా నీసత్యవాదిత్వము? ఇది యసత్యము కాదా?

రాజు సిగ్గుతోఁ దలవంచుకొని "నాకిఁక గత్యంతరము లేదు—రాజశాసనము ననుసరించి పోయితిని" అనియెను.

అనం—ఇట్టి రాజధర్మము పదదళితమై పోవుఁగాక ! ఇది రాజధర్మము కాదు—పశుధర్మము! ప్రాణరక్షణముం గావించినవాని ప్రాణములం దీయించు నీ ధర్మమును నీకెవ్వరుపదేశించినారు ?

శూరసింహుఁ డీసారి మఱియును సిగ్గుపడిపోయెను. అనంతరాముఁడు ప్రసాదునియెడలం గావించిన యకార్యముల నెఱింగి యున్నచో శూరసేనుఁ డాతనికిఁ బ్రత్యుత్తర మిచ్చియే యుండును. తెలియనివా డగుటచే నాతఁడు నిరుత్తరుఁడై పోయెను.

అనంతరాముఁ డప్పుడు వ్యాఘ్రమువలె హుంకరించుచు "నీకు వీరేంద్రకేసరి యొనరించిన యుపకారమును మఱచిపోయితివా శూరసింహా? నీప్రాణమాన ధనరక్షణముల నెన్నియో పర్యాయములు గావించిన యాతనినే మఱచిపోయితివా ? ఈబాలకుఁడా వీరేంద్రకేసరి తనయుడే !" అనియెను.

సభాసదు లందఱును నిస్తబ్ధులైపోయిరి. క్రమముగా రాజున కెల్లసంగతులును జ్ఞప్తికి వచ్చెను. ఒకప్పుడు ప్రసాదుని వీరత్వము నకు రణక్షేత్రమునందలి శత్రుమిత్రు లెల్లరును విస్మితులైపోయిరి. అప్పటినుండియు జరగిన సంగతుల నన్నిటి నాలోచించుకొని యాతడు విహ్వలచిత్తముతో "ఆ మహాత్ముఁడు వీరేంద్రకేసరి తనయుఁడగు భవానీప్రసాదుఁ డీతఁడేనా ?" అనియెను.

అనం—ఈతని ప్రతాప నైపుణ్యములం గన్నారఁజూచి నీవింకను గ్రహింపజాలక పోయితివా? నేను దూరమునందుండి వినినమాత్రముననే గ్రహింపఁగలిగితిని.

అప్పుడు శూరసింహుఁడు ధర్మాసనమునుండి దిగి ప్రసాదుని సన్నిధికివచ్చి నిలువఁబడి యాతని చేతులను బట్టుకొని యనుతాప విద్ధంబగు కంఠస్వరముతో "భవానీప్రసాదా! నేను కృతఘ్నుఁడను — అసత్యవాదిని — నా యపరాధము క్షమియింపఁదగినదికాదు. కాని, నీవు దేవతామూర్తివి. నీవు క్షమియింపకపోవు; కుమారా! నాయొద్ద నీకు సమర్పింపఁదగని దేదియును లేదు నా సర్వస్వమును నీ యధీనము చేసితిని" అనియెను.

భవానీప్రసాదుఁ డింతవఱకును మౌనముతో నుండెను. పిన తండ్రి మనోభావ పరివర్తనముం గాంచి యాతనిహృదయ మానంద ప్రపూర్ణ మయ్యెను అతఁడు తనలో "నా పినతండ్రి యిట్టివాఁడని నే నిదివఱ కెఱుఁగను. బ్రతికి యున్నంతవఱకును నే నితనిపాద సేవ చేసి నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తముం గావించుకొందును" అని భావించుకొనియెను.

శూరసింహుని సంబోధనముచే నాతని ప్రాణములు చలించి పోయెను. అతఁడు కన్నీరు విడుచుచు నిరుత్తరుఁడై నిలువఁబడి పోయెను.

అనం — భవానీ! ఈ ప్రపంచమునందు నే నెన్నఁడు నెవ్వరిని విశ్వసింపలేదు. ఈ సృష్టియందు విశ్వసింపఁదగిన జీవియే లేదనినా యుద్దేశము. ఇట్టి నా భ్రమను నీవు తొలగించి వైచితివి. నీవు సత్య స్వరూపుఁడవు — సుందర స్వరూపుఁడవు అజేయ హృదయరాజ్యమును నీ విప్పుడు జయించితివి. నీచే జయింపఁబడనివస్తు వీ ప్రపంచమునం దేదియునులేదు. నాకు జాలియనునది యెన్నఁడును లేదు; కాని, నీవు నా కన్నుల నీరు పెట్టించితివి. ఎవ్వఁడు కన్నీటిని గల్పింపఁగలఁడో యాతఁడొక్కఁడే యీ విశ్వరాజ్యమును బాలింపఁగలఁడు. నీవు నీ పితృసింహాసనము నధిరోహించి ప్రపంచమునకు సత్యధర్మముల నుపదేశింపుము. ఈ రాజపుత్రస్థానమున నీ పితృవంశమునకక్షయ కీర్తి నిదానముగాఁ జేయుము — నిషధ సైనికులారా! నేనిప్పుడు నా యన్నకుమారుఁడగు భవానీప్రసాదునకు సర్వరాజ్యమును సమ

ర్పించుచున్నాను. విశ్వాసుర్లభంబగు సదృష్టము మీకు లభియించినది. దైవవిశ్వాసమే యెఱుంగని నా కిప్పు డీశ్వర విశ్వాసము కలిగినది. మీ రీతనికి వ్యతిరేకముగ యుద్ధము చేసినందులకు భయపడవలదు — ఈ దేవునియొద్ద మీకు భయములేదు. కోరకుండఁగనే మీకు క్షమా ప్రదానము లభింపఁగలదు." అనియెను.

మహారాజు శూరసింహుఁడు నిమర్థసైనికులంగాంచి "మీ నూతనప్రభువు మిమ్ముల సందఱను క్షమియించినాఁడు. అట్టి మిమ్ము నేనేల శిక్షింపవలయును? మీరు మీప్రభునితోఁ గలసి మీ దేశము నకుఁ బోవచ్చును. కాని నా ప్రాణబంధుని తనయుఁడును, నాప్రాణ రక్షకుఁడు నగు మీప్రభునకుఁ దగిన బహుమానము నొసంగ మిమ్ముఁ బంపఁదలఁచుకొనలేదు. ప్రసాదా! నామందిరమునందలి రత్నహారమును నీ కంఠమున కలంకరించెదను. మా యుమాబాల నీకుఁ దగనిదికాదు. అని యనంతరామునిం గాంచి "రాజా! అనంతరామా! భవానీప్రసాదుని కోరికచే నిన్ను విడిచి వైచితిని; కాని నీ రెండవ కేసరి తమ్ముఁడవనియెంచి కాదు" అనియెను.

అనం—రాజా! శూరసింహా! నీకును యుద్ధపద్ధతులు తెలియును నేను నీ యెడల నీచముగఁ బ్రవర్తింపలేను. నేనుగాని, నా సైనికులుగాని యొక్క పూటయయిన నీ కతిథులము కాలేదు. ఆతిథ్యము స్వీకరింపవలసి వచ్చునేమో యనియే మేము నగరమున కివ్వల విడిసితిమి విూదుర్గము నాక్రమింపవలయు ననియే నా యుద్దేశము. ఈ భవానీప్రసాదుని మూలమున సాగినదికాదు గాని యాతఁడు లేకున్నచో నీ రాజధాని యీసరికి నేలమట్టమే యయి యుండును యుద్ధమునందలి పన్నాగములును, మోసములును నింద నీయములు కావు. కత్తిగట్టుకొని యెదిరించుటమాత్రమే యుద్ధము కాదు. మహారాజా! శూరసింహా! దానమును బరిగ్రహించుట మా కలవాటు లేదు. నీ యనుగ్రహమునుగోరి బ్రదికియుండుటకంటె మరణమే మేలు. నా మరణోపాయమును నే నేర్పఱచుకొనియే యున్నాను.

అని చెప్పి యొక్క యుదుటునఁ దన చేతిలోనున్న కత్తితో వక్షమునఁ బొడుచుకొనియెను. తోడనే యనంతరాముని ప్రాణశూన్యంబగు శరీరము భిన్నపాదపముంబోలి భూతలపతితమైపోయెను. ప్రసాదుఁడు తత్తరముతోఁ బినతండ్రిని సమీపించి చూచెను. దేహమునఁ బ్రాణము లేదు. ప్రసాదుఁ డాతనిప్రాణములం దీసివైచిన తరవారి పంకఁజూచుచు దుఃఖించుచుండెను.

ఆకత్తి కారాగారమునొద్ద భవానీ ప్రసాదుని మొలనుండి లాగికొనినదే—ఒకప్పుడది ప్రసాదునిపైఁ బడినది; కాని ప్రసాదుఁడు మరణింపలేదు. అనంతరాముఁ డాకత్తిచేతనే మరణించెను. జీవితము నందును మరణమునందును ఫల మొక్కటియే. అసత్యము, సత్యమును జంపవలయునని ప్రయాసపడి తుదకు సత్యముచేతిలోని సనాతనాస్త్రముతో నాత్మహత్యం గావించుకొనియెను—ఆశ ధర్మమును బీడింపవలయునని యనేకవిధములఁ బ్రయత్నించి తుట్టతుదకు జ్ఞానాస్త్రముచేఁ గొట్టఁబడిపోయెను. హా! దురాశా! నీ జన్మస్థానమెక్కడకి ఈ యిహజీవితము నశాంతిమయంబుగాఁ జేయుటకా నీవీ ధరాతలంబునకు బంపఁబడితివి?—

---

# ఉపసంహారము

తరువాత మూఁడు వసంతములు గడచెను. తేజస్వతీనగర మిప్పుడు కలకలలాడుచుండెను. భవానీ ప్రసాదుఁడు తండ్రివలెనే ధర్మమూర్తియయి రాజ్యమును బరిపాలించుచుండెను. మునుపటి యవిశ్వాసమును మునుపటి నిరానందమును వెదుకుటకైన నగపడుటలేదు.

జనార్దనున కానందము—అందఱకు నానందము—కాని నీలాశ్వేతలకుమాత్ర మా యానందములేదు. శ్వేత తనకిఁక నానందము లేదని తెలిసికొనియెను. ఆమె హృదయము శ్మశానమై పోయినది. కాని నీలయో? నీలకు జనార్దనుఁడు విచారమును గల్పించెను. ఆమె యేమని చెప్పుకొనఁగలదు?

జనార్దనుఁడు విశాలోద్యానమున రాజపుత్రునికొఱకు ధనుర్బాణములను సిద్ధపఱచి యొంటిగానున్న సమయమున శ్వేత యాతని యొద్దకువచ్చి "నీవిక్కడ నుంటివా ! నేను నీకొఱకు నగరమంతయును వెదకితిని" అనియెను.

జనా—గుండెలపైఁ జిత్రించుకొనఁజాలక పోయితివా! వెదక నక్కఱలేకుండ నెప్పుడును గనఁబడుచునే యుండును.

శ్వేత – ఏమి ? నీ చిత్రమును నా వక్షమున ధరింపవలయునా ? ఈ నీ సరససల్లాపములు నీలయొద్దఁ బ్రచరింపుము.

జనా—ఇంకను నామెయొద్దకుఁ బోవుటా ?

శ్వేత—ఏమి ?

జనా—ఇదివఱకుఁ దర్జనభర్జనములైనవి. చాలదా ?

శ్వేత—ఇప్పుడామె నిన్ను హృదయపూర్వకముగఁ బ్రేమించినది.

జనా—ఆమె కటాక్షబాణములను నేనిఁక సహింపఁజాలను.

శ్వేత—నీ వించుక సేపిచ్చట నాఁగినచో నీలను నీకిచ్చి పెండ్లి చేయుదును.

జనా—ఆమెను స్పృశించుటకుఁగూడ నాకుభయమగుచున్నది.

శ్వేత— నీల విషముకొంటివా ?

జనా—నిజముగా నామె విషమే—నీల విషము వలెఁ బరిత్యజింపఁదగినది.

శ్వేత—ఎంతమాట ! ఆమె కురూపిణియా ?

జనా— ఎవరన్నారు ? ఆమె సుందరీశిరోమణి ఆమెకన్నులు చక్కనివి ; చిఱునవ్వులు చక్కనివి ; హృదయము ను చక్కనిదే— ఆ చక్కదనముచేతనె యామె నన్నున్మత్తునిగఁ జేసివైచినది. నేనెంతయో కష్టపడి యెట్లో నామనసు త్రిప్పుకొంటిని. మరల నాకాశ కల్పించెద వేల ?

శ్వేత—వట్టియాశ పెట్టుటలేదు. నీ వంగీకరించినచో నిప్పుడే పెండ్లి చేసెదను.

జనా—ఇక నీజన్మమున వలదు—నేను పెండ్లి చేసికొంటిని.

శ్వేత—ఎవరిని?

జనా—ఈమాటలతో బ్రయోజనము లేదు.

శ్వేత—చెప్పఁగూడదా ? ఎవ్వరిని బెండ్లి యాడితివో చెప్పుము !

జనా—శ్వేతా ! ఈ జీవితమునందు నే నొక్కనినే ప్రేమించితిని. ఇహపరములయం దాతని విడిచి యితరుల నెవ్వరిని ప్రేమింపఁజాలను.

శ్వేత—వారెవ్వరు ?

జనా—చెప్పవలయునా ? అతఁడు నాతండ్రి, తల్లి, భార్య, పుత్రుఁడు, ప్రభుడు, దేవుఁడు మిత్రుఁడు, సోదరుఁడు—నా సర్వస్వము !!

శ్వేత—అతని పేరేమి ?

జనా—భవానీ ప్రసాదుఁడు.

శ్వేత—మహారాజా ! మహారాజును బ్రేమించితివా ? సరే అట్లయినచోఁ బెండ్లి చేసికొనట కడ్డమేమున్నది ?

జనా—అంతియు నడ్డమే—నేను నాప్రేమ లేశమైన నితరుల కర్పింపఁజాలను.

ఇంతలో నీల రాజకుమారుని నెత్తికొని దూరమునుండి వచ్చుచుండెను రాజపుత్రునిం గాంచి జనార్దనుఁ డానందవివశుఁడై పోయెను. అప్పుడు శ్వేత "నీ వెవ్వరికిని ప్రేమలేశమైన నొసఁగఁజాల నంటివిగదా ! రాజకుమారు నేల ప్రేమించుచుంటివి?" అనియెను.

జనా—ఆ ముద్దుబిడ్డ భవానీ ప్రసాదుని లీలయే కాదా?

అని చెప్పుచుఁబోయి జనార్దనుఁడు నీలయొడిలోని బిడ్డను తీసికొనియెను. అతఁడు నీలవంకఁ జూడనైన లేదు ; నీలయును జూడ లేదు, మాటాడ లేదు ! అయ్యో ! అట్టియామె యాతని నేల ప్రేమించినది ?

జనార్దనుని హృదయమునం దెట్టి తుపాను వీచుచున్నదో తెలియుట లేదు. అతఁడు రాజకుమారు నెత్తుకొని యుపవనమునఁ

దిగుచుండెను. అప్పుడు భవానీప్రసాదుఁ డొకపువ్వునికుంజమున నం గూరుచుండి యొకయద్భుతాభియోగమును విచారణచేయుచుండెను.

వాదించునది లలిత—ప్రతివాది దేవలుఁడు. దేవలుఁడు రా లేదు—లలిత వచ్చి యుండెను. రాజును, రాణియు వేదికపైఁ గూర్చుండి యుండిరి అప్పుడు లలిత "అన్నా! నా బొమ్మను బాణ వైచినాఁడు—నా గోరవంక నెగురఁ గొట్టినాఁడు" అనియెను.

భవానీప్రసాదుఁ డానందోత్ఫుల్ల నయనుఁడై "ఇఁదు దేవలు నిదే నేరము—ఆతనికిఁ దగినశిక్ష చేయించెదను" అనియెను.

ఇంతలో నికుంజమున దాఁగియున్న దేవలుఁ డచ్చటికి వచ్చి "అన్నా! చూడుము! లలిత నాకత్తిని బాణమును, భల్లమునునూ తిలోఁ బాఱవైచినది" అనియెను.

భవా— ఏమి లలితా? ఆమాట నిజమేనా!

లలి—అవును, ఇతఁడు పై నెగురుచున్నపక్షిని బాణముతోఁ గొట్టుట యెందులకు?

భవా—మీ రిద్దఱును నేరమునే చేసినారు. మీకుఁ దగిన దండనము కావలసియున్నది. దేవలా! నేను గ్రొత్తగ నంబరు రాజ్యమును స్థాపించితిని. నీవు లలితతోఁగలసి యచ్చటకుఁబోయి యూరాజ్యమును బాలింపుము.

దేవలుని తలపైఁ బిడుగుపడి నట్లయ్యెను. అతఁ డన్న పాద ములపైఁబడి 'అన్నా! నాకు రాజ్యమక్కఱలేదు. నిన్ను విడిచి నేనొక్క నిమిషమైనను జీవింపజాలను" అనియెను.

భవానీప్రసాదుఁ డాతనిం గౌఁగిలించుకొని కన్నీరుఁదుడిచి యూరడించుచుండెను. అప్పు డుమాబాల "కుమారా! నీ వంబరు పోవుటకంగీకరింపుము—శిక్ష యెవ్వరికగునో చూతము!" అనియెను

భవానీప్రసాదుఁడు కన్నులు మూసికొని '(ప్రియా! నేనుమా త్రము దేవలుని విడిచి యుండఁగలనా?" అనియెను.

ఉమా—మమ్మందఱును విడిచియుయిన నుండఁగలరు గాని, దేవలుని విడువఁజాలరు.

తన బొమ్మ నపహరించినవానికి దండము లేకయుండుటచే లలితకు సంతుష్టిలేక "అన్నా! నీవు మాటలలోఁబడి నామాట మఱచిపోయితివా!" అనియెను.

భవా—లలితా! అదిగో! చూడుము! నీబొమ్మవచ్చుచున్నది.

లలిత తిరిగి చూచెను. జనార్దనుఁడు రాజకుమారు నెత్తుకొని వచ్చుచుండెను. రాజకుమారున కిప్పుడు రెండవయేఁడు. సరిగ దండ్రి పోలిక! లలిత యొక్కపరుగునఁబోయి యాబిడ్డ నెత్తికొనియెను. దేవలుఁడును జేయిచాచెను గాని, పినతల్లిని వదలి యాపసిబిడ్డ పినతండ్రియొద్దకుఁ బోవఁడయ్యెను. అప్పుడు లలిత "మీరు నా బొమ్మనిఁకఁ బాఱవైవరుగద? ఆనేరమునకే యీబిడ్డ మీయొద్దకు వచ్చుటలేదు" అనియెను.

అంతలో లలితకుఁ దనగొరువంక యగుపడుటచే బిడ్డను రాణి యొడిలోనుంచి పరుగెత్తెను భవానీప్రసాదుఁడు రాణి యొడినుండి కుమారునిఁ దీసికొని ముద్దుపెట్టుకొనియెను అప్పు డాతఁడు పులకితశరీరుఁడై "ప్రియా! దైవానుగ్రహమున మనమెంత ధన్యులమైతిమి" అనియెను.

ఉమా—ఆహా! ఈసమయమునఁ బ్రమదయే యున్నయెడల నెంతబాగుగ నుండును.

భవా—ప్రాణేశ్వరీ! సత్యము చెప్పితివి ఇప్పుడు ప్రమదయే యున్నచో—

ఉమా—ప్రమద మనప్రక్కలనే తిరుగుచున్నదని నా నమ్మకము. ఆమె నిన్నువిడిచి స్వర్గమునందైన నుండఁజాలదు. ఆమె మరల వచ్చును. నా గర్భమున జన్మించి నీసంబంధమును గలుగఁ జేసికొనక మానదు. మన కాఁడుబిడ్డ పుట్టినచోఁ బ్రమదపేరు పెట్టవలయును.

సమాప్తము.

కాకినాడ: జార్జిప్రెస్ యందు ముద్రితము—1948. (1000 కాపీలు)